# చిత్ర సుందరి

రచన

**అఖిలన్**

అనువాదం

**వాకాటి పాండురంగరావ్**



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, కొత్త ఢిల్లీ

# ప్రస్తావన

గత పాతిక, ముప్పై యేళ్ళనుండి తమిళంలో పత్రికా సాహిత్యం అన్నది బాగా వృద్ధి చెందింది. భారతదేశంలో పేరూ ప్రజాదరణా గల అగ్రశ్రేణి పత్రికలలో కొన్ని తమిళ పత్రికలూ వున్నాయి. తమిళ ప్రజల పత్రికా పఠనాభిసక్తి పెరిగినకొద్దీ పత్రికల వినియోగమూ విస్తరిస్తూంది. ఇట్టి పరిస్థితిలో చిన్న కథలూ నవలలూ అసంఖ్యాకంగా వెలువడుతున్నాయి.

పుస్తక రూపంలో మనం చూసే వచన సాహిత్యంలో చాల భాగం మొదట పత్రికలో ప్రచురితమై ఆ తర్వాత పుస్తకాలు వెలువడి పేరు పొందినవే. ఇందుకు కారణం నేటి పఠితలలో బహుళ సంఖ్యాకులు పత్రికలను చదువుతుండటమే.

సాహిత్య లోకంలో నేటి యుగధర్మం పత్రికా సాహిత్యం అని చెప్ప వచ్చును. అది సరియా, కాదా అన్నది ప్రశ్నకాదు! ఉన్న పరిస్థితి అది.

కనుకనే ఒక పుస్తకాన్ని చేపట్టగానే ఇది మొదట ఏ పత్రికలో వచ్చింది, పాఠకులు దీని నెట్లా ఆదరించారు అన్న ప్రశ్నలుదయిస్తాయి. పుస్తకం కొనే వారూ ఇదే ప్రశ్నలు వేస్తారు.

నేటి పత్రికలలో వచ్చేవాటిలో అన్నిటికన్న మిన్నగా పాఠకుల నాకర్షించేవి ధారావాహికంగా వచ్చే నవలలే. చారిత్రక దృష్టితో చూసినా ఇది నవలల యుగం అనే చెప్పక తప్పదు. కవిత, గల్పిక, చిన్న కథలాటి ప్రక్రియలకన్న నవలదే పైచేయి అవడానికీ ఇదే కారణం. నవలలు పత్రికల ప్రచారానికీ, పత్రికలు నవలల ప్రచారానికీ పరస్పరం తోడ్పడుతున్నాయి.

ఈ విధంగా పత్రికా ముఖంగా ప్రజాదరణా, పేరు ప్రతిష్ఠలూ పొంది ఉత్తమ రచయితలుగా చలామణీ అవుతున్న పది, పన్నెండుమంది రచయితలకు తమిళ సాహిత్యంలో ప్రత్యేక స్థానం వుంది. వీరి రచనలను కాలం నిష్పాక్షికంగా

బేరీజు కట్టగలదు. కాని నేటి పత్రికలు మన కనేక ఉత్తమ రచనలను ప్రసాదించా యని చెప్పుకోవచ్చును. అటువంటి ఉత్తమ రచనే ఈ 'చిత్తిరప్పావై.'

గడచిన మూడు దశాబ్దాలుగా పఠితలకు బాగా పరిచయమయిన రచయిత శ్రీ అఖిలన్. పత్రికలనే నమ్ముకుని కూచోకుండా, ధైర్యంచేసి తమ నవలలను మొదటే పుస్తకాలుగా వేసి, విజయం సాధించిన కొద్ది రచయితలలో ఈయన ఒక్కరని సగర్వంగా చెప్పుకోవచ్చును. ఆ తర్వాత ఆయన 'కలై మగళ్' పత్రికలో తమ ధారావాహికములయిన కథలద్వారా, 'కల్కి' 'ఆనంద వికటన్' మున్నగు పత్రికలలో తమ రచనల ద్వారా వాసికెక్కారు.

చేయి తిరిగిన పది పన్నెండుమంది నవలా కారులలో అఖిలన్‌ది ముఖ్య స్థానం. పాఠకులకూ, పత్రికాధిపతులకూ ఈయనపట్ల వున్న ఆదరాభిమానాలతో ఏకీభవిస్తున్నారా అన్నట్లు భారత ప్రభుత్వంవారి కేంద్ర సాహిత్య అకాడమీవారు ఈయన రాసిన నవలకు బహుమతి నిచ్చి సత్కరించారు. అర్హత, ఆధునికత గల రచయిత కావడం వలన వీరి రచనలకు ప్రజాదరణవుంది. 'పావై విళక్కు.' అన్న వీరి నవలలో తణికాచలం అన్న ఆదర్శ రచయిత పాత్ర తమిళ రసజ్ఞుల నాకర్షించింది. ఇలాగే 'కయిల్ విళి' 'వేంగైయిన్ మైన్‌దన్' 'వెట్రి తిరునగర్' మొదలయిన వీరి నవలలు తమిళభాషా సాహిత్యానికి భూషణాలు. వారి మేలి రచనలలో ఒకటి— "చిత్తిరప్పావై.''

ఈ నవల మొదట 'ఆనంద వికటన్' పత్రికలో ధారావాహికంగా వెలువడింది.

మొదట తమ రచనలను తిన్నగా పుస్తక రూపంలో వెలువరించిన అఖిలన్ ఆ తర్వాత పత్రికలలో ధారావాహికంగా నవలలు వెలువరించి పిమ్మటే వాటిని పుస్తకాలుగా వేశారు. ఇది ఈనాటి పుస్తక ప్రపంచపు ధోరణికి అనుగుణంగా వుంది. దీనిని గురించి రచయితే స్వయంగా ఇట్లా అంటారు:

''ముప్పై యేళ్ళనుండి రచనా వ్యాసంగమే నా ప్రధాన వృత్తిగా కలవాడిని నేను. అయినా తమిళ ప్రజ లింకా పుస్తకాలు కొని చదవడానికి బాగా అలవాటు పడనందున - మన విశ్వవిద్యాలయాలూ, కళాశాలలూ నేటి సాహిత్యాన్ని యువతరానికి అందించడంలో చేయవలసిన కృషి చేయకపోవడం వలన - పత్రికలే

పాఠకులకూ నాకూ సంబంధాన్ని నెలకొల్పడంలో తోడ్పడినాయి. అందుకనే ఈ నవలను మొదట తమ ''ఆనంద వికటన్" పత్రికలో ధారావాహికంగా వెలువర్చిన సంపాదకులు శ్రీ ఎస్. ఎస్ వాసన్ గారికి నేను ఎంతైనా ఋణపడి వున్నాను. ఆయన వలననే 19-3-67 నుండి 14-1-68 దాక ఆ పత్రికల సంచికలలో ఈ నవలను లక్షలాది పాఠకులు చదవగలిగారు.''

ఎలా ఈ నవలను రాశారో, దానికి పేరెం ఏమిటోకూడా అఖిలన్ మాటల లోనే చదువుదాము

"చెన్నపట్నంలో పదేళ్ళుగా నివసిస్తున్న నేను, ఈ మాయలేడి వేటలో ఈ నగరం తమిళ రాష్ట్రానికి దారి చూపిస్తూంది. సామర్థ్యమో, సామాజిక బాధ్యతో లేకుండా ఆషాఢభూతులు సాటి ప్రజలకు కీడుచేస్తున్నారు; సదాశయమూ సదుద్దేశమూ కలవారు సక్రమంగా సురక్షితంగా జీవించడానికి వీలులేకుండా చేస్తున్నారు; ఈ పరిణామాలకు వీలు కల్పిస్తున్నది నేటి సామాజిక జీవన ధోరణి. రెండువేల ఏండ్లక్రింద 'అందరిలాటివారే దొంగలూను—' అని ఆ 'లాటివారి' కపట వేషాన్ని గురించి హెచ్చరించారు వళ్ళువర్ అయినా మనం ఈ కపటవేషధారుల నంత సులభంగా పోల్చుకోలేక పోతున్నాము.

''ఇట్టి టక్కరుల చేతల ఫలితంగా వివిధ జీవిత రంగాలలో పెచ్చుపెరుగుతున్న కాపట్యం నా మనసును కలవరపెడుతూంది. ఈ కపట వేషగాళ్ళతో నిండి, చివికిపోతున్న ఒక భ్రష్ట సమాజం రూపొందుతూంది. 'ఏ అడ్డదారయినా తొక్కి, వస్తువులనూ, అవి ఇచ్చే శక్తినీ పొందాలనే తాపత్రయము మనుషులను దెయ్యమై పీడిస్తూంది.

ఈ పీడ తాకి చిహ్నమే మాణిక్యం. ఇతనివంటి వారి వాతపడి బలి అయ్యే అమాయకుల ప్రతినిధులే ఆనందీ, అణ్ణామలై మొదలయినవారు.''

మాణిక్యం ఎలాటివాడు, అణ్ణామలై ఆనంది ఎలాంటివారు అని రచయితే పరిచయం చేశారు. ఈ పాత్రల స్వరూపం నవలలోని కథయొక్క పోకడలో ఇంకా విశదమౌతుంది. ఉదాహరణకు ఒక ఆసక్తిదాయకమైన ఘట్టాన్ని తీసుకుందాము.

చిత్రకారుడు అణ్ణామలై ఆనంది చిత్రాన్ని వేస్తుండడం మాణిక్యం చూస్తాడు. మనం మాణిక్యాన్ని ఎరుగుదుము. అతడి స్వభావమూ, ప్రవర్తనా ఎట్లా వుంటాయో ఈ క్రింది ఘట్టం వివరిస్తుంది:

"నువ్వు ఆనంది చిత్రాన్ని ఎట్లా గీచావు?" అని మాణిక్యం అణ్ణామలై నడిగాడు. ఆ తర్వాత ఏమి జరిగిందో నవల చిత్రిస్తుంది. ఎలాటి దా చిత్రం?

''ఆ అమ్మాయిని చూసి ఆయన గీయమని చెప్పారా?''

అణ్ణామలైకు కోపం వచ్చింది. ''అట్లా ఎవ్వరూ చెప్పరు. నువ్వు నీ మాటలతో వాళ్ళ నవమానపరుస్తున్నావు'' అన్నాడు.

''కోప్పడకోయ్! ఏదో నీ కళను గురించి తెలుసుకుందామని నే ననుకుంటుంటే నువ్వు నా మీద మండిపడడం బాగుందా? అరవకుండా నెమ్మదిగా మాట్లాడు. అమ్మా నాన్నా వింటే బాగుండదు—" అన్నాడు మాణిక్యం. అతడు మొదటినుండి గది బయటికి విన్పించనంత మెల్లగా మాట్లాడుతున్నాడు. అణ్ణామలైను అంతటితో వదలలేదు. ''చెప్పు! ఆనంది ఈ బొమ్మ గీయమని అన్నదిగిందా? నువ్వు గీస్తుంటే తాను ఎదుట నిల్చుందా?''

మాణిక్యం అజ్ఞానానికి నవ్వాలో ఏడ్వాలో తెలియలేదు అణ్ణామలైకు. ఇటుక, సిమెంటు, గార కలిపి భగవంతు డితడి మెదడును చేసినట్లున్నాడు - అనిపించింది.

''మాణిక్యం! ఇవాళ సాయంత్రం నేను ఇక్కడికి వచ్చాక గది తలుపులు మూసుకుని వేసిన బొమ్మ ఇది. చూడకుండా, జ్ఞాపకం ఆధారంగా వేసినది. కావాలంటే నువ్విక్కడినుండి వెళ్ళిపో; నిన్ను చూడకుండానే నీ బొమ్మ గీచిస్తాను."

మాణిక్యం వెళ్ళలేదు. ''నువ్వు చాల సమర్థుడివోయ్...... నా బొమ్మ వేయక్కర్లేదుగాని వేసిన ఆ బొమ్మను నా కివ్వు—''

తన ప్రాణాన్నిమ్మని అడిగినట్లు అన్పించింది అణ్ణామలైకు. బాధతో అన్నాడు— ''మాణిక్యం, నువ్వెప్పుడూ ఇంతే!"

ఔను, మాణిక్యం ఎప్పుడూ అంతే! అణ్ణామలై తనకని తెచ్చుకున్నదానినతడు తీసుకెళ్ళి పోయేవాడు. చొక్కా, లాగు, పంచె - ఏదయినాసరే, మాట వరసకు అణ్ణామలైతో చెప్పేసి తన స్వంతం చేసుకునేవాడు. అణ్ణామలై ఆ వస్తు

వును తానే మాణిక్యాని కిచ్చినట్లు అమ్మతో చెప్పుకునేవాడు. మేస్త్రీగారేమో పట్టించు కునే వారేకాదు. మరి మాణిక్యం ఆయన 'పెద్దకొడుకు' లాటివాడయ్యె! పైపెచ్చు అతడు బీదవాడన్న జాలీ, సానుభూతీను!

"ఇవ్వవా?" అని మాణిక్యం మళ్ళీ అడిగాడు.

"దీనిని అడగకు. ఇది పెన్సిల్ 'స్కెచ్' మాత్రమే. ఇంకా పూర్తి కాలేదు. అసంపూర్ణంగా వున్నవాటి నివ్వరాదు—"

"ఇన్ని సొల్లు కబుర్లెందుకోయ్! ఇష్టంలేదని ఒక్క ముక్కంటే పోదూ?"

"ఔను! ఇష్టంలేదు!"

"హుఁ! అది ఉత్త కాగితం ముక్క. దానికోసం నేనాశపడుతున్నా ననుకున్నావా? దానితో నేనేమి చేసుకోగలను?" అని కళ్ళెర్రజేసి కోపంతో అన్నాడు మాణిక్యం.

—అతిలంగ్ తమ పాత్రల నెట్లా తీర్చిదిద్దుతారో చూపుతుంది పై సంఘటన. ఆయన ఉద్వేగాలను ఎలాంటి వర్ణచిత్రాలుగా రూపొందిస్తారో చెప్పడానికి ఒక చక్కటి ఉదాహరణ ఈ నవలలోని పతాక సన్నివేశం. అందులో చిత్రలతను సృష్టించే ఆ ప్రతిభ ఎటువంటిదో చూడండి!—

—"ఆనంది మేడమీదకు వెళ్ళింది. అక్కడ కనపడిన దృశ్యం ఆమె మేన పులకరింతలు పర్షించింది. పరిపూర్ణమైన ఆ చిత్రసుందరి ఎదుట అతడు శిలగా మారిపోయి కూర్చునివున్నాడు. రక్త మాంసాలతో ఈ ఆనంది ప్రాణంతో ఊపిరితో ఈ ఆనంది రావడం - వచ్చి తన ప్రక్కన నిల్చోవడం అత డెరుగడు. దేవాలయపు గర్భగుడిలోపల విరాజిల్లే దేవిశ్రీపాదాలచెంత సర్వమూ అర్పించి పడివున్న భక్తుడిలా వున్నాడతడు. మూసిన కనులనుండి నీరు ధారలుగా కారుతూంది

ఎందుకో ఆనందికి అతడింకా పసిపాపలాగే కనుపించాడు. ఆ రోజు - పెళ్ళికి ముందుగా, అతడు తనవద్దకు పరుగెత్తుకు వచ్చి— "మిమ్మల్ని పెళ్ళి చేసుకునే భాగ్యం నాదయితే అందుకోసం ఏమయినా చేస్తాను"— అనడం గుర్తుకు వచ్చిం దామెకు. పాపలలో పాపగా అతడలా అన్నప్పుడే అతడిని తన ఒడిలోకి

తీసుకుని కన్నీళ్ళతో లాలించడానికి తపించింది ఆమె. అదే తపన ఇప్పుడూ కలిగింది ఆనందికి.

అలాగా అణ్ణామలై కళ్ళు తెరిచాడు. ఆమెను చూశాడు ఒకరి నొకరు చూసుకుంటున్నారు. కళ్ళు అనిమేషా లయ్యాయి - కాలం నిలిచిపోయింది.

తాను తెచ్చిన నాగలింగ పుష్పాన్ని అతడికిచ్చి ఆనంది, నెమ్మదిగా అతడి తల నిమురసాగింది - ఆ ప్రేమ భారాన్ని మోయలేక అతడి తల ఆమె ఒడిలోకి వాలింది. కన్నీటి ధారలు అణ్ణామలై చెంపలమీదుగా పారసాగాయి. ఆమె నోరు విప్పి ఏమీ చెప్పకుండానే అతడికి అన్నీ తెలిశాయి.

'మనకు మిద్దెలువద్దు, మేడలువద్దు; ఎక్కడయినా చిన్న కుటీర మొక్కటి చాలు' అని అతడు నోరుతెరిచి అనలేదు. కాని ఆమెకు తెలిసింది. ఆమె మనసులో అనుకున్నది అతడి మనసుకు అందింది. అక్కడ మాటకు చోటులేదు ఏ కద లికకూ తావులేదు.

ఒకటే శాంతి; ఆనందమయమైన శాంతి......

— కాస్సేపయ్యాక అక్కడికి వచ్చిన శారద దూరంనుంచే ఆ సజీవ శిల్పాలను చూసింది. ఆమె కనులు ఆనందంతో నిండాయి. ఆ క్షణాన తానే ఆనంది అయినంత ఆనందం కలిగింది ఆమెకు.

ఆ ఇంటినుండి అణ్ణామలైనూ, అతడి తల్లినీ పిలుచుకుని వెళదామని శరవణన్ వచ్చాడు. వీరినేకాక ఆనందినీ, కదిరేశన్‌నూ కూడా తీసుకు వెళ్ళ వలసిన పరిస్థితి ఏర్పడింది.

యువతీ యువకులు తమంతట తాముగా చేసుకున్న ఆ నిర్ణయం పెద్దలకు ఏ అదరుపాటును, ఆశ్చర్యాన్ని కల్గించలేదు. పైపెచ్చు కదిరేశన్ వారిని మౌనంగా పదేపదే ఆశీర్వదిస్తున్నారు.

శరవణన్ తీసుకొచ్చిన కారులో, ఆయనగాక అణ్ణామలై కుటుంబ సభ్యులు నలుగురూ కూర్చున్నారు. ఆనంది చిత్రాన్ని చుట్టగాచుట్టి చేతిలో పట్టుకునివున్నాడు అణ్ణామలై - 'ఆస్తి' అనదగిన దింకేమీలేదు ఆ కారులో. ఈ లోకంలోకి వచ్చే టప్పుడు ప్రతి ఒక్కడూ ఏ ఆస్తినయితే తెస్తారో, ఇక్కడినుండి వెళ్ళిపోయే టప్పుడు దేనినయితే తీసుకు వెళ్తారో, దానితో మాత్రమే వారి ప్రయాణం మొద లయింది.

"ఇంక ఆ చిత్రాన్ని మీరు నా కిచ్చేయవచ్చు''– అని అద్దావమైనుండి దానినీ తీసుకుంది శారద.

కారు బయలుదేరింది.

కారు కనుమరుగయ్యేదాక శారద ఆ చోటినుండి కదలలేదు. జీవితం ఆనందిదే, అయినా ఆ ఆనందం తనది అని నమ్మిన వ్యక్తి శారద.''–

— తమిళదేశపు మేలి రచయితలలో ఒకరు అఖిలన్. ఆయన సృజించిన ఉత్తమ నవలలో ఒకటి "చిత్తిర ప్పావై" ఈ మేలి రచనకు ప్రస్తావన రాయడాని కెంతో సంతోషిస్తున్నాను.

చెన్నపట్నం మీ. ప. సోమసుందరం.

ఆ మరునాడుదయిం పరీక్షా ఫలితాలు వెలువడుతాయట. ఈ విషయం ఆనాటి సాయంత్రం పత్రికలో వేశారు.

పత్రికను, టిఫిన్‌డబ్బాను పట్టుకుని చిదంబర మేస్త్రి టౌన్ బస్సునుండి దిగారు. ఆయన వెంబడే మాణిక్యమూ దిగాడు. ఆ బస్సు ఎగ్మూరు నుండి మైలాపూర్‌లోని తెప్పకుళం వచ్చి చేరింది. మేస్త్రి ఇల్లు మైలాపూర్‌లో వుంది.

బస్సు దిగిన మేస్త్రి కోనేటి గట్టు పక్కన నిలబడి మాణిక్యం చేతికి చిల్లర డబ్బు లిస్తూ – 'వెళ్ళి ఇంకో పత్రిక ఏదయినా తీసుకురా. దాన్లోనూ ఈ వార్త వుందేమో చూద్దాం....' అని పురమాయించారు. నవ్వొచ్చింది మాణిక్యానికి. అయినా ఆ పక్కన కొట్టుదగ్గరకెళ్ళి దినపత్రికను కొని తీసుకొచ్చి ఇచ్చాడు. కళ్లజోడును సర్దుకుని మరీ ఆ దినపత్రికను జాగ్రత్తగా పరిశీలించారు మేస్త్రి. 'అమ్మయ్యా!' వుండవలసిన ఆ రెండు పంక్తులూ ఆ మూల వున్నాయి. అయినా ఆయన సంశయం పూర్తిగా సమసిపోలేదు.

'అయితే మాణిక్యం! రేప్పొద్దున తప్పకుండా వస్తుందంటావా...'

'వస్తుందండీ —'

'అణ్ణామలై సంఖ్య నీకు తెలుసా?'

'ఇంటి దగ్గర రాసి వుంచాను.'

ఆ సంఖ్యను ఉచ్చరించి నవ్వారు మేస్త్రి ఆయన కది కంఠోపాఠం. 'వీడు పాసవుతాడా?'

"తప్పక పాసవుతాడు; చాల కష్టపడి చదివాడు" అని జవాబిచ్చాడు మాణిక్యం. ఇంకో విధంగా జవాబిస్తే కోపంతో మేస్త్రి తన్ను ఆ ప్రక్కనే వున్న కోనేట్లోకి తోసేయగలరని భయం మాణిక్యానికి.

"వాడు పాసయితే రేపు నీకు, మీ అమ్మకూ మా ఇంట్లోనే భోజనం, విందు భోజనం—"

చిదంబర మేస్త్రి విసవిస నడవసాగారు.

తనతోబాటు మాణిక్యం వస్తున్నాడన్న విషయం మరిచినవాడిలా ఆ అరవై యేళ్ళ 'యువకుడు' చక చక నడిచి పోతుంటే, ఇరవై మూడేళ్ళ మాణిక్యానికి ఆయనతో బాటు అడుగులు వేయడం కష్టంగా వుంది.

అరవై యేళ్లయినా చెక్కు చెదరని ఆరోగ్యం మేస్త్రిది. కష్టపడి పనిచేసి నందున వజ్రంలా సానదీరినది ఆయన దేహం. కళ్లకున్న చత్వారపు జోడూ, తలమీద పత్తిలాగా అంటిపెట్టుకున్న నెరసిన జుత్తూ - ఇవే ఆయన వయస్సును తెలుపుతున్నాయి. చామనచాయ, ఎత్తైన విగ్రహం, కాస్త పొడుగన్పించే మొహం, కాలర్‌లేని చొక్కా, ముతక పంచె, భుజంమీద తువ్వాలు, కాలికి కిర్రు చెప్పులు - ఇది మేస్త్రిగారి స్వరూపం.

మాణిక్యానిదీ బలిష్టమైన విగ్రహమే; కాని పొడవు తక్కువ; మేస్త్రిగారి భుజాల ఎత్తుంటాడు. చదరం అన్పించే మొహం; విశాలమైన నుదురు; సూటిగా తగిలే చూపు; పొడుగు పంట్లామూ; బూట్లూ ధరించాడతడు. అతడి చేతిసంచి లోపల టిఫిన్ డబ్బా వుంది.

చిదంబర మేస్త్రి ఇంటి మేడమీదే అతడి కాపురం. ఆయన సాయంతోనే అతడు ఇళ్ళుకట్టే విద్యలో 'ఎల్. సి. ఇ.' అన్న పరీక్షకు కట్టి కృతార్థు డయ్యాడు. ఆయనే అతగాడికి తమ యజమానితో మాట్లాడి ఒక ఉద్యోగము ఇప్పించారు. వారు పనిచేస్తున్నది ఒక పెద్ద 'ఇంజనీరింగ్ కంట్రాక్టుల' కంపెనీ. ఆ కంపెనీ వారు ఎప్పుడూ ఎక్కడో ఒకచోట కట్టడాలు కడుతూనే వుంటారు. ఆ కట్టేచోట ఆయన మేస్త్రి అయితే, ఆయన మీద పర్యవేక్షించే 'సూపర్ వైజర్' మాణిక్యం అయినా ఆ పని కివతలా, ఇంట్లోనూ, మాణిక్యం ఆయన దగ్గర అణగి మణగి నడుచుకునేవాడు.

కోనేరు దాటి, కపాలేశ్వరుడి ఆలయము దాటి, తూర్పుకు వెళ్ళి వాళ్ళిద్దరు ఒక సందులోకి ప్రవేశించారు. దక్షిణాభిముఖంగా వున్న ఒక ఇంటి, బయటి 'గేట్' ని తెరచుకుని లోపలికి వెళ్ళారు. చిన్న సిమెంటు బాట, దాని కిరువైపుల పూల చెట్లు. ఇంటి తలుపులు తెరిచే వున్నాయి. తలుపుల వెనకగా వున్న మెట్లెక్కి

మాణిక్యం మేడమీదకు వెళ్ళాడు, ఇంట్లోకి అడుగు పెడుతూ "అణ్ణామలై వున్నాడా ?" అని అడిగారు మేస్త్రి. చొక్కా విప్పసాగాడు.

ఇంట్లో విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి, వంటింటి నుండి బయటికి వచ్చిన మీనాక్షమ్మ - "వచ్చే వేళయింది; ఈ పాటికి వస్తూంటాడు" అంది. ఆమె వయస్సు యాభయికన్న తక్కువే. పసుపు కుంకుమలతో ఆమె మొహం కళకళ లాడుతూంది, దబ్బపండు పసుపు ఛాయ; సన్నని శరీరం; వంటింటి పనులవలన ఏర్పడిన చెమట బిందువులు ఆమె ముఖపు శోభను ఇనుమడింప చేస్తున్నాయి. యవ్వనంలో ఆమె, చిత్రకారుడు చిత్రించదగిన సౌందర్యవతిగా వుండి వుండాలి.

ఇంట్లో కుళాయి వుంది. అయినా అలవాటు చొప్పున చిదంబరం పెరట్లో బావి నీళ్ళు తోడుకుని కాళ్ళు, చేతులు, ముఖము కడుక్కున్నారు. తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ వస్తున్న ఆయనకు, మీనాక్షమ్మ నటరాజస్వామి పటం ఎదుట దీపపు కెమ్మెను వెల్గిస్తుండడం కనపడింది. దేవుడికి దండం పెట్టే అలవాటు ఆయనకు లేదు. ఆమె చేసేదేదో తన తరఫున కూడా కలిపే చేస్తుందిలే అని ఆయన భావం. కాని ఆ రోజు ఎంచేతనో దేవుడికి నమస్కారం చేయాలన్పించింది మేస్త్రికి. దీపం ప్రక్కనే వున్న విభూతిని చేత్తో తీసుకుని నుదుటి మీద పూసుకున్నారు. ఆయన మనసు నటరాజు మీదో, ఆ దీపంమీదో నిలవలేదు. తోటలోని పూవులన్నీ ఆ దేవుడిని అలంకరించి వున్నాయి. ఆ వాసనకూడా ఆయన నాసిక కందలేదు. ఆ పూల రంగులు ఆయన కంట పడలేదు.

"పోయిన సారిలా అణ్ణామలై పరీక్ష తప్పిపోకూడదు సుమీ ! తప్పకుండా వాడిని కృతార్థుడిగా చేయాలి !" అనుకోవడంతో ఆయన పూజ ముగిసింది.

"భోంచేస్తావా ?" అని అడిగింది మీనాక్షమ్మ.

అణ్ణామలై వచ్చాక నన్ను పిలు; మేడమీద వుంటాను అని, ఆ రోజు సాయంత్రం పత్రికలో వచ్చిన వార్తను ఆమెకు చెప్పారు. ఆ తర్వాత మేడ మెట్లెక్కుతూ మాణిక్యాన్ని పిలిచారు.

అవాళ తన్నాయన వదలిపెట్టడని మాణిక్యానికి తెలుసు. ఆయన గొంతు వినగానే తను కూర్చున్న కుర్చీని ఆయనకిచ్చి పెట్టెమీద కూర్చున్నాడు మాణిక్యం. వాళ్లు కూచున్నది కాక, మేడమీద ఇంకోగది, వంటగది వున్నాయి.

మాణిక్యం తల్లి వంటింట్లో వుంది. మేడమీది వాటాలో వున్నవి రెండు

గదులే అయినా అన్ని వసతులూ అక్కడే వున్నాయి. మరి మేస్త్రి తన కోసమని కట్టుకున్నట్లు కదా !

మేస్త్రి మాణిక్యంతో అన్నారు. "దీని తర్వాత అణ్ణామలైను ఇంజినీరింగు చదివించా లనుకుంటున్నాను. సీటు దొరకడం కష్టమే ననుకో; మన యజమాని గారి సిఫారసుతో ఎట్లాగో సంపాదించవచ్చు.''

"ఔను-'' అన్నాడు మాణిక్యం. ఆయన తన కొడుకును తనకన్న తన పై చదువు చదివించనుండడం మాణిక్యానికి ఏదోగా వుంది కాని అతడు తన భావాన్ని ముఖంమీద కనపడనివ్వలేదు.

"నే నెటూ చదువురాని మూర్ఖుణ్ణి. కాని మీరంతా అట్లా వుండకూడదు. మీ దంతా చదువుకున్న మూర్ఖుల యుగంకదా !" అన్నారు మేస్త్రి,

ఏన్నో ఏండ్లకు ముందు చెట్టినాడునుండి భుజంమీద తువ్వాలు వేసుకొని, చేత్తో పరికరాలు పట్టుకుని వచ్చి మద్రాసులో దిగిన వాడాయన. ఆ సరికే చెట్టి నాడులో అంతఃపురాలు కట్టేకాలం ముగిసి, కట్టిన వాటిని పడగొట్టే కాలం మొదలయింది. మదరాసులో ఆయన పని దొరక్క పస్తులున్నాడు. ఇటుక ఆవాల దగ్గర పనిచేద్దామంటే అక్కడకూడా పోటీయే. సగం కూలికి ఏదో ఒక పనిచేసి పొట్టకింత గంజి పోసుకున్న రోజులూ వున్నాయి. సాటి పనివారు ఇంకా గుడిసెల్లో వుంటున్నా, ఏ పనయినా సరే తక్కువ కాదనుకుని చేసిన మేస్త్రి ఈ నాటికి మైలాపూర్‌లో ఇల్లు కట్టుకున్నారు; తంజావూర్ దగ్గర ఒక ఎకరం మాగాణి కొన్నారు.

"మాణిక్యం ! పని నన్ను వెతుక్కుంటూ రాలేదు. నేను దాన్ని వెతుక్కుంటూ వెళ్లాను. పనిలోకి వెళ్ళినప్పుడు ఒక పైసకు తొమ్మిది పైసల పని చేశాను. ఒళ్ళెన్నడూ దాచుకోలేదు. పోచికోలు కబుర్లు చెప్పి, ఆడ కూలీలతో సరసాలాడుతూ కూచుని కూలి డబ్బులు సంపాదించాలని అనుకుని వుంటే నేడిట్లా ఈ మేడమీద నీతో కూచుని మాట్లాడుతుండేవాడిని కాను. అట్లా కష్టాలు పడ్డ నేను ఈ నాడు మిమ్మల్ని చదివించ గలిగాను.''

"ఔను, మామయ్యా !'' అన్నాడు మాణిక్యం. అత డాయన్ను అట్లాగే పిలవడం అలవాటు. "చదువు లేకపోతేనేమి బుద్ధి, నైపుణ్యం, ప్రతిభ కలవాళ్ళు మీరు. మేము మీ యంతటి వాళ్లమయితే చాలు-''

ఆ మాటలు విని ఆయన మనసుప్పొంగింది.

"కాదు. నా అంతటి వాళ్ళయితే చాలదు. మన యజమాని అంతటి వాళ్ళు కావాలి."

"అలాగే మామయ్యా !"

క్రిందనుండి మీనాక్షమ్మ గొంతు వినిపించింది. "అణ్ణామలై వచ్చాడు, భోజనానికి లేస్తారా ?"

గబగబ లేచి క్రిందకు వెళ్ళారు చిదంబరం.

# 2

అణ్ణామలై తన గదిలో కూచుని నాన్నగారు కొనుక్కొచ్చిన పత్రికలను తిరగ వేస్తున్నాడు. పరీక్ష ఫలితాల విషయం అతడి కప్పుడే గుర్తుకొచ్చింది. పోయిన సంవత్సరం 'ఇంటర్మీడియెట్' పరీక్షలో ఇంగ్లీషులో, తమిళంలో మంచి మార్కులే వచ్చాయి కాని, లెక్కల్లో తగినన్ని మార్కులు రానందువల్ల పరీక్ష పోయింది. లెక్కలను జయిస్తేగాని ఇంజనీరింగ్ కళాశాలలో అడుగు పెట్టడానికి వీలులేదుకదా !

అణ్ణామలై లెక్కల్లో ప్రవీణుడు కావాలన్నది మేస్త్రిగారి సంకల్పం. ఆయన నిరక్షరాస్యుడయినా అన్ని విషయాలూ తెలుసుకున్నవాడు.

"ఎక్కడి కెళ్ళావురా ?"

"లైబ్రరీకి వెళ్ళి, అక్కడినుండి సముద్రపు ఒడ్డుకెళ్ళి కూచుని వస్తున్నాను."

"సరే, రా భోంచేద్దాం !"

అణ్ణామలై తల్లిని పోలిన కొడుకు. ఎన్నో ఏళ్ళకు ఆ దంపతుల కడుపున పండిన పంట అతడు. వయస్సుకు తగినట్లు పెరిగిన విగ్రహం అతడిది. వంకరలు తిరిగిన జుత్తు. పొడవైన ముక్కు. గిరిగీచినట్లున్న కనుబొమలు. కలలు కంటు న్నట్లున్న కనులు. పొడుగుచేతుల చొక్కా, ధోవతి అతడికి నిండు దనాన్నిచ్చాయి.

భోంచేస్తూ, మేస్త్రిగారు ఇందాక మాణిక్యంతో చెప్పిన మాటలే కొడుకుతోనూ అన్నారు. ఆయన మాటలలోని మితిమించిన ఉత్సాహం అతగాడిలో ఒక విధమైన సంచలనం కల్గించింది. భోజనాలవగానే అణ్ణామలైతోబాటు అతడి గదిలోకి

వచ్చారు మేస్త్రి. అతడి మంచంమీద కూర్చొని అప్పుడే అతడు పెద్ద ఇంజనీరు, కంట్రాక్టరు అయిపోయినట్లుగా ఉపదేశం చేయసాగారు.

"ఇదిగో చూడు! ఈ మాణిక్యం వున్నాడే వీడు ఇప్పుడే నాపై అధికారి అయిపోయాడు. నువ్వు నాకూ వాడికీకూడా పైవాడివిగా రావాలి—"

పెచ్చుపెరిగిన పాశమా, పెంచుకున్న ఆశలా, చదువు నేర్వని తనమా - ఎందువలన ఈయన ఇట్లా మాట్లాడుతున్నాడు అన్పించింది అణ్ణామలైకు. అతగాడికి తండ్రంటే భక్తి, గౌరవమూ వున్నాయి. కాని ఇంకో పది సంవత్సరాల తర్వాత మాట్లాడవలసిన విషయాల గురించి కాకపోతే పోయె, పది గంటలయినా ఓపికపట్టి, ఆ తర్వాతయినా మాట్లాడితే బాగుండునుకదా!

చిదంబరం తమ ధోరణిని మానలేదు.

"మన చెట్టినాడులో కూలిన ఇళ్ళూ, మొండి గోడలూ నానాటికి హెచ్చుతున్నాయి. ఈ చెన్నపట్నంలోనేమో గుడిసెలు బంగళాలవుతున్నాయి. ఊరిలో డబ్బు బలిసినవాళ్ళు పెరిగినకొద్దీ మనకు లాభమే .. వచ్చిపడుతున్న పనికి తట్టుకోలేక ఎంతో డబ్బును వదులుకుంటున్నాడు మా యజమాని."

అణ్ణామలై వలలో చిక్కిన చేపలా విలవిలలాడుతున్నాడు. ఆయన ఉత్సాహం పరవళ్ళు తొక్కుతూంది. "నీ రోజులు వచ్చేసరికి తాపీ పనికి, వడ్రంగానికి మనుషులుండరు. చదువులు చదివినవాళ్ళు ఒళ్ళువంచి పనిచేయరు. చదవని వెధవే పని ఎగ్గొడదామని చూస్తూంటే, చదివినవాడిమాట చెప్పనేల? అంచేత అన్ని పనులకూ యంత్రాలను కొనిపడేయి!"

"అలాగే" అని ఆయననుండి విడివడదామనుకున్నాడు అణ్ణామలై.

ఇంకాసేపు అదే ధోరణిలో మాట్లాడాక చిదంబర మేస్త్రి లేచారు. "నీకు నిద్ర వస్తున్నట్లుంది, పడుకో! న్యాకివాళ నిద్రరాదు." అని వెళ్ళబోయా డాయన. కాని వెంటనే వెళ్ళలేదు. వెనక్కు మళ్ళీవచ్చి —"నేను చెప్పింది గుర్తుంచుకో! 'మిషన్లు' కొనడం మరవకు. రానురాను చేత్తో పనిచేయడం చాల అవమానం అని భావించే రోజులు వస్తున్నాయి. ఇనుప యంత్రాల మెడలు వంచడం తెలుసుకో—" అని అతడి మెడవంచినంత పనిచేసి, ఆ తర్వాత కదిలారు మేస్త్రి.

అణ్ణామలై తన కుడిచేతిని చూసుకున్నాడు.

అది ఇనుపచేయి కాదు; ఇనుమును వంచగల చేయికాదు. సన్నటి పొడుగాటి

వేళ్ళున్న మృదువైన చేయి. అది అతడి తప్పుకాదు; ఆ భగవంతుడి తప్పేమో? అతడికి తెలియకుండానే అతడి చేయి ఆకులా అల్లలాడింది. అతడి కను కొలకుల్లో రెండు నీటిబొట్లు నిలిచాయి. చేతితో చేసేపని అవమానకరమట! అలాగయితే చిత్ర రచనో?

కన్నీటి బొట్లగుండా చేతిని చూస్తున్న అతడికి ఉన్నట్లుండి కొన్ని దృశ్యాలు కనిపించాయి. తామర పువ్వులు తళుక్కుమని విచ్చుకున్నాయి. నెమళ్ళు పురివిప్పి నాట్యమాడాయి. లేళ్ళు అందాల కనులతో చూశాయి. కోకిలలు గళమెత్తి పాడాయి. ఇవన్నీ మాయమయ్యాక ఇవన్నీ కలవగా ఏర్పడినదా అన్పించే అందాల జవ్వని అందగుపించింది.

దీపం ఆర్పి పడుకున్నా డణ్ణామలై. గత సంవత్సరం పరీక్ష పోవడం అతడి కెంతో బాధాకరం అనిపించింది. లెక్కలు తప్ప ఇంకే విషయమయినా తీసుకుంటా నన్నాడు కాని తండ్రి ససేమిరా అంగీకరించలేదు. ఆ లెక్కలే తనతో దాగుడు మూత లాడింది. మళ్ళీ ఈసారి దానితో పోరాటం సాగించాడు. జయించనున్నది తానా, లెక్కలా అన్నది తెల్లవారితే తేలుతుంది.

పొద్దున అయిదింటికెల్లా దొడ్లోని చెట్టుమీద కోయిలలు అతణ్ణి నిద్రలేపాయి.

పట్టణంలో కోయిలలు పాడుతాయనీ, పిచ్చుకలు కలకలారవాలు చేస్తాయనీ, లేతగాలులు నర్తిస్తాయనీ, పువ్వులు సౌరభాలు వెదజల్లుతాయనీ - అక్కడ వుంటున్న వారిలో చాలమందికి తెలియదు. ఆ నగరపు ఆకాశంమీదకూడ చంద మామ నక్షత్రాలు వెలుగుతూ వున్నాయి. ఇవన్నీ అణ్ణామలైకు తెలుసు.

మామిడి చెట్లమీద కోయిలల గానం కొన్ని కొన్ని మాసాలలో కొన్ని కొన్ని వేళలప్పుడే వినగలిగేవాడు. మల్లెపూల మత్తెక్కించే వాసనలూ అప్పుడే వీచేవి. ఎన్నోసార్లు ప్రయత్నం చేయగా చేయగా, ఒక్కసారి చాటుగా నిలబడి పాడే ఆ కోయిలలను చూడగలిగే భాగ్యం కల్గిం దతడికి. అతడి కా రోజు ఎంత ఆనంద పారవశ్యం!

''అణ్ణామలై!'' అని అతడిని కేకవేస్తూ గదిలోకి వచ్చి దీపం వేశారు చిదంబరం. వెలుతురు కళ్ళు పొడుస్తుండగా లేచాడు అణ్ణామలై. చిదంబరం అతడి కొక రూపాయినిస్తూ —''వెళ్ళి బజారులోకొచ్చిన దినపత్రికలన్నీ పట్టుకురా!'' అని పురమాయించారు. రాత్రెల్లా ఆయన నిద్రపోలేదని ఆయన కండ్లు చెబు తున్నాయి.

గబగబ వీధిలోకి వెళ్ళాడు అణ్ణామలై.

పనస తొనలమీద ఈగల్లా వున్నారు పత్రికల దుకాణాలవద్ద విద్యార్థులు. అణ్ణామలై అతి కష్టంమీద, అపాటికి వచ్చిన నాలుగు పత్రికలను కొనుక్కొని బయటపడ్డాడు. గుండె దడదడ కొట్టుకుంటుండగా, నడిచివెళ్ళి కోనేటి గట్టుమీద ఒక దీపస్తంభం ప్రక్కగా నిల్చున్నాడు. అపాటికే అక్కడ ఒక చిన్న గుంపు వుంది. కాస్త దూరంగా నిలబడి పత్రిక తెరిచి జాగ్రత్తగా చూశాడు. అతగాడి పరీక్షా సంఖ్యకు ముందరిది వుంది, వెనుకది వుంది. అతడి పరీక్షా సంఖ్య ?

అతడి సంఖ్య ?

రెండవ పత్రికలోనూ అట్లాగే వుంది. మిగతా రెండు పత్రికలను అతడు విప్పలేదు. వాటన్నిటిని చేతిలో అదిమి పట్టుకుని కోనేటి ఒడ్డునవున్న గోడదగ్గరకు వచ్చాడు. ఆ గోడే లేకపోతే పడిపోతానేమో అనుకున్నవాడిలా దానిని పట్టుకున్నాడు. కోనేటి కవతలవున్న ఆలయ గోపురాన్ని, కోనేటి మధ్య మంటపాన్ని వెర్రిచూపులు చూస్తున్నాయి అతడి కళ్ళు. కోనేటిమీద పలుచగావున్న వెన్నెల అతడి వెర్రి కళ్ళల్లో ప్రతిఫలించింది.

ఆ కోనేరు, మంటపం, గుడి, వెన్నెల - ఇవన్నీ అతడి కిప్పుడు ఆగ్రహం కల్గించాయి. అంతకు ముందెన్నోసార్లు ఆ వేళకు అక్కడకు వచ్చి ఆనందంగా గడిపిన క్షణాలున్నాయి. ఆలయంచుట్టూ తోట చెట్లూవుంటే ఎంత బాగుండునో అని ఊహించిన రోజులున్నాయి. అయితే ఇవాళ మాత్రం, ఉక్రోషం, కోపం, ఒళ్ళుమంట.

అతడి బాల్యంలో ఆ కోవెల క్రొత్త అందాలను సంతరించుకున్నది. ఆ అందాలు అతడి మనసును దోచి ఆఖరి కిట్లా చేశాయి. లెక్కలు సరిగా రానివాడిగా అతడిని చేసినదేది ? ఆ కోవెలేనా ? లేక ఆ కోనేటిలో తేలడానికని తెప్పను తయారు చేయడానికి వచ్చిన శిల్పులా ?

ఆకాశంనుండి చీకటిజారి ఆ కోనేటిలో కరగిపోయింది. పొద్దు పొడిచింది. పాలిన వెన్నెల మెరిసే ఇత్తడి రేకులాటి లేత ఎండకు తావిచ్చింది. అణ్ణామలై వీధివైపు చూశాడు. పిచ్చిపట్టిన వాడిలా చిదంబర మేస్త్రి అతడివైపు విసవిస నడిచి వస్తున్నారు.

# 3

చిదంబరమేస్త్రి నడిచి వస్తున్న వేగమే ఆయన మనస్సు అదుపులో లేదని చెప్పింది. అణ్ణామలై వెంటనే ఇంటికి రాకపోయేసరికి ఆయనకు సందేహం కలిగింది. బయలుదేరారు. దారిలో ఎదురయిన ఒక విద్యార్థి నడిగి పత్రిక తీసుకుని చూశారు.

ఈసారికూడా అతడు ఉత్తీర్ణు డవలేదు.

కొలిమినుండి తీసిన ఇనుపకడ్డీవలె ఆయన చేయి అణ్ణామలై భుజంమీద పడింది. ఏమీ మాట్లాడకుండా అతడి నింటికి తీసుకువెళ్ళారు; గదిలోకి తోశారు. తర్వాత వెర్రి ఆవేశంతో తలమీద పదేపదే బాదుకున్నారు.

''నాశనమయింది. సర్వనాశనమయింది—" అని అరుస్తూ నెత్తిమీద మొహంమీద కొట్టుకున్నారు. మీనాక్షమ్మ ఆయనను ఆపలేకపోయింది. ఈ గొడవ నంతా విని మేడమీదనుండి పరుగెత్తుకొచ్చి మాణిక్యం ఆయన చేతులను పట్టుకుని "మామయ్యా, మామయ్యా !" అని బ్రతిమిలాడాడు. అతడికి కారణం అర్థమయింది.

"మామయ్యా ! మీరిట్లా చేయడం బాగుందా చెప్పండి—''

''నువ్వు ఈ ప్రశ్న అడగవలసింది నన్నుకాదు, వాడిని !" అని మాణిక్యం మీద మండిపడ్డారు చిదంబరం. "నేనీ పట్నానికి వచ్చినప్పుడు ఒక్కపూట తిండి కూడా లేక వీధులవెంబడి తిరిగాను; మాసిన పంచను మడిస్తే చినిగిపోతుందని మారుపంచ లేకుండా తిరిగాను; ఫుట్‌పాత్‌లమీద కాగితాలు పరుచుకుని పడు కున్నాను— "

తిండి, బట్ట, ఇల్లు - మేస్త్రి చెప్పిన ఈ మూడింటి గురించి అణ్ణామలై ఇప్పుడే ఆలోచించాడు. తండ్రిమీద అతడి కెంతో జాలి కలిగింది. కాని ఆయన దుఃఖోపశమన నిమిత్తం అతడేమీ చేయలేకపోయాడు.

నెమ్మదిగా మాణిక్యం ఆయనను శాంతింపచేశాడు. ఆయన తిట్టిన తిట్లన్నీ విని ఆయన మనసును ఆనాటి పనులమీదకు మళ్ళింపచేశాడు. వాళ్ళప్పుడు కడు తున్న ఇంటికి అవాళ పునాది వేయాలని, అక్కడికి ఆ రోజు యజమాని స్వయంగా రావచ్చునని ఆయనకు గుర్తుచేశాడు.

"సరే, వెళ్దాంపద !" అన్నారు మేస్త్రి. ''ఇవాళ నేను నిన్ను విందు భోజ

నానికి పిలిచాను కదూ... అందుకు విరుద్ధంగా నేనే ఇవాళ ఉపవాసం. పచ్చి గంగయినా ముట్టుకోను. పస్తులుండడం నాకు అలవాటే.''

చొక్కా మార్చుకోవడానికి చిదంబరం లోపలికి వెళ్ళినప్పుడు మాణిక్యం అణ్ణామలై గదిలోకి వెళ్ళాడు. పరీక్షలో అతడు కృతార్థుడయివుంటే మాణిక్యం సంతోషించేవాడు కాదేమో, కాని ఇప్పుడు మాత్రం నిజంగా దుఃఖించాడు.

''ఈ పిచ్చి పిచ్చి బొమ్మలు గీయడం మానేయి. లెక్కలు వేయడం నేర్చుకో. మామయ్యతో నేను మాట్లాడి మళ్ళీ సంవత్సరం నువ్వు చదవడానికి ఏర్పాటు చేయిస్తాను.''

ఈలోగా చిదంబరం అటు రావడంతో మాణిక్యం తొందర తొందరగా మేడ మీదకువెళ్ళి మధ్యాహ్నానికి భోజనంవున్న పాత్రను తీసుకుని వచ్చాడు. మీనాక్షమ్మ తెచ్చి వుంచిన గిన్నెను చూడనయినా లేదు చిదంబరం. ఆ గిన్నెను తీసుకొనబోయిన మాణిక్యాన్ని వారించి, తనవెంట తీసుకెళ్ళారాయన.

సమయం గడిచింది. మీనాక్షమ్మ ఎన్నోసార్లు అణ్ణామలైను భోజనానికి పిలిచింది. కాని అతడు రానన్నాడు. కంట తడిపెట్టడం మినహా ఆమె ఏమీ చేయలేక పోయింది. కొంత సేపటికి స్నానం ముగించి, బట్టలు మార్చుకుని బయటకు బయలుదేరాడు. అతడి చేతిలో నోట్‌పుస్తకం వున్నది.

"భోంచేసి వెళ్లరా'' అంది మీనాక్షమ్మ.

"నాన్నగారితో పాటు చేస్తాను-".

వీధిలోకి నడిచాడు అణ్ణామలై. అట్టే దూరం నడవలేదు. అతడి కాళ్ళు కపాలేశ్వరుడి ఆలయానికి దారి తీశాయి.

ఆలయం లోపలికి వెళ్ళి ప్రాకార స్తంభాన్ని ఆనుకుని కూర్చున్నాడు. జనం లేనివేళ అది. ఏకాంతం లభించింది. అనేక సంవత్సరాల ముందు – అక్కడ జరిగిన సంఘటనలు – చిన్ననాటి సంఘటనలు – గుర్తు కొచ్చాయి.....

...అప్పుడు దేవాలయ పునరుద్ధరణ పనులు జరుగుతున్నాయి. ఒకివైపు ఎత్తైన ఆలయంతో పోటీ పడేలావున్న తెప్ప నిర్మాణం జరుగుతోంది. ఇంకొకవైపు వాహనాలకు వెండి, బంగారు మలామాలు పూస్తున్నారు. గోపురం మీద బొమ్మలకు క్రొత్త రంగులు వేస్తున్నారు. చేయి తిరిగిన పనివాళ్లు మధుర, తంజావూరుల నుండి మైలాపూరు కొచ్చారు. ఎట్లాగో వాళ్లతో నేస్తం కలిపాడు అణ్ణామలై.

బొటన వేలంతటి ఉలితో చెక్కనుండి శిల్పాలు చెక్కుతున్నారు కొందరు. తెప్పకోసం నర్తన కాంతల శిల్పాలను చెక్కుతున్న వారి చేతి వేళ్లు నాట్య మాడుతున్నట్లు, ఉలి పాట పాడుతున్నట్లు అనిపించింది అణ్ణామలైకు.

తంజావూరుకు చెందిన ఆ శిల్పుల ఆకారము, బట్టలు అతడికి విచిత్రంగా తోచాయి. వారికి పెద్ద కొప్పు లుండేవి. వాళ్లు నాల్గు పక్కల తెరలు కట్టిన గుడారాల లోపల పనిచేసేవారు. ఎవరినీ లోపలికి రానిచ్చేవారు కాదు. కాని వారి ప్రేమకు పాత్రుడయిన అణ్ణామలై రాకకు అడ్డుండేది కాదు. స్ఫటికాల వలెవున్న కాగితపు కట్టల మధ్యనుండి వారు బంగారపు, వెండి రేకులవంటి వాటిని ప్రత్తితో అద్ది పైకెత్తి వాహనాలమీద వున్న మైనపు పూతపై అద్దేవారు. చెక్కతో చేసిన వారి ఇంద్రజాల ఫలితంగా బంగారపు దేహంతో మెరిసేది. రంగు రంగుల రాళ్లను పొదిగి దానికి ఆభరణాలు చేసేవారు,

ఆ పసి వయసుననే అణ్ణామలై చేయి తత్తర పడేది. ఆ పని వాండ్లకు చేదోడుగా వుండడమే అతడి కానందంగా వుండేది.

పనులన్నీ ముగిశాయి. వాళ్లు వూరికి వెళ్ళే రోజు వచ్చింది. ఒక శిల్పి అణ్ణామలై నెత్తుకుని వాడి వీపు నిమిరాడు. వెన్న తింటున్న క్రిష్ణయ్య బొమ్మను అద్దంమీద జరీ కాగితాలు అతికించి తయారుచేసి, అణ్ణామలైకు బహుమతిగా ఇచ్చాడు. అతడి కోసం ఆ శిల్పి ప్రత్యేకంగా చేశాడు దానిని.

"బాబూ ! నీకీ పని బాగా వస్తుంది. కాని ఇది చెయ్యకు !''

"ఎందుకు ?'' అన్నట్లుగా చూశాడు అణ్ణామలై.

"ఇక ముందా వృత్తిని చేపట్టి పొట్టపోసుకోవడం వీలుకాదు. మా కంటే తర తరాలుగా వచ్చింది. రాజులు, చక్రవర్తులు ఆదరించి పోషించిన వృత్తి. కాని ఇప్పుడు కాలం మారిపోయింది. నా కొడుకు ఫోటోలు తీయడం నేర్చుకున్నాడు. ఒక్క మీటను నొక్కితే చాలు ఫోటో వస్తుంది. అదీ ఈ కాలం ! కనుక నాయనా, ఈ కళపై ఆశ పెంచుకోకు !"

ఆ వయసున అణ్ణామలైకు అదంతా బోధపడలేదు. ఆ వెన్న తింటున్న కృష్ణుడి జరీ చిత్రపు అంద మొక్కటే అతడికి తెలిసింది.

ఇప్పుడు ఈ వయసున దానిని అర్థం చేసుకుందామని యత్నించాడు అణ్ణామలై. మండపం స్తంభాన్ని వెతుక్కుంటూ రావలసిన స్థితి ఎందుకొచ్చింది ?

కాలేజీలో చేరాకనే అతడి లోపల దాగిన కళాతృష్ణ తీవ్రమయింది. లెక్కల మీదకు దృష్టి మరల్చాలని ఎంతో ప్రయత్నించాడు. కాని అందుకు వ్యతిరేకంగా ఏదో శక్తి అతడిలోనుండి పోరాటం సాగించింది,

"నాయనా! ఈ కళపై ఆశ పెంచుకోకు—" అని ఆ కొప్పు పెట్టుకున్న శిల్పి మళ్ళీ వచ్చి చెబుతున్నట్లు అన్పించింది.

"నేను ఆశ పెంచుకున్నానా! ఆ కళే తన ఆశకోసం నన్నిలా ఆడిస్తూంది—" అని తనలో తానే మాట్లాడుకున్నాడు అణ్ణామలై.

కొంతసేపయింది. ఆకలి వేసింది. కూర్చోబుద్ధి కాలేదు. వెనుక నుండి కోనేటివైపుగా వెలుపలికి వచ్చాడు. మధ్యాహ్నపు ఎండ ముదురుతూంది. చేతిలో డబ్బులున్నాయి కాని కాఫీ తాగాలని తోచలేదు. నడిచి వెళ్లి అడయారు వెళ్ళే బస్సునెక్కాడు.

# 4

అడయారు వచ్చింది.

బస్సు దిగాడు అణ్ణామలై. కుళాయి దగ్గర మొహం కడుక్కొని నీరు తాగాడు. ఆకలి కాస్త సర్దుకున్నట్లనిపించింది.

అతడు అప్పుడప్పుడు మాణిక్యంతో బాటో లేక ఇంకెవరైనా మిత్రుడితో బాటో అడయారువద్ద ఎలియట్స్ బీచ్ దగ్గరకు వస్తుండేవాడు. అక్కడికి వెళ్దామనే తూర్పుకు తిరిగి ఒక వీధిలోకి అడుగుపెట్టాడు. ఆ వీధి చివర కనపడిన దృశ్యం కొన్ని క్షణాలపాటు అతడిని నిలవేసింది.

దేహపుష్టి గలదీ, చినిగిన చీర కట్టుకున్నదీ అయిన ఒక పల్లె పడుచు, ఎవరినీ లక్ష్యపెట్టని ధోరణిలో కూచుని తన బిడ్డకు పాలు ఇస్తూంది. నల్లటి మనిషి. అయినా శిల్పంవలె వుంది. ఇటువంటి మనిషి నతడు పట్నంలో ఎన్నడూ చూడలేదు. ఆమె పక్కన ఒక గుడ్డల మూట, రేకు డబ్బా వున్నాయి. ఆమెపై అతడికి జాలి కలిగింది. గ్రామం నుండి చెడి చెన్నపట్నం చేరిందో, చెడడానికని చేరిందో తెలియలేదు. ఆకలితో వున్న అణ్ణామలైను దీనంగా చూసి, - 'బాబూ!' అని చేయి జాచింది. పర్సుతీసి, చేతికి అందిన పావలా నామె చేతిలో పడేసి, ఆమె

వైపు చూడనయినా చూడకుండా గబగబ నడిచి వెళ్ళిపోయాడు అతడు. ఆమె ఆశ్చర్యంతో అతడు వెళ్ళిపోతున్న వైపు చూసింది. ఇటువంటి వెర్రివాడిని ఆమె పట్నంలో ఇంతవరకు చూచి ఎరగదు, రెండు పైసలు ఇచ్చే మిషతో పావుగంట ఎదుట నిలబడి తమ కళ్లతో ఆమె శరీరాన్ని మింగేసే వారినే ఆమె ఎరుగును.

ఆ రోజుల్లో ఎలియట్స్ బీచ్ వూరికి ఒక ప్రక్కగా వుండేది. అక్కడ వలయాకారంలో వున్న మండపమూ, కొన్ని గుడిసెలూ వున్నాయి.

సాయంకాలం నాలు గయింది. అయిదయ్యాక కాని వ్యాహ్యాళి కెవ్వరూ అటురారు. అణ్ణామలై మంటపంలో కూచున్నాడు. నోట్ పుస్తకం తెరిచాడు. పెన్సిలుతో బొమ్మ గీయ నారంభించాడు; ఆ గీయడంలో ఆకలిని మరిచాడు; పరీక్షలో ఓటమిని మరిచాడు; తండ్రి ఛీత్కారమూ మరిచాడు.

ఎదుట సముద్రపు అలలు నీలపు పచ్చరంగునుండి ముదురు నీలపు రంగులోకి మారుతున్నాయి. సూర్యుడు మేఘాల ముసుగు లోపల వుండడం వలన ఎండ వేడి తగలడంలేదు. సముద్ర తీరపు గాలి అణ్ణామలై పెదవికి ఉప్పగా తగిలింది. నెమ్మదిగా మనుష్యులు రాసాగారు. కాని అణ్ణామలై వైపు ఎవ్వరూ రానందున అతడి ఏకాగ్రతకు భంగం కలుగలేదు.

కాని దూరంనుండి వస్తున్న ఇద్దరు మాత్రం అతడినే చూస్తూ వస్తున్నారు. ఎందుకంటే సముద్ర తీరానికి—గాలికని కొందరు కబుర్లు చెప్పుకోవడానికి కొందరు, ఏదయినా చదువుకోవడానికి కొందరు — ఇట్లా వస్తారు కాని ఎవరూ ఇక్కడికి వచ్చి కూర్చుని రాయరు. అందుకనే అణ్ణామలై వారి దృష్టి నాకర్షించాడు.

ఇద్దరిలో ఒకరు వయసు మీరిన పెద్దాయన; ఇంకొకరు యువతి. వారు ఎప్పుడూ ఆ చోటికి వచ్చేవారు. ఆ అమ్మాయితో మాట్లాడుతూ వచ్చిన ఆయన, తటాలున మాటలు ఆపి మండపంవైపు చూశాడు. అ అమ్మాయీ చూసింది.

మోకాలి క్రిందకు వేలాడే లాల్చీని వేసుకుని పంచె కట్టుకొని, బెంగాలీలవలె పసుపు శాలువను వల్లెవాటు వేసుకుని వున్నారాయన. ఒడ్డూ పొడుగూ వున్న ఆయన తలముందు భాగం బట్టగా వుంది. వెడల్పయిన ముఖంమీద - సోడాబుడ్డీ అడుగు భాగంతో చేసినట్లున్న - కళ్ళజోడుంది.

ఆయనతో బాటున్న యువతి చూపరుల నాకర్షించే సౌందర్యవతి కాదు. ఎదుటి వారి నిట్టే నిలవేయగల అందం ఆమె సొత్తుకాదు. ఆమె వయసు అణ్ణా

మలై కన్న ఒకటి రెండేళ్ళు తక్కువ వుండవచ్చు. కాని ఆమె కనులలో సమ్మోహన శక్తి వుంది. ఆమె కదలికలో అతి సహజమైన హొయలున్నాయి. నఖశిఖ పర్యంతం నవనవోన్మేషంగా వున్న ఆమె అలవోకగా నడుస్తూంది. నడుము క్రింద దాక వ్రేలాడే జడ, పొడుగాటి ముఖం, తీర్చి దిద్దినట్లున్న కనుబొమలు, లేతాకుల వంటి పెదవులు, సన్నని శరీరం.

"ఏదో బొమ్మ గీస్తున్నట్లున్నాడు—" అన్నాడాయన ఆమెకు మాత్రం వినపడేలా.

"ఔను నాన్నా! బొమ్మలు గీసేటప్పుడు మీ రెట్లా లీనమయి పోతారో అతడూ అలాగే వున్నాడు".

సమీపించారు. అణ్ణామలై ఎదురు దిశవైపు తిరిగి కూర్చుండడం వలన, వారి రాకను గమనించలేదు. ఆమె సిగలోని మల్లెల వాసన అతడి నాసికను తాకింది. తలెత్తాడు. అతడి మొదటి చూపు ఆమె కనులను చూసింది; రెండవ చూపు పెద్దాయనను చూసింది.

"మన్నించండి! మీ పనికి అంతరాయం కల్గించినట్లున్నాము—" అన్నారాయన.

"అబ్బే అదేమీ లేదులెండి. ఏదో ఊసుపోక గీకుతున్నాను."

"మేము దానిని చూడవచ్చా?"

ప్రక్కన ఆ అమ్మాయి వుండగా ఆయన చేతికి చిత్రాన్నివ్వడం అతడికి మొహమాటం అనిపించింది. అయినా ఆయన మాటను కాదనడానికి వీలు లేదాయె. అందులోను తాను తెలిసీ తెలియక వేసినదాయె....

"ఏదో...తర్వాత చింపి పారేద్దాంకదా అని గీశాను...." అంటూ నోట్ పుస్తకాన్ని అటు జరిపాడు.

ఆ చిత్రాన్ని చూసిన ఆయన, నెమ్మదిగా ఆ మంటపంలో కూర్చున్నారు. ఆ అమ్మాయిని కూచోమని సైగ చేశారు. ఒక నిముషంసేపు ఆ చిత్రాన్ని చూశాక అతడి కిచ్చేశారు. ఆ అమ్మాయి కళ్ళలోని వెలుగు అతడి ఒడలిని పులకరింప జేసింది. 'ఈ చిత్రం బాగున్నదేమో—'.

"దారిలో కూచునివున్న బిచ్చకత్తెను చూశారా?" అని ఆయన అడిగారు.

"మీరు చూశారా?"

"ఔను ! ఆమె మా ఇంటి ఎదుటే కదా కూచునుంది ?....ముఖం, శరీరం అన్నీ బాగున్నాయి. కాని ఆమె పుష్టిగానే వుంది, మీరు గీసినట్లు ఎముకల పోగులా లేదే ?"

"ఎందుకో గాని ఆమె త్వరలో ఇట్లా అవుతుంది అనిపిస్తూంది. ఈ పట్నం ఆకలితో ఆమెను అస్తిపంజరం చేసివేస్తుంది—''

ఆయన, అమ్మాయి ఒకరి నొకరు చూసుకున్నారు. ఈ బిచ్చకత్తెను గురించిన రహస్య మేదో తెలిసిన వారిలా చూసుకున్నారు.

అతడి చిత్రంలో...

ఎముకల గూడులా వున్న ఆ బిచ్చకత్తె దీనమైన మొహంతో బిడ్డకు పాలివ్వజూస్తూంది. ఎండిన ఆమె స్తనంనుంచి పాలు లభించని ఆ బిడ్డ కాళ్లు చేతులు విదిలిస్తూ రోదిస్తున్నది. ఆ ఏడుస్తున్న బిడ్డ నోటివద్ద ఆమె కన్నీటి బొట్టొకటి వున్నట్లుగా కల్పన చేశాడతడు. ఆ వెనకాతల ఎత్తైన మేడలున్నట్లు గీతలు, ఇంకొకవైపు ఆ వెనకాల నీడలలో వంగినట్లున్న చిన్న ఆలయ గోపురం. ఇదీ చిత్రం, దీని క్రింద - 'నగర హృదయం' అని పేరు రాశాడు.

ఆశ్చర్యంతో అతన్ని చూసింది ఆ కన్య. "అబ్బాయి చిన్నవాడే అయినప్పటికీ ఆలోచించి బొమ్మలు వేయడం నేర్చుకుంటున్నాడు—" అని పెద్దాయన అనుకున్నారు.

''ఆ బిచ్చకత్తె రూపం కళాభిరుచి వున్నవారిని రేకెత్తించే రూపమే; కాని వికారాలకు గురిఅయ్యే వారిని వెర్రి వారిని చేయగలది కూడాను" అని ఆయన అన్నారు.

సరిగ్గా అదే సమయంలో - దూరంనుండి, ''అణ్ణామలై ! నువ్విక్కడున్నావా ?'' అన్న గొంతు వినిపించింది.

ముగ్గురూ ఒక్కసారిగా వెనక్కు తిరిగి చూశారు.

# 5

అణ్ణామలైని చూసిన సంతోషంతో అట్లా అరిచినవాడు మాణిక్యం. అతగాడంత ఉత్సాహంతో కేక వేయడానికి ఇంకో కారణం, అణ్ణామలై ప్రక్కన ఒక

యువతి వుండడమే. ఆ పెద్దాయన మాణిక్యం దృష్టిలో పడనట్లే లెక్క. ముందా యువతిని, తర్వాత అణ్ణామలై ను చూశాడతడు.

"ఇతడు నా మిత్రుడు, మాణిక్యం" అని పరిచయం చేశాడు అణ్ణామలై .

"మీరింకా మీ పేరే చెప్పలేదే'' అని పెద్దాయన అనగానే అతడు తన పేరు చెప్పాడు. అప్పు డాయన తనపేరు కదిరేశన్ అనీ, తమ కూతురి పేరు ఆనంది అనీ చెప్పారు.

మాణిక్యం ఉండబట్టలేక —"నీ కోసం ఎన్నిచోట్లని తిరగడం ?'' అని పంచాంగం మొదలుపెట్టాడు. ''నువ్వు కోపంతో వెళ్ళి ఏ గుంటలోనో, బావిలోనో దూకుతావేమోనని మామయ్య భయం ! నిన్నసలు ఇంటినుండి బయటికి పోనిచ్చిందని అత్తయ్యను నానా మాటలూ అన్నారు. ఎట్లాగయినా నిన్ను వెతికి పట్టుకొస్తానని మామయ్యకు మాటయిచ్చి బయలుదేరాను."

ఆనంది సానుభూతితో అణ్ణామలై వైపు చూసింది. 'గుంటలోనో బావిలోనో దూకవలసినంతగా ఏమొచ్చింది ?' అని అడిగాయి ఆమె చూపులు. మాణిక్యం మాటలకు బాధతో, అవమానంతో తలవంచుకున్నాడు అణ్ణామలై . కదిరేశన్‌కు అతని గురించి ఇంకా తెలుసుకోవాలన్న కుతూహలం కల్గింది. —"రండి ! ఇసుకలో కూచుని మాట్లాడుకుందాం'' అని ఆయన లేచారు.

అణ్ణామలై సిగ్గుతో కాస్త దూరంగానే కూర్చున్నాడు. అతడి దృష్టికి ఆనంది మితిమీరిన కట్టుబాట్లకు లోనయిన మనిషిగాను అనిపించలేదు; నవనాగరికత వెర్రి తలలు వేసిన వ్యక్తిగాను అనిపించలేదు. ఆమెలో ఒక నూతనత్వం, నిదానం, మేలితనం, గాంభీర్యం గోచరించాయి.

మాణిక్యం అతి ఉత్సాహంతో కబుర్లు చెప్పసాగాడు. ఆ రోజు అణ్ణామలై తండ్రిగారికి పనిమీద మనసు పోలేదట; అందుకని ఉదయం శంఖుస్థాపన అయిపోగానే మధ్యాహ్నం మాణిక్యంతోబాటు ఇంటికి వచ్చేశారట. కొడుకు ఇంట్లో లేకపోయేసరికి గాభరా పడిపోయారట. లెక్కలపలన పరీక్షలో తప్పిపోయినందుకు అణ్ణామలై పిచ్చిగా ఏదన్నా అఘాయిత్యం చేస్తాడేమోనన్న భయం ఆయన్ను పట్టుకుందట.

మాటలో మాటగా మాణిక్యం తన చదువు, ఉద్యోగం మొదలయిన వివరాలూ చెప్పేశాడు. అణ్ణామలై రెండుసార్లు పరీక్ష తప్పాడనీ, ఆ మాత్రం అవకాశం

తనకుండివుంటే తాను బి. ఇ. చదివి ఇంజనీరయి వుండేవాడిననికూడా మనవి చేసుకున్నాడు. ప్రక్కనే అమ్మాయి వుందన్న విషయాన్ని మరువలేని వయసు మాణిక్యంది. అణ్ణామలైకన్న వయసులో పెద్దకదా !

అణ్ణామలై మనసు గాయపడిందన్న విషయాన్ని ఆనంది అర్థం చేసుకుంది.

ఆమె అణ్ణామలైతో —"మీ చక్కని చిత్రాన్ని చూసి చిత్రకళాశాలలో విద్యార్థిగా వున్నారేమో ననుకున్నాను—" అంది. ఆ మాటలు, వాటి నామె చెప్పిన తీరు, ఆమె స్వరం - అణ్ణామలై బాధను మరిచిపోయేలా చేశాయి. కళ్ళతో కృతజ్ఞత తెలిపాడు.

ఆనంది చెప్పింది : "కష్టపడి చదివికూడా లెక్కలలో తప్పినందుకు మీరు అంతగా బాధపడనక్కరలేదు. ఆ రోజుల్లో నాన్నగారుకూడా విజ్ఞాన శాస్త్రంలో తప్పారట. అయితేనేమి, నేడాయన చిత్రాలు ప్రపంచపు నలుమూలల 'మ్యూజియా' లలో వున్నాయి. కొన్ని దశాబ్దాలు చిత్రకళాశాలలో సేవచేసి ఆయన ఇప్పుడే పదవినుండి విరమించారు —"

"ఓ ! ఆ కదిరేశన్ మీరేనా !!" అని ఆనందాశ్చర్యాలతో అడిగిన అణ్ణామలై తన మనసున పూజించే ఆయన చిత్రాల గురించి చెప్పాడు. కదిరేశన్ మనసు సంతోషంతో నిండింది.

"చిత్రాలంటే నాకు ప్రాణం!" అన్నాడు అణ్ణామలై.

కదిరేశన్ కాసేపు ఆలోచించి — "మీరు చిత్రకళాశాలలో చేరదలచారా ?" అని అడిగారు. అణ్ణామలై ఆనందానికి అవధులు లేకపోయాయి.

"అయ్యో రామా ! బొమ్మల కాలేజిలోనా ?" అని అడ్డుపడ్డాడు మాణిక్యం. "మామయ్య ఈ మాట వింటే ఇతణ్ణి ప్రాణాలతో వుండనివ్వడు ! —"

"అసలు నాకు ప్రాణం వచ్చింది ఇప్పుడేకద !" అని ఆనందంతో అన్నాడు అణ్ణామలై.

కదిరేశన్ అణ్ణామలై నోట్ పుస్తకాన్ని తీసుకుని అందులో తమ చిరునామా రాసి "మీ నాన్నగారు అంగీకరిస్తే వచ్చి నన్ను కలవండి. ఏర్పాటు చేద్దాం" అన్నారు. ప్రక్కనేవున్న మాణిక్యం అవస్థను గమనించారాయన. అతడితోనూ ఏవో నాలుగు మాటలాడి "మీ రిటుప్రక్క వచ్చినప్పుడు కలవండి. మా ఇల్లు దారి లోనే వుంది." అన్నారు.

లేచి నిల్చున్న అణ్ణామలై కదిరేశన్‌కు కృతజ్ఞతలు చెప్పి, కరచాలనం చేశాడు; ఆనందికి కళ్ళతో కృతజ్ఞత తెలిపి తలవంచుకు నిలబడ్డాడు. అమ్మాయిలంటేనే అతడికి సిగ్గు. కాని ఆనంది ఆ రోజు తన కానందం కల్గించినదన్న విషయం అతడి మనసునిండా వ్యాపించి వుంది. పరీక్ష ఓటమివలన ఏర్పడిన బాధ, విరక్తి, చికాకు అన్నీ ఆమె కనుచూపులో కరిగిపోయాయి. ఈ విషయం ఇంత వివరంగా అతడికి తెలియనప్పటికీ అతడి మనసు మాత్రం పున్నమినాటి కడలిపలె వుంది.

మాణిక్యం వా రిద్దరినుండి శెలవు తీసుకున్నాడు. అతడికీ ఉల్లాసంగానే వుంది. ప్రత్యేకంగా ఆనందిని చూసి చిరునవ్వు నవ్వి మరీ సెలవు తీసుకున్నాడతడు.

వెనక్కు వెళ్ళే దారిలోనే - ఇందాక ఆ బిచ్చగత్తె కూచున్న చోటి కెదురుగా వుంది కదిరేశన్ ఇల్లు. ఇంటికి ప్రహరీగోడ లేదుగాని ముందుపక్క ఒక తుప్పు పట్టిన 'గేట్' వుంది. దాని కిరువైపుల వెదురు కర్రల పందిరి దానిమీద పూలూ ఆకులు నిండిన తీగలు వున్నాయి. ఇంటిచుట్టు పెద్ద తోట. దానినిండా చెట్లు తీగలు పూలమొక్కలు వున్నాయి. వీటిమధ్య పాత డాబా ఇల్లు. డాబాకువెళ్ళే మెట్ల సందు నుంచి ఒక రావిమొక్క తొంగిచూస్తూంది. దానిని చూస్తూ నిలబడ్డాడు అణ్ణామలై.

''ఇది ఆయన స్వంత ఇల్లే !'' అన్నాడు మాణిక్యం గేటుప్రక్కన శిలాఫలకం మీద పేరును చూస్తూ ''ఆహా ! పది 'గ్రౌండ్ల' చోటు ! బంగారం ! అంతా బంగారం !"

ఇల్లు, తోటచూసిన మాణిక్యానికి బంగారం ఎక్కడ కనపడిందో అర్థం కాలేదు అణ్ణామలైకు.

''ఈ మట్టే బంగారం. ఆ రోజుల్లో ఏ ఐదువందలకో కొట్టేసివుంటా డీయన. కాని ఇప్పుడిది బంగారంతో సమానం. ఇంకో అయిదేళ్ళయితే ఇదే వజ్రం తెలుసా ?''

"నాన్నగారితో మెలగి మట్టినుండి బంగారం సంపాదించడం ఒక్కటే లక్ష్యంగా పెట్టుకున్నట్లునా డితడు !" అని నవ్వుకున్నాడు అణ్ణామలై.

రకరకాల చెట్లు నిండిన ప్రశాంతమైన తోట - ఆ ఇల్లు - వీటినుండి ఏదో ప్రశాంతి బయలుదేరి అణ్ణామలైను ఆవరిస్తున్నట్లనిపించింది. ఆ చోటువిడిచి వెళ్ళాలనిపించలేదు. ఎన్నోసార్లు అటు వెళ్ళికూడా ఈ ఇంటిని తోటను గమనించలేదే

అనుకుని ''ఇది చూస్తుంటే ఏ తంజావూరు గ్రామసీమ లాగానో, కేరళలో లాగానో వుంది కదూ ?'' అన్నాడు అణ్ణామలై.

"ఈ చెట్లనుగనుక సరికేస్తే ఇక్కడో పెద్ద హోటలు కట్టవచ్చు'' అన్నాడు మాణిక్యం.

అతడిమీద కోపం వచ్చింది అణ్ణామలైకు. "రా ! పోదాం !'' అని అతడిని లాక్కుని వెళ్ళాడు.

చిదంబరమేస్త్రి దిగులుగా ఎదురుతెన్నులుచూస్తూ కూర్చొని వున్నారు. అల్లంత దూరాన కొడుకును చూడగానే ఆయనకు పోయిన ప్రాణం వచ్చినట్లయింది. ఆ రావడం భయంతో వచ్చింది. ఔను ! అణ్ణామలైను చూసి భయపడాల్సిన పనిని ఆయన మితిమీరిన కోపంలో చేసేశారు.

అయినా ఆయన - తన భయాన్ని వెలుపలికి చూపించుకోవడమా ? వాళ్ళిద్దరూ వస్తున్న సంగతి మీనాక్షమ్మకు చెప్పి ''వాడిని చూడగానే ఆగ్రహంతో ఏమిచేస్తానో నాకే తెలియదు. కనుక నా గదిలో వుంటాను మాణిక్యాన్ని మాత్రం పంపు." అని తమ గదిలోకి వెళ్ళిపోయారు. అణ్ణామలైకు సర్దిచెప్పే పని ఆమెకు వదలిపెట్టడం అయింది.

మీనాక్షమ్మ అట్లాగే మాణిక్యాన్ని మాత్రం ఆయనవద్దకు పంపింది. అణ్ణామలైతో మాట్లాడడానికి ఆమెకు జంకే. అందుకు కారణం వుంది.

అణ్ణామలై తన గదిలోకివెళ్ళి దీపం వేశాడు. అక్కడ కనపడిన దృశ్యం - అతడి కండ్లను తేలువలె కుట్టింది. నోరుతెరిచి అరుద్దామనుకున్నాడు. కాని నోట శబ్దం రాలేదు. గదంతా చిందరవందరగా అప్పుడే పెద్ద తుఫానుకు గురిఅయినట్లుంది. కాగితాలంటే ఆకలిగొన్న రాక్షసి అక్కడ విలయతాండవం చేసినట్లుంది.

అతడు గీచిన బొమ్మలన్నీ ముక్కలు ముక్కలుగా చిరిగి చెల్లాచెదరుగా వున్నాయి. నోట్ పుస్తకాలు మూలకొకటిగా క్రిందపడి వున్నాయి. కాగితపు అట్టలు వేయి ముక్కలుగా ప్రత్యక్ష మయ్యాయి. నెమ్మదిగా వంగి ఆ చెత్తను కెలికాడు అణ్ణామలై. యుద్ధరంగంకన్న భయంకరమైన పరిస్థితి. తలలులేని మొండాలు, వేర్వేరయిన కాళ్ళు, చేతులు, వికలాంగులు.

జుత్తు పీక్కుని వీధిలోకి పరుగెడదా మన్పించింది అణ్ణామలైకు. పరుగెత్తుకు వెళ్ళి సముద్రంలో దూకుదామనిపించింది. పరీక్ష పోయినప్పుడా ఆలోచన రాలేదు

కాని ఇప్పుడు వచ్చింది. కాని ఇంత జరిగాక అక్కడ వుండబుద్ధికాలేదు. ఇదంతా చేసిన దెవరో అతడి కర్థమయింది. కాని ఆయన ఇట్లా చేస్తుంటే అమ్మ ఆప కుండా చూస్తూ వూర్కుందా ?

తలుపువైపు తిరిగాడు. అక్కడ తలుపువారగా గ్రుడ్లనీరు కుక్కుకుంటూ మీనాక్షమ్మ నిలబడివుంది. ఆమె నుదుటిమీద చెంపలమీద గోళ్ళతో గీకినట్లున్న రక్తపు చారలు. అతడికి తెలిసింది. తన్ను కన్నతల్లి తనకోసం పోరాడింది !

మీనాక్షమ్మ నెమ్మదిగావచ్చి అతడి చేయి పట్టుకుంది. అతడిహ ఆపుకోలేక పోయాడు. తల్లి నానుకుని భోరుమని ఏడ్చాడు.

శిశువుగా వున్నప్పుడు వాడి నామె పాలతోనేగాదు, తన ఆశలన్నిటిని రంగ రించి పోసి పెంచింది. కథలు చెప్పింది. పాటలు పాడింది. ఆటలు నేర్పింది. తన గ్రామీణ జీవితం ఎంత ఆనందంగా వుండేదో చెప్పింది. ఆమె బడికివెళ్ళి చదువు కోలేదు. కాని ఆమెకు ఎన్నో కథలు, పాటలు వచ్చు. ఏనుగు, పులి, తామర పువ్వు, కాకి, పిట్ట మొదలయిన బొమ్మలను పలకమీద గీసిచ్చేది. పిల్లవాడయిన అణ్ణామలై ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని చూస్తుండేవాడు.

ఆ స్మృతులన్నీ గుర్తుకొచ్చాయి అణ్ణామలైకు. తోటలో ఒక మల్లెతీగ నాటాలని, చిత్రకళాశాలలో చేరాలని తనకుందని తల్లితో చెబుదామని తహతహ లాడాడు అణ్ణామలై. అపాటికి చిదంబరమేస్త్రి మాణిక్యాన్ని మేడమీదకు పంపివేసి "ఆకలిగా వుంది. నాకు అణ్ణామలైకు వడ్డించు" అంటూ అక్కడికి వచ్చాడు. ఆయన మొహం ఏమీ ఎరగనట్లుంది; తుఫానుకు కనపడనివ్వని ప్రశాంతి అది.

# 6

తండ్రీ కొడుకు లిద్దరూ మంచి ఆకలితో భోజనానికి కూర్చున్నారు. రోషాలు మరిచి వాళ్ళిద్దరూ అట్లా కూర్చోవడం చూసిన మీనాక్షమ్మ కడుపు నిండిపోయింది.

కాని ముద్ద నోట్లో పెట్టుకొన బోతున్న అణ్ణామలైకు తన మనసు ఆకలి గుర్తుకు వచ్చింది. 'నేను చిత్రకళాశాలలో చేరుతాను'' అని భోజనం చెయ్య సాగాడు.

గుండె జారింది మేస్త్రికి. నోటిలోని ముద్ద గొంతులో ఇరుక్కుని పలక

మారింది. మంచినీరు త్రాగి సర్దు కున్నారు. ఏమి ధైర్యం! తన్ను సలహా అడగ లేదు. తన సలహా అడగలేదు. సమ్మతి కోరలేదు. తనకు తానే నిర్ణయానికి వచ్చాడా? ఎంత తెగువ? బొమ్మలు చించినందుకు తనమీద పగ సాధిస్తున్నాడా?

మళ్ళీ యుద్ధం మొదలవుతోందేమో నని భయపడిన మీనాక్షమ్మ ''మాట్లాడ కుండా భోజనాలు ముగించండి. పొద్దున మాట్లాడుకోవచ్చు. నాకు ఆకలి ప్రాణం పోతోంది'' అంది.

పోరాటం వాయిదా పడింది. కాని అర్ధరాత్రి వరకు చిదంబర మేస్త్రి మీనా క్షమ్మలకు నిద్ర లేదు.

మంచంమీద కూచున్న చిదంబరం ఆమె ఇస్తున్న తమలపాకు చిలకల నందుకుంటూ చెప్పసాగారు!

"అణ్ణామలై ఇట్లా అడుగుతాడని నాకు తెలుసు; మాణిక్యం చెప్పాడు. సముద్ర తీరాన ఎవరో ముసలాయనా పడుచుపిల్లా కలిసి మనవాడి మనసును పాడు చేశారట. ఆ చిత్ర కళాశాల గురించి ఆయన చెప్పగా విన్న మాణిక్యానికి అది సగం పిచ్చిపట్టినవాళ్లు చేరే స్థలం అని తెలిసిందిట. పై చదువులకు డబ్బు లేని వాళ్ళు, చదువు రానివాళ్లు, పనికిమాలిన సోమరులు అక్కడ చేరుతారట. అయిదా రేళ్లు అక్కడ చదివి బయట కొచ్చాక తిండికి చేత చిప్పపుచ్చుకుని తిరగాలిట. బ్రతక నేర్వని వారి వృత్తిఅట అది!''

ఇవన్నీ కాక ఇంకొక విషయాన్ని ఆమె చెవిలో రహస్యంగా చెప్పారు. ''ఆ కాలేజీలో బట్టలే లేకుండా దిగంబరంగా వున్న ఆడదాన్ని ఎదుట వుంచుకుని బొమ్మలు గీయడం నేర్పిస్తారట. నేను నమ్మలేకుండా వున్నానుకాని అది నిజంట.''

"ఏమిటి?'' మీనాక్షమ్మ నమ్మలేక పోయింది. ఆమె కింకో సందేహం కూడా వచ్చింది. ''ఆ కాలేజీలో ఆడా, మగా కలిసి చదువుతారా? వేర్వేరుగా చదువుతారా?''

''కలిసే చదువుతారట!''

తండ్రి సమస్య కాస్తా తల్లి సమస్యగా కూడా అయిం దిప్పుడు. అణ్ణామలై కు ఇంకా ఎక్కువ వయస్సు కాలేదు. ఇరవై ఏళ్లు నిండిన 'చిన్న' అబ్బాయి అతడు. వాడి అందం ఎలాటిదో చెప్పలేక పోయినా మీనాక్షమ్మకు అది చపల చిత్తులయిన అమ్మాయిల నాకర్షించే అందమని మాత్రం తెలుసు. అపుడపుడు ఇంటికి వచ్చే

వారిలో పడుచులో, వీధిలో ఎదురయే కన్యలో అతడిని కన్నార్పకుండా చూడడం ఆమె ఎరుగును. తన అందమూ, ఆయన పట్టుదల వాడిలో చోటు చేసుకున్నాయని ఆమె అనుకుంది.

మేస్త్రిగారి చింత కాస్తా మీనాక్షమ్మ చింత అయింది. "డబ్బు సంపాదించ లేక చెడిపోతాడే" అని ఆయన విచారం; 'ప్రవర్తన పాడయి గుణహీను డవుతాడే' నని ఆమె బాధ.

''నేను చెప్పినా వినడు. నువ్వు చెప్పినా వినడు. మరింకెవ్వరు చెబితే వింటాడో ?'' అని ఆలోచనలో పడ్డారు మేస్త్రి.

''మీ దండపాణి గారితో మాట్లాడి చెప్పమంటే నో ? అంది మీనాక్షమ్మ.

ఆ సలహాను చెప్పి నందుకు ఆమె నోట్లో పంచదార పోయా లనిపించింది మేస్త్రి గారికి.

ఆమె జన్మతః శుద్ధ మొద్దావతారం అయినప్పటికీ తనతోబాటు ఏళ్ళ తరబడి కలిసి జీవించి నందుకు అప్పుడప్పుడు ఆమె చాల తెలివిగా ప్రవర్తిస్తుంది కదా అని ఆయన గర్వించారు.

"బాగా చెప్పావు. వీడి కెలా చెప్పాలో ఆయనకు తెలుసు" అన్నారు ఆయన ఉత్సాహంగా.

మేస్త్రి చెన్నపట్నానికి వచ్చి స్థిర పడ్డాక దండపాణి ఆయనకు స్నేహితు డయ్యారు. క్రొత్తగా ఆస్తి సంపాదించిన దండపాణి గారి ఇల్లు కట్టినప్పుడే మేస్త్రి ఆయనకు పరిచయమయ్యారు. దండపాణి ఏదో బంధుత్వంకూడా కలిపారు. తర్వాత కుటుంబాలూ దగ్గరయ్యాయి. దండపాణి వాక్చాతుర్యమన్నా, కార్యసాధ కత్వమన్నా చిదంబర మేస్త్రికి వల్లమాలిన గౌరవం.

''వా డీసారి పరీక్ష నెగ్గితే వాడికో స్కూటర్ కొనిపెడతా నన్నారు, జ్ఞాపకం వుందా ?'' అని అడిగారు మేస్త్రి.

''ఈ పాటికి అది మన ఇంటికి వచ్చి చేరివుండేది'' అని నిట్టూర్చింది మీనాక్షమ్మ. ఆమెకు స్కూటర్ కాదు ముఖ్యం, దాని వెనుకవున్న అనుబంధము, బాంధవ్యము ఇవి ముఖ్యం. దండపాణి కూతురు సుందరి కూడా ఆమె మనసులో మెదిలింది.

"దండపాణి మనవాడిమీద ఓ కన్నేసి వుంచారని తెలుసా ?'' అన్నా రాయన.

ఆమె నవ్వింది. ఎందుకంటే ఆమెకు అంతకన్న ఎక్కువే తెలుసు. అణ్ణా మలై మీద దండపాణి ఒక కన్నువేసి వుంచితే, ఆయన కూతురు రెండుకళ్లు వేసి వుంచిందని ఆమెకు తెలుసు. సుందరి వయసేమంత ఎక్కువ కాదు. అయినా ఆ పిల్ల చూపులను మీనాక్షమ్మ గుర్తించింది.

# 7

ఆ తరువాతి ఆదివారం నాడుదయం చిదంబర మేస్త్రి దండపాణి ఇంటికి వెళ్ళారు. రాయిపేట బజారు వీధి నానుకునివున్న ఒక సందులో మొదటి ఇల్లే దండపాణి ఇల్లు. వీధిపక్క తూర్పు ముఖంగా ద్వారం వుంచి కట్టారా యింటిని; మరి ఆ వీధి ప్రక్కన రెండు దుకాణాలకని కట్టారు కదా !

సందులో అడుగు పెడుతూనే చిదంబరం, లోపల దండపాణి కారు వుందా అని చూశారు. ఉంది. గేట్ తెరుచుకుని లోపలికి వెళ్ళా రాయన. పడమట ఇంటి ఆవరణలో సుందరికి వాళ్ళన్నయ్య సైకిలు తొక్కడం నేర్పిస్తున్నాడు. పడుతూ వాలుతూ అష్టవంకరలు తిరుగుతూ సైకిలు తొక్కుతున్న సుందరి చిదంబరం గారిని చూడగానే ఇంకాస్త సంరంభంతో ఆయనమీద పడ్డంతపని చేసింది. సైకిలుతోపాటు కింద కూలింది. సిగ్గుతో మొహం ఎర్రపడగా పరికిణి కంటిన మట్టిని కూడా విది లించుకోకుండా అట్లాగే లోపలికి పరుగెత్తి పోయింది. సుందరి సైకిలు తొక్కు తూంది ! మేస్త్రిగా రుబ్బిపోయారు.

సుందరి అన్నయ్య మేస్త్రి గారిని గమనించినట్లే లేదు. సుందరిని తిడుతూ సైకిలు చక్రం వంకరను సరిచేయడంలో లీనమయ్యాడు.

మేస్త్రి ఇంటిముందు ప్రక్కనున్న సోఫాలో కూర్చున్నారు. ఆ ఇల్లు ఆయన పర్యవేక్షణలో నిర్మించినదే. మధ్య తరగతి నాగరికతా చిహ్నాలు - కిటికీలకు తెరలు, మూల కాగితపు పూలసెజ్జ, అద్దాలున్న అలమారలో బొమ్మలు కనుపిం చాయి. ఆష్ట్రేలో ఆరీ ఆరని సిగరెట్టు పడివుంది. సోఫాలనుకూడా ఇంకా తుడిచినట్లు లేదు అనుకున్నారు మేస్త్రి.

''రండి, రండి ! సుందరి చెప్పింది'' అంటూ తెర తొలగించు కుంటూ వచ్చారు దండపాణి. వయస్సు యాభై కి లోపే వుండవచ్చు నన్పించే రూపం. దట్టంగా వున్న తల వెంట్రుకల మధ్య అక్కడక్కడ వెండి రేఖలు. తీక్షణమైన చూపు. పెద్ద పెదవులు, లాల్చీ, ఎనిమిది మూరల ధోవతి ధరించారు. బాగా పొడవుగా వున్నందున ఎక్కువ లావన్పించడం లేదు. కళ్లు మాత్రం ఎదుటి వారిని పొడిచేలా చూస్తాయి.

అణ్ణామలై పరీక్ష పోయినందుకు తమ విచారాన్ని వ్యక్తం చేసి ''మీ రేమీ దిగులు పడకండి. ఈ సారి అతడి నెలాగయినా పైకి నెట్టే పూచీ నాది'' అన్నారు దండపాణి.

మేస్త్రికి పోయినప్రాణం వచ్చినట్లయింది. తమ వలెనే దండపాణి కూడా 'షాక్' తిన్నప్పటికీ అది బయటకు కనపడనివ్వకుండా వున్నారని మేస్త్రి ఊహ. కాని దండపాణికి కొంత విచారం కల్గినమాట నిజమే; అయితే కొంత సంతోషమూ వుంది. వెంటనే ఏ రెండువేలో ధారపోసి స్కూటర్ కొనవలసిన అవసరం తప్పింది కదా ?

ముఖంమీద చిరునవ్వుతో చేతిలో కాఫీతో తెర తొలగించుకొని వచ్చిన శ్రీమతి దండపాణి "ఒదినగారు కులాసేనా ?'' అని కాఫీ అక్కడ పెట్టింది. మర్యాదకు రెండు మాటలాడి లోపలకు వెళ్ళింది.

వయసు ప్రభావం కనపడని శరీరం ఆమెది. ఆమె నలుగురు పిల్లల తల్లి అంటే నమ్మడం కష్టం. ఆమె మేస్త్రి గారికి కాఫీ తెచ్చి ఇచ్చిన విధం క్రొత్తగా కలెక్టరయి నతడి భార్య తమకన్న ఒక్క మెట్టు దిగువనున్న డిప్యూటి కలెక్టరును మర్యాద చేసినట్లుంది. చూపులో, నడకలో, మాటలో, అంతస్తుల వ్యత్యాసాన్ని ఆమె నొక్కి చూపకనే చూపింది.

కాఫీ ముగిశాక మేస్త్రి అసలు విషయం మాట్లాడ సాగారు. తమ కొడుకెలా కొరకరాని కొయ్య అయినదీ వివరించారు. "అణ్ణామలై చిత్ర కళాశాలలో చేరే తీరుతానని మొండిపట్టు పట్టాడు. వాడి నెలా ఆపాలో మాకు తెలియకుండా వుంది. కనుక మీరయితే వాడికి నచ్చజెప్పగలరని మా నమ్మకం".

"ఓహో''

ఆ పైన మేస్త్రి తమకు తెలియకుండా వాడు బొమ్మలు గీచినది, వాటిని

చూసి తాము చించివేసినది, ఎవ్వరో ముసలాయన (అమ్మాయిని గురించి కావాలనే చెప్పలేదు మేస్త్రి.) వాడి మనసు నెలా పాడుచేసినది అన్నీ వివరించారు దండపాణికి.

దండపాణిగారి మొహం క్రమంగా వికసించింది. ఆయన సిగరెట్టు వెలిగించి పీలుస్తూ, ఆసక్తితో విన్నారు. 'ఇదేమిటో ఈయన, నాలాగా విచారించకుండా ఉత్సాహంగా వున్నాడే ?' అనుకున్నారు మేస్త్రి.

''సుందరీ ! ఇటు రావమ్మా !'' అని ఉత్సాహంతో కేకేశారు దండపాణి. ముగ్గు రబ్బాయిల తర్వాత అమ్మాయి సుందరి వారిముద్దుబిడ్డ.

తెరవెనుక నుండి వచ్చింది సుందరి. ఆమె బట్టలు మార్చుకుంది. ఆకుపచ్చ పరికిణీ, గులాబిరంగు ఓణీలతో ఆమె అమ్మ వలెనే వుంది. ఆకర్షణీయమైన ముఖం. ముఖంలో చిన్నతనపు కొంటెతనం తొంగిచూస్తున్నా, వయసుకుమించిన పెరుగుదల ఆమెలో కన్పించింది.

''మీ బాబ బాగా బొమ్మలు గీస్తాడని అన్నావే అది నిజమే నమ్మా ! అతడో పెద్ద ఆర్టిస్టయి పోతాడు !''

'వచ్చింది గొర్రె !' అనుకున్నారు మేస్త్రి. ఇట్లాంటి తలతిక్క మనిషి దగ్గరకు సలహాకని రావడం కన్న మూర్ఖత్వం మరోటి వుండబోదనుకున్నారాయన.

''ఇదిగో చూడండి ! గుర్రం ఉలవలు తింటుంది. అలాగని గేదెకు ఉలవలు పెడతామా ?... పెట్టము. గేదెకు పచ్చిగడ్డి పెడతాము. అలాగే మనవాడు కళాకారుడు. అతడికి లెక్కలు రావు; బొమ్మలు గీయడమే వస్తుంది. అదే అతడికి నేర్పించాలి'' అన్నారు దండపాణి.

'ఏడ్చినట్లుంది' అన్నట్లుగా తల నాడించారు మేస్త్రి.

''ఔను మామయ్యా ! బాబ పెద్ద ఆర్టిస్టని మొదట కనుక్కున్నది నేనే !'' అంటూ కుర్చీలో కూర్చుంది సుందరి.

చిదంబర మేస్త్రికి మీనాక్షమ్మ మీద కోపం పెరగసాగింది. ఈ దండపాణి దగ్గరకు తన్ను పంపింది ఆమె కదా ? ఇట్లాంటి చవట సలహాలు వినడానికా పొద్దున్నే లేచి ఇంత దూరం వచ్చిందీ ?

మరి బొమ్మలు గీస్తూ కూచుంటే పొట్ట గడవడం ఎలాగ అని దండపాణితో వాదించారు మేస్త్రి.

దండపాణి మండి పడ్డారు. ''బొమ్మలు గీస్తే డబ్బు రాదనే మూర్ఖుదెవ

రండీ ? ఇది చెన్నపట్నం. ఇక్కడ బొమ్మలుగీచి నెలకు వేలకువేలు, లక్షలకు లక్షలు సంపాదించే వా రెందరో వున్నారు గంతలు కట్టుకున్న గుర్రంలాగా మీకు మీ వృత్తి ఒక్కటి తప్ప ఇంకో విషయం తెలియదు. అతగాడినీ ఇంజనీరు చేయాలనుకుంటున్నారు. అతడికీ తన మెదడంటూ వుంది. అది చెప్పిన విధంగా చల్ల కదలకుండా కూర్చుని సంపాదించుకుంటా నంటున్నాడు ఇందులో తప్పేమిటి ?"

సినిమా ఆర్ట్, డైరెక్టర్, పోస్టర్, బ్యానర్, పబ్లిసిటీ అంటూ మేస్త్రీగా రెర గని ఇంగ్లీషు పదాలను వర్షించి ఆయనను అదరగొట్టేశారు దండపాణి. తన మీద వర్షిస్తున్నది వేల కొలది రూపాయలేనేమో నన్న భ్రమ కలిగింది మేస్త్రీకి. మీనాక్షమ్మ చెప్పినది కూడ ఆక్షేపణీయం అనిపించలేదు మగవా డెట్లా వుంటేనేమి, రెండు చేతులా సంపాదించాలి, అంతే !

"సరే కానివ్వండి ! అలాగే కానిద్దాం'' అని లేచారు మేస్త్రీ. దండపాణి వాక్ సామర్థ్యంపట్ల ఆయన గౌరవం ఇనుమడించింది. కొడుకు మనసుకు మారుగా తన మనసునే మార్చినవాడు కదా దండపాణి !

# 8

"నువ్వు చిత్రకళాశాలలో చేరవోయ్!'' అన్న తండ్రి మాటలువిని నమ్మలేక పోయాడు అణ్ణామలై. వెంటనే ఎగిరి అడయారుకు వెళ్ళి కదిరేశన్ కా మాట చెప్పాలనిపించింది. అసలు తనలో ఈ బీజం నాటింది ఆయనే కదా ?

తండ్రి దండపాణి ఇంటికి వెళ్ళడం, ఆయన సలహాను కోరడం ఇవన్నీ అతడికి తెలియవు. తన చిత్రాలను చింపి పారేసిన తండ్రితో చాల పెద్ద పోరాటమే జరుగుతుంది అని ఎదురుచూస్తున్న అణ్ణామలై, ఇంత సునాయాసంగా తన కోరిక నెరవేరుతుందని కలలో నయినా ఎదురు చూడలేదు.

సముద్ర తీరంలో తాను యధాలాపంగా కలిసిన కదిరేశన్ పట్ల అతడి మనసు కృతజ్ఞతతో నిండింది. చిత్రకళాశాల అంటూ ఒకటి వుందనీ, దానిలో చేరి కళ నేర్వవచ్చునని అతడికి తెలియదు. ఏవో బొమ్మలు గీద్దా మనిపిస్తే గీచాడు. అది క్రమంగా అలవాటయింది. అంతే ! అసలు తనలోపల కళపట్ల అభిరుచి

ఏర్పడుతున్నదని కూడా అతడు గుర్తించలేదు. ఆ అభిరుచికి దోహదం ఎట్లా చేయాలో అత డెరగడు.

వెంటనే అడయారు వెళదా మనుకున్నాడు, కాని ఆయనకు చూపడానికి తనవద్ద చిత్రాలేవీ లేవే! అందుకని మానుకున్నాడు. కొత్త బొమ్మలు వేయడం ప్రారంభించాడు.

తన గదిలో పెన్సిలూ కాగితమూ పట్టుకుని కూర్చున్నాడు. బయటి ప్రపంచాన్ని మరిచాడు. అమ్మ మాట కాదనలేక ఏదో రెండు ముద్దలు మింగి మళ్ళీ తన లోకంలో లీనమయిపోయాడు. అతడి మనసులో నర్తిస్తున్న ఊహలు చిత్రాలుగా రూపొందాయి. సూర్యాస్తమయ వేళకు మూడు చిత్రాలను ముగించి నాలుగవ దానిని మొదలు పెట్టాడు.

కదిరేళనే కాదు, కమ్మని వెన్నెలలు కురిసే ఆయన కూతురూ వీటిని చూడనున్నది - అన్న తలంపు అతడి కెనలేని ఆనందాన్నిచ్చింది.

చీకటయిందని గుర్తించి, లైటు వెలిగిద్దా మని లేచిన అణ్ణామలై, ఆ గదిలో మాణిక్యం నిల్చుని వుండటం చూశాడు. అతడలా ఎంతసేపటినుండి నిల్చున్నాడు?

దీపం వెలిగించాక, ఆదరంతో మాణిక్యం చేతులు పట్టుకుని కుర్చీలో కూర్చో బెట్టాడు. తనకు తండ్రి అనుమతి లభించిందని చెప్పాడు. తాను వేస్తున్న చిత్రాలను చూపించాడు. సాధారణంగా అయితే తన చిత్రాల నతడు ఇతరులకు చూపడానికి సిగ్గుపడేవాడు. అయితే ఆ రోజు అతడి మనసు ఆనందంతో ఉప్పొంగి ఉరకలు వేస్తూంది. ఆ ఆనందాన్ని అతడు మిత్రుడితో పంచుకో దలిచాడు.

అణ్ణామలై మాటలు, చిత్రాలు మాణిక్యాని కేమీ ఆసక్తి కలిగించలేదు. అసలతడి మొహంలో విచారం కన్పించింది. "నేను నీకో విషయం చెబుదామని వచ్చాను."

"ఏమిటి?"

"అణ్ణామలై! నీ భవిష్యత్తు గురించి మాట్లాడే హక్కు నాకుంది. నువ్వూ నేనూ ఒకే వృత్తిని చేపట్టి, చేతులు కలిపి పనిచేయాలని పచ్చగా వుండాలనీ నాన్నగారు ఆశపడ్డారు. కాని నువ్వు ఆ ఆశలను మట్టిలో కలిపి నీ దారిని నువ్వు పోదా మనుకుంటున్నావు. నాన్నగారిందుకు ఒప్పుకున్నా నేను ఒప్పుకోను" అని మంచి ట్యూషన్ మేష్టారి నేర్పాటు చేసుకుని పైసారి లెక్కల్లో పాసయి, ఇంజనీరింగ్ కాలేజిలో చేరమని చెప్పాడు మాణిక్యం.

"మాణిక్యం! ఇందులో మాత్రం నా ఇష్టాన్ని కాదనకు. ఎంతమంది కిష్టం లేకపోయినా నా మనసు ఇందులో వుంది. ఇంకే విషయంలోనయినా సరే నీ మాట వింటాను. సరేనా ?"

"నీకు పిచ్చి పట్టింది. అందుకనే నా మాటను కాదంటున్నావు." అని కోపంతో లేచి విసవిస వెళ్ళిపోయాడు మాణిక్యం. దేని పిచ్చి అని మాత్రం అతడు వివరించ లేదు. అణ్ణామలై మాత్రం 'నా మంచిని కోరేకదా అత డిట్లా కోప్పడ్డాడు' అను కున్నాడు.

ఆ పూట కింక చిత్రరచన కుపక్రమించలేకపోయాడు అణ్ణామలై.

మర్నాడుదయం లేచి, నాల్గవ చిత్రాన్ని ముగించి, ఫలహారం సేవించి, బయలుదేరాడు అణ్ణామలై.

కదిరేశన్ ప్రహరీగేటు దగ్గరగా మూసివుంది. గేటును తెరుచుకుని లోపలికి అడుగుపెట్టిన అణ్ణామలైకు వేరే లోకంలోకి నడిచినట్లనిపించింది. కొబ్బరిచెట్ల సందులనుండి ప్రసరించే సూర్యకిరణాల వెలుగు చీకట్ల ముగ్గులతో నిండివుంది తోట. మల్లెల సౌరభమూ, పక్షుల కలకలారవమూ, ఉడుతల నృత్యమూ అతడికి స్వాగతం పలికాయి. అతడి నెత్తిమీదుగా రివ్వుమని ఒక రామచిలుక ఎగిరి వెళ్ళింది.

కాలిబాట దాటి నెమ్మదిగా నడిచివెళ్ళి కుడిప్రక్కగావున్న ఇంటి ముఖాన్ని గమనించాడు. ఇంటి తలుపులు మూసివున్నాయి. తలుపులు తట్టడాని కతడికి ధైర్యం చాలలేదు. అడుగుమీద అడుగు వేసుకుంటూ వెళ్ళి, క్రిందుగా తెరిచివున్న కిటికీ గుండా చూశాడు. అక్కడ కనపడిన దృశ్యం అతడి ఒడలిని పులకరింపజేసింది. కనురెప్ప లార్పడం మరచి శిల్పంలా నిలబడిపోయాడు.

లోపల ఒక పీఠంమీద బంగారు విగ్రహం వుంది. ఆ విగ్రహం చేతిలో అందమైన వీణ. ఆ వ్రేళ్లు వీణను మీటుతున్నాయా లేదా అని అతడు చెప్పలేక పోయాడు. వీణానాదం వినపడుతున్నదా, లేదా అని తెలియలేదు. కదలని ఆ వేళ్ళు మీటబడని ఆ తంత్రులూ వినిపిస్తున్న నిశ్శబ్ద సంగీతం మధుర మధురంగా వినబడు తున్నట్లు అతడికో భ్రమ ఏర్పడింది. అర్ధనిమీలిత నేత్రాలతో ఆ విగ్రహ మా సంగీ తంలో లీనమైనట్లు కనపడింది.

బంగారాన్ని కరిగించి పోతపోసిన విగ్రహంకాదది. పోతపోసిన విగ్రహం అయితే ఆ లాలిత్యమూ, ఆ జీవమూ ఎలా రాగలవు ? బంగారాన్ని పొడిచేసి,

నిప్పులో కరిగించక, నీటితో కలిపి, దానితో బొమ్మచేస్తే ఎట్లా వుంటుంది ? అట్లా కనబడింది ఆనంది.

అణ్ణామలై కేమీ అర్థంకాలేదు. మునుపెన్నడూ ఎవరినీ ఈ రాతిలో అతడు చూసి ఎరగడు.

ఎందుకామె ఇట్లా కదలక మెదలక నిల్చుంది ? కొద్దిగా జరిగి నిల్చుని చూశాడు. అంతా అర్థం అయింది.

మట్టితో సరస్వతి విగ్రహాన్ని రూపొందిస్తున్నారు కదిరేశన్. కలిపిన మట్టితో ఆయన తీర్చిదిద్దుతున్న విగ్రహాన్ని, ఆయనకు 'మాడల్'గా కూర్చున్న ఆమెను చూడగానే అతడి గుండె వేగంగా కొట్టుకుంది.

సృష్టి ఆదిలో సరస్వతిని రూపకల్పనచేసిన ఆ విధాత ఎదుటకూడా ఇట్లాగే ఒక ఆనంది కూచుంది కాబోలూ !

లోపలి రెండు విగ్రహాలతోబాటు అతడూ వెలుపల మూడవ విగ్రహం అయ్యాడు.

# 9

అణ్ణామలై అట్లా కిటికీకి వెలుపల నిల్చోవడం వారు గమనించలేదు. వారికి అంతరాయం కల్గించడం అతడికి ఇష్టంలేదు. వెళ్ళిపోయి సాయంకాలం వద్దామా అనుకుంటే ఆ చల్లని, చక్కటితోట విడిచి వెళ్ళబుద్ధి కాలేదు.

లోపలి గోడ నానుకుని పెరిగిన నాగలింగపు చెట్టు కొమ్మలతో ఆకులతో అతడికి గొడుగుపడుతూ నిల్చుంది. పెద్దపెద్ద ఆకులు, కొమ్మల చివర పచ్చటి పాములవలె మెలికలు తిరిగిన తీగెలు. ఆ తీగెల చివర గుత్తులు గుత్తులుగా పువ్వులు. ఆ చెట్టు నానుకుని కూర్చుని కాళ్ళు జాపాడు అణ్ణామలై. ఆ ఏకాంతం అత్యానంద కరంగా వుంది.

అతని చుట్టూరా పరచుకునివున్న ప్రకృతి అణువణువునా ఆతడికి భగవంతు డనే మహాశిల్పి కనబడసాగింది. ఎన్నెన్ని రూపాలు, ఎన్నెన్ని వన్నెలు, ఎన్నెన్ని చిన్నెలు ! పొద్దున్న వికసించి సాయంత్రానికి రాలిపోయే చిన్న పువ్వులోపల ఎంత మనోహర రంగుల సమ్మేళనం ! ఎంతటి సువాసన !

చిత్రకళ నభ్యసించి ఆ మహా చిత్రకారుడితో పోటీ పడాలనిపించింది. "ఓహో ! పోటీకి ఆశిస్తున్నావా ? ఇదిగో - మొదలు పెట్టు !" అన్నట్లుగా గాలి ఒక నాగలింగ పువ్వు నాతడి ఒడిలో పడేసింది. ఆశ్చర్యంతో, దిగ్భ్రమతో ఆ పువ్వును చేతిలోకి తీసుకుని చూశాడు. పోటీకి పిలుపువలె అనిపించింది ఆ ఘటన. సాహసంతో ఉపక్రమించాడు అణ్ణామలై.

వేయి తలల నాగుపాము తన అందాల పడగను విప్పి — పువ్వులోపల మెత్తటి కేసరముల నడుమనున్న ముఖంవంటి లింగానికి - గొడుగుపడుతున్నట్లుంది. లింగంచుట్టు కేసరములు చంద్రకిరణాలవలె వున్నాయి. ఎరుపు, పసుపు, తెలుపు, రంగులలో వెలుగుతూంది ఆ పువ్వు. చెప్పరాని దాని సౌరభం అతడికి మత్తెక్కించ సాగింది.

అతడి చేతిలోనో ? నల్లటి గీతలు గీయగల పెన్సిలు మాత్రం వుంది. అయినా అత డధైర్యపడలేదు. నేలమీద తన నోట్ పుస్తకాన్ని వుంచి బోర్లపడుకున్నాడు. పడగవిప్పిన పామువలె పువ్వు అతడి ఎదుటవుంది. కాగితంమీద పెన్సిలు నాట్యమాడసాగింది. అణ్ణామలై తన ఉనికినే మరిచాడు.

ఇంటిలోపల - కదిరేశన్‌కు ఆనాటి పని ముగిసింది. ఆయన ఉస్సురంటూ పడక కుర్చీలోకి వాలారు. స్వర్గస్తురాలైన ఆయన భార్య సరస్వతి ఛాయ ఈ సరస్వతీ విగ్రహంలోకి వచ్చింది. ఆనంది - తలిదండ్రు లిరువురిని పోలింది; అయినా ఆమెలోని ఆమె తల్లి పోలికను వేరుచేసి విగ్రహంలోకి చొప్పించగలిగా రాయన.

ఆనంది వంటింట్లోకి వెళ్ళింది; అక్కడ అమ్మమ్మ వంటచేస్తుండడం చూసింది. నిమ్మరసం ఒక గ్లాసు, నాలుగయిదు పండ్లు తీసుకెళ్ళి నాన్నగారి ఎదుట పెట్టింది. తీసుకోమని ఆయనకు గుర్తుచేసింది.

ఇవన్నీ ఆమెకు తల్లి నేర్పిన పాఠాలు. "ఆనందీ ! ఈ ఇంట్లో నాకు మొదటి బిడ్డ మీ నాన్నే ! ఆ తర్వాతే నువ్వయినా..." అని నవ్వేది సరస్వతమ్మ. ఆమె పోయాక మొదటిబిడ్డ బాధ్యత రెండవబిడ్డ వహించాల్సి వచ్చింది. భార్య పోయాక కదిరేశనూ మారిపోయారు. అంతవరకూ సరస్వతమ్మకు ముద్దుబిడ్డలా పెరిగిన మనిషి తానొక ఎదిగిన ఆడపిల్ల తండ్రి నని తెలుసుకుని మెలగసాగారు. ఆమెనొక

ఇంటిదానిని చేయాలన్న ప్రయత్నంలో వున్నారు. అయినా తండ్రి పరిచర్యలో ఆనందికి చెప్పరాని సంతృప్తి కలిగేది.

యధాలాపంగా తోటలోకి వచ్చిన ఆనందికి - అక్కడ కాళ్లుమడిచి పైకెత్తి, బోర్ల పడుకునివున్న అణ్ణామలైను చూడగానే ఆశ్చర్యం కలిగింది. "ఇది యింకో బిడ్డ కాబోలునన్న తలపువచ్చి నవ్వుకుంది ఆమె. ఆమె తన దగ్గరకు రావడం అతడు గమనించలేదు. అతడి నోట్ పుస్తకంనుండి నాగలింగ పుష్పం తొంగిచూస్తూంది. ఆ పవ్వు పక్కనే ఎగురుతున్న తుమ్మెదను ఆ పువ్వులోని వాసనకు తేనెకు సంకేతంగా చిత్రించా డణ్ణామలై. భావుకతకల చిత్రకారు డితడని పసిగట్టిందామె.

"ఎప్పుడొచ్చా రిక్కడికి ?'' అని ఆమె అలిసిన కంఠంతో నెమ్మదిగానే అడిగినప్పటికీ అణ్ణామలై అదిరిపడ్డాడు. తటాలున లేచి నిలబడ్డాడు. తన స్వంత తోటలోవలె అక్కడ అంతసేపు పడుకున్నందుకు బిడియపడ్డాడు. చొక్కామీది మట్టి మరకలయినా దులుపుకోకుండా తడబడుతూ "నన్ను క్షమించండి" అని అన గలిగాడు.

'క్షమించడం దేనికో—' నన్నట్లుగా చూసిన ఆమె "మీరు వచ్చి చాల సేపయిందా ?" అని అడిగింది.

"ఔను ! మీరు... మిమ్మల్ని ...చూసి మీ నాన్నగారు విగ్రహాన్ని తయారు చేస్తుంటే..." అని, మొత్తంమీద తాను వచ్చిన పనేమిటో చెప్పాడు.

ఆనంది ముఖం సిగ్గుతో ఎర్రబడింది. తండ్రి చేస్తున్న విగ్రహానికి తాను 'మాడల్'గా వుండడాన్ని అతడు చూసినందుకు కలిగిన సిగ్గది. ఇల్లు తోట మధ్యగా, వీధికి దూరంగా వున్నందువలన కదిరేశన్ పనిచేస్తుండడం ఎవరికంటా పడదు. అందుకనే ఆయన కిటికీలకు తెరలయినా వేయకుండా ఎండ వెలుతురులోనే పనిచేశారు. ఆనందికి సిగ్గుతోబాటు కొద్దిగా గర్వంగాను సంతృప్తిగానుకూడా అనిపించింది. క్రింద అతడి ఎదుట పడివున్న నాగలింగ పువ్వును చేతిలోకి తీసుకుంటూ "దీని బొమ్మ నిక్కడకు వచ్చాక గీచినట్లున్నారు'' అంది.

చేతిలో పువ్వుతోవున్న ఆనందిని చూడగానే అణ్ణామలైకు నూర్జహాన్, అనార్కలి, ముంతాజ్ వంటి మొగలు కాలపు సుందరీమణులు గుర్తుకొచ్చారు ?

అతడి నోట్ పుస్తకాన్ని తీసుకుని బొమ్మలను చూసింది. "ఆ రోజు మీ బొమ్మలను చూసి చాల సంతోషించారు నాన్న" అంది. ''సాధారణంగా ఆయన

అంత సులభంగా ఎవరినీ మెచ్చుకోరు. ఆయన మీలో కళాభిరుచి వుందని అన్నారు."

అణ్ణామలై ను తీసుకుని ఇంట్లోకి దారితీసింది ఆనంది. ఆమె నడక హొయలను, జడ విసురును గమనించకుండా వుండలేకపోయాడతడు. నాగరికతయొక్క వెర్రిమొర్రి రూపాల నవతలకునెట్టి, దానిలోని మేలి గుణాలను మాత్రం ఆమె స్వీకరించినదని గ్రహించాడు. ఆమెలో, ఆమె నడకలో, అలంకరణలో, మాటలో కృత్రిమత్వం లేనేలేదు. ఒక చిత్రకారుడి కూతురామె అన్న విషయం గుర్తుంచుకుని మరీ ఆ విధాత ఈమెను సృష్టించాడు కాబోలు !

అతడిని గదిలో కూర్చుండమని లోనికి వెళ్ళిన ఆనందితో కదిరేశన్ ''ఇక్కడికే తీసుకురావచ్చుగా '' అన్నారు. మరు నిముషం ఆమె అతడిని తన తండ్రి ఎదుటికి తీసుకువెళ్ళింది.

కదిరేశన్ గదిలోకి అడుగిడిన అణ్ణామలై కంట ఎదుట గోడమీదవున్న పంక్తులు పడ్డాయి.

''అందంగా జీవించడం నేర్చుకో !
వీలయితే జీవితాన్ని అందంతో నింపు
వీలు కాకపోతే దానిని పాడు మాత్రం చేయకు.''

ఆయనకు నమస్కరించి కూర్చున్నాడు అణ్ణామలై. ఆ గది తా నంతవరకు ఎరుగని క్రొత్త లోకంవలె అన్పించింది. ఆ నగరంలో ఆ ఇల్లొక వేరు జగమయితే, అందులో ఆయన గది ప్రత్యేక లోకం – అన్నంత అందం అక్కడ రాశిపోసివుంది.

# 10

కదిరేశన్ చేతికి తన చిత్రాల నిచ్చిన అణ్ణామలై, వాటిలో తనకేమీ ఆసక్తి లేదన్నట్లుగా ఇబ్బందిగా కూర్చున్నాడు. ఆ పెద్ద గదినంతా చూస్తే బాగుండునన్పించింది. అది తెలిసినవారిలా కదిరేశన్ ''లేచి గది అంతా చూడండి !'' అన్నారు; ఆనందిని సాయం వుండమన్నారు.

గోడలమీద వర్ణచిత్రాలు. గదిలో అక్కడక్కడ శిల్పాలు. గది పెద్దదే అయినా తెరలతో, తడికలవంటి ఏర్పాట్లతో అనేక భాగాలుగా విభజింపబడివుంది.

సరస్వతి శిల్పం ఎదుట నిల్చోగానే అణ్ణామలై వెంటనే తనకు తెలియకుండానే ఆనంది మొహాన్ని చూశాడు. చటుక్కున తలవంచుకుంది ఆమె. ఆమె బుగ్గలలో లేలేత ఎర్రందనాలు పర్షించడం అతడి కంట పడకపోలేదు.

"ఇది ముగిశాక దీనికి రంగులు పూస్తారా?'' అని అడిగిన అణ్ణామలై మనో నేత్రంముందు చిన్ననాడు కోవెల గోపురంమీద బొమ్మలు చేసిన శిల్పులు మెదిలారు.

"కాదు. మొదట ఇట్లా మట్టితో చేసి దీని 'అచ్చు'ను తీసుకుని దానిలో కరిగిన లోహాన్ని పోస్తారు; అట్లా పోతపోసి లోహ విగ్రహం చేస్తారు."

ఇట్లా విగ్రహాలను తయారుచేసే పద్ధతిని వివరించాక ఆమె తెర తొలగించి, అతడిని అవతలకు తీసుకువెళ్ళింది అక్కడ 'స్టాండ్'మీద 'కేన్వాస్'మీద ఒక ప్రకృతి దృశ్యం అసంపూర్ణంగా వుంది. ఇంకోవైపు మేజామీద కాగితంమీద వర్ణ చిత్రం ఒకటి తయారవుతూ వుంది.

"కాగితాలమీద పోటిలో కరిగే రంగులతో బొమ్మలు వేస్తారు. ఆ గుడ్డమీద తైల వర్ణాలతో చిత్రిస్తారు" అని వివరిస్తూ ఆనంది ఆయా రంగులను, కుంచెలను తీసి చూపించింది.

ఆ చిత్రాలన్నిటిని చూసి ఆనందించడానికి ఒక్క రోజంతా కావాలనిపించింది అణ్ణామలైకు. గది చివర గాజుతలుపుల బీరువాల నిండుగా పుస్తకాలున్నాయి. ఆ బీరువాలమీద వివిధ దేశాల పేర్లు అతికించి వున్నాయి. ''ఆయా దేశాలను గురించిన పుస్తకాలా?'' అని అడిగాడు అణ్ణామలై.

''ఔను, ఆయా దేశాల కళలను గురించిన గ్రంథాలవి—''

అక్కడే కూర్చుండిపోదా మనిపించింది. కాని తానక్కడికి వచ్చిన పని గుర్తుకు రాగానే పుస్తకాల నొదలి, కదిరేశన్ దగ్గరికి వచ్చి కూర్చున్నాడు.

సంతృప్తితో నిండిన అతడి మొహంచూసి ''చూశారా?'' అని నవ్వుతూ అడిగారు కదిరేశన్. ఆ ప్రశ్న కాయన జవాబు ఎదురుచూడనూలేదు; అణ్ణామలై జవాబు చెప్పనూలేదు. ఆనంది లోపలకు వెళ్ళింది.

అణ్ణామలై మర్యాద, చనువు కలిసిన ధోరణిలో - తన విషయం చెప్పుకున్నాడు; తండ్రి అనుమతి లభించిన విషయం చెప్పాడు.

కాస్సేపాయన ఏమీ మాట్లాడలేదు. ఉన్నట్లుండి —"చిత్ర రచననో, కావ్య రచననో నేర్పించగల కాలేజి ఈ ప్రపంచంలోనే లేదు." అని ఆవేశంతో అన్నారు.

ఇది వినగానే తల తిరగ నారంభించింది అణ్ణామలైకు. దారిలో ఎదురయి నప్పుడేమో కాలేజిలో చేరవోయి అని ప్రేరేపించి, తీరా కాలేజిలో చేరదామని వస్తే ఇప్పు డిలా అంటాడేమి ఈయన !

"నా చిత్రాలలో...?'' అని సగంలో ఆగిపోయాడు అణ్ణామలై.

''...అనుభవం ప్రతిఫలిస్తూంది. ఈ విషయం ఆ రోజే నేను గమనించాను. కాని ఇప్పుడిప్పుడే అంకురిస్తూంది అది. పరిశ్రమ, శిక్షణ, సాధనలతో దానిని పెంపొందించాలి."

అతడి చిత్రా లన్నిటిలోను నాగలింగ పుష్ప చిత్రం తమ్మెక్కువ ఆకర్షిం చిందని కదిరేశన్ అన్నారు. అతడిని ఉత్సాహపరుస్తూ మాట్లాడారు. పేరుపొందిన ఆచార్యులు వయోవృద్ధులు అయికూడా ఆయన తనతో అంత సరళంగా ప్రవర్తిం చడం చూసి ఆయనమీద అణ్ణామలైకు భక్తి ప్రేమ ఏర్పడ్డాయి.

''కాలేజి తెరిచేదాక మీ రిక్కడకు వచ్చి నా వద్ద నేర్చుకోవచ్చు. వారంలో మూడు నాలుగు సాయంకాలాలు వస్తేచాలు.''

ఆయన కెలా కృతజ్ఞతలు చెప్పాలో అణ్ణామలైకు తెలియలేదు. అక్కడికి తరుచు రాగల్గడం, ఆయనతో మాట్లాడగల్గడం, అక్కడి పుస్తకాలు చదవడం, చిత్రాలు చూడడం - ఇంతకన్న ఏమి భాగ్యం వుండగలదు ? ఇక వెళ్దామని లేవబోతే ఆయన వారించి పండ్లు తినమన్నారు. అతడితోబాటు ఆయనా తినసాగారు.

నెమ్మది నెమ్మదిగా ఆయన ముఖం మారింది. నుదురు ముడతలు పడింది. అంతవరకూ కళాకారుడిగా వుండిన కదిరేశన్ హఠాత్తుగా అందరిలో ఒకరుగా అయ్యారు. అందరూ అడిగే ప్రశ్నలే అడగసాగారు.

అతడి పూర్వీకులు ఎక్కడివారు చెన్నపట్నంవారా, లేక ఇంకెక్కడినుండి అయినా వచ్చి స్థిరపడ్డవారా ఏ కులంవారు నాన్నగారి పనేవిటి ? తోబుట్టువు లెందరు ఇక్కడ బంధువులు ఎవరెవ రున్నారు ?

మరెవ్వరయినా ఆ ప్రశ్న లడిగివుంటే అణ్ణామలై జవాబు చెప్పివుండేవాడు కాదు. కాని కదిరేశన్ అలా అడగడం అతనికి సంతోషాన్ని కల్గించింది. తనమీద

ఆయనకు అభిమానం వుండబట్టేకదా వివరా లడిగారు కనుకనే అతడు సంతోషంగా అన్నీ చెప్పాడు.

# 11

కోటి కోటి సుమాల సౌరభాలు-అహోరాత్రాలు కోయిల ఆనంద గీతాలు - పురివిప్పిన మయూరి మనోహర నృత్యం - కదిరేశన్ ఇంటికి వెళ్ళిరావడం మొద లెట్టిన నాటినుండి - అణ్ణామలై హృదయంలో ఇవన్నీ వీస్తున్నాయి, పాడుతున్నాయి, ఆడుతున్నాయి.

వారంలో మూడురోజులే ఎందుకు, ఏడు రోజులూ రమ్మనకూడదా ఆయన? కాలేజి తెరిచాకకూడా కాలేజికి వెళ్ళకుండా ఆయనవద్దే కళ నభ్యసిస్తే— ?

ఒక నెల గడిచింది.

ఈ నెల రోజులలో అతడిలోని మార్పులన్నీ మీనాక్షమ్మ గమనించింది. అతడి ముఖంలో కొత్త కళ, కళ్లల్లో కొత్త వెలుగు, నడకలో కొత్త ఠీవి, మాటలో కొత్త ఉత్సాహం తొంగిచూచాయి. భర్తతో కొత్తకాపురం పెట్టిన నవవధువువలె వుందతని స్థితి.

—తమ వృత్తిలో ఆశించిన స్థితిని పొందగానే మగవా డిట్లా మారుతాడని మీనాక్షమ్మ అనుకుంది. మామూలు పనివాడిగా వుండిన తనభర్త మేస్త్రి అయి నాలుగు డబ్బులు ఎక్కువ సంపాదించ మొదలుపెట్టిన రోజుల్లో ఇట్లాగే మారి పోయారు. పేదరికపు పోరాటంలో గడిచిపోయిన ఆయన యవ్వనం నలభయ్యోవఏట తిరిగి వచ్చింది. మీనాక్షమ్మతో నవ్వుతూ మాట్లాడడం, ఆమెను తీసుకుని కోవెలలకు ఉత్సవాలకు వెళ్లడం, ఆమెతో కలిసి సముద్ర తీరానికి వెళ్లడం - వీటన్నిటికి ఆయనకు అప్పుడే కుదిరింది. ఎన్నటికీ మరవలేని ఆ వసంతాన పూచిన పూవే అణ్ణామలై —

—అణ్ణామలై జీవితంలో అది మరపురాని కాలమే! సాయంకాలం అక్కడికి వెళ్ళాలంటే పొద్దుటినుండి అందుకు సన్నాహమే! సాయంకాలం వెళ్ళివచ్చాక, అక్కడ జరిగిన వాటిని నెమరువేసుకోవడమే.

ఒకరోజు సాయంకాలం అత డక్కడకు వెళ్ళాడు. కదిరేశన్ లేరు. ఏదో పనిమీద బయటకు వెళ్ళారు అని ఆనంది చెప్పింది. నిరాశతో "అయితే నేను వెళ్ళొస్తాను" అని వెనక్కు తిరగబోయా డణ్ణామలై.

"ఉండండి, వెళ్ళరుగాని నాన్నగా రొచ్చేస్తారు... రావడానికి ఆలస్యం అయ్యే పక్షంలో నాతో చెప్పివెళ్ళేవారు."

ఆయన లేనప్పుడుగాని, ఆయన బొమ్మలు గీస్తుండగాగాని అతడాయన స్టూడియోలోకి వెళ్ళేవాడుకాదు. కనుక బయట గదిలో కుర్చీలో కూర్చున్నాడు.

ఆనందితో ఏవేవో మాట్లాడాలనివుంది అతడికి; కాని ఏమి మాట్లాడాలో తెలియలేదు. ఆమెకూ అతడితో మాట్లాడాలనే కుతూహలంగా వుంది. ఆ గదిలోకి వీచిన గాలి ఆమె జడలోని మల్లెల వాసనను మోసుకొచ్చింది అతడి దగ్గరకు.

''ఈ సరస్వతి విగ్రహంవంటి అందమైన శిల్పాన్ని నేనెప్పుడూ చూడలేదు... దీనిని ఎవరికోసం చేస్తున్నారో తెలుసా ?'' అని అడిగాడు.

ఆ విగ్రహం గురించి అడగగానే ఆమె సిగ్గుపడింది. అతడు అడిగింది తన్ను గురించేనన్న భావంతో తలవంచుకుని - సమాధానం చెప్పింది ఆమె.

"ఇంకెవరికోసమో చేసే శిల్పానికి, గీచే చిత్రానికి ఆయన నన్ను మాడల్‌గా తీసుకోరు.''

"క్షమించండి" అన్నాడు అతడు బాధతో.

ఆ తర్వాత అతడు మాట్లాడకుండా వుండిపోతాడేమోనని ఆనంది "మనింటి తోటలో చెట్లమధ్య ఒక పీఠంమీద ప్రతిష్ఠించా లనుకుంటున్నారు నాన్న'' అంది.

ఆమె 'మనింటి తోట' అనడం అతడికి నచ్చింది. తన్నుకూడా వారి కుటుంబంలో ఒకడుగా స్వీకరించారన్నమాట !

ఆనంది ఇంకా చెప్పింది. "ఇది చాల పాతఇల్లు; ఏ క్షణాన పడిపోతుందో చెప్పలేము. అందుకనే దీనిని పడగొట్టి కొత్తగా కట్టించాలనీ, అలా కట్టినప్పుడు, ఇంటి ముందుప్రక్క ఆ విగ్రహాన్ని నెలకొల్పాలనీ అనుకుంటున్నారు. అంతేకాదు... ఇంకో కారణమూ వుంది."

"ఏమిటది "

"మా అమ్మ పేరూ సరస్వతే. పేరు మాత్రమేకాదు, నాన్నగారి కళా జీవనానికి ఆమే ఊపిరిగా వుండేది. ఆమె పోయాక నాన్నగారుపడ అవస్థ..." అని

చెప్పడానికి ఆమెపడ్డ బాధ అతడిని కదిల్చివేసింది. ఆమె కంటనీరు పెడుతుందేమో నని భయపడ్డాడు. ఇకముం దెప్పుడూకూడా ఆమె అమ్మ ఊసు ఎత్తకూడదని నిశ్చయించుకున్నాడు. ఆనందం తప్ప మరొక్కటి వుండదని తా నూహించిన ఇంటిలో ఇంతటి ఆవేదన ?

''అమ్మ జ్ఞాపకం రాకుండా వుండాలనే నాన్న ఎప్పుడూ ఏదో చిత్రరచనలో లీనమవుతుంటారు. అదే లేకపోతే ఆయనా ఈపాటికి దిగులుతో మంచమెక్కి వుండేవారు.''

అతడా విషయంనుంచి ఆమెను మరల్చదలిచాడు; తాను అడగాలని తహతహ లాడుతున్న ప్రశ్న నడిగాడు; "స్టూడియోలో మీ చిత్రం ఎక్కడా లేదే ? నాన్న గారు మిమ్మల్ని చిత్రించలేదా ?" అడిగాక తన సాహసానికి తనే ఆశ్చర్యపడ్డాడు.

ఆమె విప్పారిన నేత్రాలతో అతడిని చూసింది. ముఖంమీద లేత చిరున వ్వొకటి వెలుగుతుండగా "లోపల వుంది. చూద్దాం, పదండి" అంది.

లోపలికి వెళ్ళారు. అక్కడ గోడమీద - కదిరేశన్, సరస్వతమ్మ, ఆనందిల చిత్రాలు వేర్వేరుగా - వ్రేలాడదీసి వున్నాయి. అక్కడ దీపం వేయగానే అణ్ణామలై ఒడలు పులకరించింది. మిగతా రెండు చిత్రాలనూ అత డంతగా చూడలేదు, చూడ లేక పోయాడు.

ఆనంది తన ప్రక్కనే నిల్చుని వున్నప్పటికీ, ఆమె అటు ఆ చిత్రంలోనుండి తనవైపు నడిచివస్తున్న ట్లనిపించింది. సంజెవేళ సముద్రతీరాన నడిచివస్తున్నదామె. నేపథ్యంలో సంధ్యాసమయపు బంగారపు పూతలో ఆకాశము, సముద్రము మెరు స్తున్నాయి. ఆమె ముఖంమీద రొమ్ముమీద ఎండ వెలుగుతూంది. గాలికి చెదిరిన కేశాలు ఫాలభాగంమీద అల్లల్లాడు తున్నాయి. తెరచాపలా లేచిన పయ్యెద... సజీవంగా, భువనైక మోహనంగా ఆమె తన్నుచూసే నడిచివస్తూంది.

తదేకంగా తన్నే చూస్తున్న ఆమె కళ్ళల్లోకి చూడడాని కతడికి సిగ్గువేసింది. ఒక మూలకువెళ్ళి చూశాడు. ఆ సుందరి కళ్లు తనవైపే వున్నాయి. తా నెక్కడకు వెళ్ళినా తనవెంట ఆమె కళ్లు. నిజమేనా ? ఇది నిజమేనా ?

ఆ చిత్రానికి తన చిత్తాన్ని అర్పించిన అణ్ణామలై హఠాత్తుగా అక్కడ నిల్చున్న ఆనందివైపు చూపు మరల్చాడు. ఆమె అక్కడ లేదు.

వెంటనే బయటకు పరుగెత్తాడు. కుర్చీలో కూలబడ్డాడు. అతడికి చెమటలు పోశాయి. ఇరుకుగా వున్నట్లనిపించింది. కళ్లొక క్షణం మూసుకున్నాడు.

కళ్ళు తెరిచాడు. ఎదుట ఆమె వుంది. అనురాగం ఆమె చూపులలో నిండి వుంది. మాటలు రాలేదు ఇరువురికీ. కుర్చీలో కూర్చుంది ఆమె.

"మీరు వచ్చి చాల సేపయినట్లుంది —" అంటూ కదిరేశన్ లోపలికి వచ్చారు.

# 12

కదిరేశన్ అణ్ణామలైను స్టూడియోలోకి తీసుకువెళ్ళారు. ఒక మేజామీద గడియారం, పూలసెజ్జ, పుస్తకాలు అమర్చి ఆయన అతడితో'' వాటిని చూసి గీస్తూ వుండండి. నేనూ ఒక చిత్రం ముగించాలి; ఇప్పుడే వస్తాను" అని లోపలికి వెళ్లారు.

ఆ జీవంలేని వస్తువులపట్ల అతడి మనసు లగ్నం కాలేదు. అంతకుముందు చూసిన ఆనంది చిత్రాన్ని మరపలేకపోయాడు. ఆ చిత్రాన్ని కదిరేశన్ ఇటీవలే రచించి వుండాలి. ఎన్నో నాళ్ళనుండి ఆమెతో మెలగుతున్నప్పటికీ తనకు బోధ పడని ఆమె హొయలు, అంతర్గత సౌందర్యం ఆ చిత్రంద్వారా అవగతమయ్యాయి. స్వతహాగా సంకోచస్తుడు కావడంవలన అతడంత పరీక్షగా ఆమె నెప్పుడూ చూసి ఎరగడు కూడాను. చిత్రంలో కనపడిన ఆనంది అతడికి కొత్తచూపు నిచ్చింది; అతడి కంటికి క్రొత్త వెలుగు నిచ్చింది.

ఆనంది అటు వచ్చింది. తండ్రి బొమ్మగీస్తున్న మేజామీద కూజాలో నీరుంచింది. పెన్సిలు చెక్కిపెట్టింది. రబ్బరును శుభ్రంగా తుడిచింది. కుంచెలను శుభ్రం చేసి గిన్నెలో అమర్చింది. కావలసిన రంగులను నీటిలో కలిపి తయారుచేసింది. ఈ పనులన్నిటినీ ఆమె ఎంతో ఉత్సాహంతో చేసింది.

ఇదంతా గమనించిన అణ్ణామలై - కదిరేశన్‌గా రెంత అదృష్టవంతుడో అనుకున్నాడు.

వెనక్కుతిరిగి వెళ్తూ ''ఏం, మీరింకా మొదలు పెట్టనేలేదా ?'' అని ఆమె అడిగి నవ్వినప్పుడే - అతడికి తన శిక్షణ విషయం గుర్తుకొచ్చింది. ఆమె వెళ్ళిపోయింది. అణ్ణామలై ఏదో ఒక విధంగా తాను గీయవలసిన బొమ్మను గీచాడు.

కదిరేశన్‌కు ఆ బొమ్మలు చూపించాక ఇంటికి బయలుదేరాడు. బస్సులో ఎక్కాడు. దిగవలసినచోటుకు రెండు 'స్టాప్'లు ముందరే బస్సు దిగాడు. అవాళ అంతటి మరపు !

ఇంట్లో అమ్మ మాటలను సరిగా వినసయినాలేదు. ఎప్పటివలె కాళ్లు చేతులు కడుక్కోనలేదు. చొక్కా విప్పేసి, పంచెమాత్రం కట్టుకుని కుర్చీలో కూర్చున్నాడు. అతడి మనసులో చిత్రం పెరుగుతూంది. స్త్రీల ప్రసవవేదనవంటి మధురమైన వేదన అతడిని అల్లలాడిస్తూంది. అతడింక భరించలేక పోయాడు. ఒడలు మరిచాడు.

పెన్సిలు చేతబట్టి గీయడం మొదలుపెట్టాడు. సన్నని తిన్నని గీతలు; ఒయ్యారాలొలికే వంకర గీతలు; రెండోసారి దిద్దవలసిన అవసరంలేని గీతలు. కొన్ని నిముషాలలో ఆనంది ముఖం యథాతథంగా కాగితంమీద ప్రత్యక్షమయింది. వర్ణచిత్రరచన నతడింకా అభ్యసించనందున కేవలం పెన్సిలుతోనే సజీవమైన ఆమె సౌందర్యాన్ని ఆ కాగితంమీద పొందుపరిచాడు. ఆ కళ్ళ వెలుగును చిత్రించ బోయిన వ్రేళ్లు వణికాయి. అలా వణికి వుండనక్కరలేదు అని ఆనంది కళ్ళే నవ్వాయి.

చిత్రాన్ని మేజామీద వుంచి వివిధ కోణాలనుండి చూశాడు. ఎటు నిలిచినా ఆమె కనులు తనవైపే !

అయినా ఆ చిత్రం అతడికి పూర్తిగా సంతృప్తి నివ్వలేదు. సెలయేటి గల గలలవలె ఆమె లోలోపలనుండి కనులగుండా వెలువడే లాలిత్యాన్ని, తేజస్సును కదిరేశన్ చిత్రం ప్రతిఫలించిన దానిలో శతాంశమయినా తాను సాధించలేకపోయానే అని విలవిలలాడాడు. అయితేనేమి, ముఖ కవళికలన్నీ యథాతథంగా వచ్చాయి; అందు కతడికో తృప్తి.

ఆ చిత్రాన్ని మేజామీదుంచి తువ్వాలు మీదవేసుకుని బావిదగ్గరకు వెళ్ళాడు. దీపాలుపెట్టే వేళయింది.

బావిదగ్గర అతడి తండ్రి కాళ్లు చేతులు కడుక్కుంటున్నారు. చల్లగాలి వీచింది.

"మీ మేష్టరుగారు అక్కరతో చెప్పిస్తున్నారా ? ఆయనకు జీతం కావాలంటే ఇచ్చేద్దాము. ఎంత కావాలో కనుక్కో. జీతంలేని చదువు మనకొద్దు—" అన్నారు మేస్త్రి.

దేనినయినా డబ్బుతోకొలిచే నాన్న మన స్తత్వం అణ్ణామలైకు నవ్వు కల్గించింది. డబ్బు ఈ సెత్తితేనే కదిరేశన్ నొచ్చుకుంటారని అతడికి తెలుసు.

"ఆయనకు డబ్బు అవసరంలేదు; మనం ఇచ్చినా తీసుకోరు—" అన్నాడు.

"డబ్బు అవసరం లేనివాడు ఈ పట్నంలో వున్నాడంటే నేను నమ్మను. ఒక ఇల్లుకాదు పదిండ్లు కావాలి, ఒక కారు చాలదు పదికార్లు కావాలి అంటారుకదా అందరూ" అన్నాడు మేస్త్రి.

అణ్ణామలై మాట్లాడకుండా కాళ్లుచేతులు కడుక్కొని లోపలికి నడిచాడు.

తన గదిలోకి అడుగుపెట్టబోయిన అణ్ణామలైకు తన గదిలో నిల్చునివున్న మాణిక్యం వీపు కనపడింది. మాణిక్యం రెండు చేతులతో ఆ చిత్రాన్ని పట్టుకుని రెండు కళ్ళూ అప్పగించి చూస్తున్నాడు. అణ్ణామలై రాకనుకూడా అతడు గమనించలేదు.

తేలుకుట్టినట్లయింది అణ్ణామలైకు. "ఎవరది, మాణిక్యమా ?" అని అడిగినప్పుడు అతడి స్వరం వణికింది.

ఆ తర్వాతకూడా మాణిక్యం ఆ చిత్రాన్ని చూడడం మానలేదు. అట్లాగే దానిని చేతులలో వుంచుకునే అవతలి కుర్చీలోకాక మాణిక్యం కుర్చీలో కూచున్నాడతడు. ఇంక సహించలేక పోయాడు అణ్ణామలై.

"దాన్నిట్లా ఇవ్వు" అని లాగబోయాడు. మాణిక్యం గట్టిగా పట్టుకున్నాడు. ఆ చిత్రం పర్రుమని చినిగిన శబ్దం అణ్ణామలై హృదయానికి రంపపుకోతయింది. అయితే, ఆ కాగితం ఒకమూల మాత్రమే చినిగింది. ఆనంది మొహం చెక్కుచెదరకుండా వున్నప్పటికీ, ఏదో అంగవైకల్యం వంటిది ఏర్పడినట్లనిపించింది అణ్ణామలైకు.

ఆ చిత్రాన్ని జాగ్రత్తగా 'డ్రాయర్'లో వుంచాడు అణ్ణామలై. మాణిక్యం వెళ్ళాక దాని నెక్కడయినా భద్రపరచి తాళం వేయాలనుకున్నాడు. కాని మాణిక్యం అప్పట్లో కదిలేలా లేడు.

# 13

ఉన్నట్లుండి మాణిక్యానికి అణ్ణామలై కళమీద వల్లమాలిన అభిమానం ఏర్పడింది. చిత్రకళ అంటే ఏమిటో తెలియని తన్నుకూడ ఆనంది చిత్రం పరవశుణ్ణి చేసిందట. ఆ రోజు ఎలియట్స్ బీచ్‌లో 'తన్నుచూసి ఆనంది నవ్వడం' గుర్తుకొచ్చిందట.

''అణ్ణామలై ! నేను నిన్ను నీ దారినుండి మరల్చ యత్నించడం పొరబాటు. నువ్వు నిజమైన చిత్రకారుడివి. ఈ బొమ్మను ఎంత అద్భుతంగా చిత్రించావు !" అని ప్రశంసించాడు మాణిక్యం. అణ్ణామలైకు అతడిమీద కోపం తగ్గడమేకాదు, సదభిప్రాయమూ ఏర్పడసాగింది.

"ఆ అమ్మాయిని చూసి గీయమని ఆయన చెప్పారా ?''

అణ్ణామలైకు కోపం వచ్చింది; ''అట్లా ఎవ్వరూ చెప్పరు. నువ్వు నీ మాటలతో వాళ్ళ నవమాన పరుస్తున్నావు" అన్నాడు.

''కోప్పడకోయ్ ! ఏదో నీ కళను గురించి తెలుసుకుందామని నేననుకుంటుంటే నువ్వు నా మీద మండిపడడం బాగుందా ? అరవకుండా నెమ్మదిగా మాట్లాడు. నాన్న అమ్మా వింటే బాగుండదు'' అన్నాడు మాణిక్యం. అతడు మొదటినుండి గది బయటకు విన్పించనంత మెల్లగా మాట్లాడుతున్నాడు. అణ్ణామలైను అంతటితో వదలలేదు. ''చెప్పు ! ఆనంది ఈ బొమ్మ గీయమని నిన్నడిగిందా ? నువ్వు గీస్తుంటే తాను ఎదుట నిల్చుందా ?''

మాణిక్యం అజ్ఞానానికి నవ్వాలో, ఏడ్వాలో తెలియలేదు అణ్ణామలైకు. ఇటుక, సిమెంటు, గార కలిపి భగవంతు డితడి మెదడును చేసినట్లున్నాడు - అనిపించింది.

''మాణిక్యం ! ఇవాళ సాయంత్రం నేను ఇక్కడికి వచ్చాక గది తలుపులు మూసుకుని వేసిన బొమ్మ ఇది. చూడకుండా, జ్ఞాపకం ఆధారంగా వేసినది. కావాలంటే నువ్విక్కడనుండి వెళ్ళిపో, నిన్ను చూడకుండానే నీ బొమ్మ గీచిస్తాను.''

మాణిక్యం వెళ్ళలేదు. ''నువ్వు చాల సమర్థుడివోయ్... నా బొమ్మ వేయక్కర్లేదుగాని వేసిన ఆ బొమ్మను నా కివ్వు—''

తన ప్రాణాన్నిమ్మని అడిగినట్లనిపించింది అణ్ణామలైకు. బాధతో అన్నాడు. "మాణిక్యం, నువ్వెప్పుడూ ఇంతే !"

ఔను, మాణిక్యం ఎప్పుడూ అంతే ! అణ్ణామలై తనకని తెచ్చుకున్నదాని నతడు తీసుకెళ్ళి పోయేవాడు. చొక్కా, లాగు, పంచె ఏదయినాసరే, మాటవరసకు అణ్ణామలైతో చెప్పేసి తన స్వంతం చేసుకునేవాడు. అణ్ణామలై తన అమ్మతో ఆ వస్తువు తానే మాణిక్యాని కిచ్చినట్లు చెప్పుకునేవాడు. మేస్త్రిగారేమో పట్టించుకునే వారేకాదు. మరి మాణిక్యం ఆయన 'పెద్దకొడుకు'లాటి వాడయ్యె ! పైపెచ్చు అతడు బీదవాడన్న జాలీ, సానుభూతీను !

"ఇవ్వవా ?" అని మళ్ళీ అడిగాడు మాణిక్యం.

"దీనిని అడగకు. ఇది పెన్సిల్ 'స్కెచ్' మాత్రమే; ఇంకా పూర్తికాలేదు. అసంపూర్ణంగా వున్నవాటి నివ్వరాదు—"

"ఇన్ని సొల్లు కబుర్లెందుకోయ్ ? ఇష్టంలేదని ఒక్క ముక్కంటే పోలే ?"

"ఔను, ఇష్టంలేదు !"

"హుఁ ! అది ఉత్త కాగితం ముక్క. దానికోసం నే నాశపడుతున్నా నను కున్నావా ? దానితో నేనేమి చేసుకోగలను ?" అని కళ్ళెఱ్రజేసి, కోపంతో అన్నాడు మాణిక్యం. "నువ్వు అర్భకుడివే, చిక్కుల్లో పడతావేమోనని నీ మేలుకోరి అడి గాను, కాని నాకోసం కాదు." అని అణ్ణామలై చెవిలో చెప్పాడు.

"చిక్కులా ?"

మాణిక్యం, ఎవరన్నా వస్తున్నారేమో నన్నట్లుగా ఇటూ అటూ చూశాడు. మళ్ళీ అణ్ణామలైతో గుసగుసలాడాడు. "ఆ బొమ్మనుచూస్తే అమ్మా నాన్నా ఏమను కుంటారు ? అది గనుక ఆ ముసలాయన కంటబడితే నిన్ను వాళ్ళ గుమ్మం తొక్క నిస్తాడా ? ఏళ్ళు వచ్చికూడా నువ్వు పసిపిల్లవాడిలా ప్రవర్తిస్తున్నావేం ?"

'ఇందులో తప్పేవిటి ?' అని అడగాలని తపించాడు అణ్ణామలై. అంతవరకు అది తప్పుగా తోచలేదతనికి. కాని మాణిక్యం చెప్పాక 'తప్పేనా ? తప్పేనేమో' అన్పించసాగింది. మనసంతా గందరగోళమయింది.

అట్లా గుడ్లప్పగించి చూస్తావేం ? ఆ పిల్లను నువ్వు ప్రేమిస్తున్నావని వాళ్లను కోరా ?"

"అలాగా ?" అన్నాడు అణ్ణామలై బాధతో.

'ప్రేమా ?'

'ప్రేమా ?'

ఆ మాట అర్థమయినట్లూవుంది; కానట్లూవుంది. కాలేజిలో విద్యార్థులు దానిని గురించి పవిత్రంగా, నీచంగా, రహస్యంగా మాట్లాడడం అతడు విన్నాడు. కావ్యాలలో, కథలలో, నవలల్లో దానిని గురించి చదివాడు. తనకిచ్చి పెళ్ళిచేయాలని అమ్మ నాన్న అనుకుంటున్న ఆ సుందరిని చూసినప్పుడేర్పడే ఆకర్షణ సత దెరుగును. ఇందులో ఏది ప్రేమ ?

''అలాగని నువ్వు అనుకుంటున్నావేమో ?'' అన్నా డణ్ణామలై.

''నువ్వు ?''

''నేనట్లా అనుకోవడంలేదు.''

''చాల సంతోషం ! కాని తదితరులు అట్లాగే అనుకుంటారు. అమాటే నేను చెప్పాను.''

''దానికి నేనేమి చేయగలను ?''

''నువ్వా బొమ్మవున్న కాగితాన్ని చింపిపారేయి. లేకపోతే అనవసరమైన చిక్కుల్లో పడగలవు.''

''సరే !'' అని సగం మనసుతో అన్నాడు అణ్ణామలై. మాణిక్యంకూడా సగం సంతృప్తితో అక్కడనుండి కదిలాడు.

అతడు వెళ్లగానే ఆ చిత్రాన్ని చింపి పారేద్దామన్నంత ఉక్రోషం వచ్చింది అణ్ణామలైకు. దానిని చేతిలోకి తీసుకున్నాడు. చేతులు వణికాయి. చిత్రం వణికింది. ఆహా, ఆనంది నయనాలు ! అణ్ణామలై కండ్లల్లో నీరు నిండింది.

చింపడానికని తీసుకున్నవాడు, దాని చినిగిన మూల కాగితం ముక్కనుంచి అతికించాడు. అది నలగకుండా వుండాలని దానిని అట్టలమధ్య వుంచాడు. అప్పుడు దాని నలాగే తన పెట్టెలోపల భద్రపరచి తాళం వేశాడు.

అతడికి మాణిక్యంమీద విపరీతమైన కోపం వచ్చింది.

# 14

చిత్రకళాశాల తెరిచేరోజు సమీపిస్తూంది. కదిరేశన్‌వద్ద అణ్ణామలై శిష్యరికం ముగిసేటట్లనిపించింది. కాని చిత్ర కళాశాలలో చేరడానికి తహతహలాడిన అణ్ణామలైకు, ఆ సుదినం దగ్గరకొస్తున్నకొద్దీ ఇంకొక సమస్య తయారయింది. కళాశాల తెరిస్తే కదిరేశన్ ఇంటికి వెళ్ళడానికి వీలుండదే ? అదయారు కెలా వెళ్ళడం ? సముద్ర తీరాన అంకురించిన బాంధవ్యం, కాలేజిలో అడుగిడడంతో అంతమవవలసిందేనా ?

ఒకనాడు అణ్ణామలై, కదిరేశన్‌వద్ద శిక్షణ ముగిశాక, అలవాటు చొప్పున ఇంటివైపుకాక ఎలియట్స్ సముద్రతీరంవైపు నడవసాగాడు. ఆ సాయంకాలమంతా సముద్రతీరపు ఇసుకలో పడుకుని గడపాలనిపించిం దతడికి.

మనసులో ఏదో భారం, ఏదో దుఃఖం అతడిని బాధించింది. అదేమిటో అతడికే తెలియదు.

ఇసుకమీద పడుకుని హోరుమంటూ ఎగసిపడే అలలను తదేకంగా చూస్తున్నాడు. నాగుపాములవలె తలలెత్తి వస్తున్నాయి అలలు; విరిగిపడుతున్నాయి; నురగలు కక్కుతున్నాయి; ఎదురొచ్చే అలలను ఢీకొంటున్నాయి; అణ్ణామలై అంతరంగంలోవలె వాటికికూడా ఏదయినా బరువుందేమో, బాధ వుందేమో ?

'ఎందుకు మనసింత వికలంగా వుంది ?' అని పదేపదే ప్రశ్నించుకున్నాడు అణ్ణామలై. కారణం నెమ్మదిగా నెమ్మదిగా బోధపడసాగింది.

తనకు జ్ఞానం తెలిసిన నాటినుండీ - గత కొన్ని మాసాలవలె ఉత్సాహంగా ఎన్నడూ గడవలేదు. కదిరేశన్ ఇంట్లో గడిచిన ఘంటలు స్వప్నలోకంలో విహరించిన మధురవేళలు. ఆ కల కర్పూరమయి కరగిపోనున్నది. అదే ఈ బాధ. దానినే తానుభరించలేకున్నాడు.

"అందంగా జీవించు; జీవితాన్ని అందంతో నింపు" అన్న కదిరేశన్ ఇంటి గోడమీది సూక్తి, చూసిన వెంటనే అతన్ని ఆకర్షించింది. అయినా దాని భావం వెంటనే పూర్తిగా స్ఫురించలేదు. కంటికి కనపడే అందమే అందమనుకునేవాడు తను. రూపాలు, రంగులు - అందమంటే ఇవే అనుకునేవాడు.

కానీ ?

కంటికగపడని ప్రాణానికి అందం వుంది. మనసుకు అందం వుంది. ఈ రెంటికీ ఆవలవున్న ఆత్మకు సౌందర్యం వుంది, సౌరభం వుంది - ఇవన్నీ కూడా తనకు ఆ ఇంటిలో తెలిశాయి.

అలాంటి అందాన్ని ఆనంది కనులలో కన్నాడు. ఆమె పలుకులలో విన్నాడు. ఆ పలుకుల నామె పలికే తీరులో, ఆమె స్వరపు ఒంపులలో గమనించాడు. ఆమె నడకలో, వేషంలో, భావనలో, శరీరపు కదలికలో - సౌందర్య దేవతకు శతకోటి అర్చనలు చూశాడు. మనోవాక్కాయాలు మూడింటి వ్యక్తీకరణలో సౌందర్యపు చందమామ కురిసే వెన్నెలల నామె వెదజల్లింది.

అందంగురించి ఆమె అతడితో ఎన్నడూ మాట్లాడలేదు. ఆమె అందగత్తె అని చాలమంది అంగీకరించరు. చూపరుల నాకర్షించే బాహ్యసౌందర్యం ఆమె సొత్తు కాదు. నందనవనపు వెలుపలి భాగాన్నిచూసి దాని అందాన్నెలా తెలుసుకోగలం ? లోపలి కడుగిడి విహరించక పోయినప్పటికీ అణ్ణామలై తొంగిచూడ గలిగాడు. అలా చూశాడు గనుకనే దానికి దూరమవలేక బాధపడుతున్నాడు.

అప్పుడొక అద్భుతం జరిగింది.

ఎవరో అతణ్ని మౌనంగా పిలుస్తున్నట్లు వినిపించింది. నిజానికి ఎవరూ పిలవలేదు, కాని అతడి కట్లా అనిపించింది. భ్రమ అనుకుని అతడు వెనుదిరిగి చూడలేదు.

తన కళ్ల నతడు నమ్మలేకపోయాడు. దిగ్భ్రమ చెందాడు. ఆశ్చర్యంలో మునిగి లేచాడు. అతడి మనసు హర్షాతిశయంతో చప్పట్లు కొట్టింది. దూరాన, ఆనంది ఒక్కతే నడిచివస్తూంది. ఆమె అతడి నలా పిలిచివుండదు. పిలిచినా ఆమె గొంతు అతడికి వినపడదు.

మరి ? ఆ విన్పించిన మంజుల స్వరం ఆమె మనసుదా ?

ఆమె వెనకాలే కదిరేశన్ వస్తున్నారేమోనని చూశాడు అణ్ణామలై. లేదు, ఆయన రావడం లేదు. ఇంకెవరూలేదు. ఆమె ఒంటరిగా అలా రావడం అతడికి సిగ్గనిపించింది.

ఆనంది అతడివైపే రాసాగింది. ఆమె గమన సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ, తానున్నచోటనే తిరిగి కూర్చున్నాడతడు. పాదాలవద్ద కుంచెవలె చేరిన కుచ్చిళ్ల

జారాడుతుండగా, పయ్యెద గాలికి రెపరెపలాడుతుండగా ఆమె అలవోకగా నడిచి వస్తూంది. ఆ నడకలో తొందరలేదు, తొట్రుపాటులేదు. నడకలో ఒక నవ్యత; చేతి విసురులో ఒక చెలువము; అంతటా అతి సహజమైన అందము.

వారింటిలో కదిరేశన్ రచించిన ఆ అద్భుత చిత్రమే అలా తనవైపు నడిచి వస్తున్నదేమో ననిపించిం దతనికి. 'ఇలా ఈమె నెన్నోసార్లు చూసిన కదిరేశన్ మదిలో ఈ మూర్తి స్థిరంగా నిలిచినట్లుంది. అందుకనే ఆయన ఆ చిత్రాన్ని రచించారు' అనుకున్నాడు.

అతడి దగ్గరగావచ్చి, పాదాలను మడుచుకుని పొందికగా కూరుచుంది ఆనంది. కొన్ని క్షణాలపాటు ఎవ్వరూ మాట్లాడలేదు. అణ్ణామలై ఆనందం అతడి మొహంలో వెలిగింది; అది చూచిన ఆనంది ముఖంమీద దరహాసం వెలిగింది.

''నాన్నగారు రాలేదా ?''

''ఏదో చిత్ర రచనలో లీనమయివున్నారు. ముగియడానికి ఏదవుతుందేమో నన్నారు.''

''మీ రిక్కడికి ఒంటరిగా వస్తుంటారా ?"

''లేదు; ఇవాళే మొదటిసారి.''

''ఒంటరిగా మీ రిలా...'' అని సాగదీశాడు అణ్ణామలై.

''స్నేహితురాళ్ళను పిలిచాను కాని వాళ్ళకేవో పనులున్నాయట. మీ రిక్కడ వుంటారని తెలుసు. అందుకే వచ్చాను.''

''నేనుంటానని తెలుసా ?''

"మీరు ఇంటివైపుకాక, సముద్రంవైపు తిరగడం నేను గమనించాను'' అని ఆమె తల ఒంచుకుంది. ఆమె వేళ్ళు ఇసుకమీద ఏదో గీయసాగాయి. మొదట తామరమొగ్గ; తర్వాత అరవిచ్చిన పువ్వు; ఆ వెంటనే వికసించిన కెందామర కుసుమం - ఇలాగ ఆమె వేళ్ళు సృష్టించాయి.

అణ్ణామలై హృదయంలోనుండి వందలాది పావురాళ్ళు బయటి కెగిరివచ్చి, అతడి తలపైన ఆకాశనిండా రెక్కలు విదల్చుకుంటూ ఎగురుతున్నట్లు అన్పించింది. ఆనందార్ణవపు అంచులమీద నిలబడి అతడు "మీకు బొమ్మలు వేయడం వచ్చునే ?'' అన్నాడు.

"రాదు."

''ఒక ప్రక్క గీస్తూనే ఇంకో ప్రక్క రాదు అంటున్నారే—?"

''అట్లా చూస్తే ఆడవాళ్ళందరూ చిత్రకారిణులే. మేము ముగ్గులు పెడతాము. జడలల్లుతాము. ఇంటి నందంగా వుంచుతాము''

అలాంటి అమ్మాయిలు పట్నాలలో అరుదయిపోతున్నారని అందామనుకున్నాడతను.

''చిత్ర రచన మీరూ నేర్చుకోరాదూ ?"

"వద్దు, వద్దు !'' అని నవ్వింది ఆనంది. తాను నేర్చుకోకుండా వున్నందు వలననే నాన్నగారిని చూసుకోవడానికి వీలవుతున్నదట. కళాకారులంటే పసిపిల్లల వంటివారట. వాళ్ళతోబాటు వుండేవారికి - వారికి అడ్డంకులుగా వుండకపోవడం, వారికి సాయం చేయడం - ఇవి రెండూ తెలియాలట. తను ఆ రెంటినీ నేర్చుకుంటే చాలట !

వెంటనే ఇంకేదో గుర్తుకు వచ్చినట్లుగా ''మేము ఇంతవరకు మీ అమ్మ నాన్నలను కలవనేలేదు. వారి నొకసారి మా ఇంటికి పిలుచుకుని రాకూడదా ?" అని అడిగింది ఆనంది.

''మా నాన్నకూడా మిమ్మల్ని మా ఇంటికి పిలవాలని ఎన్నోసార్లు అన్నారు. కాని ఆ మాట మీ నాన్నగారితో చెప్పాలంటే నాకు జంకుగా వుంది.''

''జంకా, ఎందుకు ?"

"మేము...మేము పల్లెటూరి వాళ్ళం. మీకు అతిథి మర్యాదలు సరిగా చేయగలమో, లేదోనని భయం. అందుకని పిలిస్తే ఏమనుకుంటారో, ఏమోనని బెరుకు..."

''రమ్మని పిలుస్తే ఏమనుకుంటారేమిటి. సంతోష పడతారు. నాగరికత యొక్క బాహ్యాడంబరాలే నాన్నకు గిట్టవు.''

''అలాగయితే నేను, మా నాన్న పిలువడానికి వస్తాము.'' అన్నాడు అశ్వత్థామ ఉత్సాహంతో. కరిగిపోనున్న కలకు తిరిగి ఆనంది ప్రాణం పోసినట్లనిపించింది అతడికి.

# 15

నిన్న దూషించినవారిని నేడు భూషించడం, నేడు పొగిడినవారిని రేపు తెగ నాడడం మానవ నైజం. చిదంబరమేస్త్రీ ఇంతే.

మొట్టమొదట కదిరేశన్‌ను కలవకుండానే మాణిక్యం మాటలను విని 'ఆ ముసలివాడూ ఆ పిల్లా కలిపి అబ్బాయిని చెడగొట్టారు' అని తూలనాడారు. ఆ తర్వాత దండపాణిగారిని సంప్రదించాక మనసు కొద్దిగా మారింది. ఆ తర్వాత కదిరేశన్ జీతం పుచ్చుకోకుండా అబ్బాయికేదో చెప్పిస్తున్నాడనీ ఇల్లూ తోట కల వాడనీ ఆయనమీద గౌరవం ఏర్పడింది మేస్త్రీకి. ఆయనను విందు భోజనానికి తమ ఇంటికి పిలవాలి అనుకున్నారు.

కదిరేశన్‌ను పిలవడానికని వెళ్ళి అణ్ణామలైతో కలిసి వారింట్లోకి అడుగు పెట్టగానే మేస్త్రీకి క్రొత్తదనం గోచరించింది. ఆ ఇల్లు పెద్ద తోటమధ్య చిన్న ఆశ్రమంవలె అన్పించింది. ఆనంది, కదిరేశన్ ఎదురొచ్చి స్వాగతం చెప్పారు. ముందుప్రక్క చిన్న గదిలో వారిని కూర్చోపెట్టారు; కదిరేశనూ కూర్చున్నారు. ఆనంది లోపలికి వెళ్ళింది.

కదిరేశన్‌ను చూడగానే ఆయనపట్ల మేస్త్రీగారికి భక్తితో కలిసిన గౌరవం ఏర్పడింది. మేస్త్రీగారి నిరాడంబరత కదిరేశన్‌ను ఆకర్షించింది. "అణ్ణామలై ద్వారా మీ గురించి తెలుసుకున్నాను. మిమ్మల్ని కలవడం చాల సంతోషం." అన్నారు కదిరేశన్.

"కుర్రాడని ఇంజనీరు చేద్దాం అనుకున్నాను; వీలుకాలేదు. మీరో దారి చూపించారు. అదృష్టంవుంటే అందులోనే పైకి రానివ్వండి" అన్నారు మేస్త్రీ.

'పైకి రావడం' అన్న మాట విని నవ్వుకున్నారు కదిరేశన్. ప్రతీ తండ్రీ ఇలాగే తన కొడుకు 'పైకి రావాలని' 'ముందుకు పోవాలని' ఎదురుచూస్తాడు. గుర్రపు పందెం వంటి జీవితపు పందేనికి వలసిన వేగాన్ని పుంజుకునే నిమిత్తం లేత ప్రాయంలోనే పిల్లల తోకలు మెలిపెట్టడమేను జీవితం అంటే ? జీవితపు లక్ష్యం ఈ పందెమేనా ?

మేస్త్రీ తా మెందుకొచ్చిందీ వివరించి, వారిని తమ ఇంటికి ఆహ్వానించారు.

ఆదివారం ఉదయంవస్తే, కబుర్లతో కాలక్షేపంచేసి, భోజనం ముగించి సాయంకాలం వెనక్కు రావచ్చునని సూచించారు.

"తప్పకుండా వస్తాము." అన్నారు కదిరేశన్. అప్పుడు ఆనంది పళ్ళెం నిండా పిండివంటలు పండ్లు తీసుకొచ్చి వారి ఎదుట వుంచింది.

"నేను విందు తినడానికి రాలేదమ్మా. విందుకు పిలవడానికి వచ్చాను." అన్నారు మేస్త్రి.

"ఇదేమీ విందు కాదులెండి; అమ్మగారితోబాటు మీ రాకనా డొచ్చి విందు భోజనం చేద్దురుగాని—" అంది ఆనంది.

"అమ్మాయి చక్కగా మాట్లాడుతూందే, కాలేజిలో చదువుతూందా?" అని కదిరేశన్‌ను అడిగారు మేస్త్రి.

"ఔను చదవాలని తనకు ఆశవుంది. కాలేజికి వెళ్ళివస్తుంది."

"ఏం చదువుతూంది?"

"బి. ఏ. ముగించాలి."

"బి. ఏ. లో ఏమి చదువుతూంది?"

"సాహిత్యం!" అన్నారు కదిరేశన్.

'సాహిత్యం' అంటే ఏమిటో మేస్త్రికి అర్థం కాలేదు. ఏ పనికి పనికివచ్చే చదువది?

"నేను చదువురాని బైతునండీ! అట్లాగంటే ఏమిటో నాకు బోధపడలేదు." అన్నారు మేస్త్రి.

"తమిళము, ఆంగ్లమువంటి భాషలలో కావ్యాలు, కథలు, నాటకాలు, కవితలు మొదలయినవాటిని చదవడ మన్నమాట."

"అవి చదవడంవల్ల లాభం ఏమిటి?"

"అవి మనిషికి జీవించడం నేర్పిస్తాయి. మనిషికి జీవించడం కాక వస్తువులను సంపాదించడం నేర్పిస్తున్నాము గనుకనే ఎక్కడ చూసినా స్వార్థం, పేరాశ, మోసం, అసత్యం రాజ్యమేలుతున్నాయి. రీతి, మర్యాద, సాంఘిక బాధ్యత లేకపోయాక దేశం ఎంత ఐశ్వర్యవంతమయితేనేమి, బాగుపడదు. సాహిత్యం మనిషి ఆలోచనలను, మాటలను చేతలను సౌందర్యవంతం చేస్తుంది. అతడి లోపల యంత్రాలవలె పనిచేసే ఇంద్రియాలను సరైన దారిలో నడిపిస్తుంది."

ఆ ఇంద్రియాల గురించి మాట్లాడారు కదిరేశన్. 'అందం' అన్న మాటకు కొంగ్రొత్త అర్థాలను చెప్పారాయన. ఆ రోజు మేస్త్రీగారికే కాదు అణ్ణామలైకూ జ్ఞాన భోజనం లభించింది.

''చదువుకునివుంటే ఎన్నో విషయాలు తెలుసుకోవచ్చు— " అని నొచ్చుకున్నారు మేస్త్రీ.

''ఉత్త చదువువల్ల లాభంలేదు. చదవని కొందరు సంస్కారం, సంప్రదాయం - వీటి ఫలితంగా ఎంతో చక్కగా నడచుకొంటారు. చదివిన దానిని జీవించాలి. 'మేలుచేయి' అన్న పెద్దబాలశిక్ష వాక్యానికి ఎంతో అర్థంవుంది. అది పునాదిగా వుంటే ఆ పైన ఎంతటి భవనమయినా కట్టవచ్చు. ఆ పునాది లేనిదే ఎంతటి సౌధమయినా కూలక తప్పదు."

పునాది, భవనం, సౌధం అన్న పదాలను కదిరేశన్ ఉచ్చరించగానే మేస్త్రీగారి మనసు సాహిత్యంనుండి తమ వృత్తిలోకి గెంతింది. కదిరేశన్ ఇంటి గోడలను కప్పును పరిశీలించారు. పునాది గట్టిదేగాని, ఇల్లు బాగా పాతది కావడం మూలాన గోడలమీద పగుళ్ళు కన్పిస్తున్నాయి.

'పాతదేదో చూసి, అవసరమైనచోట కొత్తగా పునర్నిర్మించవలసిన ఇల్లిది' అనుకున్న మేస్త్రీ— "ఓ సారి ఈ ఇంటిని చూడవచ్చా ?" అని అడిగారు.

"తప్పకుండా చూడండి. నేనే చూపిద్దామనుకుంటున్నా. కొత్తగా కట్టించవలసిన ఇల్లు ఇది."

ఇద్దరూ కలిసి ఇల్లంతా తిరిగి చూశారు. కదిరేశన్ వర్ణ చిత్రాలూ, శిల్పాలూ మేస్త్రీగారి దృష్టి నాకర్షించలేదు. పొడవు, వెడల్పు, మందం, పగుళ్ళు, గోడ, పూత - వీటిని ఆయన గమనించారు.

కదిరేశన్ పడకగదిలోకి వచ్చిన మేస్త్రీ అక్కడవున్న ఒక పాత ఫోటోను చూసి ఠక్కున ఆగిపోయారు.

ఫోటోలో భార్యాభర్త కూతురు - ముగ్గురున్నారు. కళ్ళుపోడుగుండా పరిశీలనగా చూసిన మేస్త్రీ మొహం విప్పారింది.

"ఆ ఫోటోలో వున్నది కారైక్కుడి కుమారస్వామిగారు కదండీ ? కొలంబోలో వ్యాపారం చేశాక స్వంత వూరుకు చేరారు. ఆ తర్వాత ఆ వూరు విడిచి మదరాసు కొచ్చారు ఆయనేనా ?"

"ఔను —" అన్నారు కదిరేశన్ తడబడుతున్నట్లుగా.

"ఆయన కూతురుకూడా, ... పాపం ... చిన్న వయసులోనే..."

ఆ పైన మేస్త్రీని మాట్లాడనివ్వకుండా అడ్డొచ్చిన కదిరేశన్ - "ఔను. ఆయన కూతురే నా భార్య, ఆనంది తల్లి. ఆమె కన్నుమూసింది. నా అత్తగా రిక్కడే వున్నారు" అని తొట్రుపడుతూ చెప్పారు.

మేస్త్రీ గారికి బోధపడలేదు. కాని వంటింట్లోకి వెళ్ళినప్పుడు ఆనంది అవ్వ కనపడితే అన్నీ అర్థమయ్యాయి. "అమ్మా!" అని ఆనందంతో దండం పెట్టారు.

''మీ ఇంటి పనివాడు చిదంబరాన్ని మీకు గుర్తుందామ్మా? అయ్యగారు పట్నం రావడానికి ముందు ఒక సంవత్సరంపాటు మీ ఇంటి అన్నంతిని పెరిగిన శరీరమమ్మా ఇది!''

అతి కష్టంమీద గుర్తుకు తెచ్చుకున్న ఆమె మొహం విప్పారింది.

కాని కదిరేశన్ మొహం, ఆయనకు తెలియకుండానే ముడుచుకుంది.

# 16

ఇంటి వెనకప్రక్క తోటను మేస్త్రీ, కదిరేశనూ చూస్తుండగా అణ్ణామలై కూడా వారితో చేరాడు. అత డింతకుముం దెన్నడూ పెరటితోటను చూడలేదు. కొబ్బరి, అరటి, పోక, మొదలైన చెట్లు ఒక ప్రక్క వున్నాయి. ఇంకొకవైపు టొమెటో, వంగ, బెండ, ఆకుకూరల మొక్కల పాదులున్నాయి. చిన్న పందిరి మీదకు మల్లెతీగె పాకివుంది.

ప్రహరీగోడ నానుకుని తోటమాలి వేలయ్య ఇల్లు వుంది. దానికి వేరుగా స్నానాలగది, కుళాయి వున్నాయి. వేలయ్య కూతురు ఇంట్లోపల వంట చేస్తుంది. వేలయ్య, వాడి పెళ్ళాము తోటపని చేస్తున్నారు. కొట్టం లోపల లేగదూడ గెంతుతూ తల్లితో ఆడుకుంటూంది.

అంత విశాలమైన చోటుచూసి మేస్త్రీ ఆశ్చర్యపోయారు. ఇంతపెద్ద చోటులో ఇంత చిన్న ఇల్లా అనుకున్నారు మేస్త్రీ. 'ఈ ఇంటిని పూర్తిగా పడగొట్టి కొత్త ఇల్లు కట్టాల్సిందే' అనిపించింది.

ముందు గదిలోకి వచ్చారు. "చూశాముకదా, ఈ ఇల్లు ఆట్టేకాలం నిల బడదు. కొత్త ఇల్లు కట్టాల్సిందే'' అన్నారు మేస్త్రి.

''ఔను, క-ట్టా-ల్సిం-దే-" అని సాగదీశారు కదిరేశన్.

''కట్టడం ఏమంత కష్టంకాదు —"

విచారంతో నవ్వారు కదిరేశన్. ''ఇలాటి పనులలో నాకు అనుభవం లేదు. ఆవిడ వున్నంత కాలం బాధ్యత తెలియకుండా వెళ్ళబుచ్చాను. రాబడి, ఖర్చు, పొదుపు, ధరలు - ఇవన్నీ నాకు తెలియని విషయాలు. "ఇల్లుకట్టిచూడు; పెళ్ళి చేసిచూడు" అంటారు. నేనా రెండు పనులూ చేయాలి. ఎలా చేస్తానో ఏమో."

''ఇల్లుకట్టే బాధ్యత నా కప్పగించండి. కాగితంమీద ప్లాన్ వేయడం దగ్గర నుండి గృహప్రవేశందాక పనులుచేసే మనుషులు నా దగ్గరున్నారు. మీరు పూర్తిగా నా కప్పగించి మరిచిపోవచ్చు.''

''వెలలన్నీ పెరుగుతున్నా యంటున్నారు. అలాంటప్పుడు ఇంటి పనిలో ఇరుక్కోవడానికి భయంగా వుంది.''

"డబ్బు గురించి ఆలోచిస్తున్నారా ?"

"ఔను. ఏదో ఉపకార వేతనం లభిస్తుంది. ఏదో అవసరమైన ఖర్చులకని కొంత వుంచుకున్నాను. మరి ఇల్లూ బాగుచేయాలని వుంది."

''చేతిలో వెన్ననుంచుకుని నేతికోసం వెతుకుతున్నారు మీరు. మీ కింత పెద్ద తోట ఎందుకు ? ఈ తోటలో నాలుగు బంగళాలకు సరిపడే చోటుంది. సగం చోటు నమ్మేస్తే ఆ డబ్బుతో బ్రహ్మాండమైన ఇల్లు కట్టవచ్చు."

అణ్ణామలైకు ఈ ఆలోచన అంతగా నచ్చలేదు. అప్పుడెప్పుడో మాణిక్యమూ ఇట్లాగే మాట్లాడాడు.

"కట్టవచ్చుననుకోండి. తోటమాలి వేలయ్యకు ఇల్లు లేకుండా చేయడం నా కిష్టంలేదు." అన్నారు కదిరేశన్.

''వాడికికూడా వెనకప్రక్క ఒక ఇల్లు కట్టవచ్చు.''

"అలాగే చేద్దాం" అన్నారు కదిరేశన్ కృతనిశ్చయంతో.

మేస్త్రి ఒక క్షణం కళ్ళుమూసుకుని యోచించారు. ''వెనకప్రక్క సగం స్థలానికి మరొకరయితే ఎంత ధర ఇస్తారో అదే ధర ఇచ్చి నేను కొనుక్కుంటాను.

ఒక్క పైసాకూడా తగ్గించకండి. డబ్బు వేరు; స్నేహం వేరు. రెండింటినీ కలిపితే ఏ ఒక్కటీ నిలవదు.''

మేస్త్రీగారి ఖరాఖండీ మాటలు కదిరేశన్‌కు నచ్చాయి. ''మీరే తీసుకునేటట్లయితే నాకు ధరను గురించి దిగులులేదు.'' అన్నారు కదిరేశన్ ఉత్సాహంతో.

"ఊహు! రేపొద్దున, మిమ్మల్ని మోసంచేసి తక్కువ ధరకు కొన్నానని ఎవ్వరూ అనకూడదు. నలుగురినీ కనుక్కొని ఆ వెలనే నా దగ్గర తీసుకోండి.''

కదిరేశన్ అంగీకరించారు; "మీ సహాయం నాకు ఎదురుచూడకుండా లభించింది" అని ఉప్పొంగిపోయారు.

మేస్త్రీ, అణ్ణామలై సెలవుతీసుకునే సమయానికి ఆనంది, వేలయ్య అక్కడికి వచ్చారు. వాళ్ళు రెండు సంచులనిండా కాయగూరలూ అరటిపండ్లూ తీసుకొచ్చారు. మల్లెలను అరటి ఆకులో పొట్లం కట్టారు. ఆ సువాసన గదంతా అలముకుంది. ఆనంది అభిమానాన్ని చూసి మేస్త్రీ విస్తుపోయారు.

''ఇవన్నీ ఎందుకమ్మా ?"

''ఎందుకో మీకు తెలియదు; ఇంటి కెళ్ళాక అమ్మనడగండి. ఆమె చెబుతారు !''

పెద్ద చోటిని కొనబోతున్నామన్న ఉత్సాహంతో వున్నారు మేస్త్రీ. అణ్ణామలై మనసు మల్లెల సౌరభాలతో నిండింది.

# 17

డాక్టర్లకు తెలియని అంటువ్యాధి ఒకటి వుంది. అది మధ్య తరగతి వాళ్ళకు సంక్రమిస్తుంటుంది. ఇది 'తాత్కాలిక అవతారం'తో మొదలయి క్రమంగా ముదిరి 'ఆడంబరమైన అలవాట్లు'గా విషమిస్తుంది.

ఎదుటి వారిని కళ్ళతో చూస్తే చాలు అంటుకుంటుందీ వ్యాధి. దీని క్రిములు కళ్ళద్వారా మనసులోకి వెళ్ళి అక్కడ గుడ్లు పెట్టి, పిల్లలను పెంచుతాయని చెప్పవచ్చు. మగవారి విషయంలో ఇది - హోటల్ నివాసం, సోఫాసెట్, విద్యుత్ పరికరాలు - వీటితో మొదలయి వాయిదాల పద్ధతిలో కారు కొనడందాక ముదురు

తుంది. ఆడవారికయితే స్టెయిన్లెస్ స్టీల్ పాత్రలతో ప్రారంభమయి పట్టుచీరల వరకు, రవ్వల నగలవరకు ముదరగలదు.

యవ్వనపు దినాలనుండి బీదరికం అనుభవించడం వలన చిదంబరమేస్త్రీ మనసులో పైన చెప్పిన జబ్బు లోలోపల దాగివుంది. దానిని పైకి విజృంభించ కుండా చాల రోజులు జాగ్రత్త పడినప్పటికీ, కదిరేశన్ రాక సందర్భంగా మాత్రం ఆయనలో అది 'తాత్కాలిక అవతారం' ఎత్తింది.

కదిరేశన్ ఆ రోజు తమ ఇంటికి అణ్ణామలై గురువుగానే కాదు, విశాలమైన ఇంటికి అధిపతిగా వస్తున్నట్లు మేస్త్రీ భావించారు. వారింటి నివేశనంమీద ఆశ వున్నందున, దానిని కొనగల స్తోమత తన కుందని నిరూపించ దలచారు మేస్త్రీ.

'ముద్దుల కొడుక'యిన మాణిక్యమూ ఆయనా కలిసి బజారుకు వెళ్ళారు. సోఫాసెట్టు, ఎలక్ట్రిక్ ఫ్యాన్‌లు, తెరగుడ్డలు, ఫ్లవర్ వాజులు కొన్నారు. ఖర్చులో ఖర్చుగా మాణిక్యం తనకోసం రెండు టెరిలిన్ చొక్కాలు ధోవతులు కొనుక్కున్నాడు. అణ్ణామలైకు కావలసినన్ని గుడ్డలున్నాయని మాణిక్యం చెప్పడంవలన మేస్త్రీగారేమీ కొనలేదు. శనివారం సాయంకాలానికే మేస్త్రీగారిల్లు అతిథుల రాకకు సిద్ధమయింది.

ఆదివారం ఉదయం.

పది గంటలకు మాణిక్యమూ అణ్ణామలై వెళ్ళి కదిరేశన్ కుటుంబాన్ని తీసుకు రావడానికి సన్నద్ధులయారు. గంట ముందునుండి మాణిక్యం అలంకారం మొదలెట్టాడు. మల్లు ధోవతి కొత్త టెరిలిన్ చొక్కా ధరించాడు. ముఖానికి పౌడర్ అద్దుకుని రుమాలుతో మెరుగులు దిద్దుకున్నాడు. చొక్కామీద అత్తరు నలదు కొన్నాడు.

మాణిక్యాన్ని చూసిన అణ్ణామలై బిత్తరపోయాడు. ''ఇదేమిటీ వేషం, పెళ్ళి కొడుకులా ?" అని ఎగతాళిగా అడిగాడు.

"అతిథుల ఎదుట నవనాగరికంగా వుండకపోతే నాన్నగారికి కోపం రాదూ ? నీ కేమి ఆర్టిస్టువి, జుత్తంతా రేపుకుని నలిగిన బట్టలతో వాళ్ళతో మెలగగలవు. నేనట్లా కాదుగదా ? ఇదిగో, నువ్వుకూడా కాస్త అత్తరు పూసుకో—"

"బాబోయ్, ఆ అత్తరంటేనే నాకు తలనొప్పి. నా వంతుకూడా నువ్వే పూసుకో - ఇక బయల్దేరు'' అన్నాడు అణ్ణామలై.

వాళ్ళు బయలుదేరవలసిన అవసరమే లేకపోయింది. మేడమీద మాణిక్యం గదినుండి చూస్తే, కదిరేశనూ ఆనందీ రావడం కనిపించింది. మొదట వారిని చూసిన మాణిక్యం, ఆ విషయం అణ్ణామలైకు చెప్పకుండా, అతన్ని తోసుకుని గబగబ క్రిందకు వెళ్ళాడు. అసలు విషయం ఆ తర్వాత తెలిసింది అణ్ణామలైకు.

మాణిక్యం వీధిలోని అతిథులను కలుసుకుని, స్వాగతం పలికి ఇంట్లోకి తీసుకొచ్చాడు.

వారితోబాటు ఆనంది అవ్వగారు రాకపోవడం గమనించిన చిదంబరమేస్త్రి ''ఏరి, అమ్మగారిని తీసుకురాలేదేం ?" అంటూ వారికి స్వాగతం చెప్పారు.

''వయసయిందికదా ఆమె సాధారణంగా ఎక్కడికీ రాదు.'' అన్నారు కదిరేశన్. అక్కడ అణ్ణామలైని చూశాకనే ఆనంది చూపులకు విశ్రాంతి కలిగింది.

తన ఒకప్పటి యజమాని భార్యకు తానూ ఇప్పుడొక యజమాని అన్న విషయం చూపించాలని ఆశించిన మేస్త్రికి, కదిరేశన్ అత్తగారు రాకపోవడం కొంత నిరాశ కలిగించింది.

మీనాక్షమ్మ వచ్చి కదిరేశన్‌కు నమస్కారంచేసి ఆనంది చేతిని పట్టుకుని లోపలికి తీసుకువెళ్ళింది. వంటింట్లో కూరలు తరుగుతున్న మాణిక్యం తల్లి చెల్లమ్మకు ఆనందిని పరిచయం చేసింది. చెల్లమ్మ ముఖంమీద కృత్రిమపు చిరునవ్వు వెలిగింది. ఆమె ఆనంది చీర, నగలు గమనిస్తూ కూరలు తరగసాగింది.

చెల్లమ్మ వయసు ఎక్కువేకాని శరీర దారుఢ్యం సడలలేదు. కష్టించి పని చేసే ఒళ్ళుగనక గట్టిగా వుంది. ఆమె పని అంత నాణ్యంగా లేకపోయినా, చురుకుగా చేస్తూంది. ఆమె చూపులలో ఏదో అశాంతి, తొందర కన్పిస్తున్నాయి.

ఆనంది కూర్చోవడానికని మీనాక్షమ్మ చాప పరిచింది. దానిమీద కూర్చోకుండా ఆనంది ''నా కేదయినా పని చెప్పండి. పని చేద్దామనే లోపలికి వచ్చాను.'' అంది.

''భోజనం చేసే పనిని నువ్వు సరిగా చేస్తేచాలు. మా ఇంటి అతిథులకు మేము అప్పజెప్పే పని అదే !" అని నవ్వింది మీనాక్షమ్మ.

"నేను మీకు అతిథిని కాను. మీ ఇంటి అమ్మాయి ననుకోండి. నా వంట మీద మీకు నమ్మకం లేకపోతే వేరేదయినా పని నప్పగించండి —"

చెల్లెమ్మకు మీనాక్షమ్మకు ఆడపిల్లలు లేరు. మీనాక్షమ్మకు కూతురు లేదే అన్న లోటువుంది. అంచేత ఆమెకు ఆనంది మాటలు నచ్చాయి. 'పిల్ల బలే మాటకారిలా వుందే—' అనుకుంది చెల్లమ్మ.

తరగడానికని ప్రక్కన పెట్టివున్న తోటకూర కట్టను తీసుకుంది ఆనంది. "ఇంకొక కత్తిపీట వుంటే ఇవ్వండి'' అని చెల్లమ్మను అడిగింది. ఆమెను కూడా మాట్లాడించాలని ఆనంది ఆశ.

''వద్దమ్మాయ్ ! వేలు కోసుకుంటావేమో... నిన్ను చూస్తే ఇట్లాంటి పనులు చేసేదానివిలా లేదు—" అంటూ చెల్లమ్మ ఇంకో కత్తిపీటను ఆనంది వైపు జరిపింది.

ఆనంది ఆకుకూరను బాగా కడిగి ఒక పళ్ళెంలో వుంచుకుంది; గబగబ తరిగి ఇంకో పాత్రలో వుంచింది. ఉల్లిపాయలను సన్నగా తరిగింది. చిందర వందరగా పడివున్న పాత్రలను సర్ది వంటిల్లు శుభ్రం చేసింది. ఇవన్నీ చూసిన మీనాక్షమ్మ ఆశ్చర్యానికి సంతోషానికి అంతేలేదు. చదువుకున్న అమ్మాయిలకు ఇంటిపని చేతకాదు అని మీనాక్షమ్మ అనుకునేది. ఆ మాట అబద్ధం అని ఆనంది ఋజువుచేసింది. చెల్లమ్మకూడా ఆనందినే చూస్తూ మంచి వంకాయలతోపాటు పుచ్చువాటినీ తరిగి పడేసింది.

మీనాక్షమ్మ ఎంత చెప్పినా వినిపించుకోక ఆనంది చీపురు తీసుకుని గదినంతా చిమ్మింది. తన పరిసరాన్ని శుభ్రంగా వుంచుకునే అలవాటే ఆమెచేత ఆ పని చేయించింది.

ఆమె చిమ్ముతుండగా గదిలోకి అత్తరు వాసన వచ్చింది. వెనకవైపు తలుపు కవతల ఎవరో వున్నట్లనిపించింది. అణ్ణామలై యేమోనని ఆనంది తిరిగి చూసింది. కాదు, మాణిక్యం !

''ఏమిటీ పని ? ఇందుకేనా మీ రిక్కడికి వచ్చింది ? ఇది చూస్తే మా నాన్న కోప్పడగలరు—'' అన్నాడు మాణిక్యం.

''నేను పనిచేయకుండా కూచుంటే మా నాన్న కోప్పడతారు—'' అని గలగల నవ్వింది ఆనంది.

ఆమె మాటలు నవ్వు అతన్ని ఉస్మత్తుణ్ణి చేశాయి. చెల్లమ్మకు మాత్రం ఆమెది దుందుడుకు ధోరణి అన్పించింది. మగవాడిని చూడగానే చీపురు క్రింద

పదేసి ప్రక్కకు తప్పుకోకుండా, ఎదుట నిల్చుని సరిసమానంగా మాట్లాడుతుందే. అణకువ లేనిపిల్ల!' అనుకుంది ఆమె.

# 18

మంచినీళ్ళు త్రాగడానికని తాను వంటింటికి వచ్చానన్నాడు మాణిక్యం. కాని నీరు త్రాగాకకూడా అక్కడనుండి కదలలేదు. వాళ్ళకు సాయం చేస్తానని అక్కడే కూర్చున్నాడు. చెల్లమ్మ అతడిని కొబ్బరికాయను పగలగొట్టమంది. వరుగులు వేయించడానికి దుంపలు కోరమని చెప్పింది. అతడూ సకలకళా పారంగతుడికిమల్లే చకచక చేసిపారేయసాగాడు. మీనాక్షమ్మ కివేమీ నచ్చలేదు కాని ఆమె ఏమీ మాట్లాడలేదు 'ఇది ఈ ఇంటి అలవాటు కాబోలు—' అని ఆనంది వూరుకుంది.

అతడు పూసుకున్న ఆ అత్తరే ఆనందికి నచ్చలేదు కాని అతడి పని చాకచక్యమూ, అరమరికలు లేకుండా మెలగే స్వభావమూ నచ్చాయి. అది ఇంకొకరి ఇల్లని అత డనుకున్నట్లు కనిపించలేదు. అవన్నీ ఆడవారి పనులని అతడు భావించలేదు.

ప్రతి మాటలో చేతలో తానే ఆ ఇంటి పెద్దకొడుకు అన్న భావాన్ని వ్యక్తం చేస్తున్నాడు మాణిక్యం.

బయట గదిలో పెద్దలిద్దరూ ఆర్థిక విషయాలగురించి ఆసక్తితో మాట్లాడుకుంటున్నారు. అక్కడే కూచునివున్న అణ్ణామలై మనసు వంటింటివైపు వెళ్ళుతూ వుంది. అయినా లేచి లోపలికి వెళ్ళడానికి ధైర్యం చాలలేదు. కదిరేశనూ ఆనందీ తమ ఇంటికి విందుకు రావడమే అతడికి పరమానందంగా వుంది.

ఆ రోజు డబ్బు విషయాలలో కదిరేశన్‌కు మేస్త్రి గురువయ్యారు. కదిరేశనూ ఆ శిష్యరికాన్ని సంతోషంగా స్వీకరించారు.

కళాకారుడిగానే జీవించిన కదిరేశన్‌ను ఈ లౌకికమైన చింతలు ఆయన భార్య పోయాకనే పీడించడం మొదలుపెట్టాయి. బాగా ఆలోచించిచూస్తే ఆయన కేమీ చింతలేదు. కాని నాగరిక జీవన వేగం ఆలోచించనిస్తుందా? ''అందంగా జీవించు'' అని రాసిపెట్టుకున్న ఆ వ్యక్తే అంతవరకు తాను సరిగా జీవించలేదేమో

నని దిగులు పడసాగారు. సంస్కృతి సభ్యత నెలవుండిన ఆ ఎదలో ఇప్పుడు కోరికలు, దిగుళ్ళు, వాంఛలు, నిరాశలు కాపురానికి వస్తున్నాయి.

"నాకూ వయసయింది. ఇంకా నేను ఆ జీతం డబ్బులకో కూలి డబ్బులకో పని చేయలేను. కాని పనికి అలవాటుపడ్డ ప్రాణంగనుక వూరికే కూర్చోనూలేను. ఆ మాణిక్యాన్ని పెట్టుకుని స్వంత కంపెనీ పెట్టుకుందా మనుకుంటున్నాను. మా యజమానీ తప్పుగా అనుకోడు—" అన్నారు మేస్త్రి.

"మాణిక్యం కుర్రవాడు కదా?" అన్నారు కదిరేశన్.

"కుర్రవాడయితేనేమి వాడు దిట్ట. చెట్టెక్కి ఆకులు కోసి తెమ్మంటే సమూలంగా చెట్టే తేగలడు. అణ్ణామలై వలె బ్రతకనేర్వనివాడు కాదు మాణిక్యం!"

ఇది విని అణ్ణామలై నొచ్చుకోలేదు, నవ్వుకున్నాడు.

"ఔను గట్టివాడే!" అన్నారు కదిరేశన్.

"నా ప్రాణానికి ప్రాణం అయిన స్నేహితుడి కొడుకు వాడు. వాడి చిన్న వయసులోనే వాడినీ, వాడి అమ్మనూ నా కప్పగించి కన్నుమూశాడు నా మిత్రుడు. ఏదో నా చేతనయినది చేస్తున్నాను. వాడి ప్రవర్తనా బాగావుంది. మున్ముందు కూడా వాడు నే ననుకుంటున్నట్లే నడచుకుంటే వాడూ బాగుపడతాడు; నాకూ మేలు జరుగుతుంది."

తండ్రిలేని బిడ్డను అంత అభిమానంతో చూసుకుంటున్న ఆయన ఔదార్యాన్ని కదిరేశన్ మెచ్చుకున్నారు. మేస్త్రిగారిపట్ల ఆయన గౌరవం ఇనుమడించింది.

భోజనాలయ్యాక మళ్ళీ ఆ గదిలో చేరారు. మాట్లాడుకున్నారు. ఆ తర్వాత కదిరేశన్ ఇల్లంతా చూడాలని వుందన్నారు. ఆయనను తీసుకుని మాణిక్యమూ మేస్త్రీ ఇల్లు చూపించారు. వెనుకవైపు తోట చూడగానే అక్కడ చెట్టుక్రింద నేల మీద కూర్చున్నారు కదిరేశన్. మిగతావారూ ఆపనే చేశారు.

అణ్ణామలై తన గదిలో కూచుని కలలు కంటున్నాడు. క్రొత్త సోఫాలో ఆనుకుని కూర్చుంటే సుఖంగా వుంది.

ఆడవారితోబాటు భోజనం ముగించిన ఆనంది యధేచ్ఛగా వచ్చి ఆ గదిలోకి తొంగిచూసింది. "మీ రిక్కడ వున్నారా?" అని ఆశ్చర్యపడింది.

"ఔను, మీరు పెట్టిన భోజనం చాల బరువుగా వుంది" అని నవ్వాడు అణ్ణామలై. ఆమెకూడా ప్రక్కనున్న కుర్చీలో చేరగిల బడింది.

''స్వంత ఇంటిలోకూడా మీరు అతిథులేనని ఇవాళ తెలిసింది. అటువైపు తొంగి అయినా చూడలేదే—"

తాను తొంగిచూడకపోయినా ఆమె అక్కడకువచ్చి తొంగి చూడడం అతడికి ఆనందంగా వుంది. ఆ రోజు ఆనంది అతడితో గలగలమని మామూలుకన్న ఎక్కువగా మాట్లాడింది. ... కాస్సేపయ్యాక ఉన్నట్లుండి మౌనం దాల్చింది.

''ఆ రోజు మిమ్మల్ని మీ తండ్రిగారిని కలిసివుండకపోతే ఈ అవకాశం నాకు లభించేది కాదు. రేపటినుండి చిత్రకళను నేర్చుకోవడానికని నేను కళాశాలకు వెళ్ళాలి—'' అన్నాడతడు.

''కళాశాలకు వెళ్ళినా సెలవు రోజులలో వచ్చి మా నాన్నగారి దగ్గరా నేర్చుకోవచ్చు. వారి పుస్తకాలు మీ కుపయోగపడగలవు." అంది ఆనంది.

అప్పుడా గదిలోకి మాణిక్యం వచ్చాడు. అత డప్పుడు రావడం, ఎందుకో ఊపిరి కడ్డం పడ్డట్లనిపించింది అణ్ణామలైకు. మాణిక్యం అణ్ణామలై నొకసారి చూసి, అతడికి ఆమెకు మధ్యనున్న కుర్చీలో కూర్చున్నాడు. మాణిక్యం అంటే ఆనందికి ఏవగింపు లేదుగాని అంతకుముందుదాక ఆమెలో పొంగిన ఉత్సాహం అతడి రాకతో తగ్గింది.

# 19

సెలవులు ముగిసి, చిత్రకళాశాల తెరిచారు. క్రొత్తగా చేరదలచిన యువతీ యువకులలో అణ్ణామలై కూడా వున్నాడు. ఒక్కొక్కరుగా ప్రధానోపాధ్యాయుని గదిలోకి వెళ్ళి ఆయనను కలిసి వస్తున్నారు. తనవంతు వచ్చినప్పుడు అణ్ణామలై కూడా వెళ్ళాడు లోపలికి. కదిరేశన్ ఇచ్చిన ఉత్తరాన్ని చూపాడు.

''హుం! ఆయన్ను శ్రమపెట్టి ఒక వుత్తరం రాయించి పట్టుకొచ్చినట్లున్నావు'' అని గొణుక్కుంటూ అతణ్ణి ఎగాదిగా చూశారు. తర్వాత ముఖం ముడుచుకుని "నువ్వు ఇందులో చేరాలని ఎందు కనుకుంటున్నావు— ?'' అని ప్రశ్నించారు.

"నేర్చుకోవాలని ఆశ ?" అని సాగదీశాడు అణ్ణామలై.

''ఆశ ? ... హుం ! ... చేరడానికి ముందు బాగా ఆలోచించు. ఇక్కడ ఆరేళ్ళు చదువుకోవాలి, ఆరేళ్ళు ! మధ్యలో పారిపోరాదు... హుం ! ఆరేళ్ళు చదివాక ఏమిటి ఫలితం అని అడగకు ! చిత్రాలు గీయడం నేర్చుకుని బయటికి వెళ్ళాక పొట్టపోసుకోవడానికి కిల్లీకొట్టు పెట్టుకున్నవాళ్ళున్నారు, సైకిల్ రిపేర్ దుకాణం తెరిచినవాళ్ళున్నారు. నువ్వూ అట్లా చెయ్యదలచుకుంటే ఇప్పుడే వెళ్ళి బడ్డీకొట్టు పెట్టుకో – ఆరేళ్ళు మిగులుతాయి. హుం ! ఏమంటావు ?"

ఏమి చెప్పాలో తెలియలేదు అణ్ణామలైకు.

మాట్లాడకుండా నిల్చున్నాడు. ఆయనే ఇంకా చెప్పారు !

''నీ కిందులో ఆశ వుందని తెలుస్తూంది; ఉండాల్సిందే. కాని ఆశ ఒక్కటి వుంటే చాలదు. ఆడడానికి తెలియనివాళ్ళూ, పాడడానికి తెలియనివాళ్ళూ ఆశపడి అనేకుల కళ్ళనూ, చెవులనూ నిరంతరం బాధిస్తుంటాడు. చిత్రకారుడని పేరు చెప్పుకుని చూపరుల కళ్ళను బాధించే హక్కు ఎవరికీ లేదు. ఆశలు ఆశయాలూ వుండాల్సిందే ... కదిరేశన్‌గారి ఉత్తరంతో వచ్చినందున నీకీ మాట గట్టిగా చెప్పాలి."

ఆ ఉత్తరం తీసుకురాకుండా వుండాల్సింది అనిపించింది అణ్ణామలైకు; ఏడుపు వస్తుందేమో ననిపించింది.

"నేను వేసిన బొమ్మలను తీసుకు వచ్చాను. చూస్తారా ?" అని అడిగాడు.

''ఊహు ! నేనిప్పు డా బొమ్మలను చూడను. అసలు వాటిని నువ్వే వేశావో, ఇంకెవరన్నా వేసిచ్చారో నా కెట్లా తెలుస్తుంది ?"

ఏడుపు వచ్చేసింది అణ్ణామలైకు.

"ఇక్కడి కొచ్చినవా రెవరికయినా పరీక్ష పెడతాను. దానిలో నెగ్గినవారినే నేను తీసుకుంటాను. నీలో ప్రతిభవుంటే అందులో చూపెట్టు—" అని అతన్ని పంపారు.

ఆ రోజు మధ్యాహ్నం పరీక్షలు మొదలయ్యాయి. రెండు వారాలపాటు పరీక్షలు నడుస్తాయన్నారు. ఒక గదిలో యువతీయువకులు కుర్చీలమీద కూర్చున్నారు. వారి ముందు వాలుబల్లలున్నాయి. మధ్యలో ఎత్తయిన పీఠంమీద పురాతన లోహ శిల్పం వుంది. దానిని చూసి బొమ్మ గీయమని అక్కడవున్న ఉపాధ్యాయుడు చెప్పాడు మొదలెట్టారు విద్యార్థులు.

అణ్ణామలై చూపు లా శిల్పంమీద నిలిచిపోయాయి. నిలబడివున్న పరమేశ్వరుడు అనురాగంతో పార్వతిని తన చేతి చుట్టులో పొదివి పట్టుకున్నట్లున్న అద్భుతమైన శిల్పం అది. అంతకుముం దెన్నడూ అణ్ణామలై చూసి ఎరగని అనన్యమైన కళా ఖండం. తొలిచూపులోనే అతడి మేను పులకరించింది. కొన్ని శతాబ్దాలకు ముందు ఈ అపూర్వ సౌందర్యరాశిని సృష్టించి ధన్యుడై కనులు మూసిన ఆ అజ్ఞాత శిల్పికి మనసులో నమోవాకము లర్పించాడు అణ్ణామలై.

ఆ శిల్పి ఆ శిల్పంలోనుండే మౌనంగా మాట్లాడుతున్నట్లనిపించింది అణ్ణామలై కు. అతడికి ఆ స్వరం స్పష్టంగా వినిపించింది.

'అబ్బాయీ ! జీవితంలో ఎక్కడా కనపడని స్త్రీ, పురుష సౌందర్యాలిందులో రాశిపోసి వున్నాయి చూశావు కదూ ? చూడడానికి మనుష్యుల ఆకృతులలో వున్నప్పటికీ వాటి నకళ్ళు కావు ఇవి. లోపల వెలుపల లోట్లున్నవారు మనుష్యులు. వారిలోనే పరిపూర్ణతను వెతికి వేసారే వారున్నారు. అటువంటి వారిలో ఒకడినయిన నేను సకల చరాచర సృష్టికీ తలిదండ్రులయిన వారి నూహించి రూపకల్పన చేయడానికి యత్నించాను. ఈ సృష్టిని జాగ్రత్తగా గమనించు. బాహ్య, అంతర, పరిపూర్ణతకోసం నేను పడ్డ మధుర వేదనను నువ్వు ఊహించగల్గుతున్నావా ?'

కళా దృష్టితో మొదటిసారిగా దానిని చూసిన అణ్ణామలై కళ్ళవెంబడి ఆనందాశ్రువులు రాలాయి.

ఎటువంటి కృత్రిమ అలంకారాలూలేక సహజ సౌందర్యంతో భాసిల్లుతూంది ఆ విగ్రహం. ఆ దేవతా మూర్తులకు వస్త్రాలను చెక్కిన ఆ శిల్పి నేర్పరితనం ! ఆ వస్త్రా లా మూర్తుల అవయవ సౌందర్య విన్యాణా న్నెత్తిచూపుతున్నాయి; చూపరుల మనస్సుల్లో అత్యుత్తమ భావాలనే ప్రేరేపిస్తున్నాయి.

కదిరేశన్ ఇంట్లో ఒక పుస్తకంలో చదివిన వాక్యాలు కొన్ని గుర్తుకొచ్చాయి అణ్ణామలై కు. ''లోహ విగ్రహాలను మలచడంలో తమిళ శిల్పులకు దీటు ఈ జగాన ఎవ్వరూ లేరు. అందుకనే యావత్ప్రపంచమూ ఈ అద్వితీయ శిల్పాలముందు మోకరిల్లుతూంది.''

సమయం పరుగెడుతూంది. అందరూ తమ పనిలో నిమగ్నులయివున్నారు. అణ్ణామలై మాత్రం ఈ లోకంలో లేదు.

ప్రధానాధ్యాపకు డా గదిలోకి వచ్చి అందరి నోట్ పుస్తకాలను తొంగి చూస్తూ వచ్చారు. ఆయన దగ్గరకొచ్చినా అణ్ణామలై గమనించలేదు. నెమ్మదిగా అతడి భుజంమీద చేతి నానించి అతడి నోట్ పుస్తకాన్ని తీసుకుని చూశారు. అత డొక్క గీతయినా గీచలేదు. అతడింకా పెన్సిలునే ముట్టుకోలేదని ఆయన గమ నించారు. ఆ ఖాళీ నోట్‌పుస్తకాన్ని చూపెడుతూ "నువ్వు వేసిన బొమ్మ ఇదేనా ?'' అని కోపంగా అడిగారు.

గుండె జారింది అణ్ణామలైకు. చుట్టుప్రక్కల విద్యార్థులు నవ్వు నాపుకుం టుండడం చూశాడు. ప్రధానాధ్యాపకుడు అక్కడినుండి వెళ్ళిపోయారు. ఆ రోజుకు కళాశాల మూసే వేళయింది.

ఒక విద్యార్థి వచ్చి అణ్ణామలై పుస్తకాన్ని తీసుకుని చూశాడు అందరికీ చూపించి నవ్వాడు.

''ఔను, తొందరెందుకు, ఇంకా రెండు వారాలున్నాయి కదా ?'' అన్నా డింకొకడు.

గదంతా నవ్వులతో ప్రతిధ్వనించింది.

అది విని సహించలేని బాధతో లేచి, తలవంచుకుని ఇల్లు చేరాడు అణ్ణామలై.

# 20

ఇంట్లో అతడు ఎవరితోనూ మాట్లాడలేదు. అంతకు ముందురోజు కళా శాలలో అనుభవం అతడిని బాధిస్తూంది. అసలు కళాశాలకు వెళ్ళడం మానేసి కదిరేశన్ ఇంటికివెళ్ళి నేర్చుకుంటే ? అడయారుకు వెళ్ళి ఆయనతో చెబుదామను కున్నాడు. కాని ఆ వెంటనే, అట్లా చేయడం పిరికితన మనిపించింది.

మరునాటికి కొంత విశ్వాసాన్ని పుంజుకుని, కళాశాలకు వెళ్ళి, తరగతిలోకి వెళ్ళి కూర్చున్నాడు. ఎదుటవున్న శిల్పాన్ని చేసిన అజ్ఞాత శిల్పికి మనసులోనే నమస్కారా లర్పించి పెన్సిలు చేతబట్టాడు. చేత ఉలినిపట్టి లోహానికి ప్రాణం పోశా దతడు, దానిని చూసి కాగితంమీద గీయడమేనా కష్టం ?

కాని గీయబోతే కష్టమనిపించింది. మధ్యాహ్నం భోజన విరామ సమయాని కతడు బయటికి వెళ్ళలేదు. ఆకలిని మరిచాడు. దాహం మరిచాడు. తన్ను తాను మరిచాడు. కాని పనిని మరవలేదు. మధ్యాహ్నవేళ మిగతా విద్యార్థు లందరూ

అతన్ని చూసి నవ్వుకున్నారు. సాయంకాలం ప్రధానాధ్యాపకుడు అందరి పుస్తకాలూ చూచినట్టే అతడి పుస్తకమూ చూసి వెళ్ళారు.

ఇట్లా అయిదారు రోజులు గడిచాయి. అణ్ణామలై చిత్రంలో పరమేశ్వరుడి ఆకృతి ముగియవచ్చింది. కొందరయితే ఆ సరికే రెండు చిత్రాలు గీచారు. వారి నందరినీ పరీక్షించి, తరగతుల్లోకి పంపారు ప్రధానాధ్యాపకుడు. అణ్ణామలై అందు కని తొందరపడలేదు. శిపశక్తుల బాహ్యరూపాలే కాక వారి అంతశ్చైతన్యాన్ని ప్రతిఫలింపచేయాలని అతడి తాపత్రయం. ఆ చైతన్యాన్ని తేగలిగా ననుకున్నప్పుడు రూపభంగం అయిందేమో ననిపించేది. కాని అతడు తన మొండి పట్టుదలను వదలలేదు.

రోజుకు కొంతమంది చొప్పున ప్రధానాధ్యాపకుడు విద్యార్థుల నెన్నికచేసి వేర్వేరు తరగతులకు పంపిస్తున్నారు. ఆయన ఇప్పుడు అణ్ణామలై దగ్గరకొస్తే నిముషాల తరబడి నిలిచి తదేకంగా చూడసాగారు. పదిరోజు లయేసరికి సగంమంది కళాశాలలో చేరారు. పదకొండవ రోజున అణ్ణామలై కుడిఎడమల వున్నవారినికూడా చేర్చేసుకున్నారు. వాళ్ళూ తమ చిత్రాల నింకా పూర్తిగా గీయలేదు. మరి ప్రధానాచార్యుడు తనతో మాట్లాడకుండా రోజులు గడిపేయడం కొంత అతడిని కలవర పెట్టింది. అయినా తన లక్ష్యాన్ని వదలలేదు.

పదకొండపరోజు, తరగతి మొదలవడానికి ముందుగా ఒక విద్యార్థి ఇతరులకు ఒక రహస్యాన్ని చెప్పాడు. అణ్ణామలై పక్కనవున్న వాడితో "ఆ సుబ్బయ్యది బలే అదృష్టం వాణ్ణి తిన్నగా రెండవ ఏడాది తరగతిలో చేర్చుకున్నారు." అన్నాడు.

"కారణం ?" అని అడిగాడు ఒకడు.

"వాడి చిత్రం చక్కగా వుంది. దానికి తగిన చోటునే యిచ్చారు."

"బొమ్మ బాగాలేదని ఎవరినైనా యింటికి పంపివేశారా ?" అని కలవరంతో అడిగాడు అణ్ణామలై.

"లేదు. లేదు. నీవు భయపడకు చెక్కపని, మట్టిపని, 'ఎన్‌గ్రేవింగ్' లాటి శాఖలు దేనిలోనైనా ఒకదానిలో నిన్ను యిరికిస్తారు లేవోయ్ ! బయిటికి మాత్రం పంపరు. అట్లా ఎవరిని పంపలేదు."

ఇట్లా చెప్పినవాడు అణ్ణామలై బొమ్మను చూడలేదు. అణ్ణామలై భయం

కొద్దిగా తగ్గింది. ఆ మధ్యాహ్నానికి మొత్తంమీద అతడి చిత్రం ముగింపుకు వచ్చింది.

ముగించి దానిని చూశాడు. కాస్త తృప్తిగానే వుంది.

సాయంకాలం కళాశాల మూయడానికి కాస్త ముందుగా ప్రధానోపాధ్యాయుడక్కడికి వచ్చారు. అణ్ణామలై చిత్రాన్ని చేతిలోకి తీసుకుని కొన్ని నిముషాలపాటు తదేకంగా చూశారు. అతడి చిత్రాన్ని మొదటిసారి చూసినప్పుడు ఆనంది కళ్ళలో మెరసిన వెలుగులాటిది ఆయన కళ్ళలో మెరిసింది. అణ్ణామలై గుండె వేగంగా కొట్టుకుంది.

"సరే నీవు నాతోరా!" అని అతణ్ణి వెంటబెట్టుకొని నడిచారు. మొదటి సంవత్సరపు తరగతిలో తనకు చోటు దొరకడం ఖాయం అనుకున్నాడతడు. ఆ తరగతిని దాటి నడిచారు. అణ్ణామలై మనసు ఆనందంతో పరవళ్ళు తొక్కింది. రెండవ యేడాది తరగతి వైపు నడిచారు. కాని ప్రధానాచార్యుడు దానిలోకిగూడా అడుగిడలేదు. ఉన్నట్టుండి అణ్ణామలైకు పెద్ద దిగులు పట్టుకుంది. తన్ను తిన్నగా కళాశాల వెలుపలికి పంపడానికే యిట్లా చుట్టుదారిని తీసుకు వెళ్తున్నారా?

మూడవ తరగతి గది సమీపించారు. జంకుతూ వెలుపలే ఆగిన అణ్ణామలై భుజంమీద చెయ్యివేసి వాత్సల్యంతో లోపలికి తోసుకువెళ్ళారు ఆయన. అక్కడి ఉపాధ్యాయుని చేతికి చిత్రాన్ని యిచ్చి, "ఇతడిని నేను కనుగొన్నాను; కష్టపడితే ఇతడొక కళాకారుడౌతాడు!" అన్నారు వెంటనే ఒకరితో ఒకరు పోటీపడుతూ ఆ తరగతిలోని వారంతా ఆ చిత్రం చుట్టూ, అతడి చుట్టూ, చేరారు.

"పేరు అణ్ణామలై. యికపై ఇతడు మీతోబాటు నేర్చుకుంటాడు" అని చెప్పి ప్రధానాచార్యుడు కదిలారు.

వెంటనే మేకగడ్డంవున్న ఒక బక్కపలచటి విద్యార్థి కరచాలనం చేసి "నీకు ఏకంగా ట్రిబుల్ ప్రమోషన్ లభించింది" అని పొగిడాడు.

అతనిని ఆశ్చర్యంతో చూస్తున్న ముఖాలలో ఒకటి ఇదివరకే అతడికి పరిచితమైనది. ఎప్పుడో ఒకటి రెండుసార్లు ఆనంది యింట్లో కలిసిన శారద ముఖం అది. ఆమె అతణ్ణిచూసి, "ఓ! మీరు మా తరగతికే వచ్చారే? అభినందనలు!" అని వుత్సాహంతో స్వాగతం చెప్పింది. క్రొత్త తరగతిలో తెలిసినవారొక్కరైనా వుండటం అతడికి, హాయి అనిపించింది

ఇంతా సేపటికి కళాశాల ముగిసింది. అణ్ణామలై బస్‌స్టాప్ వైపు నడవ సాగాడు. అతడి వెనకాలే పరుగెత్తుకొచ్చింది శారద.

"మా అడయారు బస్‌లోనే మైలాపూర్ వెళుదురుగానీ, రండి!" అంది శారద. మైలాపూర్‌కు ప్రత్యేకంగా బస్ వున్నప్పటికి ఆమె మాటను కాదనలేక పొయ్యాడు అణ్ణామలై.

బస్ కోసం నిలుచొని వుండగా శారద చెప్పింది.

"మీరు యిక్కడ చేరనున్నారని ఆనంది చెప్పినందున, నేను మొదటి రోజే మిమ్మల్ని గమనించాను. కళాశాలలో చేరాక పలకరిద్దామని అనుకున్నాను. మీరేమో రెండే బొమ్మలు గీసి రెండేళ్ళు గంతేశారు! ఇది వింటే ఆనందీ వాళ్ళ నాన్న ఎంత సంతోష పడతారో తెలుసా?"

కృతజ్ఞతతో కదిరేశన్‌ను గురించి అనుకుంటూ అణ్ణామలై "నేను యింటి నుండి అక్కడికే వెళ్ళి నా కృతజ్ఞతను తెలుపుకోవాలి" అన్నాడు.

"మీకన్నా ముందే శుభవార్త వారికి అందుతుంది." అని నవ్వింది శారద. "ముందు నేను ఆనందిని చూసి కబురు చెప్పాకగాని యింటికి వెళ్ళను."

శారద వాత్సల్యం నిండిన మాటకారి అనిపించింది. గలగలమని మాటలు. కుతూహలం నిండిన చూపు, స్వరం, నడక, స్వభావం, అమాయకత్వం నిండిన పెద్ద కళ్ళు. ఆమె బట్టలు వారి కుటుంబం అంత ఐశ్వర్యవంతం కాదని చెప్పాయి. ఐతేనేమి అందమైన మొహం. చామనచాయ. సన్నగా ఓ మోస్తరు పొడవుగా వుంది. కాటుక దిద్దకుండానే కాటుక వుందనిపించే కన్నులు.

"పెద్దాయన వున్నాడే మహా అసాధ్యుడు! ఆయన ఏమనుకుంటున్నాడో, ఏమంటున్నాడో ఎవరికీ అర్థంకాదు. కానీ వారి వారి ప్రతిభా వ్యుత్పత్తుల నిట్టే పసిగట్టేయగలడు. మీకు లభించిన అవకాశం వంటిది యింకెవరికీ లభించదు! నా కిది మూడవ సంవత్సరం అంటే ఆలోచించండి. తెలుస్తుంది!"

అడయారు బస్ వచ్చింది. ఇరువురూ ఎక్కారు. వేర్వేరుగా కూర్చున్నారు. వేరువేరుగా టికెట్లు కొనుక్కున్నారు. బస్సు బయలుదేరింది.

# 21

చిత్రకళాశాలే అణ్ణామలైకి ఏకైక లోకమయింది. ఒకప్పుడు కదిరేశన్ ఇంటికి వెళ్ళడానికి ఎంత ఆసక్తి చూపేవాడో అంత ఆసక్తినీ ఇప్పుడు కళాశాలకు వెళ్ళడంలో చూపుతున్నాడు. కళాశాలలోని తోట, వాతావరణం బోధనా పద్ధతి అతడికి చాల నచ్చాయి. మొదట అతడినిచూసి పరిహసించిన విద్యార్థులే అతడి ప్రతిభా విశేషాలను గమనించి గౌరవించసాగారు. తరగతిలో వాతావరణం కల్పనకు ప్రోత్సాహమిచ్చేదిగా వుంది.

చిదంబర మేస్త్రికి కొడుకంటే క్రొత్తగర్వం ఏర్పడింది. పనికిమాలిన వాడనుకున్నవాడు తనకూ ఒక ప్రతిభ వుందని ఋజువు చేశాడుకదా ? ఉత్సాహం, గర్వం అందే మేస్త్రి విషయంలో మాటలతో కాదు - కార్యరూపం దాల్చాలి కదా, తన కొడు కింతటివాడని అందరూ అనుకోవాలి కదా... !

"అణ్ణామలై తాను అనుకున్నదానిని సాధించాడు. ఇంక మనమూ అను కున్నట్లు చేయాలి—" అన్నారు మేస్త్రి మాణిక్యంతో.

"ఏమిటది ?" అన్నాడు మాణిక్యం.

"కదిరేశన్ నివేశనంలో వారికొక ఇల్లూ మనకొక ఇల్లూ కట్టాలి. ఈ పని మొదలెట్టడంతోనే మన స్వంత కంపెనీ ప్రారంభించాలి. కదిరేశన్ ఇంటి నిర్మాణంలో మనకు లాభం వద్దు. కాని ఆ పనిలో మంచిపేరు తెచ్చుకుంటే, తర్వాత ఆ పేరును డబ్బుగా చేసుకోవచ్చు మన యజమానితో చెప్పి మనం వేరుపడదాం. ఏమంటావు ?"

మాణిక్యాని కది మంచి అవకాశంగా తోచింది. తన సాయం లేనిదే మేస్త్రి వ్యాపారం చేయలేరు. వృత్తి జ్ఞానమేకాక, చదువూ తన దగ్గరుంది. మొదట కట్టనున్నది ఆనంది ఇల్లు. తన పనితనాన్ని ఆనందికీ కదిరేశన్‌కూ చూపెట్ట వచ్చును. అంచేత అతడు సంతోషంతో అంగీకరించాడు.

"అయితే నేను డబ్బు ఏర్పాట్లు చేస్తాను." అన్నారు మేస్త్రి.

మరు రోజే ఆ ప్రయత్నం మొదలెట్టారు. మైలాపూర్ లజ్ కార్నర్ వద్ద వున్న బట్టలకొట్టు యజమాని సింధీవాడితో సంప్రతింపులు జరిపారు. అతగాడికి

కొట్టుదగ్గరగా ఇల్లు కావాలి. మునుపే ఆ మాట మేస్త్రీతో చెప్పివుంచాడు పాపానీ అన్న ఆ సింధీ.

"పాపానీగారూ ! మంచి ఇల్లొకటి వుంది. వచ్చి చూడండి. మీకు నచ్చితే వెల మాట్లాడుకుందాం" అని మేస్త్రీ ఆ ఇంటిని గురించి వివరించారు.

"కొంటే వెంటనే కాపురం వుండవచ్చునా ?"

"వెంటనే వీలుకాదు. ఆ ఇల్లు అమ్మగా వచ్చిన డబ్బుతో ఆయన అడయారులో ఇల్లు కట్టుకుంటారు. స్వంతఇల్లు పూర్తవగానే వారందులోకి వెళితే మీ ఇల్లు మీదవుతుంది. అందాక అద్దె ఇస్తుంటారు. ఇష్టముంటే వచ్చి చూడండి."

పాపానీ ఒప్పుకున్నారు. అతడిని తీసుకొని తమ ఇంటికే వచ్చారు మేస్త్రీ. ఇల్లు తోట చూపించారు. మీనాక్షమ్మ కేమీ అర్థంకాలేదు. ఇంటి వివరాలన్నీ మేస్త్రీ చెప్పారు ! పాపానీకి ఇల్లు నచ్చింది. వెల అడిగాడు.

"ఇల్లు నాదే ! వెల యాభై వేలు !" అన్నారు మేస్త్రీ.

"హరేరాం ! వెల చాల ఎక్కువే !" అని మొదట అన్నా, దేశ విభజన కాలంలో సర్వస్వాన్నీ పాకిస్తాన్‌లో వదిలేసి ప్రాణాలతో పారిపోయి వచ్చిన ఆ సింధీ డబ్బుకన్న విలువైనవి చాల వున్నాయని తెలిసిన వాడవడంచేత చివరకు "వెల ఎక్కువేగాని ఒప్పుకుంటున్నాను." అన్నాడు. "నేను ఎందుకు ఇక్కడ కాపురం పెట్టాలను కుంటున్నానో తెలుసా ?" అని అడిగాడు మేస్త్రీని.

"దుకాణం దగ్గర ఇల్లుంటే వసతిగా వుంటుందని మీ వుద్దేశం" అన్నారు మేస్త్రీ అది ఎరిగే ఆయన ఇంటి ధరను కాస్త ఎక్కువే చెప్పారు.

"అదీ ఒక కారణమే. ఇంకొకటి వుంది. నేను కేవలం సింధీవాడిని కాదు. తమిళులు నివసించే పేటలో వారిలో ఒకడుగా నివసించి వారి సుఖదుఃఖాలలో భాగం పంచుకోవాలని ఆశిస్తున్నాను." అన్నాడు పాపానీ.

ఇతడు కేవలం ధనాశ గలవాడు కాదు అని తెలిసింది మేస్త్రీకి. పైపెచ్చు తాను చెప్పిన ధరకు అతడు అంగీకరించడం కూడా మేస్త్రీకి నచ్చింది.

"నేను దక్షిణాన ఒక గ్రామంనుండి పొట్ట చేతబట్టుకుని ఈ పట్నానికి వచ్చాను. మీరూ అలాగే ఉత్తరాదినుండి వచ్చారు. ఉన్నంతకాలం అన్నదమ్ముల్లా వుండిపోదాం—" అన్నారు మేస్త్రీ.

ఆ సౌభ్రాతృత్వం ఇక్కడి మట్టిలోనే వుంది - అనుకున్నాడు పాపాసీ.

# 22

అణ్ణామలై తరగతి వారికి మనుష్యుల్ని 'మాడల్'గా వుంచుకుని బొమ్మలు గీచే శిక్షణ ప్రారంభం అవనున్నది. విద్యార్థులు మొదటి రెండేళ్ళలోను దానిని గురించి విన్నారే తప్ప, వారికా శిక్షణ మూడవ ఏడే వుంటుంది. కాని వారి కది వింతగాగాని క్రొత్తగాగాని అన్పించలేదు. కాని తిన్నగా మూడవ ఏట తరగతిలో కొచ్చిన అణ్ణామలై కది క్రొత్తగానే అన్పించింది.

ఆ శిక్షణ సమయంలో తరగతి గది తలుపులు గడియ పెట్టారు. 'మాడల్' విశ్రాంతి తీసుకోవడానికి బట్టలు మార్చుకోవడానికి ఒక మూల తడికల గది నిర్మించారు.

ఆ క్షణం వచ్చింది. తడికల చాటునుండి సిగ్గుభారంతో వంగిన తలతో వేదిక దగ్గరగా వచ్చి నిలిచిం దొక యువతి. ఉపాధ్యాయుడు ఆమె ఎట్లా, ఏ కోణంలో నిల్చోవాలో ఆమెకు వివరించారు. ఆమె ఇదివరకే మాడల్‌గా పనిచేసిన వ్యక్తి కావడంవలన తక్షణమే కావలసిన విధంలో కొద్దిగా ప్రక్కకు తిరిగి నిల్చుంది. చిన్న పూగుత్తి ఆమె శరీరానికెట్టి ఆచ్ఛాదన నివ్వలేక ఆమె చేతిలో వణికింది.

ఆమె ఎవరినీ తలెత్తి చూడలేదు. ఆమె మనస్సునే తన ప్రపంచంలోకి లీనమవడానికి యత్నిస్తూంది. లజ్జతో ఆమె ముఖం ఎర్రబడడం అణ్ణామలై గుర్తించాడు. అట్లాంటి దృశ్యాన్ని మొట్టమొదటిసారిగా చూసిన అణ్ణామలై మేను గగుర్పొడిచింది. అత డెప్పుడో ఒక పుస్తకంలో చదివిన స్త్రీ పాత్ర ఒకటి గుర్తు కొచ్చింది. మరుక్షణం ఆమె అతడి కళ్ళకో నల్లరాతి శిల్పంవలె కనుపించింది. బ్రహ్మ అనే శిల్పి సృష్టించిన సజీవ శిల్పం ఆమె !

పల్లె పడుచులా వుంది ఆమె. ఆమె బాహ్య సౌందర్యాన్ని అధిగమించి అంతరాంతరాల నూహించాడు అణ్ణామలై. సిగ్గు, లజ్జ, భయంవంటి పదాలు ఎన్నో విన్నాడుతను; నేడు ఈమె శరీరం ఆ పదాలకు క్రొత్త అర్థాలు చెబుతూంది.

ప్రక్కనున్న మిత్రుడు అణ్ణామలై చెవిలో ఏదో ఊదాడు. అది విన్న అణ్ణామలై కళ్ళ నీళ్ళు వచ్చాయి. ఆ 'మాడల్' వనిత భర్తకు పక్షవాతమట. అతడిని కాపాడుకోవడాని కామె ఇట్లా పనిచేస్తున్నదట. అందరివలె తిండితిని, బట్టలుకట్టి, భర్తతో కులాసాగా తిరుగుతూ బ్రతకవలసిన వనిత ఆ విధంగా కనుల ఎదుట వున్నప్పటికీ అతడి ఆలోచనలు ఉత్తమంగానే వున్నాయి. ఆ తరగతిలో ఇంచుమించు అందరూ అంతే.

ఆ శిలా విగ్రహంలాంటి స్త్రీమూర్తిని కళ్ళతో చూస్తున్నారు, కాగితంమీద గీస్తున్నారు. ఎవరున్న చోటినిబట్టి అక్కడినుండి ఆమె కనబడిన కోణాని బట్టి గీస్తున్నారు. అవసరమైతే ఇంకొక చోటికి వెళ్ళి అక్కడినుండి చూసి వేస్తున్నారు.

ఆమెకు కొంతసేపు విశ్రాంతి నిచ్చారు. ఆ సమయంలో ఉపాధ్యాయుడు అంతవరకు గీచిన బొమ్మలను చూడసాగాడు. విద్యార్థులూ ఒండొరుల చిత్రాలను చూడసాగారు. శారద తను వేసిన బొమ్మను అణ్ణామలై కిచ్చి, అతడు వేసిన దానిని తాను తీసుకుని చూచింది. ఆమె వేసిన చిత్రం అచ్చం ఫోటోవలె వుంది. ఆమె అడిగింది ''ఆమె సిగ్గును, వేదనను ఎట్లా తీసుకురాగలిగారు."

"ఆమె అంతరంగాన్ని చిత్రించడమే కష్టమనిపించింది. నేననుకున్నంత బాగా రాలేదీ చిత్రం." అన్నాడు అణ్ణామలై.

''నిజమైన కళాకారుడి లక్షణం ఆ అసంతృప్తి" అని నవ్వింది శారద.

ఇంకొక విద్యార్థి రాజశేఖరన్ శారదనుండి ఆ చిత్రాన్ని తీసుకుని చూసి పెదవి విరిచాడు ''ఫోటోలోవున్న ఈ 'రియలిజమ్' నాకు నచ్చదు. 'సింబాలిజమూ' 'అబ్‌స్ట్రాక్ట్' అర్టూ బాగుంటాయి." అన్నాడు. అతడు వేసిన బొమ్మ అతడి మాటల కనుగుణంగా నవనాగరికంగా వుంది. రాతియుగపు మనిషి ఎట్లా ఆడదాని అవయవాలను విశేషించి చిత్రించాడో అట్లా వుంది. ఆ స్త్రీనిచూసి ఈ విధంగా ఒక దూహించ గల్గడం అణ్ణామలైకు ఆశ్చర్యంగా వుంది.

''నాకు దీని భావం తెలియడంలేదు. తెలుసుకో యత్నిస్తున్నాను." అన్నాడణ్ణామలై.

''చూడగానే అర్థమయితే అది కళ ఎట్లా అవుతుంది?" అన్నాడు రాజశేఖరన్.

అణ్ణామలై తన అజ్ఞానానికి నొచ్చుకున్నాడు. 'ఇదే క్రొత్త పద్ధతి' అని రాజశేఖ రనడం విని శారద నవ్వింది. అణ్ణామలై నవ్వలేదు. 'లోకోభిన్న రుచిః' అని ఆత డెరుగును విద్యార్థుల ఊహలపై కల్పనలపై ఎట్టి ఆంక్షలూ లేవుగనుక ఎవరిచిత్రం వచ్చినట్లు వారు గీచారు.

విరామం ముగిసింది. తరగతి మళ్ళీ మొదలయింది.

రోజులు గడిచాయి. స్త్రీలవలె పురుషులూ 'మాడల్స్'గా వచ్చారు; వెళ్ళారు. వారిని చూసి చిత్రాలు గీచే అనుభవం అతడికి ఎన్నో విషయాలను నేర్పింది. అతడు మనసున ఎన్నో ఆకారాలను నిల్పింది.

అణ్ణామలై కొక కొత్త సమస్య వచ్చిపడింది. అణ్ణామలై తన వస్తువుల నెన్నడూ దాచేవాడు కాదు. తన గదిలో పడేసి వుంచేవాడు. వాటిని ఎవరూ ముట్టుకునేవారు కారు.

ఒకసారి అతడి నోట్ పుస్తకాన్ని తిరగేసి చూసిన సుందరి ''ఏమిటీ ఘోరం ?" అని కళ్ళు తిప్పుతూ అడిగింది. అందులో ఘోరమేమి కనిపించని అణ్ణామలై నవ్వాడు.

చిత్రాల నొకదాని తర్వాత ఒకటిగా చూస్తూ ఆమె ''ఛీ, ఛీ ! పాడు ! అబ్బ ఘోరం ! ఛీ" అని ఎగిరింది. ఒక్క చిత్రాన్ని చూపించి —" ఏమిటి ఈ అన్యాయం ? ఎక్కడిది మీకా ధైర్యం ? ఇట్లాంటివి రాయడానికి సిగ్గనిపించలేదూ ?" అని కోప్పడింది.

''చూడు సుందరీ ! ఇది తరగతిలో పాఠం. ప్రత్యక్షంగా చూసి రాస్తే అలవాటవుతుంది.

"ఏమిటీ ? తిన్నగా చూసి రాశారా ? ఈ స్థితిలోనా ?"

"ఔను తప్పేమిటి ?"

ఆమె అతడిని సవాలక్ష ప్రశ్నలువేసి, తొలిచి, అన్నీ తెలుసుకుని చివరకు "ఇట్లాగని తెలిస్తే మిమ్మల్ని అక్కడికి పంపవద్దని మొదటే మామయ్యతో చెప్పి వుండేదానినే !" అంది.

అనవసరంగా నిజంచెప్పి గోతిలో పడ్డామే అనిపించింది అణ్ణామలైకు. అంత దగ్గరగావున్న ఆమెను చూచిన అతడిలోని కళాకారుడికి ఆమె చక్కటి

'మాడల్'గా కనుపించింది. వయసుకుమించి పెరిగిన ఆమె యవ్వనపు సౌష్ఠవాలు- "ఈమె నొక్కసారి చిత్రంగా గీస్తే?" అని ఆలోచించేటట్లు చేసింది.

# 23

ఆరయారులో పాత ఇంటిని పడగొట్టి క్రొత్తదానిని కట్టడానికి ఏర్పాట్లు మొదలయ్యాయి. మేస్త్రీగారూ మాణిక్యం పొద్దుటినుండి రాత్రిదాక అక్కడేవుండి పనులు చేయించసాగారు.

పాత ఇంటిని పడగొట్టాక కదిరేశన్ వుండడానికని వారికొక కుటీరంలాటి దానిని నిర్మించారు మేస్త్రీ. కదిరేశన్ సంసారం ఆ కుటీరంలోకి మారడానికి మాణిక్యం అహోరాత్రులు శ్రమించాడు. అన్నిపనులు పూనుకుని తానే చేశాడు. అతడి దీక్ష ఉత్సాహం, నేర్పరితనం - కదిరేశన్‌ను మాత్రమేకాదు, ఆనందినీ ఆశ్చర్యపరచింది.

పొద్దున కాలేజికి వెళ్ళి సాయంకాలం ఆమె వెనక్కు వచ్చేసరికి ఎన్నో మార్పులు! పనివాళ్ళలో పనివాడుగా బొంగరంలా తిరుగుతూ మాణిక్యం కన్పించే వాడు. ఆ తోటలోని చెట్లు మొక్కలు ఆనందికి ప్రాణసమానం అని తెలుసు కున్నాడు మాణిక్యం. ఆమెకు ప్రతి దినమూ సాయంకాలం వాటి యోగక్షేమాలు కనుక్కోవడం ఒక పని. అందుకని అలా తిరిగివచ్చేది.

అప్పుడప్పుడు పర్యవేక్షిస్తుండడం, అవసరమయితే ఏదయినా సలహాలు ఇవ్వడం - ఇవీ మేస్త్రీగారి పనులు. అన్నిపనులూ మాణిక్యమే చేస్తున్నందున ఆయనకు విశ్రాంతి లభించింది. కదిరేశన్ తాత్కాలికంగా, చిత్రరచన మాని మేస్త్రీగారి ఆర్థిక సంబంధమైన ఉపన్యాసాలను వినసాగారు. "ధనమే ప్రత్యక్ష దైవము; అది లేనివాడు శవము. కాసున్నవాడి చుట్టూనే అందరూ చేరుతారు. వాడెంత మూర్ఖుడయినా వాడిమాటే వేదంగా చెల్లుతుంది. వాడికి దొరకని వస్తు వుండదు సాధించలేని పనివుండదు. కనుక మనం మన పిల్లలకు డబ్బు ఇతోధి కంగా సంపాదించడం నేర్పాలి—" ఈ ధోరణిలో సాగే మేస్త్రీగారి ఉద్బోధలను విని విని కదిరేశన్ దృక్పథమే కొంత మారసాగింది.

ఒకసారి కదిరేశన్ అన్నారు - "మీ సాహచర్యంవల్ల మాణిక్యమూ కార్య కూరు దవుతున్నాడు. వయసులో చిన్న అయినా పనిలో దిట్ట."

"నా స్వంత కొడుకు కెందుకూ పనికిరానివాడు; వాడిమీద నాకు నమ్మకం లేదు. కాని మాణిక్యం పనిలో దిట్ట; డబ్బు విషయంలో నేర్పరి. ఇంక కొన్నేళ్ళలో అతడు ఈ పట్టణంలో సగాన్ని కొనగలడు. ఈపాటికే ఏ రెండు మూడు వేలో వెనక వేసి వుంటాడు."

ఇది విని కదిరేశన్ ముక్కుమీద వేల వేసుకున్నారు. మాణిక్యం వయసులో తాను ఇంటినుండి రెండు మూడు వేలు తీసుకొని ఖర్చుపెట్టేవాడు. అందుకు, ఇది విన్నాక అయనకు మాణిక్యంపట్ల ప్రత్యేకమయిన ఆదరణ ఏర్పడింది.

ఆనందికి కూడా తరుచుగా మాణిక్యంతోబాటు మెలగవలసిన సందర్భాలు వుంటూ వచ్చాయి. అయినప్పటికీ ఆమె కొంత 'దూరా'న్ని పాటిస్తుండేది. మాణిక్యం తనకు సన్నిహితం కావాలని కోరడం ఆమెకు తెలియనిదికాదు. మాణిక్యానికి ఆమె అందే కొంత బెరుకు వుండేది. ఆమె ఎంత నవ్వుతూ మాట్లాడినా ఆమెతో చనువుగా వుండలేక పోయేవా డతడు. పాత క్రొత్త సంప్రదాయాల కలయిక ఆనంది.

అణ్ణామలై అప్పుడప్పుడూ, ముఖ్యంగా ఆదివారాలు వచ్చిపోతుండేవాడు. కదిరేశన్‌కూ ఆనందికీ తను గీచిన బొమ్మలను చూపిస్తుండేవాడు. సందేహాలుంటే అయన్నడిగేవాడు. ఆనందితో కలిసి తోటలో తిరిగేవాడు; జరుగుతున్న పనులను చూసేవాడు. ఆనంది అతడితో చాల సన్నిహితంగా మెలగేది. అతడు వారంలో ఒక్కసారో రెండుసార్లో వచ్చేవాడు గనుక అత డొచ్చేసరికి ఆమె అతడికని బోలె డన్ని కబుర్లు సేకరించి వుంచేది.

అణ్ణామలై అక్కడికి వచ్చినప్పుడు వాళ్ళిద్దరికి దూరంగా వుండేవాడు మాణిక్యం. దూరంనుండే వాళ్ళిద్దరి ధోరణిని గమనించాలనీ, ఒకవేళ వాళ్ళకు అంతరాయం కలిగిస్తే ఆనందికి కోపం కల్గించినవాడి నవుతానేమోననీ అత డట్లా వుండేవాడు. అంతేగాని అణ్ణామలై గురించి అత డాలోచించలేదు. అతడి దృష్టిలో అణ్ణామలై పసివాడు; ఆనందిని చూసి చిత్రాలు గీయించాలని మోజు పడుతున్న వాడు; అంతేతప్ప అతడికి మరో భావం ఏమీ వుండబోదు - అని మాణిక్యం అను

కునేవాడు. అయినా అతడికి లోలోపల చెప్పరాని బాధలాంటి దేదో మూలుగుతూ వుండేది.

ఒకరోజు మధ్యాహ్నం అజ్జామలై పెట్టి, పడకలతో అడయారుకు వచ్చి చేరాడు. ఆ సాయంకాలం అతడు తన కళాశాల సహ విద్యార్థులతోబాటు మహాబలిపురం బయలుదేరి వెళ్ళాలి. అక్కడ నాలుగయిదు రోజులుండి చిత్రాలు గీయాలని ఈ కార్యక్రమం పెట్టారు.

మహాబలిపురానికి వెళ్ళడానికి పడవరేవు అడయారు పక్కనే వుంది. ఆ రోజు పౌర్ణమి. రాత్రి బయలుదేరితే సరదాగా వెన్నెలలో రాత్రంతా ప్రయాణంచేసి ఉదయాన్నే మహాబలిపురం చేరుతారు. కాలవనిండా నీరున్న కాలం అది.

ఆనందితో - "మీరూ మాతోబాటు మహాబలిపురం వస్తే నాకు ఎంతో ఆనందంగా వుంటుంది." అన్నాడు ఒళ్ళు తెలియని ఉత్సాహంతో అజ్జామలై.

"నిజంగానా !" అని పరవశంతో విప్పారిన తన కళ్ళతో అతన్ని చూసింది ఆనంది. "మీతోబాటు మహాబలిపురం రాలేకపోయినా, మీకు వీడ్కోలు చెప్పడానికి రేవుదాక వస్తాను." అంది. అదే పదివేలనిపించింది అతడికి.

కాస్సేపటికి శారద వచ్చింది. పనులన్నీ ముగించుకుని మాణిక్యమూ వచ్చాడు. పెద్దలిద్దరూ పర్ణశాలలో వున్నారు. రేవుదాక వెళ్తానని తండ్రితో చెప్పి, తోడుగా వేలయ్యను తీసుకు బయలుదేరింది ఆనంది. తానూ వస్తానని మాణిక్యం బయలుదేరాడు. శారద పెట్టె పడకలను వేలయ్య తీసుకొస్తున్నాడు. అజ్జామలై నుండి అతడి పెట్టె పడకలను మాణిక్యం లాక్కున్నాడు. గలగలమని మాట్లాడుతూ వాళ్ళు నడవసాగారు. దారి కొకవైపు చెట్లు నిల్చున్నాయి; ఇంకొక వైపున విశాలమైన ఖాళీస్థలం పరచుకుని వుంది.

అపాటికే రేవుదగ్గర కొందరు విద్యార్థీ విద్యార్థినులు చేరి గలగలమని మాట్లాడుకుంటున్నారు. రాటలకు కట్టివున్న పడవల్లోకి తమ సామాన్లను చేరవేస్తున్నారు.

పడవ సరంగులు ఉత్సాహంగా వున్నారు. మహాబలిపురానికి రోడ్డు వెంబడి వెళ్ళడానికి వీలున్నా, నిదానంగా వెన్నెల రాత్రంతా ఉల్లాసంగా యాత్రచేసి అక్కడికి వెళ్ళడానికి చాలమంది ఇష్టపడేవారు. అందుకనే ఈ పడవలలో

పయనించేవారు. చిత్రకళాశాల బృందమూ ఆ కారణంచేతనే కాలవమార్గం వెంబడి వెళదామని అనుకున్నారు. వారందరి ఉత్సాహం చూసిన ఆనందికి - తానూ వాళ్ళతోబాటు వెళ్తేబాగుండు ననిపించింది. ఆ కోర్కె నణచిపెట్టుకుని, శారదతో- "ఆయనను జాగ్రత్తగా చూసుకో !" అని చెప్పింది.

పడవల తాళ్ళను విప్పివేశారు; తెరచాపల నెత్తారు. గాలివాటంకూడా అనుకూలంగా వుంది. 'హైలేసా' అంటూ గొంతెత్తి పదంపాడుతూ తెడ్డు వేయసాగారు సరంగులు.

పున్నమి వెన్నెలలో, నీటిని చీల్చుకుంటూ వెళ్తున్న అణ్ణామలై పడవను, కనుమరుగయేదాక చూస్తూ నిల్చుంది ఆనంది.

# 24

అణ్ణామలైను సాగనంపి ఆనంది, మాణిక్యమూ వెనక్కు వస్తున్నారు. వారికి కాస్త ముందుగా వేలయ్య నడుస్తున్నాడు. చెట్ల సందులగుండా జారిన వెన్నెల దారిమీద పడుతూంది. అణ్ణామలైతోపాటు తన మనసును పంపివేసిన ఆనంది మౌనంగా నడుస్తూంది. "మీరూ నాతోబాటు మహాబలిపురం వస్తే ఎంత ఆనందంగా వుంటుంది !" - అన్న అణ్ణామలై చెప్పినది ఆమె చెవుల్లో గింగురుమంటూంది.

నింగిని వెన్నెల, నీటిమీద పడవ, పడవ సరంగుల పాట, ఆ పడవమీద అణ్ణామలై సాన్నిధ్యం......ఎంత ఆనందకరమైన అనుభవం! — నిట్టూర్చింది ఆనంది.

ఆమె మౌనం సహించలేని మాణిక్యానికి ఆ మౌనానికి కారణం తెలియక పోలేదు. ఆమె ఆలోచనల కంతరాయం కల్గించే ధైర్యం అతడికి లేదు. ఆమెను పరిశీలించినకొద్దీ, కనీసం మరికొంత కాలందాకయినా ఆమెతో చాల జాగ్రత్తగా మెలగాలి అన్పించింది.

మాట్లాడడాని కతడికో చక్కటి విషయం లభించింది.

"నా తమ్ముడు అణ్ణామలై అన్నివిధాలా అదృష్టవంతుడే; వాడి అదృష్టం గురించి తలచుకుంటే నా కెంతో సంతోషంగా వుంటుంది."

ఆత్రతతో తలతిప్పి చూసింది ఆనంది.

"పుట్టుక, పెంపకం, చదువు, సౌకర్యాలు - అన్నిటిలోనూ వాడు భాగ్యశాలే. మా అందరికీ గారాబుపట్టి ఇప్పుడు మీ తండ్రిగారికి - ఆమాటకొస్తే మీకూను - చాల కావలసిన వాడయ్యాడు—"

"జన్మతః కళాకారు లాయన, అందుకనే వారంటే మా కింత అభిమానం" అంది ఆనంది గర్వంతో. "ఆయన అదృష్టం మీ అదృష్టం కాదూ? నిజానికి మేస్త్రిగారు ఆయనకన్న మిమ్మల్నే ఎక్కువగా ముద్దుల కొడుకువలె చూడడం లేదూ?"

" 'వలె' చూడడం వేరుకదా! 'వలె' వాడు 'వెలి' వాడేకదా?" అని తన దుస్థితికి నొచ్చుకుంటున్నట్లు విచారంగా నవ్వాడు మాణిక్యం. "నేను స్వంత కొడుకు నయివుంటే ఇప్పటికి ఇంజనీరయివుండేవాడిని. కాని నేను అనాథను. నాకు డబ్బులేదు; నా అన్నవారు లేరు; సుఖంలేదు. మేస్త్రిగారు దయతో చూసినంత కాలం నాకు ఫరవాలేదు. కాని వారు వదిలివేస్తే నాకూ మా అమ్మకూ వీధే శరణ్యం."

చకితురాలయింది ఆనంది. అతడి ఆందోళన ఆమెను కలచివేసింది. ఆనాడు అణ్ణామలైను వెతుక్కుంటూ సముద్ర తీరానికి వచ్చిన మాణిక్యం కాడితడు. ఆ రోజు అతడు తన్ను చూసిన పద్ధతి, మాట్లాడిన తీరు ఆమెకు బొత్తిగా నచ్చలేదు కాని రోజులు గడిచినకొద్దీ అణ్ణామలైపట్ల ఆమెకున్న అభిమానం కారణంగా మాణిక్యంపట్ల ఆమె అభిప్రాయం మారసాగింది. గురుతరమైన బాధ్యతల నతడు నెత్తిన వేసుకుని అహోరాత్రాలు పనిచేస్తుండడం చూశాక ఆమెకు ఆశ్చర్యం వేసింది. ఇప్పుడు నిజంగా జాలివేసింది.

"మీదంతా అనవసరమైన బెంగ—" అని అతడిని ఊరడించింది ఆమె. "మీకేమిటి, మగవారు, చదువురాని మేస్త్రి పట్నానికొచ్చి సుఖంగా జీవిస్తున్నారు అంటే మీచేత ఎందుకు కాదు? మేస్త్రి మిమ్మల్ని చదివించారు; వృత్తి నేర్పించారు; మీరు దక్షత గలవారు. మీ కొచ్చిన లోటేమిటి? అనవసరంగా దిగులు పడకండి."

అడయారు దగ్గరకొస్తున్నకొద్దీ వాళ్ళిద్దరి మధ్యవున్న దూరం తక్కువ కాసాగింది. ఇది ఆనంది గమనించలేదు; గమనించినా లక్ష్యపెట్టలేదు. కాని మాణిక్యం తెలియనట్లే నడుస్తున్నాడు. కాని ఆ సామీప్యం అతడికి సంకోచంగాను సంతోషంగాను వుంది.

ఉన్నట్లుండి ఏదో గుర్తుకొచ్చిన వాడిలా - ''మీ నాన్నగారివద్ద చిత్రకళ నభ్యసించడానికి అణ్ణామలైకు వాళ్ళ నాన్నగారు ఎట్లా అనుమతిచ్చారో, ఆ రహస్యం మీకు తెలుసునా ?'' అని అడిగాడు.

"ఎలా అనుమతించారు ?''

''అదీ ఒక అదృష్టమే !''

ఆ రహస్యం తెలుసుకోవాలన్న తహతహతో ఆమె అతడివైపు చూసింది.

''మొదట్లో మేస్త్రీగారు వీలులేదు అని గట్టిగా చెప్పేశారు కాని అణ్ణామలై మామగారూ, వారి అమ్మాయీ కలిసి పట్టుబట్టి అతడికి అనుమతిప్పించారు—''

ఊపిరి ఆగిపోయినట్లయింది ఆనందికి. వెలవెలబోయి అట్లాగే నిలబడి పోయింది. ఆమె పరిస్థితిని గ్రహించిన మాణిక్యం ఆమెను ఇంకా ఇంకా కదిలించి వేసే వార్తలను చెప్పసాగాడు.

"అయితే మీ కివేమీ తెలియవన్నమాట ! అణ్ణామలై ముందు దండపాణిగారూ, వారి అమ్మాయి సుందరీ అతడి తరపున మేస్త్రీగారితో వాదించారు. సుందరిని మీరు చూడలేదేమిటి ? అప్పుడప్పుడు అణ్ణామలై కోసం మా ఇంటికి సైకిలుమీద వస్తుంటుందిలెండి ! అతడికోసమనే పెరుగుతున్న పిల్ల ! ఇందులోనూ తమ్ముడు అదృష్టవంతుడే... బాగా భాగ్యవంతులు వాళ్ళు !"

ఇదంతా విన్నాక ఆనంది ఒక్క అడుగుకూడా ముందుకు వేయలేక పోయింది. తన మనోభావాలను మాణిక్యం ఎదట వెలిబుచ్చరాదని ఆమె చేసిన యత్నమంతా విఫలమయింది. వరుసగా వాడి బాణాలు వచ్చి ఎదలో గుచ్చుకున్న పావురం విలవిల లాడకుండా ఎలా వుంటుంది ?

## 25

విశాలమైన సముద్రము, నీలాలనింగి, సరుగుడు తోపులు, ఇసుక, గుట్టలు, రాళ్ళు, వాటినిండా కళ్లుచెదిరే శిల్పాలు - ఈ మహాబలిపురం వాతావరణం చిత్ర కళాశాల విద్యార్థులను ఆనందాతిశయంతో మూసివేసింది. చెన్నపట్నపు ఇరుకులో నుండి వచ్చిన వారికి ఈ విశాలమైన ప్రకృతి హాయిగా చక్కిలిగింతలు పెట్టింది.

వసతులులేని ఇంట్లో ఒకవైపు మగవారు, ఇంకొకవైపు స్త్రీలు మకాము పెట్టారు. సరయిన తిండివసతికూడా లేదు. కాని వా రివేమీ లక్ష్యపెట్టకుండా తాము వచ్చిన పనులలో నిమగ్నులయ్యారు. తమకు నచ్చిన దృశ్యాన్నో, శిల్పాన్నో గీయడంలో వారి కాలం గడిచిపోసాగింది.

అణ్ణామలైకుకూడా పంజరంనుండి విడివడి నట్లనిపించింది. చీకటితోనే పక్షుల కిలకిలా రవంతోబాటు లేచి బొమ్మలు గీయడం మొదలుపెడితే నెత్తిమీదకు సూర్యుడొచ్చేదాక ఆగేవాడుకాదు. అప్పుడయినా శారద అతడిని బలవంతంగా లేపి భోజనానికి లాక్కువెళ్ళేది. మళ్ళీ సాయంకాలం, కాస్త చల్లబడ్డాక వెళ్ళేవాడు. మళ్ళీ మద్రాసుకు వెళ్ళేలోగా అక్కడి శిల్ప సౌందర్యాన్ని చిత్రాలుగా మార్చి తనతోబాటు తీసుకు వెళ్ళాలని అతడి కోరిక !

సముద్రతీరపు ఆలయము, పాండవుల రథాలు, ఏనుగు, ఇతర రాతి శిల్పాలు - వీటన్నిటిని అతడు గీచాడు. అనుకున్నట్లే వెనక్కు వెళ్ళేలోగా అంతా గీచేసుకోవచ్చు ననిపించింది. 'అర్జునుడి తపస్సు' లేక 'భగీరథుడి తపస్సు' అని పేరున్న శిల్పంయొక్క సౌందర్యం అతడిని ముగ్ధుడిని చేసింది. అది అనేకానేక మూర్తులున్న శిల్పకూటమి అన్పించింది. దానిని గీస్తున్నప్పుడు అతడికి ఈ దేశపు శిల్పుల విశిష్టత బాగా తెలిసివచ్చింది.

ఒకరోజు పొద్దున్నవచ్చి కూచుని మధ్యాహ్నం పాటికి దానిని చిత్రంగా గీచి ముగించాడు. అయినా సాయంకాలం మళ్ళీ అక్కడికేవచ్చి కూర్చున్నా డణ్ణామలై. అప్పు డక్కడికి ఆ మేకగడ్డం మనిషి - రాజశేఖరన్ వచ్చాడు. రాజశేఖరన్‌కు ఆ శిల్పంలో గొప్పదనమేమీ కనిపించలేదు. అంతవరకు అతగాడు గ్రామపు పొలిమేర గుళ్ళలో వుండే శిల్పాలను పోలిన జంతువుల, మనుషుల రూపాలతో తన పుస్తకం నింపుకొచ్చాడు.

అణ్ణామలై పుస్తకం తీసుకుని చూసి పెదవి విరిచాడు రాజశేఖరన్. "ఇవి శిల్పాలా ? హుం ! మనుషులను జంతువులను అట్లాగే రాళ్ళలో ఫోటోలుగా మలిచారు ఆ పాతకాలపు పిచ్చివాళ్ళు ! వాళ్ళు గొప్ప పనికాండ్రంటే ఒప్పుకుంటాను గాని కళాకారులంటే ఒప్పుకోను. అసలు ఇది కళకాదు; నకిలీ కళ; ఉత్త 'రియలిజం', ఫోటోగ్రఫీ ! అంతే !'' అన్నాడు.

తన్నేమయిన అనివుంటే అణ్ణామలై వూరుకునేవాడు. కాని ఈ దేశపు కళా సంప్రదాయానికి ఊపిరిపోసిన మహా శిల్పులను, తమ ఊరుపేరు సైతం చెప్పుకోని కళాజీవులను రాజశేఖరన్ అలా తూలనాడడం - అతడికి కోపం కలిగించింది.

"ఏది అసలుకళ, ఏది నకిలీకళ ! ఈ శిల్పాలను చూడు ! జాగ్రత్తగా వాటి ప్రతి అంగుళమూ పరిశీలించి చూడు. నీకు జీవితంలో ఎదురయ్యే మనుషు లిట్లాగే వుంటారని నువ్వు అంటే నీ చూపులో లోపం వుందన్నమాట. కల్పనా చాతుర్యం పొంగవలసినచోట పొంగి, వెల్లువై పారవలసినచోట పారి, వెనక్కుండి సూచనా మాత్రంగా కనపడవలసినచోట కనపడేలా చేసి, అంతరంగంయొక్క రంగు లన్నిటినీ ఆ ముఖాలమీదకు తేగలిగారే; వాళ్ళు శిల్పులు కారా ? వాళ్ళది కళకాదా ? నువ్వన్నమాట ఎవడో దానయ్య అంటే ఫరవాలేదు కాని, నువ్వు కళాకారుడిని అని చెప్పుకుంటావే ?''

"కళమీద అభిప్రాయాలు విప్లవాత్మకంగా మారిపోయాయి బ్రదర్ !'' అని నవ్వాడు రాజశేఖరన్.

ఈ జాతికళా స్రోతస్విని నరనరాల్లో ప్రవహించే వా డెవ్వడూ ఈ గుడ్డితనంతో బాధపడడు. ఈ దేశపు మట్టిలో వేళ్ళులేని వారి మాటలువిని నువ్వు మన కళల నెగతాళి చేయకు !"

దూరంగా శారద రావడం చూసిన రాజశేఖరన్, ఆమెతో వాదించి గెలవడం వీలుకాదని — "సరేనయ్యా ! అదిగో నీ ప్రియురాలు వస్తూంది. ఇంక నేనిక్కడ వుండడం భావ్యంకాదు. వస్తా—" అని జారుకున్నాడు.

'ప్రియురాలు' అన్నమాట విని ఉలిక్కిపడి తిరిగి చూశాడు అణ్ణామలై. మోయలేని బరువును మోసుకుంటూ వచ్చింది శారద. ఆ సామాన్లను క్రిందపెట్టి నీడలో అతడి ప్రక్కగా కూర్చుంది. పేము బుట్టనుండి, ఆనంది పంపిన, తగరపు డబ్బా, నీళ్ళకూజా, కాఫీ ఫ్లాస్కు, బయటికి వచ్చాయి. డబ్బానుండి శారద జంతికలను పాలకాయలను తీసి అణ్ణామలైకు అందిచ్చింది; తానూ తినసాగింది. రోజూ ఈ వేళకు వాళ్ళు అల్పాహారం సేవించడం అలవాటు.

వీళ్ళిద్దరూ సన్నిహితంగా మెలగడం చూసి కొందరు వీరి వెనక ఎగతాళి చేస్తుండడం వీరికి తెలియకపోలేదు. కాని వాళ్ళు దానిని లెక్కచేయలేదు. కాని

అణ్ణామలై తెలుసుకోని విషయం శారద తెలుసుకుంది; అది ఆనంది మనసు! ఆ శోకదవంల ఆనంది పొందే ఆనందం శారద మనసును సంతృప్తితో నింపింది.

మరరోజు సాయంకాలం వాళ్ళు మహాబలిపురంనుండి బయలుదేరి ఆవలి రోజు వుదయం చెన్నపట్నం చేరాలి. ఆ విషయం మాట్లాడుతుండగా శారద తాను వేసిన చిన్న చిత్రాన్ని అతడికి చూపింది. అది చేతిలోకి తీసుకుని, చూసి, నవ్వాడు అణ్ణామలై. అతడు బొమ్మ గీస్తున్నట్లుగావున్న రూపం అందులో వుంది; అది శారద వేసింది.

"బొమ్మ నాకన్న బాగుంది—" అన్నా డతడు.

"ఇది నేను ఆనంది కిస్తాను. ఆమె చాల సంతోషిస్తుంది."

"ఇంతకన్న మీరు ఆనంది బొమ్మ గీచివుంటే బాగుండేది!"

"అది మీరు చేయాల్సినపని; మీరు గీస్తే ఆనందికూడా సంతోషిస్తుంది!" అని ఆమె అతడిని కొంటెగా చూసి నవ్వింది. కలలో వున్నవాడివలె అణ్ణామలై ఆమె మాటలవెనుక భావాన్ని అందుకో యత్నించాడు.

అప్పుడు వారికి దగ్గరగావచ్చి ఒక కారు ఆగడం వారు గమనించలేదు. కారులోపలివారు తమ్ము అదేపనిగా చూడడమూ వారు గమనించలేదు. కారునుండి సుందరి దిగి ధామ్మన్ని చప్పుడుతో కారుతలుపు వేసినప్పుడే అణ్ణామలై ఉలిక్కి పడి తిరిగిచూశాడు.

"అబ్బబ్బ! మీ కోసం ఎన్ని చోట్ల వెతకడం? ఎవరో గడ్డం ఆసామీ చెప్పాడు మీ రిక్కడ వుంటారని—" అంటూ అణ్ణామలైతో మాట్లాడుతూనే సంశయంతో శారదను పరీక్షగా చూసింది సుందరి. అక్కడవున్న డబ్బా, ఫ్లాస్కు, కూజా చూసింది. శారద చేతిలోని అణ్ణామలై చిత్రాన్ని చూసింది!

# 26

కారునుండి దండపాణిగారూ దిగివచ్చారు; సుందరి ఇంటినుండి ఇంకెవరూ రాలేదు. మహాబలిపురంలో తన మిత్రుడితో పనితగిలి తాను వస్తుంటే, సుందరి కూడా బయలుదేరిందట.

ఈలోగా సుందరి శారద పక్కన కూర్చుని, ఆమె చేతిలోని అణ్ణామలై చిత్రాన్ని తీసుకుని చూసింది; ''బాగుంది. దీనిని మీరు వేశారా ?' అని అడిగింది. ఔనని తల వూపింది శారద. "దీనిని నా కిస్తారా ?'' అని అడిగి, ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండా దానిని తన చేతి సంచిలోపల వుంచుకుంది సుందరి.

శారదను వారికి పరిచయం చేశాడు అణ్ణామలై. ఒంటిమీద ఏ నగలేని శారద బీదకుటుంబానికి చెందినదని ఊహించింది సుందరి. ఆమె అణ్ణామలై కలిసి వుండడాన్ని చూసిన కోపం ఆమెలో చల్లారనేలేదు.

అణ్ణామలైను చూసి—" ఇక్కడ చిత్రకళ నభ్యాసం చేయాలి అన్నారు; కాని తీరా వచ్చిచూస్తే వినోదయాత్రకు వచ్చినవారిలా ఈ అల్పాహారవిందు నార గిస్తున్నారే ?" అంది.

''బొమ్మలుకూడా చాలా వేశాను. చూడు—'' అని తన పుస్తకాన్ని ఆమె కిచ్చాడు అణ్ణామలై.

కాని సాటి ఆడదయిన శారద మాటకుమాట చెప్పకుండా వుండలేక పోయింది "ఈయన ధోరణిలో ఈయనను ఇక్కడ వదిలివుంటే అన్నాహారా లుండేవికావు. అందుకనే ఈయనను చూసుకోమని అడయారులో వీరి గురువుగా రింటివారు చెప్పారు. ఎంతటి చిత్రకళయినా పస్తు లుండరాదుకదా ?''

అడయా రింటివా రనగానే దండపాణిగారి నొసలు ముడివడింది. మేస్త్రీగా రక్కడ క్రొత్తఇల్లు కడుతుండడం ఆయన ఎరుగుదురు. కాని అణ్ణామలైమీద అంత శ్రద్ధగలవా రెవ్వరు ? సుందరి కా విషయం నచ్చలేదు.

''బావా ! నాన్నకు పనుంది. వెళ్తారు. మీరే నాకీ వూరంతా చూపాలి." అంది సుందరి.

''నే నొచ్చిన పనికూడా అయిపోయింది. అయినా మా ఉపాధ్యాయులతో చెప్పిరావాలి—'' అన్నాడు అణ్ణామలై.

''కారెక్కండి; వెళ్ళి చెప్పవచ్చు. చీకటయ్యేలోగా అన్నీ చూడడం ముగింప వచ్చును.'' అంది సుందరి.

"మీరు మాతో వస్తారా శారదా ?" అని పిలిచాడు అణ్ణామలై. కాని ఆమెకు ఇంకా బొమ్మలు వేయవలసివుంది. అదీగాక రమ్మని సుందరి పిలవలేదు.

''మీరు వెళ్ళిరండి: నే నిక్కడే కూచుని బొమ్మలు వేస్తాను.'' అంది శారద. ఆమెను వదలి వాళ్ళు బయలుదేరారు. దండపాణిగారే అధ్యాపకుడితో మాట్లాడి అణ్ణామలైకు అనుమతి సంపాదించారు ఆ తర్వాత ఆయన తన మిత్రుడింట్లో దిగి, అణ్ణామలైను, సుందరిని డ్రైవర్‌తో బాటు కారులో పంపారు.

వాళ్ళిద్దరూ సముద్రపు ఒడ్డు కోవెల పాండవుల రథాలు చూశాక పూరికొక ప్రక్కనున్న 'యాళి' గుహలోకి వెళ్ళారు. ఆ ప్రక్కనేవున్న మంటపంలో కూర్చుంది సుందరి.

ఆశ్చర్యంతో— ' కూచున్నావేం ? మనం వెళ్ళొద్దూ ?'' అని అడిగాడు అణ్ణామలై.

"మీరూ కూచోండి. మీతో మాట్లాడాలి."

అతడికి ఏమిటి ఈ వైరితనం అన్పించింది; కొద్దిగా భయం అన్పించింది; కాస్త పరవశమూ ఏర్పడింది.

"ఏం మాట్లాడాలి ?"

"మీతో ఎంతో సంతోషంగా కాలం గడపాలని ఇక్కడికి వచ్చాను కాని ఎందుకొచ్చానురా బాబూ - అన్పిస్తూంది."

"ఏం, ఏమయింది ?"

తటాలున సుందరి మొహం కోపంతో జేవురించింది. చేతి సంచిలోనుండి ఆ చిత్రాన్ని తీసి చూపెడుతూ — " ఇందుకోసమేనా మీ రిక్కడికి వచ్చింది—" అని ఏడుపు, ఉక్రోషము కలిసిన గొంతుతో అడిగింది.

ఆమె కోపానికి కారణం ఏమిటో అణ్ణామలైకు బోధపడలేదు. ఆమె ఆ బొమ్మను ఏదో తమాషాకు వేసినదని, అసలామె వేస్తున్నట్లు తనకు తెలియదని చెప్పాడు. అందులో అతడికి తప్పేమీ అన్పించలేదు.

''నాకు ఆమె నచ్చలేదు.''

'ఎందుకు ?' అన్నట్లు చూశాడు అణ్ణామలై.

"పెళ్ళిచేసుకున్నదానిలా పూసుకుని తిరుగుతుందే మీతో ? ఇట్లా జరుగుతాయని తెలిసివుంటే మొదటే ఈ మీ చదువుకు నేను ఒప్పుకునేదానినికాదు.''

అణ్ణామలై తల ఒంచుకుని విన్నాడు. 'ప్రియురాలు' అని రాజశేఖరన్ అనడం గుర్తుకు వచ్చింది. బాధపడ్డాడు.

"సుందరీ! అపార్థం చేసుకోకు. శారద మంచి అమ్మాయి. నా చెల్లెలిలా ప్రవర్తిస్తుంది." అన్నాడు.

"ఏమో నాకు నచ్చలేదు..."

"సరేలే! నేను ఇకముందు జాగ్రత్తగా వుంటాను."

సుందరి కళ్ళు తుడుచుకుని నెమ్మదిగా నవ్వింది. 'పెళ్ళాడబోయేది నేను; కాస్త జ్ఞాపకం వుంచుకోండి—' అన్నట్లుంది ఆ నవ్వు

ఏకాంతము, సౌందర్యము, భయము కలిసిన ఆ పరిస్థితిలో ఆ మంటపం రాతినేలమీద ఒయ్యారంగా పడుకున్న ఆమెను చూస్తుంటే అతడి వేళ్ళు విలవిలలాడాయి. చిత్రం గీయడానికి అనువైన రూపం; అనువైనచోటు; ఆమెనే తదేకంగా, తన్మయంగా చూస్తూ నిలబడ్డాడు అణ్ణామలై.

"ఏమిటలా చూస్తున్నారు? నామీద కోపమా?"

"అబ్బే, కాదు—" అని సిగ్గుతో తలవంచుకున్నాడు. తర్వాత ఇద్దరూ కలిసి కారుదగ్గరకు వచ్చారు.

మరురోజు రాత్రి సహవిద్యార్థులతోబాటు పడవమీద రావాలనుకున్నవాడు ఉదయమే సుందరి వాళ్ళతో కారులో బయలుదేరాడు. దారిలో కారాగిపోయింది. దాన్ని బాగుచేసి, చెన్నపట్నం చేరేసరికి రాత్రి అయింది.

మరుసటిరోజు ఉదయం అణ్ణామలై ముందు అడయారుకు వచ్చే ఆ తర్వాత తన ఇంటికి వెళ్తాడని ఎదురుచూసిన ఆనందికి ఇది పెద్ద నిరాశ కల్గించింది. శారద మాత్రం పడవ దిగగానే వచ్చి అతడు తమకన్న ముందే బయలుదేరాడని చెప్పింది. ఆమె చెప్పిన విషయాలు ఆనంది హృదయాన్ని పిండివేశాయి.

## 27

శారద నిజానికి కాస్త చిలవలు పలవలుచేర్చి చెబుతుందేగాని అబద్ధం ఆడదు. ఆమె ఆనందికి - సుందరి అందచందాలు, మాట, నడక, ఆమె అణ్ణామలైని ఆడించిన తీరు - వీటికి కాస్త అతిశయోక్తి కలిపి చెప్పింది. చెప్పి, చివర— "నేను ఈ విషయాన్ని ఇంతటితో విడిచిపెట్టబోను. ఆయననే అడుగు

తాను. కాస్త ఆ సుందరి విషయంలో జాగ్రత్తగా వుండమని హెచ్చరిస్తాను." అంది.

ఆనంది వారించింది. "వద్దు శారదా, వద్దు! సుందరి ఆయనకు పరసయిన పిల్ల. వారి వ్యవహారంలో మనం తలదూర్చడం తప్పు. కనుక నువ్వు నా కోసం ఓరిమితో సరుదుకోవాలి."

"నీ ధోరణే నాకు అర్థం కావడంలేదు—" అని కోపంగా అంది శారద.

"నువ్వీ విషయాన్ని వెంటనే మరిచిపో; లేకపోతే అనవసరమైన గొడవలు వస్తాయి."

"నీ ఇష్టమమ్మా! కాని ఒకబిడ్డ ఇంకొక బిడ్డ పాడుచెయ్యనున్నది..." అంది శారద.

"అంటే?"

"అంటే - అజ్ఞానమతై ఒక పాప. ఆయనకు బొమ్మలు గీయడం మినహా ఇంకేమీ తెలియదు. సుందరి - మొండితనం నేర్చిన గారాబుబిడ్డ. ఆయన ఆ అందమైన సుందరిని 'మాడల్'గా వుంచుకొని బొమ్మలు గీయవచ్చు. అంతటితో ఆగితే బ్రతికిపోతారు. అలాకాక చిక్కుకున్నాడా జీవితాంతం ఆమె ఆయన్ని నమిలి తినేస్తుంది."

"నీకు ఆమె అంటే ఇష్టంలేదు. అందుకనే ఇట్లా అంటున్నావు." అంది ఆనంది.

"అరగంటసేపు ఆవిడగారితో గడిపేసరికి చాలు చాలనిపించింది. నువ్వూ ఆమెతో మెలిగితే తెలుస్తుంది."

శారద వెళ్ళింది.

ఆనంది కవాళ కాలేజి లేదు. అది ఆమెకు కాలేజిలో ఆఖరి సంవత్సరం

ఆమె మనసానాడు దేనిమీదా నిలవడంలేదు. ఆకలిలేదు. మాట్లాడకుండా వెళ్ళి మంచంమీద పడుకుంది. మనసులో జ్ఞాపకా లేవేవో కదలసాగాయి.

ఆమె తండ్రి ఇంకొక కులానికి చెందిన వితంతువును పెళ్ళాడినందున వారు అందరికీ దూరం అవవలసి వచ్చింది. నడివీధిలోని నిరుపేదయినా, సిరిసంపదలు కలవాడయినా సమాజపు కట్టుబాట్లను త్రోసిరాజని బ్రతకగలడు. కాని కదిరేశన్ రెంటికీచెడ్డ రేవడి లాటివాడు. కులం, కట్టుబాట్లు, బంధువులు, బాంధవ్యాలు,

సంబంధాలు - వీటిని గురించి ఆనంది మొట్టమొదటిసారిగా ఆలోచించింది. వీటన్నిటికి కొంత బలం వుందన్న మాటను కాదనలేము అనిపించింది.

తాటాకుల కిటికీగుండా బయటకు చూసిందామె. వాళ్ళ క్రొత్త ఇల్లు గబగబ లేస్తూంది. అటు అణ్ణామలై ఇంటి పునాదులూ ముగిశాయి. మాణిక్యమూ మేస్త్రీగారూ ఏవో సామాన్లు కొనడానికని వెళ్ళారు. కదిరేశన్ చెట్టుకింద కూచుని పనిని పర్యవేక్షిస్తున్నారు. వేలయ్య, వాడి కూతురు ముత్తమ్మ పనిచేస్తున్నారు.

ముత్తమ్మకు పద్దెన్మిదేళ్ళుంటాయేమో... చకచక పనిచేస్తూంది. ఆమెను పరీక్షగా చూసింది ఆనంది. ఆమె గలగల మాటలు, పకపక నవ్వులు విని - ఎంత నిశ్చింతగా వుందీ పిల్ల అనుకుంది ఆనంది. ముత్తమ్మపట్ల అవ్యాజమైన అనురాగం కలిగింది ఆమెకు.

తన గదిలోకి ఎవరో తొంగిచూసిన ట్లనిపించింది ఆనందికి తటాలున తిరిగి చూసింది తడబడుతూ చేతిలో నోట్ పుస్తకాలతో నిలబడి వున్నాడు అణ్ణామలై. "కూర్చోండి" అంటూ ఆమె సంరంభంతో లేచింది.

పుస్తకాలను ఆమె చేతికిచ్చి కుర్చీలో కూర్చున్నాడు అణ్ణామలై. ఆమె వాటిని తిరగవేస్తుంటే, అతడికి ఆమె ఒయ్యారంగా ఆ మంచంమీద పడుకున్న దృశ్యమే కనపడుతున్నది. విప్పారిన నవకుసుమం సంజెవేళ కొద్దిగా వాడినప్పు డెలా వుంటుంది ? అలా వుందామె అనిపించిందతనికి.

బొమ్మలన్నీ చూశాక ఆనంది వున్నట్లుండి అడిగింది "ఔనుగానీ, మీ రెన్నడూ నాతో సుందరి గురించి చెప్పలేదేం ?"

"మీ రడిగితే చెప్పివుండేవాడినే. నాకూ గుర్తులేదుమరి..."

"మహాబలిపురం వస్తానని ఆమె మీతో చెప్పిందా ?"

"లేదే, ఉన్నట్లుండి వచ్చింది. ఆమే, మామయ్య బలవంతం చేయడంతో వారితో రావలసి వచ్చింది. అందుకనే ఈ పుస్తకాలు తీసుకుని ఇలా వచ్చాను."

"మీకో మామయ్య కూతురుందని తెలిస్తే ఆమెనూ ఇదివరకే ఇక్కడకు తీసుకురమ్మని కోరివుండేదానిని." అంది ఆనంది.

"నే నామెను బయటకు తీసుకువెళ్ళే అలవాటే లేదు. ఆమే అప్పుడప్పుడు మా ఇంటికి వస్తుంటుంది. మీకు చూడాలని వుంటే ఆమెతో చెబుతాను—" అన్నాడు అత డమాయకంగా.

''మీరేమీ చెప్పక్కర్లేదులెండి. అదేదో నేనే చూసుకుంటాను'' అంది ఆనంది. అతడి సమాధానం ఆమె మనసు కూరట కలిగించింది. సుందరిని చూడదాని కత దామె ఇంటికి వెళ్ళడంలేదు. ఆమెను తీసుకుని బయట తిరగడానికి వెళ్ళడంలేదు. అంతేకాదు, తాను వేసిన బొమ్మలను తీసుకుని ఇక్కడికి వచ్చాడు. నిజంగా శారద చెప్పిన ట్లితడు పసిబిడ్డే.

వెళ్ళి కదిరేశన్‌ను చూడాలని లేవబోతున్న అణ్ణామలైను వారించింది ఆమె. ''వెళ్ళరుగాని వుండండి, మిమ్మల్ని ఒకటి అడగాలి—''

''ఏమిటి?''

కాసేపు తటపటాయించి అతడి ముఖంలోకి చూసింది. ఆ తర్వాత అది గించి— ''మరి మీరు... మీరు ఆ... ఆ... సుందరిని పెళ్ళిచేసుకుంటారా?'' అని నిదానంగా అడిగింది. అడుగుతుండగానే ఆమె హృదయం వేగంగా కొట్టుకుంది. అడిగిన వెంటనే అలా అడిగినందుకు పెదవి కొరుక్కుంది.

అణ్ణామలై వెంటనే ఏమీ మాట్లాడలేదు. జవాబు తెలియనివాడివలె గుడ్లప్ప గించి చూశాడు. అతడి మొహంలో సంతోషంగాని సిగ్గుగాని కనపడలేదన్న విష యాన్ని ఆమె గమనించింది.

''శారద ఇక్కడికి వచ్చి ఏమయినా చెప్పారా?''

''మీరు ముందు నే నడిగినదానికి సమాధానం చెప్పండి.'' అంటూ అతడి కళ్ళల్లోకి చూసింది ఆనంది.

''నే నింకా చదవాలి. తర్వాత ఉద్యోగం చూసుకోవాలి. అందాక ఇంకే ఆలోచనా లేదు. ఇంట్లో పెద్దవాళ్ళేవేవో మాట్లాడుతుంటారు. నా కవేమీ తెలియదు–''

అతదేదీ దాచలేదని గ్రహించింది ఆనంది. పసిపాప మాటలలా నిర్మలంగా వున్న అతడి మాటలను విన్న ఆమెకు ఇంకొక్క ప్రశ్న అడగాలని తహతహ పుట్టింది. 'మీరు... ఆమెను... ప్రేమిస్తున్నారా?' అన్న ప్రశ్న ఆమె పెదవుల మీదకు వచ్చింది. కాని ఆమె దానిని బయటికి రానివ్వలేదు. తన్నుతాను అదుపులో వుంచుకుని— 'ఎన్నడూ ఈ ప్రశ్న నడగరాదు' అని నిర్ణయించుకుంది. ఆ అడ గని ప్రశ్నలోనే తన ప్రాణం ఊగిసలాడుతున్నదన్న విషయమూ ఆమెకు తోచింది.

# 28

కదిరేశన్ ఇల్లు గృహప్రవేశ ముహూర్తానికి ఎదురుచూస్తుంది. మేస్త్రీగా రిల్లూ ముప్పాతిక భాగం అయింది. ఎంచేతనో మాణిక్యానికి కదిరేశన్ ఇంటి నిర్మాణంలో కల్గినంత ఉత్సాహం మేస్త్రీగా రింటి నిర్మాణంలో కలగలేదు. ఆనంది ఇల్లు తన ఇల్లనీ, మేస్త్రీగారిల్లు ప్రక్కిల్లు అని అనిపించింది అతడికి. అయితే ఈ భావాలన్నీ ఎవ్వరికీ, ఆఖరికి మేస్త్రీగారికికూడా, తెలియనివ్వకుండా జాగ్రత్త పడ్డాడు.

మేస్త్రీగా రింటిని చూడడానికి దండపాణి వచ్చినప్పుడు ఆయనకు కదిరేశన్‌తో పరిచయం ఏర్పడింది. అందుచేత తమ గృహప్రవేశ మహోత్సవానికి దండపాణిగారిని స్వయంగా పిలిచి వద్దామని కదిరేశనూ ఆనందీ బయలుదేరారు. సుందరిని చూడాలన్న ఆశకూడా ఆనందికి వుంది.

ఆనందని చూడగానే సుందరి ఆమెను చాల రోజులనుండి ఎరిగిన దానివలె దగ్గరకు తీసుకుంది. సుందరి తల్లితో కాస్సేపు మాట్లాడనిచ్చాక ఆనందిని సుందరి తనతోబాటు తీసుకెళ్ళింది. ఆనందతో ఆమె మాట్లాడిన తీరు 'ఆమెకు ఆనంది గురించి ఎంతో తెలుసునన్న భావాన్ని కల్గించేలా వుంది.

''మిమ్మల్ని చూడడానికి నేనే బావతోపాటు వద్దామనుకున్నాను. ఈలోగా మీరే వచ్చేశారు—'' అంది సుందరి.

''అణ్ణామలై నా గురించి ఏమయినా చెప్పారా ?'' అని ఆనంది అడిగింది. అలా అడగాలనిపించింది. అత దలా ఏదయినా చెప్పివుంటే ఆమె బాధపడేది.

పెదవి నొక్కుకుంటూ—— ''ఆయనా ! ఆయనెందుకు చెబుతారు—'' అని— ''నాకూ కొద్దిగా తెలుసులెండి—'' అని కొంటెగా నవ్వింది సుందరి.

సుందరికి ఏమి తెలుసు ? తెలిసికూడా ఇంత చనువుతో మెలగుతున్నదా ? ఆనంది గుండె వేగంగా కొట్టుకుంది.

''భయపడకండి ! మీ గురించి నేను విన్నదంతా మీ మంచిగురించే. మీరు చాల సరళ స్వభావులని, అరమరికలు లేకుండా వుంటారని తెలుసు— ''నేను మిమ్మల్ని ఎన్నడూ అపార్థం చేసుకోను. నేను వయసులో చిన్నదానినయినా కాస్త

జ్ఞానం కలదానినే... అన్ని విషయాలూ మాణిక్యం అన్నయ్యే చెప్పారు '' అని నవ్వింది సుందరి.

మాణిక్యం ఏమి చెప్పివుంటాడు ? ఊపిరి ఆడనట్లనిపించింది ఆనందికి. సుందరి ఏదో అల్లరిపిల్లలే అనుకోవడానికే వీలులేకుండా వుంది. ఆ తర్వాత ఆనంది సంభాషణను తనునుండి ఆమె చదువుమీదకు మళ్ళించింది.

''పరీక్ష రాశాను; ఫలితమూ నాకు తెలుసు'' అంది సుందరి.

''అప్పుడే తెలుసా !''

''అవో, తెలుసు. తప్పకుండా ఫెయిలవుతాను.'' అంది సుందరి.

ఎంత విచిత్రమైన మనిషి అన్నట్లుగా ఆమెవైపు చూసింది ఆనంద.

''ఏమిటో, నేను బాగానే చదువుకుంటూ వుండేదానిని. కాని ఈ ఏడాది ఏమయిందోగాని పాఠాలు బుర్రకెక్కడం మానేశాయి చదివినా బుర్ర కెక్కడం లేదు — ''

వయసుతెచ్చే గందరగోళం ఆమెకు వయసు రాకముందే వచ్చిందని ఆనంది గ్రహించింది.

''మీరు బి. ఏ. రాశారుట. ఎప్పుడూ మీది మొదటి స్థానమటకదా ! బి. ఏ. తర్వాత ఏమి చేయదలచారు ?''

''ఇంక పై చదువు చదవను. నాన్నగారూ చాలన్నారు.'' అని చెప్పింది ఆనంది.

''అవును... చదువింక చాల్లెండి —'' అని లేచి ఆనందిని వాటేసుకుని ఆమె చెవిలో ''చదువులు చాలు ! మీకు నచ్చినవారిని పెళ్ళిచేసుకోండి.'' అని రహస్యంగా చెప్పింది సుందరి.

చెమట పోసింది ఆనందికి. ఇంక ఈమెతో మాట్లాడకూడదు - అనుకుని సుందరిని తీసుకుని గది బయటికి వచ్చింది. తర్వాత వారందరిని గృహప్రవేశానికి తప్పక రమ్మని చెప్పి, తండ్రితోబాటు అడయారుకు వచ్చింది.

సుందరి చెప్పిన ఆఖరి మాటలు ఆనంది మనసులో నాటుకుపోయాయి. అవి తలచుకుంటే నవ్వాలో, ఏడవ్వాలో తెలియలేదు. నవ్వూ వచ్చింది. ఏడుపూ వచ్చింది.

అసలు ఏమి జరిగిందంటే —

—ఒకరోజు అణ్ణామలైను చూడడానికని సైకిలుమీద వెళ్ళింది సుందరి. వా రెవరూలేరు. మేడమీదకు వెళ్తే మాణిక్యం వున్నాడు. తన తల్లిగారూ, మీనాక్షమ్మా కోవెలకు వెళ్ళారనీ, కొంచెం సేపట్లో వస్తారనీ చెప్పి ఆమెను వుండమన్నాడు.

అతడంటే సుందరికి అలక్ష్యమే; కలవారింటిపిల్ల పనివాడిని చూసినట్లు చూసేది. కాని ఆ రోజు అతడు తన్నూ అణ్ణామలైనూ కలుపుతూ మాట్లాడినందున అతడంటే వున్న అలక్ష్యంపోయి, కాస్త శ్రద్ధ ఏర్పడింది. ఒకరోజు అణ్ణామలై సుందరీ పారిస్ కార్నర్‌లో హోటల్‌లో కూచుని వుండగా చూశాననీ, ఇంకా అలాగే కొన్నిసార్లు వేర్వేరుచోట్ల వాళ్ళను తాను చూశానని మాణిక్యం చెప్పాడు. త్వరలోనే వాళ్ళిద్దరూ దంపతులు కావాలని తాను కాంక్షిస్తున్నట్లు చెప్పాడు. ఆనందపు మైకంలో తల తిరిగింది సుందరికి.

నెమ్మదిగా సంభాషణను కదిరేశన్ ఇంటివైపుకు మరల్చాడు మాణిక్యం. ఆనందిని గురించి చాల గౌరవంతో మాట్లాడాడు. చిత్రకారుడి కుమార్తె అయినందున అణ్ణామలై చిత్రాలలో మాత్రం ఆమెకు ప్రత్యేక స్థానం వుందనీ, ఇది సరిగా అర్థం చేసుకోలేని అణ్ణామలై కొంత సందిగ్ధంలో పడినట్లు తనకు తోస్తున్నదనీ చెప్పాడు.

సుందరి కళ్ళల్లో కోపం మెరిసింది. ''నిజమేనా ?'' అని అరిచింది.

''మీరు కోప్పడేలా ఏమీ జరగలేదు. ఆనంది నిప్పువంటి మనిషి. అతడితో తోబుట్టువులా నిష్కల్మషంగా మెలగుతూంది.''

''ఆనంది నిష్కల్మషంగా వుందని మీకెట్లా తెలుసు ?''

లజ్జతో తలవంచి నవ్వాడు మాణిక్యం. ''మీరు ఆమెను సంశయిస్తే నాకు కోపం రాగలదు. మీరూ అణ్ణామలై ఎట్లా వుంటున్నారో మేమిద్దరమూ అట్లా వుంటున్నాము. కాని ఇవన్నీ మీరు ఎవరికీ చెప్పకూడదు. లేపోతే మాకు చాల కష్టాలు వస్తాయి.''

''ఓహో, అదా సంగతి !'' అని పెద్ద భారం తొలగినదానివలె నిట్టూర్చింది సుందరి. అతడుకూడా ఒక అమ్మాయిని ప్రేమిస్తున్నాడని తెలియగానే అతడిపట్ల సద్భావం ఏర్పడింది; ఆనంది అంటే అనురాగం ఏర్పడింది.

''కాని ఇవన్నీ మీరు అణ్ణామలైకు చెప్పకండి; అతనిని ఏమీ అడగకండి. సమయం వచ్చినప్పుడు చెప్పమని నేను ఆనందితోనే చెబుతాను ఎందుకయినా మంచిది మీరు అడయారుకు వెళ్తూ వస్తూ వుండండి. అన్నీ సర్దుకుంటాయి —" అన్నాడు మాణిక్యం.

మాణిక్యం చెప్పిన ఈ మాటలనుబట్టే సుందరి తనతో అట్లా ప్రవర్తించిందని ఆనందికి ఎట్లా తెలుస్తుంది? ఆనందికి సుందరిగాని, ఆమె మాటలుగాని అవగతం కాలేదు.

# 29

'ఇల్లు కట్టిచూడు; పెళ్ళి చేసిచూడు' అన్నారు. ఆ మొదటిపని చేయడంలో కదిరేశన్‌కు మేస్త్రిగారు తోడ్పడ్డారు. అలా చేయడంలో స్వామికార్యమూ, స్వకార్యమూ అయినట్లయింది మేస్త్రికి. తమకో, విశాలమైన ఇల్లు వచ్చింది; కదిరేశన్‌కో నవనాగరికమైన ఇల్లు ఏర్పడింది.

'పెళ్ళిచేసిచూడు' అన్న రెండవ పరీక్ష మిగిలింది కదిరేశన్‌కు. సందర్భం వచ్చినప్పుడెల్లా కదిరేశన్ మేస్త్రితో ఈ విషయం ప్రస్తావిస్తూ వచ్చారు; తనతో వియ్యమందుతానని మేస్త్రిగా రంటే తా సందుకు సిద్ధంగా వున్నారు.

మేస్త్రిగారికీ ఈ పేరాశ లేకపోలేదు అట్టే చదువుకోని అణ్ణామలైవంటి అప్రయోజకుడికి ఒక మేధావి తమ బి. ఏ. చదివిన కూతురి నిస్తానంటే అంతకన్న ఆశించదగిన దేముంది? ఆనందీ ఆయనకు నచ్చింది. అణ్ణామలై ఆమెను పెళ్ళాడితే ఆ క్రొత్త ఇల్లూ వాడికే చెందుతుంది. వాడు బొమ్మలుగీచి సంపాదించినా, సంపాదించకపోయినా, ఈ ఖాళీ స్థలంలో ఇళ్ళుకట్టి అద్దె కిచ్చుకుంటే చాలు, కాలుమీద కాలువేసుకుని సుఖంగా కాలం గడిపేయవచ్చు —

ఈ విషయం గురించి మేస్త్రి తీవ్రంగా ఆలోచించసాగారు. దాని సాధక బాధకాలను బేరీజు వేయసాగారు. కాలాన్నిబట్టి చూస్తే బాధకాలే ఎక్కువ అన్పించిం దాయనకు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అందరూ దేశానికి రాజులయ్యారు. ఆ రాజులలో చక్రవర్తులుగా జీవించ దలచిన కొందరికి జాతి, కులం, ధనం - ఆధారా

లయ్యాయి. నడుమువంచి ఒక్క మూట మోయలేని సోమరిపోతులు, ఇంకెందుకూ పనికిరాని శుంఠలు - తమ బంధువుల అండ, కులం అండలను మాత్రమే నిచ్చె నలుగా వేసుకుని పై కెగబాకి, లక్షలలో దొర్లుతూ, కార్లలో తిరుగుతున్నారు. జాతి వారిని వదలి పొట్ట చేతపట్టుకుని చెన్నపట్నం చేరిన మేస్త్రీగారికి విచారం కలిగింది.

కదిరేశన్‌ది మేస్త్రీకులం కాదు. అది పోనిమ్మనుకుంటే మరొక కులానికి సంబంధించిన వితంతువును పెళ్ళాడాడాయె! ఇతరత్రా అన్ని హంగులూ వున్నా, ఈ లోపాలున్నాయి గనుకనే ఆనంది కింతవరకు పెళ్ళికాలేదు.

దండపాణి తమ కులంవాడు. ఒంటిపిల్లి రాకాసిలా ఒకేఒక కూతురినికాక, నలుగు రయిదుగురు కొడుకులనూ గలవాడు. రేపు అణ్ణామలై కేదయినా అవసరం వచ్చినా ఒకరికి నలుగురుగా బావలూ, మఱదులూ వచ్చి సాయంగా నిలబడగలరు.

కనుక అణ్ణామలై విషయంలో మేస్త్రీ ఒక నిర్ణయానికి రాగలిగారు. కాని కదిరేశన్‌తో సంబంధం తెంచివేసుకోవడం ఆయనకు కష్టంలేదు. ఆయన ఇల్లు, తోట, ప్రవర్తన, ఆనంది నడత అన్నీ ఆయనకు నచ్చాయి. కనుకనే ఒండొరులకు సాయంగా వుండాలన్న తమ సూత్రంమేరకు కదిరేశన్‌కు సాయపడాలనుకున్నారు.

మాణిక్యానికి ఆనందినిచ్చి పెళ్ళిచేస్తే ఏం? కదిరేశన్‌కు మగబిడ్డంటూ లేడు. మాణిక్యానికి వేరే దిక్కూలేదు. ఇంటికి అల్లుడిగా వుండిపోతాడు. ఒకరి కొకరు తోడు!

మేస్త్రీగా రింటిపని పూర్తి అవవచ్చింది. అది చూస్తూ ఒకనాడు సాయం కాలం మేస్త్రీ, కదిరేశను చెట్టుక్రింద కుర్చీలలో కూర్చుని మాట్లాడు కుంటున్నారు.

"నా ఇంటిపనీ పూర్తి కానున్నది. ఇక పెండ్లి ఒకటి చేయాలి.'' అన్నారు మేస్త్రీ కదిరేశన్ ఆతురతతో ఆయన మొహంవైపు చూశారు ''మీరెట్లా ఒక కూతురి నింట్లో వుంచుకుని ఆలోచిస్తున్నారో నేనూ నా పెద్దబ్బాయి మాణిక్యం గురించి చింతిస్తున్నాను.''

కదిరేశన్ మాట్లాడలేదు. ఆయన ముఖం కాస్త వాడినట్లయింది. మాణి క్యానికి బుద్ధి, నైపుణ్యం, దీక్ష వున్నాయి కాని అతడిలో చెప్పరాని లోపేదో వున్నట్లనిపించిం దాయనకు. ఇంగితజ్ఞానం, సంప్రదాయం, నాగరికత వంటివి ఆయన మనసులో మెదిలాయి. వాటిలో ఒకటో రెండో మాణిక్యంలో లోపిందా యేమో...

''యేదో ఆలోచిస్తున్నట్లున్నారు? మీకు ఇష్టం అయితే ముడివేయించేద్దాము. స్నేహంతో మొదలయింది; వృత్తిరీత్యా పెరిగింది; ఈ సంబంధంతో ముడిపడ నివ్వండి—''

''బాగానే వుంటుంది...'' అని ఆ పైన మాట్లాడకుండా వెనుకాడారు కదిరేశన్.

''చెప్పండి—''

''అణ్ణామలైకు ఆనంది నిమ్మని అడుగుతారేమో ననుకున్నాను. అలా అడిగి వుంటే ఆలోచించవలసిన అవసరమే వుండేదికాదు. పెళ్ళి రెండేళ్ళ తర్వాతయినా చేయవచ్చు—''

''ఆ అదృష్టానికి నేను నోచుకోలేదు.'' అన్నారు మేస్త్రి. ''నేనా భాగ్యాన్ని ఇదివరకే కోల్పోయాను. మా మారపుచుట్టం దండపాణి కిచ్చిన వాగ్దానం ఇప్పుడు అడ్డుగా నిలుస్తున్నది. ఆడినమాట తప్పడం నా కలవాటులేదు. అంచేతనే ఆనందిని మా ఇంటి పెద్ద కోడలుగా చేసుకోవాలని ఆశిస్తున్నాను.''

కదిరేశన్ నిరుత్తరులయ్యారు. దండపాణి మేస్త్రిగారల మధ్య ఇట్లాంటి ఒప్పందం వుందని ఆయనకు తెలియదు. ఇంక మేస్త్రిగారితో ఈ విషయమై మాట్లాడడాని కేముంది? ఆయన మౌనం దాల్చారు. మాణిక్యం మితిమీరిన తెలివి తేటలూ, ప్రయోజకత్వమూ కొద్దిగా భయాన్ని కల్గించాయి ఆయనకు. అతడి బాహ్య స్వరూప స్వభావాల నాధారంగా అతడి అంతరంగాన్ని బేరీజువేసినా ఆయన సంశయం సంశయంగానే వుండిపోయింది. అతడితో పోల్చితే అల్లుడిగా అణ్ణామలై పైమెట్టుమీద వున్నవాడు - అంతే, కాదు. ఇద్దరిలోను అణ్ణామలై నచ్చాడు; అంతే! అదీగాక అణ్ణామలై పట్ల ఆనంది భావాల నాయన ఊహించగలిగారు.

ఇదమిత్థమని చెప్పేముందుగా తేల్చుకోవలసినవి చాలా వున్నా యని పించింది.

''ఏమంటారు?'' అనడిగారు మేస్త్రి.

''ఆలోచించి చెబుతాను ఆనంది అన్నీ తెలిసినపిల్ల. రేపు పెళ్ళయ్యాక అతడితో నాలుగు కాలాలు కాపురం చేయవలసిన మనిషి ఆమే కదా? కనుక ఆమె మనసేమిటో తెలుసుకున్నాక మీతో మాట్లాడుతాను.''

"నిదానంగా చెప్పండి. తొందరేమీలేదు. అయితే ఇది కాదని వేరే సంబంధం చేయాలని వుంటే, చేయగలిగితే తప్పక చేయండి; నా సలహా నొక ప్రతిబంధకంగా భావించకండి. అలా కాని పక్షంలో ఈ అవకాశాన్ని జారవిడవకండి. ఆనందికీ ఈ మాట చెప్పివుంచండి"

కదిరేశన్ శరీరం వణికింది. ఆనందితో ఈ విషయం ఎట్లా చెప్పడం?

# 30

మేస్త్రీగారు ఆనందిని మాణిక్యానికిచ్చి పెళ్ళి చేయమని తమ్ముకోరిన విషయాన్ని కదిరేశన్ ఆనందితో చెప్పలేదు. కాని మేస్త్రీ ఆ విషయాన్ని మాణిక్యంతో చెప్పడమేకాక — "ఆనంది మనసు కనుక్కొని సమాధానం చెబుతానన్నారు" అని కూడా చెప్పారు.

కదిరేశన్ ఆనందితో ఈ వూసెత్తక పోవడానికి కారణా లున్నాయి. ఈ మాట వింటే ఆనంది మనసు నొచ్చుకుంటుందేమో; అదీగాక ఈ సూచన తండ్రి అభీష్టంగా భావించి, దానిని కాదనలేక, తనకు ఇష్టంలేని దానికి ఒప్పుకుంటుం దేమో - ఈ రెండు రకాల పరిస్థితులనూ ఆయన సృష్టించదలచుకోలేదు. అదీగాక అణ్ణామలై కోసం సుందరి వుందని ఆనందికి తెలియకుండా వుంటుందా?

చివరిమాటగా మేస్త్రీ చేసిన హెచ్చరిక కదిరేశన్‌ను కలచివేసింది. కులాన్ని, సంప్రదాయాన్ని కాదన్న వారి ఆడబిడ్డ కింకో సంబంధం దొరకడం అంత సులభం కాదన్న విషయాన్ని సున్నితంగా చెప్పారు మేస్త్రీ. మాణిక్యాన్ని కాదంటే మరొకరు దొరకబోరు అన్నట్లు చెప్పాడాయన. 'అలాగని ఆనందిని మాణిక్యానికిచ్చి పెళ్ళిచేసి తీరాలా ఏమిటి? పెళ్ళిచేసుకోకుండా కన్యలుగా ఎంద రాడవారు జీవించడంలేదు? ఆనందికూడా అలా వుండిపోనీ— ' అని కూడా ఆలోచించా రాయన. ఆమె కిష్టంలేని జీవితాన్ని ఆమె నెత్తిన రుద్దడం కదిరేశన్ కిష్టంలేదు.

కాలం గడుపుతూ వచ్చారు కదిరేశన్. మేస్త్రీగారూ మళ్ళీ ఆ విషయం మాట్లాడలేదు. కాలం సాయంతో దేనినయినా తన కనుకూలంగా మార్చుకోగల సామర్థ్యం మాణిక్యానికి వుంది అని మేస్త్రీ విశ్వాసం. అందుకనే అప్పటికా బాధ్యత నతడికే వదిలిపెట్టారు.

పరిస్థితులూ వారి కనుకూలంగా ఏర్పడసాగాయి. మేస్త్రీగారూ క్రొత్త ఇంట్లోకి కాపురం వచ్చేశారు. మాణిక్యం క్రొత్తఇంటి మేడమీద కాపురం పెట్టాడు. ఆనంది బి. ఏ ఉత్తీర్ణురాలయి చదువు చాలించుకుంది. సుందరి, ఆనందితో చెప్పినట్లు పరీక్ష కోల్పోయి; ఇంక చదవడం మానుకుంది.

మేస్త్రీగారి గృహప్రవేశ ఉత్సవ సందర్భంగా దండపాణి అణ్ణామలై కొక స్కూటర్ బహూకరించారు అణ్ణామలై ఆ ఏడాది కృతార్థుడయి, వర్ణచిత్రాల తరగతికి వచ్చాడు. అది నెపంగా దండపాణి వెనకటికి చేసి, నెరవేర్చుకోని తన వాగ్దానాన్ని ఇప్పుడు నెరవేర్చారు.

గృహప్రవేశపు ఏర్పాట్లన్నీ మాణిక్యమూ, సుందరీ చూసుకున్నారు. ఈ అనవసరపు గొడవలంటే ఇష్టంలేని అణ్ణామలై ఇతర అతిథులవలెనే దూరంగా వుండిపోయాడు. సుందరికూడా అతడిని నలుగురి మధ్యకు లాక్కురాలేకపోయింది. క్రొత్త స్కూటర్‌కూడా అనవసరమైన శ్రమగా అనిపించింది అణ్ణామలైకు.

సుందరి ఆనందిని తీసుకువెళ్ళి క్రొత్త స్కూటర్‌ను చూపించి — "మీరూ మీ నాన్నగారితో చెప్పి మాణిక్యంగారి కిలాటిది కొనిపించండి. ఆతర్వాత ఆయన డ్రైవరుగా మీరూ స్కూటర్‌మీద కూర్చుని హాయిగా ఊరంతా తిరిగిరావచ్చు !—" అంది.

ఆనందికి అన్నీ స్పష్టంగా విశదమయినాయి. మొదటిసారి కలిసినప్పుడే సుందరి — 'మీకు నచ్చినవారిని త్వరగా పెళ్ళాడండి' అని ఎవరి గురించి చెప్పిందో బోధపడింది. ఈ రెండిళ్ళూ ప్రక్క ప్రక్కగా కడుతున్నప్పుడామె మనసులో కట్టుకున్న రమ్య హర్మ్యాలను - ఆ ఇళ్ళు పూర్తికాగానే పడగొట్టుకోవలసి వచ్చింది. మట్టిమేడకు గృహప్రవేశం జరిగిన అదే క్షణాన మనోసౌధానికి అంత్యక్రియలు జరపాల్సి వచ్చింది.

ఆ ప్రక్క ఇంటిలోకి వాళ్ళు కాపురం వచ్చాక, అణ్ణామలై మాణిక్యమూ ఆ ఇంట్లో వుంటున్నా, మాణిక్యం మాత్రం ఈ ఇంటికి ఒంటరిగా వచ్చేవాడు. ఆమె బి. ఏ. పాసయిన సందర్భంగా అతడు వంద రూపాయల ఖరీదుచేసే వెండిపెట్టె నొకదానిని ఆమెకు కానుకగా ఇచ్చాడు; ఆ ఇవ్వడం కదిరేశన్ ఎదుట ఇచ్చినందున ఆమె నిరాకరించలేకపోయింది. సోపుపెట్టి, పౌడర్ డబ్బా, దువ్వెన, అద్దం అన్నీ వున్న వెండిపెట్టె అది.

ఎన్నోసార్లు అత డామెను ఏకాంతంగా కలుసుకున్న సందర్భాలున్నా అతడు నోరు తెరిచి అడగలేదు. అడగడాని కతడికి ధైర్యం చాలలేదు. అదిగాక ఆమె నిరాకరిస్తే, ఇంక ఆ ఇంట్లోకి అడుగుపెట్టలేనని అతడికి తెలుసు. ఆమె తన భాగ్యదేవత. ఆమెను ప్రసన్నం చేసుకోవడానికి ఏమేమి చేయాలో అవన్నీ చేయ సాగాడు. నోరుతెరిచి తన మనసును బయటపెట్టలేదేగాని ఆమె కోసం తాను తపిస్తున్న విషయాన్ని ప్రదర్శించ సాగాడు.

ఆనంది కిదంతా దుర్భరమయింది. ఇంకా ఇంకా ఓరిమి వహించడం కష్ట మనిపించింది. అణ్ణామలై తన్నుగురించి ఏమనుకుంటున్నాడో తెలుసుకుని తీరాలి! తలితరులందరూ ఏకమయి, ఈ ప్రపంచమంతా ఒక్కటయి ఆయనకు సుందరికి పెళ్ళి చేయాలనుకుంటే అలాగే కావచ్చు - కాని 'ఆయన మనసులో ఏముంది? సుందరి అంటే ప్రేమా లేక ఆకర్షణా? లేక రెండింటికీ మధ్య వ్యత్యాసం ఆయనకు తెలియడం లేదా?'

అణ్ణామలై గురించి అహోరాత్రాలు ఆలోచించి కుమిలిన ఆనంది ఒక రోజు, అతడి వద్దకే వెళ్ళి మాట్లాడుదా మనుకుని వాళ్ళింటికి బయలు దేరింది. అణ్ణామలై కళాశాలనుండి వచ్చేవేళ అది. మీనాక్షమ్మతో కాసేపు మాట్లాడి అణ్ణామలై గది లోకి వెళ్ళింది. ఎప్పటిలా అతడి పుస్తకాలు ఆలమారలో వున్నాయి. వాటిలో కొన్నిటిని తీసుకుని ముందర పడేసుకుని తిరగవేయ సాగింది.

అతడితో ఎలా మాట్లాడడం అని ఆమె మనసు ఆలోచించసాగింది. 'ఉన్న ట్లుండి ఏమిటి అడగడం? ఎట్లా అడగడం? "మీకు నామీదవున్న ప్రేమ ఎటు వంటిది? సుందరిమీద వున్న ప్రేమ ఎటువంటిది?" అని అడిగేయడానికి వీలు కాదుగదా? అట్లా అడగడం బొత్తిగా బాగుండదు—' అని తనలోతానే చర్చించుకో సాగింది.

ఏవేవో ఆలోచిస్తూ చిత్రాలున్న పుస్తకాలను తిరగవేస్తున్న ఆనంది, ఒక పుస్తకంనుండి ఒక చిత్రం జారి క్రింద పడడం చూచింది.

దానిని తీసుకుని చూచిన ఆనంది శరీరం కంపించింది.

సాధారణంగా అణ్ణామలై వేసిన చిత్రాలను చూచినప్పుడు ఆమె కళ్ళు వెలిగేవి. ఇప్పు డామె కళ్ళు చీకట్లు క్రమ్మాయి.

కళ్లు తుడుచుకుని, గుండెను రాయిచేసుకుని ఆ చిత్రాన్ని పరిశీలించి చూసింది ఆనంది. అది సుందరి చిత్రం.

సుందరి చిత్రానికని ఇట్లా ఎట్లా కూర్చోగలిగింది? అణ్ణామలై మాత్రం ఈ స్థితిలోవున్న ఆమెను చూచి చిత్ర మెట్లా రచించగలిగాడు? తన కళ్ళను తాను నమ్మలేకపోయింది ఆనంది.

అనాదిగా ఆడదాని శరీరం అందం శిల్పులకు, చిత్రకారులకు ప్రేరణ ఇస్తూ వచ్చినమాట నిజమే; వారి కళాభివృద్ధికి దోహదంచేసిన మాట నిజమే. చిత్రకారుడి తనయ అయిన ఆనంది కిది తెలియంది కాదు.

అయితే 'మాడల్' అన్నది వేరు; సుందరి వేరు. ఎంత మనసునే అర్పించిన ఆడదయినా, అది భార్యే అయినా ఈ దేశపు ఆడది ఇలాటి 'పోజ్' నెలా ఇవ్వగల్గింది? ఒకవేళ ఆతడి ఎదుట వున్నది అదే వృత్తిగా స్వీకరించిన తరగతిలోని 'మాడల్' అయినా, ఆమె ఇట్లా చిత్రకారుడిని కళ్ళప్పగించి చూడదు ఆమె ముఖంలో, అంగాంగాల్లో ఈ భావాలు ప్రతిఫలించవు. ఇట్టి స్థితిలోవున్న ఆడదానిని చూచి అణ్ణామలై మనసు చలించకుండా ఎట్లా చిత్రం గీయగలిగాడు?

అంతవరకు అణ్ణామలైమీద ఆమెకున్న గౌరవం బదులుగా జుగుప్స ఏర్పడింది. ఛీ! మగవాళ్ళందరూ ఇంతేనా? మాణిక్యంవంటి మూసలలో పోత పోయబడిన వాళ్ళేనా? ఇంక ఆమె ఆ చిత్రాన్ని చూడలేకపోయింది. దానిని చింపి పారవేద్దా మన్నంత ఉద్రేకం వచ్చిందా ఆమెకు.

బయట స్కూటర్ వచ్చిన శబ్దం అయింది ఆనంది ఆ బొమ్మను నోట్ పుస్తకంలో వుంచి, పుస్తకాన్ని యథాస్థానంలో వుంచింది. ఆతడు వచ్చేలోపుగా అక్కడినుండి లేచి వెళ్ళిపోవా లనిపించింది ఆమెకు. అయినా ఆశ ఆమెను వీడ లేదు. తాను వచ్చిన పనిని గుర్తుచేసుకుంటూ, లేచి కిటికీదగ్గర నిలబడి బయటికి చూసింది.

స్కూటర్‌మీద అణ్ణామలై ఒక్కడేకాదు, పవిట గాలిలో ఎగురుతుండగా సుందరి వెనకాతల కూర్చునుంది. ఆమె కుడిచేయి అతడి భుజంమీద వుంది.

వేగంగా వచ్చిన స్కూటర్‌ని ఆపడంతో ఆమె అతడి వీపుకు ఢీకొంది; వెంటనే క్రిందకు గెంతింది. ఆపైన ఆనంది అక్కడ నిలవలేకపోయింది.

చరచర లేచి వాళ్ళకంట పడకుండా దొడ్డిదారిని వాళ్ళింటినుండి బయటపడి తమ ఇంట్లోకి వచ్చింది ఆమె.

కలలన్నీ బూడిదయిపోయిన ట్లనిపించింది ఆమెకు. నాన్న, అవ్వ, ఇల్లు, వాకిలి, తోట, పువ్వులు, చిత్రాలు, శిల్పాలు, చదువు - అన్నీ అర్థరహితంగా అనిపించాయి. తాను పిరికినని, బ్రతకనేర్వని దానినని నిందించుకుంది. మొదట అతడితో దగ్గరగా మెలగడం ప్రారంభమయినప్పుడే తన మనసు నతడికి విప్పి చెప్పివుండ వచ్చునుకదా ? ఒకనాడు సాగర తీరాన అతడు తన మనోభావాన్ని వ్యక్తం చేసినప్పుడే తనకూ అటువంటి భావమే వుందని చెప్పివుండవచ్చును కదా ?

మేడమెట్లమీద ఎవరో వస్తున్న చప్పుడయింది. ఏదో పోగొట్టుకున్నవాడిలా మొహం పెట్టుకున్న మాణిక్యం వచ్చి చేరాడక్కడికి. తటాలున లేచి దీపాన్ని వేసిన ఆనంది అతడి మొహాన్నిచూచి నిశ్చేష్టురాలయింది. ఆమె అజ్ఞాతమలై ఇంటికి వెళ్ళడాన్ని, వెనక్కు రావడాన్ని అతడు తన గదిలోనుండే గమనించాడన్న విషయం ఆమెకు తెలియదు.

''నేను ఉద్యోగం పోగొట్టుకుని ఇలా బాధపడుతూ వున్నాననుకోండి, మరి మీ రెందుకలా దిగాలుపడి కూర్చున్నారు ?'' అని అడుగుతూ పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు !

కష్టంలో ఇ కొకరి కష్టం కాస్త ఊరట కల్గించిన ట్లనిపించింది ''నాకేమీ లేదు. మీకేమి కష్టం ?'' అని అడిగింది ఆనంది.

తనకు వచ్చిన కష్టాన్ని చాల దుఃఖపూరితమైన స్వరంతో చెప్పుకున్నాడు మాణిక్యం. ఇల్లు కట్టడానికని వున్న ఉద్యోగాన్ని విడిచి రమ్మని చెప్పారు మేస్త్రీ; వచ్చాడు తను. వచ్చినపని అయింది. కాని ఇపుడు ఆ నెలనెల జీతంవచ్చే ఉద్యోగాని వెళ్ళడానికి వీలులేదు. ఇంటి ఖర్చులకు మేస్త్రీగా రేవో దబ్బులిస్తున్నా, ఏ పనీ చేయకుండా దబ్బెట్లా తీసుకోవడం ?

అతడు భాగస్వామిగా మేస్త్రీగారు వ్యాపారం మొదలుపెట్ట నున్నారన్న విషయం అతడు ఆమెతో చెప్పలేదు.

"మా ఇల్లు కడదామని వచ్చి, వున్న వుద్యోగాన్ని పోగొట్టుకున్నారు మీరు. మా వల్ల మీకు ఎంత కష్టం ?" అని బాధపడింది ఆనంది.

"ఇంకొకసారి అట్లా అనకండి. మీ కోసం కష్టపడడం నాకు లభించిన అదృష్టం —''

''మీరూ మేస్త్రీగారూ మాకోసం ఎంతో శ్రమపడ్డారు. లేకపోతే ఈ రోజు లలో మేము ఇలాంటి ఇల్లు కట్టగలిగేవాళ్ళమా ?''

''మేస్త్రీగారయినా ఊరకే చేయలేదుకదా, వారికి మీరు సగం నివేశనాన్ని ఇచ్చేశారుగా—''

అక్కడికి తానొక్కడే ప్రతిఫలాపేక్ష లేకుండా కష్టించే వాడిననీ, అట్లాటి తననుకూడా మేస్త్రీ తన లాభానికి వాడుకుంటున్నారనీ ధ్వనించేటట్లుగా మాట్లాడాడు మాణిక్యం. అతడి మాటలు నిజమే ననిపించాయి ఆనందికి. పేదవారంటే జాలిపడే ఆనందికి అతడి స్థితిచూసి మనసు కరిగింది. ఉద్యోగం దొరకడం దుర్లభం అయిన ఈ రోజులలో వున్న పుద్యోగాన్ని కోల్పోయిన అతడి కోసం ఆమె బాధ పడింది.

కొంత సేపు నిశ్శబ్దంగా వున్నాక మాణిక్యం బాధగా ఆమెను చూస్తూ - ''మీతో ఒక విషయం మాట్లాడాలని అనుకుంటుంటాను. కాని ఎంత ప్రయత్నించినా వీలు కావడంలేదు; మీకూ ఆ విషయం తెలిసే వుంటుంది..." అన్నాడు.

ఏమి మాట్లాడనున్నాడోనన్న భయం పట్టుకుంది ఆమెను. అతడు వున్నట్లుండి ఇట్లాటి స్థితి తెస్తాడని ఎదురుచూడలేదామె. అక్కడనుండి లేచి వెళ్ళి పోదామా అన్పించింది.

"మేస్త్రీగారు మా తండ్రిగారిని నాకోసమని మీ సంబంధాన్ని కోరారుట. వారు మిమ్మల్ని కనుక్కొని చెబుతా నన్నారుట..."

"నాన్నగారు నాతో ఏమీ మాట్లాడలేదే ?'' అని తొట్రుపాటుతో అక్కడి నుండి లేచింది ఆనంది. ఆమె శరీరం వణుకుతూంది'' రేపు మాట్లాడుదాం లెండి; ఇవాళ నా మనసు బాగులేదు.''

ఆనంది నెమ్మదిగా అక్కడినుంచి నడిచి మెట్లదగ్గరకు వచ్చింది. అతడిని బయటకు వెళ్ళమనడానికి మనసు ఒప్పుకోనందున తానే బయలుదేరింది. తటాలున మాణిక్యమూ లేచి, దీపం ఆర్పి, ఆమెవెంట బయలుదేరాడు.

అతడికి ముందుగా, వసివాడిన తీగలా నడుస్తున్న ఆనంది రూపం అతడి నేదో చేసింది. ఎవరికోసమో ఆమె సిగలో తురుముకున్న మల్లెల సౌరభం అతడిని నిప్పులతో కాల్చింది. చీకటిలో అతడు అతి సమీపంగా వెనకాల వస్తుండడం ఆమె గమనించలేదు.

''ఆనందీ !'' జీరపోయింది అతడి గొంతు. దిగ్భ్రమచెంది తిరిగి చూసింది ఆనంది.

అంతే......

లిప్తకాలంలో ఏమి జరిగిందో ఆమెకు తెలియలేదు. అతడి చేతులు ఇనుప సంకెళ్ళై తన్ను బంధించాయని, బండ ఒకటి తన హృదయానికి తగిలి ఊపిరాడకుండా చేసిందని, నిప్పు తన లేలేత పెదవులకు వాతలు పెట్టిందని - ఆమెకు సరిగా తెలియలేదు.

క్షణంలో అంతా జరిగిపోయింది. కళ్ళు బైర్లు క్రమ్మాయి ఆమెకు. కాళ్ళు అచేతనములయ్యాయి. బలమంతా కూడదీసుకుని అతడి నొక్క తోపు త్రోసింది.

మెట్లమీద పడ్డవాడు ఆమె పాదాలను గట్టిగా పట్టుకుని, ఆమె పాదాలచెంత తలనుంచి పడివున్నాడు.

"దీనిని గురించి మీ రెవరికయినా చెప్పదలచితే నేను సముద్రంలో దూకి ప్రాణాలు కోల్పోయాకనే చెప్పండి !''

తానే సముద్రంలో దూకి ప్రాణాలు కోల్పోగల్గితే ఎంత బాగుండును - అన్పించింది ఆ క్షణాన ఆనందికి.

# 32

'నిప్పు చేసిన గాయం మానుతుంది; నాలుక చేసిన గాయం మానదు' అని వస్తున్న సూక్తి అయితే నాలుక ఉమ్మికి ఒక పదును అత్మను కాల్చివేసే గుణం వుందని మాణిక్యం నిరూపించాడు. ఉమ్మి అమృతమని పాడిన కవివరేణ్యులు దానిలోని విషం గురించి రాయడం మరిచారు కాబోలు. ఆ విషపు కాటుయొక్క వేదనను ఆనంది ఆ రాత్రి అంతా అనుభవించింది.

తెరిచిన కళ్ళతోనే బావిలోపడ్డ అదరుపాటు. దేహమంతటా బురద చల్లిన జుగుప్స, శరీరంలోపల నిప్పు రాజుకున్నట్లు మంట — ఇవన్నీ కలిసిన బాధ.

చచ్చిపోతే బాగుండును కానీ ఆ మాణిక్యం తాను సముద్రంలోపడి చస్తానని కాళ్ళు పట్టుకుని మరీ ఏడ్చాడు. అతడు అట్లా ఎన్నటికీ చేయలేదని ఎందుకో ఆమెకు తెలియలేదు. ఇద్దరి చావుతో సమస్య తీరిపోతే బాగుండును. కాని అట్లా చేస్తే ఇద్దరినీ కలిపి లోకం నానా మాటలూ అనడానికి అవకాశం కల్పించినట్లవుతుంది. తల్లికో తండ్రికో తీరని అప్రతిష్ఠ తేవడమవుతుంది. తల్లి ఎటూలేదు. ఆ వున్న తండ్రిఅయినా జీవితాంతం ఈ కళంకాన్ని మోయవద్దూ ?

మరణించాలని కోరినా ఆ మరణం బ్రతుకుకన్న హేయమైన దవడంవలన ఆ తలపును దూరం చేసింది. కాని బ్రతకడమూ దుర్భరమే ననిపించింది.

పాతకాలంలో ఆడవారిని గడప దాటరాదని నిర్బంధించడం చాల సబబనిపించింది ఆమెకు. మరి ఈ కాలంలో స్త్రీ పురుషులకు సమాన స్వాతంత్ర్యం అంటున్నారు. శీలం కోల్పోయి చెడుగా బ్రతకడానికి స్వాతంత్ర్యం కావాలా ? ఇతరుల స్వాతంత్ర్యాన్ని కాలరాచ సిద్ధమయ్యే వారి మధ్య, సజ్జనులు ఎలా మనగల్గడం ?

'ఆనందీ ! నువ్వు మన ప్రాత క్రొత్త సంప్రదాయాల మేలి కలయికగా వెలగాలమ్మా !' అని కదిరేశన్ పదేపదే చెప్పడం గుర్తుకు వచ్చింది ఆమెకు.

ఆమెను తన విషపు కోరలతో కాటువేసింది అర్వాచీనం 'దీన్తో నీ బ్రతుకు చట్టుబండలయింది' అని ఘోషిస్తోంది ప్రాచీనం. పాతపద్ధతినయితే అతడిని గుమ్మంలోకి రానివ్వకుండా అడ్డుపెట్టి వుండవచ్చును. క్రొత్తపద్ధతినయితే బుగ్గమీది అతడి ఎంగిలిని తుడిచివేసి, అతడి మొహాన కాండ్రించి వుమ్మి— 'ఫో ! ఇప్పుడే చచ్చిపో !' అని కాలితో ఎగిసితన్ని వుండవచ్చు. కాని రెండూ లేదు. ముసలిదయిన 'ప్రాత' ఇనుప పిడికిలిమధ్య, పిదప కాలంలో పండిన 'క్రొత్త' గందరగోళం మధ్య వూగిసలాడిందామె.

జరగరానిది జరిగి అజ్ఞామలైయేవచ్చి ఆమెను పెళ్ళాడాలని తపించినా ఇంక తను అతడిని పెళ్ళాడలేదు. పోనీ ఎప్పుడో ఒకప్పుడు, ఎవరో ఒకరిని పెళ్ళి చేసుకోవచ్చుకదా అనుకుందే అందుకు మనస్సంగీకరించడంలేదు. మానని

గాయం పడిన ఈ బుగ్గలతో ఈ జన్మలో ఇంకొకరి ప్రక్కన పెళ్ళిపీటలమీద ఎలా కూర్చోవడం ?

ఎలాగో తెల్లవారింది.

బయటి గదిలో, పత్రికలు చూస్తున్న కదిరేశన్ ప్రక్కన కూర్చుంది ఆనంది. ఆమె మొహం చూశారాయన. నిశ్చేష్టులయ్యారు. ఆమె నుదుటిమీద చేతియుంచి చూశారు; పెనంలా కాలింది. ఆయన ఆందోళనతో అడగగా, తన ఆరోగ్యం బాగానే వుందని దాటవేసింది ఆనంది. డాక్టర్‌ని పిలవనక్కర్లేదని, మందులు అసలు వద్దని మొండికి వేసింది.

పత్రిక నవతలవుంచి "ఏమిటమ్మా విషయం, నాతో చెప్పుతల్లీ !" అని ఆమె తల నిమిరారు కదిరేశన్. ఆయన స్పర్శకు కంపించింది ఆమె శరీరం.

"నాన్నా ! మేస్త్రీగారు మాణిక్యానికని నన్ను ఇమ్మని మిమ్మల్ని అడిగారట కదా ? నాతో ఈ మాట చెప్పలేదే మీరు ?"

కదిరేశన్‌కు నెత్తిపై సుత్తితో కొట్టినట్లయింది. కళ్ళుతోదురోంచి తదేకంగా చూశారామెను.

"ఈ విషయం నీతో చెప్పింది మాణిక్యమా, మేస్త్రీగారా ?"

"మాణిక్యం—"

"చెబితే ఏం ? మేస్త్రీగారడిగినంత మాత్రాన నువ్వు మాణిక్యాన్ని పెళ్ళి చేసుకోవాలా ఏమిటి ? ఇది విని దెయ్యంపట్టిన దానిలా ఇట్లా తయారవడమా, పిచ్చితల్లీ ! అడిగితే అడిగారు, వీలులేదు - అని ఇప్పుడే వెళ్ళి చెప్పి వస్తాను !"

"నన్నడిగి చెబుతా నన్నారటకదా, నన్నడగనే లేదే ?"

"నేనే ఒక నిర్ణయానికి రాలేకపోయాను. అలాటప్పుడు నిన్నడిగితే, నేనే కోరుతున్నానని నువ్వు తప్పుగా అర్థం చేసుకుని ఇష్టంలేని పెళ్ళికి సమ్మతిస్తావేమో నని సంశయించానమ్మా ! జీవింపవలసిన దానివి నువ్వు. నీ జీవితానికి ఇసుమంతయినా హాని జరగరాదనే నేను ఆలోచనలో పడ్డాను."

"నాన్నా !" అని ఆయన ఒడిలోకి ఒరిగిపోయి ఏడవసాగింది ఆమె.

ఇటువంటి ఉదాత్తమైన వ్యక్తికి కూతురిగా పుట్టి ఇలా అయానే అన్న ఆవేదన ఆమెను పిండివేసింది.

కాస్సేపయ్యాక సర్దుకుంది ఆనంది.

"నాన్నా ! మీకీ విషయం నన్ను మొదటే అడిగి వుండవలసింది. అడిగి వుంటే ఎంతో బాగుండేది."

''అడగనందున ఇప్పు డేమంయిదమ్మా ?"

ఏమయిందో ఆమెకే తెలుసు.

"నాన్నా ! నేనిప్పుడు పెళ్ళాడ దలిచాను. నేను కోరినవారితో నా పెళ్ళి జరిపించడానికి మీ రభ్యంతరం చెప్పరాదు."

అణ్ణామలై పేరు చెప్పనున్న దేమోనని భయపడ్డారు కదిరేశన్. తనకు అభ్యంతరం లేకపోయినా మేస్త్రిగా రొప్పుకోరు అని చెబుదామనుకున్నారు.

"నేను మాణిక్యాన్ని పెళ్ళాడుతాను. అదే నా నిర్ణయం; నా కోరిక."

తమ చెవులను నమ్మలేకపోయారు కదిరేశన్.

"ఆనందీ ! కుంద కాల్చిందని కుందనుండి జారి కుంపటిలోకి పడకూడదు. అణ్ణామలైను పెళ్ళాడడానికి వీలులేదని...

"కాదు నాన్నా కాదు. అణ్ణామలై, వారి నాన్నగారు కోరినా నాకా ఉద్దేశం లేదు."

చంచలమైన మనస్థితిలో ఆమె వుందనుకుని, ఆయన జీవిత భాగస్వామి ఎన్నికలో వుండవలసిన జాగ్రత్తను గురించి చాలాసేపు ఆమెకు చెప్పారు. కాని ఆమె కివేమీ వినపడలేదు; వినపడినా అర్థంచేసుకునే స్థితిలో లేదు.

"దయచేసి నా నిర్ణయాన్ని మార్చడానికి ప్రయత్నించకండి."

"నేనా పని చేయడం లేదమ్మా"—

# 33

మేస్త్రి మాణిక్యంతో, ఆనంది అతడిని పెళ్ళాడడానికి ఒప్పుకున్నదని చెప్పినప్పు డతడు నమ్మలేక పోయాడు. ఆమెతో అనుచితంగా ప్రవర్తించినందుకు వెరచి బయటకు రాకుండా వున్నా డతడు. తనకు ఏ శిక్ష లభించనున్నదో అని భయపడుతున్న వాడికి మొదట ఈ వార్తను నమ్మడం కష్టమనిపించింది.

మేస్త్రిగారు మాణిక్యాన్ని, అతడి తల్లి చెల్లమ్మలను పిలిచి కూచోబెట్టి అన్నీ వివరంగా చెప్పారు. తాము కదిరేశన్‌తో మాట్లాడిన వైనం వివరించారు.

''చెల్లెమ్మా! నువ్వూ, మాణిక్యమూ ఏ జన్మలో ఏ నోము నోచారోగాని, ఈ అమ్మాయి మీ ఇంటి దవుతూంది. సుమారు లక్ష రూపాయల ఆస్తితో సాక్షాత్తు లక్ష్మీదేవే మీ ఇంటికి రానున్నది. దాని నంతా కాపాడుకోవడం మీ వంతు. మనకు నిచ్చెనలు వేసినా అందని స్థాయి వాళ్ళది. ఇవన్నీ తెలుసుకుని పెద్దమనిషి తరహాగా నడచుకోవాలి!" అని చెప్పి అక్కడినుండి లేచారు మేస్త్రి. కదిరేశన్‌తో కలిసి చకచక పెళ్ళి ఏర్పాట్లు చేయాలికదా!

మతిపోయినట్లున్న మాణిక్యానికి ఇప్పుడిప్పుడే స్ఫురణ కలుగుతూంది. 'ఓహో! ఆనంది నన్ను ప్రేమిస్తూందన్నమాట. లేకపోతే నేను నా ప్రేమను తెలిపిన వెంటనే ఇట్లా పెళ్ళికి ఒప్పుకుంటుందా?' అనుకున్నాడు. ఇది ప్రేమ పెళ్ళేనని తోచగానే అతడి ఆనందానికి అవధులులేవు.

వెంటనే పెళ్ళికొడుకులా తయారయి తిన్నగా ఆనంది ఇంటికి వెళ్ళాడు మాణిక్యం. బయటి గదిలో కదిరేశనూ మేస్త్రీ మాట్లాడుకుంటున్నారు. క్రింద ఆనంది లేదని తెలిసి, హక్కుతో, ఉత్సాహంతో మాణిక్యం పైకి వెళ్ళాడు. గదిలో ఆమె మంచంమీద పడుకున్న దృశ్యం చూడగానే అతడి ఆనందం పరవళ్ల తొక్కింది.

చప్పుడుకు అదిరిపడి తిరిగిన ఆనంది అతడిని చూసింది. దూరంగావున్న కుర్చీని చూపించి "అట్లా కూర్చోండి!" అంది. ఆమె పడకమీదనుండి లేవలేక పోయింది.

"ఆరోగ్యం బాగులేదా?"

"బాగుంది!" అని నిర్వేదంతో చెప్పి, తనకు భర్తకాబోయే వాడిని నిర్వికారంగా చూసింది ఆనంది. ఎవరో క్రొత్త మనిషిని చూచినట్లుంది ఆమె చూపు.

"ఆనందీ! చాల కృతజ్ఞుడిని!"

"చావు, పెళ్ళి - ఈ రెంటిలో ఒకటని తేల్చుకోవాలికదా - తేల్చుకున్నాను. మీకు సంతోషమేగా?" ఆమె గొంతు మూసుకుపోయినట్లయింది.

"ఆనందీ! నువ్వు ఇలాగంటే..." అంటూ ఆమె మందాన్ని సమీపించాడు మాణిక్యం. తన్నతడు ఏకవచనంతో సంబోధించడం విని అప్పుడే తనకు భర్తగా తన్ను భావించుకుంటున్నాడని గ్రహించింది ఆనంది.

"ఆగండి!" అని గద్దించింది. "మన పెళ్ళి జరిగేదాక మీరు నన్ను ఏకాంతంలో కలవరాదు; కలవకండి!"

ఆమె గొంతులోని నిశ్చలత్వం అతణ్ణి కలచివేసింది అది ఆజ్ఞలా వినబడింది. దానిని మీరితే వ్యవహారం చెడుతుందేమోనని భయపడ్డాడు.

నిరాశతో మెట్లు దిగుతున్న మాణిక్యానికి ముందురోజు అక్కడ జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది గులాబీని తేనెలో ముంచి కొరుక్కుతిన్నట్లు, గుండెలు కొట్టుకుంటున్న పావురపు గువ్వను పొదివి పట్టుకున్నట్లు వుండింది ఆ అనుభవం. 'ఛీ! అట్లా పిరికిలా వెళ్ళి ఆమె పాదాలమీద పడివుండకూడదు. ఆలా పడ్డందువల్లనే ఇప్పు డీమెగారు చిటారుకొమ్మ నెక్కికూచుంది' అని మండి పడ్డాడు.

ఇంటికి చేరాడు మాణిక్యం. కుంపటి దగ్గరవున్న చెల్లమ్మ అతడిని ఎగాదిగా చూసింది అత డెక్కడికి వెళ్ళి వస్తున్నాడో ఊహించిందామె. పెళ్ళి వార్త విన్నప్పటినుండి ఆమెకు ఒక ప్రక్క సంతోషం, ఇంకొక ప్రక్క భయం కలిగాయి. ఒక్కగానొక్క కొడుకు. ఎన్ని కష్టాలుపడి వాడిని పెంచిందో ఆమెకే తెలుసు. అలాటి వాడికి తానుగా ఒక పిల్లనుచూసి పెళ్ళిచేస్తే తన అధికారానికి లొంగేపిల్ల కోడలుగా వస్తే ఆమెకీ భయం వుండేదికాదు కొడుకుతేని కదిరేశన్‌కు తన కొడుకు నమ్మివేస్తున్న భయం. పట్నవాసంలో పెరిగి చదువుకున్న పిల్లకు కొడుకును ధారాదత్తం చేసుకుంటున్న భయం! జరగనున్న దానిని ఆపలేదు ఆమె - ఆమె మాటను మేస్త్రీ వినరు; మాణిక్యమూ వినడు.

"మాణిక్యం! మేస్త్రి చెబుతున్నారుకదా అని మనకు అదృష్ట వర్షం కురిసి పోతూందని భ్రమపడబోకు. అంతోటి అదృష్టంతెచ్చే పిల్లయితే మేస్త్రిగారు తన కొడుక్కి చేసుకోకుండా నీకు కట్టబెడుతున్నా రెందుకూ? ఇందులో వున్న మాయంతా నాకూ తెలుసులేరా!" అంటూ మొదలు పెట్టింది చెల్లమ్మ.

అసలే ఒళ్ళు మండిపోతూంది మాణిక్యానికి. తల్లిమాటల కింకా ఆగ్రహం కలిగింది. అయినా తమాయించుకుని— "అమ్మా ! పెళ్ళి అయ్యేదాక నువ్వో కాస్త వూరుకుంటే బాగుంటుంది !" అన్నాడు.

"ఔనురా ! అది ఇంట్లోకి రాకమునుపే నా మాటలు నీకు చేదయిపోయాయి. ఆమె వచ్చేస్తే ఇంక అడగనేల ?" అని అంగలార్చింది ఆమె – "ఇం కెక్కడా సంబంధం దొరక్కపోతే దానిని నీ మెడకు కడుతున్నారా అబ్బీ ! దాని తల్లి మొగుడు పోయాక రెండో పెళ్ళి చేసుకుంది. ఈ విషయం నువ్వు దాచనక్కరలేదు. ఇది జగమెరిగిన విషయం—"

ఊహించని చోటినుండి, ఊహించని విధంగా ప్రాతికూల్యం వచ్చేసరికి తికమక పడిపోయాడు మాణిక్యం. మేస్త్రిగారి దగ్గరకు పరుగెత్తుకు పోయాడు మాణిక్యం. ఆయన్ను వెంటబెట్టుకుని అమ్మదగ్గరకు తీసుకొచ్చాడు. మేస్త్రిగారంటే చెల్లమ్మకు భయం. ఆమె ప్రాణమానాలను సంరక్షించిన వాడాయన. అంచేత ఆయన నయాన భయాన చెప్పి అప్పటి కామె నోరు మూయించారు.

"ఆ పిల్లమెడలో మూడుముళ్ళు పడేదాక నోరు మూసుకునివుండు. కొడు కెట్లాగయినా బాగా వుండాలనుకోక, ఏదో కొంప మునిగిపోయినట్లు అరుస్తా వెందుకు ?" అని కోప్పడ్డారాయన.

బలవంతాన కన్నీరు నణచుకుని మూలకువెళ్ళి పడుకుంది చెల్లమ్మ. ఈ చిక్కు వచ్చిందన్న కారణంతో మేస్త్రిగారూ, పెళ్ళికిముందు ప్రేమకు వీలులేక పోయిందేనన్న కారణంతో మాణిక్యమూ, త్వరగా పెళ్ళి జరగాలని తీవ్రంగా ప్రయత్నాలు చేశారు.

పెళ్ళి జరిగింది; ఆనంది మెడలో మూడుముళ్ళూ పడ్డాయి.

చెన్నపట్నంలో ధనవంతుల ఇండ్లల్లో, ధనవంతులు కాదలచినవా రిండ్లల్లో జరిగేలా హడావిడిగా జరిగింది పెండ్లి. ధనవంతులు కాదలచినవారు మాణిక్యమూ మేస్త్రిగారూ; వారు ఖర్చుపెట్టింది కదిరేశన్ డబ్బు; ఆయన చేతిలోది చాలకపోతే అప్పుగా తెచ్చిన డబ్బు.

పెండ్లి జరిగినప్పుడు అట్టామలై ఊరిలో లేడు. తంజావూరు జిల్లాలో సందారంచేస్తూ చిత్రాలు గీయడానికని కళాశాల వారితో కలిసి వెళ్ళిపోయాడు.

శారద మాత్రం ప్రత్యేకంగా సెలవు తీసుకుని పెళ్ళికని వుండిపోయింది. కాని అణ్ణామలై ఎవరితో చెప్పకుండా వెళ్ళిపోయాడు.

ఆనంది ఏకాంతంలో తన మాంగాల్యాన్ని కండ్లకద్దుకుంది. తన్నది క్రొత్త మనిషిగా చేయాలని, తనకు తన కుటుంబానికి క్రొత్త జీవితాన్ని ప్రసాదించాలని కోరుకుంది. ఆ నిముషాన ఆమె మాంగల్యాన్ని తడిపినవి ఆనందాశ్రువులేనా ? ఏమో ?

# 1

మద్రాసునుండి బస్సు నేర్పాటు చేసుకుని బయలుదేరిన చిత్రకళాశాల విద్యార్థి బృందం తంజావూర్ జిల్లా సంచరించాక కుడంద్రైకు చేరింది. ఆ ప్రయాణమే చాల వుల్లాసంగా వుండింది.

ఎక్కడ చూసినా వరిపొలాలు పచ్చటి తివాసీలు పరచి స్వాగతం పలుకుతున్నాయి కొబ్బరి తోపులు, అరటి తోటలు, చెఱకు పైర్లు, వెదురుచెట్లు నేత్రపర్వంగా నిలబడి వున్నాయి. అక్కడక్కడ వాగులు, కాలువలు, పిల్లకాలువలు గలగలమంటూ పారుతున్నాయి. గుంటలలో, తటాకాలలో అల్లిబిల్లిగా అల్లుకున్న తామర, కలువ తీగలు, వాటిమీద పువ్వులు - ఇవి పట్నంలో పుట్టిపెరిగిన వాళ్ళు చూడని దృశ్యం.

కాని అణ్ణామలై కిదేమీ పట్టలేదు. దేనిలోనూ ఆసక్తిలేదు. బస్సులో ఒక మూల కూచుని ఎడారిని చూస్తున్నవాడిలా చూస్తూ వచ్చాడు. కండ్లు తెరిచే వున్నాయిగాని చూపుమాత్రం ఎక్కడో శూన్యంలోకి సారించివుంది. అతడి జీవితంలో అంతకుముందెన్నడూ ఆ వేదన నెరగడు. ఎందుకీ దుఃఖమని అతడికే అర్థం కాలేదు.

కోవెలలు నిండిన కుడంద్రై ప్రాంతంలో ఆ విద్యార్థులు వివిధ బృందాలుగా విడిపోయారు. కొందరు ప్రకృతి దృశ్యాలను చిత్రించగా, కొందరు ఆలయాలను శిల్పాలను చిత్రించసాగారు. అలా దారివెంబడి వెళ్తున్న అణ్ణామలై, ఒక పాత గుడిని చూడగానే అందులోకి దూరాడు.

లోపల మండపంలో చీకటి గబ్బిలాల వాసన. పై కప్పంతా దుమ్ము. మసక చీకటికి కళ్ళు సర్దుకున్నాక అక్కడో శిల్పం ఎదుట స్తంభానికి చేరగిల బడ్డాడు. తలక్రిందులుగా వేలాడుతున్నాయి. గబ్బిలాలు.

పుస్తకం తెరిచాడు. తంజావూరి ఆలయ శిల్పసంపదసంతా గీచి దాచు కోవాలని ఆశ. కాని ఏమీ చేయలేక పోయాడు. చిత్ర రచన తెలియనివాడు గీచి నట్లు ఏదో నాలుగు పెన్సిలు గీతలు మిగిలాయి పుస్తకంలో. ఏమిటి ఈ తొట్రుపాటు ?

చెన్నపట్నాన్ని విడిచి దూరంగా పారిపోయి పనిలో మునిగిపోదామని ఇక్కడికి వస్తే, ఇక్కడా ఏమిటి ఈ వ్యాకులం ? ఏమిటి ఈ ఆవేదన ?

ఎవరేది చెప్పినా వినే స్వభావంకల అణ్ణామలై - ఈసారి శారద, సుందరి, మేస్త్రిగారు, మీనాక్షమ్మ, కదిరేశన్, ఇంతమంది నచ్చజెప్పినా, వేడుకున్నా, ప్రాధేయపడినా - వినలేదు. అంత మొండితనం అతడి కెట్లా వచ్చిందో ? ఒకవేళ ఆనంది గట్టిగా కోరివుంటే వుండేవాడేమో ? కాని ఆమే ఎక్కువగా కోరలేదు. 'ఔను ! నామీద ఆమె కింకేమి అక్కర ?' అని కుమిలిపోయాడు అణ్ణామలై.

పెళ్ళివార్త నతడికి మొట్టమొదట అందించినవాడు మాణిక్యమే ! మాణిక్యమూ ఆనందీ ప్రేమికులట !

ఆనంది తన నాన్నతో—'' నేను పెళ్ళిచేసుకుంటే మాణిక్యాన్నే చేసు కుంటాను. లేకపోతే నాకు పెళ్ళేవద్దు—" అందట. ఇది చెప్పి ఇంకా గొప్పలు చెప్పుకున్నాడు మాణిక్యం. 'నీకన్న అన్నివిధాలా నేను పైమెట్టుమీద వున్నవాడి నోయ్' అన్నట్లుండింది అతడి ధోరణి.

ఆ కబురు తాకిడికి తట్టుకోలేకపోయా డణ్ణామలై. ఇనుప పారతో మాణిక్యం తన హృదయాన్ని కొట్టినట్లయింది. అయినా మాణిక్యంమీద కోపంగాని ద్వేషంగాని కలగలేదు. అణ్ణామలై అతడితో మరీ దగ్గరగా ఎప్పుడూ మెలగలేదు కాని అతడు తన తల్లికడుపున పుట్టని సోదరుడిలాటివాడు. అలాగే మెలగేవాడు అణ్ణామలై.

'అయినా ఆనంది మాణిక్యాన్ని ఎట్లా ప్రేమించింది ? అతడికి తన హృద యాన్ని ఎలా అర్పించగల్గింది ? ఎట్లా ఆమె ఈ పెళ్ళికి తండ్రిని అంతగా కోర గల్గింది ? ఇదంతా ఎలా నమ్మడం ? ఎలా నమ్మడం ?' నమ్మ నిరాకరించాడతడు.

ఏడుపు వచ్చినంత పనయింది. మాణిక్యం ఎదుట ఎట్లాగో అణచుకుని, అతడు వెళ్ళిపోయాక వెక్కి వెక్కి ఏడ్చాడు.

ఎందుకు ?

అత డెందరో అమ్మాయిలను చూశాడు కాని ఆనందిని వారిలో ఒక్కతెగా భావించలేకపోయాడు. ఏదో స్వాప్నిక లోకానికి చెందిన కన్యగానే ఆమె అతడి మనసున నిలిచింది. మనములకు అందని దూరాన, ఎవ్వరికీ అందని ఎత్తున వుండి, గలగలమని నవ్వే చంపక కుసుమం ఆమె. దూరంనుండి ఆ అందాన్ని చూసి నిర్వికారంగా ఆనందించవచ్చు. చాపల్యంలేని చిత్తంతో ఆ దివ్య సౌరభాన్ని ఆఘ్రాణించవచ్చు. ఆమె దేవకన్నియ; అతిమానుష ప్రాణి.

అలాటి ఆమెకు మాణిక్యం ఎందులో ఈడు ? నాగరికతలోనా, సంపాదనలోనా, సంప్రదాయంలోనా, చదువులోనా ? అతడి నామె ఎట్లా ప్రేమించింది ? అయితే, అయితే ఆమెకూడా వందలాది ఆడవారిలో ఒక్కతేనా ? - అయ్యో, ఆనందీ !

అయితే ఆనందికోసం తా నింతగా కుమలడం ఎందుకో అతడికి అర్థం కాలేదు. తన మనో మందిరంలో పదిలపరచుకున్న దేవత నెవడో తగనివాడు కౌంగిలించి తీసుకుపోయాడన్న విషయం అత డప్పుడు కూడా తెలుసుకోలేక పోయాడు. పాపం అణ్ణామలై !

# 2

కోవెల మంటపపు చీకటికి అలవాటుపడ్డ అణ్ణామలై కళ్ళకు, అతడి ఎదుట వున్న శిల్పం విశదమవసాగింది. తదేకంగా చూశాడు. అద్భుతమైన పనితనంగల లక్ష్మీదేవి విగ్రహం అది. 'అయ్యో పాపం ! ఈ మంటపం ఒకనా డిలా చీకటి నిండిపోతుందని తెలిసికూడా ఇక్కడికి వచ్చావే—' అనుకున్నాడు. నిట్టూర్చాడు. ఆ తర్వాత ఏమీ తోచలేదు. తానూ ఒక విగ్రహం అయ్యాడు.

పెళ్ళివార్త విన్న రోజునుండి తన తరగతిలోనూ ఇదే వరస. ఇట్లాగే రాయిలా కూర్చుండి పోయేవాడు. ఏదో నాలుగు గీతలు గీచేవాడు; కానీ ఏదీ పూర్తి చేసేవాడుకాదు. శారద ఇదంతా గమనిస్తూ వచ్చింది.

ఒకరోజు మధ్యాహ్నం విరామ సమయంలో ఒంటరిగావున్న అతడిని సమీపించింది శారద. "మీరు నాలుగు రోజులుగా అదోలా వున్నారేం? మధ్యాహ్నం సరిగా భోజనంకూడా చేస్తున్నట్లు లేరే?"

"ఒంట్లో బాగులేదు." అన్నాడటు తిరక్కుండానే.

"మీకు ఒంట్లో బాగులేకపోవడానికీ ఆనంది పెళ్ళికీ ఏమయినా సంబంధం వుందేమో? మీరు నాతోకూడా ఏమీ చెప్పలేదే!"

"శారదా! మీ రిట్లా మాట్లాడరాదు!"

ఆమె ఆగలేదు. "పాపం ఆనంది! మీ నాన్నగారు మెను మాణిక్యంకోసం అడిగారన్న కారణంగా ఆమె అందుకు ఒప్పుకుంది. అలాకాకుండా ఆయన మీ కోసమని అడిగివుంటే ఆమె ఎంతో సంతోషించేది. ఇప్పుడామె మొహాన్ని చూడ లేకుండా వున్నాను. దెయ్యంపట్టిన దానిలా వుంది!"

అట్టామలైకు నడినెత్తిమీద కొట్టినట్లయింది. 'నా కోసం నాన్నగారామె సంబంధాన్ని అడిగివుంటే? అడిగివుంటే ఆమె సంతోషించేదా? ఇది నిజమేనా? మరి ఆమె తన్ను ప్రేమిస్తున్నట్లు మాణిక్యం చెప్పాడే? ఆమె తన తండ్రితోచెప్పి మరి ఈ పెళ్ళి కోరినట్లు చెప్పాడే? ఇప్పుడు శారదేమో ఆమె మొహం దయ్యం పట్టినదానిలా వుందంటున్నదే? ఇందులో ఏది నిజం? ఏది అబద్ధం?'

తన్ను ఆమె కోరుతుండ వచ్చునన్న విషయం తెలియగానే ఆమెకోసం ఏమయినా చేయవచ్చును అన్పించింది అట్టామలైకు. సుందరిని మరవవచ్చు; తండ్రిని ఒప్పించవచ్చు; ఆమె నిర్ణయాన్ని మార్చవచ్చు. మాణిక్యం మాటలు అబద్ధాలయితే, ఆనందిని తాను పెళ్ళాడ్డం అతడిని మోసగించడం కాదు—

—అతడంత వేగంగా స్కూటర్‌ని ఎన్నడూ నడపలేదు. అదృష్టవశాత్తు ఆపద ఏమీ లేకుండా అతడు గమ్యంచేరాడు. మొదట ఆనందితో మాట్లాడి తర్వాత మిగతా అందరితోనూ పోరాడవచ్చునని నిర్ణయించుకున్నాడు.

తప్పనిసరయితే ఆనందికోసం దేనినయినా, ఎవరినయినా వదలుకోవడానికి సంసిద్ధుడయ్యాడతడు.

సమయం అతడికి అనుకూలించింది. మేస్త్రి, కదిరేశన్, మాణిక్యం - ముగ్గురూ పెళ్ళికి వస్తువులు కొనడానికి బజారు వెళ్ళారు, ఇంట్లో ఆనంది ఒంటరిగా వుంది.

ముందుగదిలో పడుకునివున్న ఆనంది అతడని చూడగానే అదిరిపడి లేచింది. ఆమె వైఖరి శారద చెప్పినట్లే వుంది. అయినా ఎప్పటిలాగే చిరునవ్వుతో అతడికి స్వాగతం చెప్పి— "మీ రిటువైపు కనపడడమే మానేశారే ? కబురు తెలియగానే శుభాకాంక్షలు తెలుపడానికి వస్తారేమో ననుకున్నాను. మీ కిప్పుడే తీరికయింది కాబోలు !" అంది.

ఏమీ సమాధానం చెప్పాలో అతడికి తెలియలేదు. మనస్సును గట్టిచేసుకుని, ఆమె కళ్ళల్లోకి చూస్తూ— "మీ నుండి ఒక ముఖ్య విషయాన్ని తెలుసుకుందామని వచ్చాను. మీరు నాతో నిజం చెప్పాలి." అన్నాడు.

"ఏమిటది ?"

"మీరు...మరి... మీరు కోరే మాణిక్యాన్ని పెళ్ళి చేసుకుంటున్నారా ? లేక మా నాన్నవచ్చి అడిగారని అందు కొప్పుకున్నారా ?"

"ఇప్పుడెందుకీ జిజ్ఞాస మీకు ?" అని బాధతో అడిగింది ఆనంది.

"చెప్పండి - చెప్పండి" అని ప్రాధేయపడ్డాడు అజ్ఞామర్తై. అతడి కళ్ళల్లో నీరు తిరిగింది; గొంతు గద్గదమయింది.

"రెండు కారణాలూ వున్నాయి. మీ నాన్న కోరారు; పెళ్ళిచేసుకునేవారూ నన్ను కోరారు; నేనూ వారిని కోరాను."

"మీరు కోరడం నిజమేనా ?"

"ఉన్నట్లుండి ఇప్పుడు మీకీ సందేహం ఏమిటి ?"

"లేదు, ఏమీలేదు—"

"చెప్పండి—"

"శారద ఏదో చెప్పింది. మీ కిష్టం లేకుండానే జరుగుతూంది - అని చెప్పింది. నాన్నగారు నా కోసమని మిమ్మల్ని అడిగివుంటే మీరు సంతోషించే వారని చెప్పింది. నే సంతటి భాగ్యానికి నోచుకునివుంటే, మీ కది ఇష్టమయితే - అందుకోసం నేనేమి చేయడానికయినా సిద్ధమే. అయితే దయచేసి నా ఈ మాటలను తప్పుగా అర్థం చేసుకోకండి. మీ రట్లా అపార్థం చేసుకుంటే నేను భరించలేను. నా మనసులో చెడ్డతలపు లేదు; పేరాశ లేదు... శారద ఇట్లా చెప్పగానే తరగతి నుండి తిన్నగా మీ వద్దకు పరుగెత్తుకొచ్చాను—" ఒకే పట్టులో ఇదంతా చెప్పడానికి నానాయాతన పడ్డాడతను.

'అయ్యో !' అని రోదించింది ఆనంది హృదయం. మరుక్షణం ఆమె ఎద రాయిగా మారింది.

'ఎంగిలిపడ్డ దానిని ఈ దేవుడి కర్పించి మోసం చేయడమా ? ఎంతటి ద్రోహం అది ?' అనిపించింది.

"నేను మిమ్మల్ని ఎన్నడూ తప్పుగా అర్థం చేసుకోను. కాని మీరు శారద మాటలను నమ్మకండి. నేను నా కోరిక మేరకే వారిని భర్తగా స్వీకరిస్తున్నాను " అంది.

''సరే ! మీకు నా శుభాకాంక్ష లివిగో ! నేను వెళ్తాను. బహుశ పెళ్ళివేళకు నేను ఈ వూళ్ళో వుండనేమో, ఇంకో వూరికి వెళ్ళాలి.''

"అలాగే, వెళ్ళిరండి !'' అని నిశ్చలంగా జవాబు చెప్పింది.

అక్కడ అగ్నిసాక్షిగా ఆనంది మెడలో మాణిక్యం తాళికడుతున్న ఆ క్షణాన్నే ఇక్కడ అణ్ణామలై చీకటిలో లక్ష్మీదేవి విగ్రహం ఎదుట కూర్చుని వున్నాడు.

# 3

అణ్ణామలై మద్రాసు వచ్చేసరికి శరపరంపరగా విందులు జరుగుతున్నాయి. వధూవరులకు అటు మేస్త్రి ఇంట్లోను, కదిరేశన్ ఇంట్లోను విందు భోజనాలు జరుగుతున్నాయి. దండపాణిగారూ పెద్ద ఎత్తున ఒక విందుకు సన్నాహాలు చేస్తున్నాడు.

విందులు కాకుండా ఇంకా ఏవో తతంగాలూ జరిగాయి. అటుతర్వాత మేస్త్రి ఇంటి మేడనుంచి మాణిక్యం తన కాపురాన్నిక ఆనంది ఇంటికి మార్చేశాడు. ఇల్లరికపు అల్లుడిలా కొడుకు ఇట్లా వెళ్ళడం చెల్లమ్మకు ఇష్టం లేకపోయినా, మేస్త్రిగారి మాట కెదురాడ లేనందున ఒప్పుకుంది.

మొదట మొదట ఈ జరుగుతున్నదంతా ఏ నాటకమో, సినిమానో అన్పించేట్లుండింది మాణిక్యానికి. ఇప్పుడు అన్ని విధాలా తనకే స్వంతం అయింది. ఆమె బంగళా, తోట, నగలు, బట్టలు – అన్నీ అతడి వయినవి. ఇదంతా నమ్మశక్యం కాలే దతడికి. అత డప్పుడప్పుడు తనలో తానే నవ్వుకునేవాడు; మాట్లాడుకునేవాడు.

సమయం దొరికినప్పుడెల్లా ఆనందిని పిలిచి కూర్చోపెట్టుకోవడం, ఆమెతో మాట్లాడడం, ఆటలాడడం చేయసాగాడు.

ఒకనాడు మేస్త్రి ఇంట్లో విందయ్యాక మాణిక్యం మాత్రమే 'తన' ఇంటికి వచ్చాడు. పెళ్ళి హడావిడిలో అణ్ణామలై చిత్రాల విషయం కదిరేశన్ మరిచి పోయారు; ఇప్పుడు గుర్తుకొచ్చింది. అణ్ణామలై కూడా తాను తన సంచారంలో గీసుకొచ్చిన చిత్రాల నాయనకు చూపలేదు; చూపవద్దనే అనుకున్నాడు.

కాని కదిరేశన్ వాటి గురించి అడగగానే వెనకాడుతూ వచ్చి ఆయనకు తన పుస్తకాల నిచ్చాడు. అది తెలిసి అక్కడికి ఆనందీ వచ్చింది.

''బయలుదేరి వెళ్ళినప్పటినుండి ఆరోగ్యం సరిగాలేదు. ఒక్క చిత్రంకూడా సరిగా గీయలేదు.'' అన్నా డణ్ణామలై.

పుస్తకాలను తిరగేసి చూసి నిరాశచెందిన కదిరేశన్— ''మీరు హాయిగా ఇక్కడే వుండవచ్చును. పెళ్ళి సమయంలో అంతకన్న ముఖ్యమైన పని అని బయలుదేరి వెళ్ళారు. కాని అక్కడా మీ పని సరిగా జరగలేదు—'' అంటూ విచారాన్ని వ్యక్తంచేశారు.

ఆనందికూడా అతడి చిత్రాలను చూసి చకితురాలయింది. ఒక్కటయినా సరిగా లేదు. అంతా కొట్టివేతలే; గజిబిజే ... బాగా రూపొందనున్న చిత్రాలను కూడా అతడు తృప్తిలేనట్లుగా పాడుచేశాడు. బొమ్మలు పిచ్చివాడి గీతలవలె వున్నాయి.

'ఏమిటి ఈ పిచ్చి ?' అన్నట్లు ఆనంది అతడివైపు చూసింది. అణ్ణామలై మొహం తిప్పుకున్నాడు. ఆమె ఇప్పుడు పరాయిసొత్తు; మునుపటివలె ఆమెతో మాట్లాడడమో, మెలగడమో చేయలేకపోయా డతడు.

మేస్త్రిగారు వచ్చి అందరినీ మేడమీదకు తీసుకువెళ్ళారు. ఒకప్పుడు మాణిక్యంవున్న ఆ మేడమీద భాగం ఇప్పుడు అణ్ణామలైదయింది. అక్కడ క్రొత్త కుర్చీలు, మేజాచూసి కదిరేశన్ విస్మయమందారు.

ఆ మార్పుకు కారణం వివరించారు మేస్త్రి. మేడమీద అణ్ణామలైకని 'స్టూడియో' ఏర్పాటు చేయాలిట. వాడి 'వృత్తి' కొనసాగించడానికని సన్నాహాలు చేస్తున్నారట.

"అణ్ణామలై 'స్టూడియో' నిమిత్తం మీ రేమీ కొనకండి" అన్నాడు కదిరేశన్.

"ఎందుకలా అన్నారు ?"

"ఆయనకు కావలసిన వస్తువులన్నీ నావద్ద వున్నాయి. కనుక మీరు డబ్బు పెట్టి ఏమీ కొనవద్దు. నేను ఆ వస్తువులన్నీ ఇక్కడికి పంపే ఏర్పాటు వెంటనే చేస్తాను." అన్నారు కదిరేశన్.

మేస్త్రీ కిది బాగానే వుందనిపించినా వద్దు, వద్దన్నారు. కాని కదిరేశన్ వినలేదు. "నే నికముందు తిరుక్కురలూ, భగవద్గీతలతో కాలం గడపదలచాను, ఏవో బొమ్మలు గీచినన్నాళ్ళు గీచాను; ఈ వయసులో కాస్త చేయి వణకడంకూడా ప్రారంభమయింది. ఎప్పుడన్నా ఆశపుడితే ఒకటో రెండో బొమ్మలు వేస్తాను, అంతే! అందేత అన్ని సామాన్లు నా కక్కరలేదు. వాటి నిక్కడికి పంపిస్తే నా కొక బాధ్యత తీరినట్లవుతుంది... మీ ధర్మమా అని నా కీ ఇల్లు కట్టించి ఇచ్చారు. అమ్మాయి పెళ్ళి చేయించారు. ప్రతిగా నేను మీకు చేసిన దేముంది? కనుక అణ్ణామలైకు నన్ను ఇవి ఇవ్వనివ్వండి."

ఆ పైన ఇంకేమీ మాట్లాడలేకపోయారు మేస్త్రీ.

మరురోజు వస్తువు లన్నిటినీ ఆనందితో, వేలయ్యతో పంపివేశారు కదిరేశన్. ఆనంది వివాహంతో ఆయనకో విధమైన వైరాగ్యం ఏర్పడింది. ఆ భావన ఫలితమే ఈ అస్త్ర సన్యాసం!

కాని కదిరేశన్ చర్య మాణిక్యానికి నచ్చలేదు.

"వీ టన్నిటిని ఇప్పుడే ఇచ్చివేయాలా? కావాలంటే అతడే ఇక్కడికి వచ్చి చిత్రాలు వేసుకోవచ్చుకదా! రేపు మీ కివి అవసరం అయితే ఏమి చేస్తారు ?"

మాణిక్యం ఇట్లా అడ్డుచెప్ప బూనడం ఆనందికి తలవంపు లనిపించింది. మామూలుగా నయితే కదిరేశన్ ఘాటుగా సమాధానం చెప్పేవారే... కాని ఇప్పు డాయన కోపపడలేదు. 'నువ్వెందుకు ఇందులో తల దూర్చడం—' అన్నట్లుగా ఒకసారి చూసి ఇట్లా అన్నారు—" నాకు కావాలసిన వాటిని వుంచుకుని మిగతా వాటినే పంపిస్తున్నాను. అంతగా నాకు తర్వాత కావలసివస్తే నేను అక్కడికి వెళ్ళి గీచుకొవచ్చుకదా ?—"

మాణిక్యానికి మాత్రం తాను చాలకాలం కష్టపడి సంపాదించిన సొత్తును కోల్పోతున్నట్లనిపించింది. ఈ విషయంలో ఆనంది ఆమె తండ్రి వైఖరిని సమర్థి చడం అతగాడికి బొత్తిగా నచ్చలేదు.

# 4

బయటి వూళ్ళనుండి అణ్ణామలై గీసుకొచ్చిన రేఖా చిత్రాలను చూసి కదిరేశన్ వలెనే, అతడి కళాశాల ప్రధానోపాధ్యాయుడూ ముఖం చిట్లించారు. అసలు వూరికి బయలుదేరక ముందునుంచే ఆయన అతడిలోని మార్పును గమనిస్తూ వచ్చారు. అతడిలా మతిభ్రమణం చెందిన వాడిలా మారడం ఆయనకు అర్థం కాలేదు.

ఒక నెచ్చెలివలె ఆయన అతడికి చెప్పారు.

"ఇదిగో చూడు! ఇది చిత్రకళాశాల, ఇక్కడ వివాహితులున్నారు; కొందరు తమలో తామే వివాహాలకు సిద్ధమవుతున్నారు. ఒకవేళ నీ మనసును ఏ అమ్మాయి అయినా ఆకర్షించివుంటే, మంచి ఇంటి అమ్మాయి అయితే ఆమెను పెళ్ళాడు ఆలా చేసినందున నీ శిక్షణకేమీ భంగం వాటిల్లదు. లేదా ఆమెను పూర్తిగా మరిచిపో... అంతేకాని అనవసరంగా మనసుని గందరగోళంలో ముంచకు; చీకాకు పడకు. ప్రేమ అన్నది జబ్బు; అది పెళ్ళితో కుదరాలి; లేదా వైరాగ్యమే శరణ్యం. కనుక రెంటిలో ఒకటి చేయి; మనస్సును ఆరోగ్యంగా వుంచుకో. కళాకారుడికి మనసే మూలధనం— !"

ఆయన మాటలు వినగానే అణ్ణామలైకు రోషం వచ్చింది. మనస్సనే మూల ధనంతో అత్యుత్తమ కళను సృష్టించాలి!

కళాశాలనుండి ఇల్లు చేరగానే మేడమీద గదిలోకి వెళ్ళి తలుపులు బిడాయించు కున్నాడు.

గదిలో తనకు వలసినదానికన్న ఎక్కువ వసతులు దడం అతనికి నచ్చలేదు. కాని ఆ ఏకాంతం అతడిలోని కళకు దోహదకారిగా వుండింది ఇకపై ఈ గదిలోకి వచ్చి తలుపులు వేసుకుని కూర్చుంటే చాలు—

కూర్చున్నాడు గదిలో. మరురోజు కళాశాలకు సెలవు. కనుక ఒక వర్ణ చిత్రాన్ని ముగించవచ్చును. ఒక 'స్కెచ్' ఎన్నుకుందామని పుస్తకాన్ని తిరగ వేస్తున్నాడు. మునుపోనాడు వేసిన సుందరి బొమ్మ కనపడింది. చేతిలోకి తీసుకుని చూశాడు. ఇంకొక్క అరగంటసేపు ఆమె సహకరించివుంటే అది పూర్తి అయి వుండేది. ఇప్పుడు దాని నాధారంగా చక్కటి వర్ణచిత్రం గీయవచ్చు. ముఖాన్ని గనుక కొద్దిగా మార్చితే ఎవరూ పోల్చుకోలేరు.

వెంటనే ఆమె ఇంటికి వెళ్ళి ఆమెను రమ్మని చెబుదాం అనుకున్నాడు. మరు క్షణం ఎవరో తలుపు తట్టారు చిత్రాన్ని జాగ్రత్తగా దాచి వెళ్ళి తలుపు తీశాడు. అతడి మనసు ఆనందంతో గంతులేసింది. అక్కడ సుందరి నిలబడి వుంది.

"రా సుందరీ! రా!'' అన్నాడు సంతోషంతో.

ఇష్టంలేనిదానిలా సణుగుతూ లోపలికి వచ్చింది ఆమె. అతడు తలుపు గడియపెట్టాడు. ఆమె కోపంగా అతడిని చూసి, తలుపు గడియతీసింది. ఆ మేడ గది స్టుడియోగా మారి వుండడం ఆమెకు ఆశ్చర్యం కల్గించింది. అన్నీ చూసి ఆమె గర్వపడింది— 'పెద్ద ఆర్టిస్టయి పోయా రీయన—' అనుకుంది.

ఆమె నెలాగయినా ప్రతిమాలి ఒప్పించాలని అతడి కోరిక. ''ఇప్పుడే నేను నీ బొమ్మను చూస్తున్నాను. దానిని పెద్దగా రంగులతో వేస్తే అద్భుతంగా వుంటుంది." అన్నాడు.

"ఔను, మీకు నా కన్న నా బొమ్మే బాగుంటుంది. దానినే ఎదురు పెట్టుకొని కూర్చోకుండా నన్ను పిలిచారెందుకు?"

మునుపు పసిబిడ్డలా వుండిన ఆమె కిప్పుడేమయింది? అత్డామలైకు అర్థం కాలేదు. ఆమె ఇంటి మీద ఆమెగానే అతడితో పోరాడి మరీ వేయించిన చిత్రం అది. అలాటిది ఇప్పుడెందుకు అంగీకరించడం లేదు? కోపమా? మరి తాను వివరంగా చెప్పాడు కదా?

"ఇదిగో నా మాట విను సుందరీ! నువ్వు ఒక్క అరగంట కూర్చుంటే చాలు 'స్కెచ్' పూర్తయి పోతుంది. తర్వాత నువ్వు రేపు సాయంకాలం వచ్చి చూడు, చిత్రం ఎట్లా వుంటుందో — ముఖాన్ని మార్చేస్తాను. నువ్వేమీ భయపడకు— !''

''ఇక మీద అదేమీ కుదరదు" అని అరిచింది సుందరి —''ఇకపై మీరు చెప్పినట్లెల్లా ఆడలేను నేను. మీ మాడల్‌ను కాను ఇంకెవతెనయినా పిలుచు కొచ్చి తలుపు వేసుకోండి" ఏడుపూ కోపమూ కలిసి వచ్చాయి ఆమెకు. లేచి నిల్చుంది.

అర్జాకులై మొండికేశాడు. తన్ను తాను మరిచాడు. పరుగెత్తుకు వెళ్ళి తలుపు వేసి వచ్చాడు.

''నా మాట విను సుందరీ ! నెల రోజులుగా నా బుర్ర పని చేయడం మానేసింది. మళ్ళి ఇవాళే ఏదయినా వేయాలి అన్న కుతూహలం కలిగింది. నీ చిత్రం రంగులలో వేద్దామనిఎంతో ఆశపడ్డాను, నువిక్కడికి రాకుండాపుంటే అది వేరు విషయం, కాని తీరా వచ్చి ఇట్లా అనడం భావ్యమా ? మునుపు నువ్వే కదా గీయమన్నది ? మరి ప్రారంభించిన దానిని పూర్తి చేయవద్దా ? సగంలో విడిచి పెట్టడం నా కిష్టం లేదు సుందరీ !''

అప్పుడర్జామలై ఎదురు చూడని విధంగా ఒక సంఘటన జరిగింది. ఉన్నట్లుండి సుందరి—అతడి భుజం మీదకు వాలిపోయి వెక్కి వెక్కి ఏడవనారంభించింది. అతడు తెల్ల మొహం వేశాడు. ఏం చేయాలో అతనికి తెలియలేదు.

''ముందు మీరు నన్ను పెళ్ళి చేసుకోండి. ఆ తరువాత మీరు చెప్పినట్లు వింటాను. త్వరగా పెళ్ళి చేసుకోండి. మీ నాన్నగారేమో ఆనందంగా పెళ్ళి చేయిస్తారు. మరి మీరు మాత్రం నన్ను కేవలం 'మాడల్' లా భావిస్తారెందుకు ?''

మచ్చెమటలు పోశాయి—అర్జామలైకు. ఏమీ పాలుపోక కాసేపు పూరుకుండి, నెమ్మదిగా, వణకుతున్న చేతులతో ఆమె తలను ముట్టుకున్నాడు.

"చెప్పండి ! చేసుకుంటారా. లేదా ? ఆ రోజు మీరు బొమ్మ గీస్తున్నప్పుడు నేనెంత నరక వేదన ననుభవించానో మీకు తెలుసా ?"

'నువ్వేకదా అప్పుడు గీయమన్నది ? 'అని తనలో తానే అడుక్కున్న అర్జాకులైకు ప్రధానోపాధ్యాయుడు వివాహం లేదా వైరాగ్యం అని చెప్పడం గుర్తుకు వచ్చింది. ఆ రెండూ ఒకలాగే అన్పించాయి అతడికి.

"అలాగే సుందరీ ! మనం త్వరలోనే పెళ్ళిచేసు కుందాము— " అన్నాడు.

ఆమె కళ్ళు తుడుచుకుంటూ అతన్నే చూసి లేతగా నవ్వింది

# 5

మరుసటి రోజు ఆదివారం. పొద్దున్నే తన గదిలోకి వచ్చి తలుపులు వేసుకుని రంగు బిళ్ళలను నీటిలో కలపసాగాడు అణ్ణామలై. చాల రోజుల తర్వాత ఆ ఉత్సాహం కలిగింది. పూర్తి చేసిన సుందరి 'స్కెచ్' ని ఎదుట వుంచుకొని, దానినే పెద్ద రంగుల చిత్రంగా రూపొందించ నారంభించాడు.

అంతకు ముందు సాయంకాలం, మొదట మొండి కేసిన సుందరి త్వరలోనే పెళ్ళి చేసుకుంటానని అణ్ణామలై అన్న వెంటనే మారిపోయింది. తనంతటతానై 'మాడల్' వలె వచ్చి—" కానివ్వండి—ఆ 'స్కెచ్' ముగించి నన్ను త్వరగా ఇంటికి పంపండి— అంది. కొంచెం సేపట్లో ఆమె మనోహరమైన రూపాన్ని మనసులో నిలువుకుని, ఆ వెంటనే కాగితం మీద పూర్తి చేశాడు అణ్ణామలై. ఆ తర్వాత ఆమెను తన స్కూటర్ మీద ఆమె ఇంటి దగ్గర దిగ బెట్టి వచ్చాడు.

పెద్దదిగా చిత్రాన్ని గీచి ముఖ కవళికలను మార్చి, దానికి రంగులు పూయ డంలో నిమగ్నుడయాడు అణ్ణామలై. కంటితో చూచి, మనసున నిలుపుకున్న అంద చందాల నతడి చేయి తనంతట తానుగా రూపొందించసాగింది. ఆ చిత్రంలో తన సహజసౌందర్యాతిశయంతో సుందరి తయారవుతుంది. అసలు సుందరి కన్న చిత్రసు దరి అతడిలోని కల్పనను రేకెత్తించింది. లోకోత్తర సౌందర్యం అంటుంటారే వారికి నిజంగా సౌందర్యం గురించి తెలుసునా ?

భోజనం అయ్యాక మళ్ళీ పని మొదలుపెట్టాడు. ఇంకామెరుగులు దిద్దాలని పించింది. ఆ తన్మయత్వంలో తలుపు గడియపెట్టడం మరిచాడు. తదేకంగా పని చేస్తున్న అతడికి ఇంటి ముందు కారాగిన శబ్దం కాని, కాసేపటికి దండపాణి ఆ 'స్టుడియో' లోకి అడుగుపెట్టడం కాని తెలియదు.

ఆయన సగర్వంగా స్టుడియోని పరికించారు. ఈసెల్స్, కాగితపు కట్టలు, మేజా కుర్చీలు, కిటికీలకు తెరలు, పూల 'వాస్‌లు' — ఆయనకు నయనానంద కరంగా వున్నాయి. ఆ వెంటనే అతడు వేస్తున్న చిత్రాన్ని చూసి, నోరు తెరచుకుని అలాగే నిలబడిపోయారు.

తటాలున తిరిగి ఆయనను చూసిన అణ్ణామలై వెలాతెలాబోయాడు. అదృష్టవశాత్తు సుందరి 'స్కెచ్' అక్కడలేదు. అయినా ఆ రంగుల చిత్రాన్ని

ఆయన తదేకంగా చూడడం గమనించి, కొంపదీసి అందులోని సుందరిని గుర్తు పట్టడు కదా — అని భయపడ్డాడు.

"నువ్వు వేశావా దీనిని!?" అని నమ్మకం కుదరని వాడికి మళ్లీ అడిగారు దండపాణి. "అద్భుతం! బ్రహ్మాండం! మార్వెలస్" అని అణ్ణామలై వీపుని పదే పదే తట్టారు. ఈమె ముందు మన సినిమా తారలందరు బలాదూర్! ఇంతటి అతిలోక సుందరిని నేనెప్పుడు చూసి ఎరగను —"

అణ్ణామలై తనలోనే నవ్వుకున్నాడు ఆయన మాటలను బట్టి ఆయన కళాభిరుచి అవగతమయింది.

"నేనిప్పుడు నీతో చిత్రకళ గురించే ఒక ముఖ్యవిషయం మాట్లాడుదామని వచ్చాను" అంటూ కుర్చీలో కూర్చున్నారు దండపాణి. అణ్ణామలై పనినాపేసి ఆయన దగ్గరకు వచ్చాడు.

"ఆర్టిస్ట్ కరుణాకరన్ అని నువ్వు వినేవుంటావు. అతడు పాతకాలపు మనిషి. మునుపు ఆయన తయారుచేసిన సీన్లకు, సెట్టింగులకు చాల గిరాకీ వుండేది. ఇప్పుడు పెద్దవయసులో ఆయన చాల కష్టపడుతున్నాడు. ఆయనకు నాకుకూడా తోడ్పడగల ఒక క్రొత్త వృత్తిని ప్రారంభించదలచాను."

"క్రొత్త వృత్తా?"

"ఔను. నాటకాల వాళ్ళను, సినిమాల వాళ్ళను చాల మందిని నాకుతెలుసు. నాటకాల రోజులయిపోయాయి. సినిమాల్లో బోలెడంత డబ్బుంది. డబ్బుకు ఇబ్బంది పడుతున్న కొందరు నిర్మాతలకు ధనరాసులు మూలుగుతున్న ఇంకొందరి నుండి నేను అప్పు ఇప్పించాను. ఆ పరిచయాల ధర్మమా అని నాకు బాగా 'బిజినెస్' లభిస్తుంది. కరుణాకరన్ ఒక్కడే పనంతా చేయలేడు."

'ఇందులో నేను చేయగలదేముంది!' అన్నట్లు చూశాడు అణ్ణామలై.

"నువ్వు కాలేజి వేళల తర్వాత అటు వస్తూపోతూ వుండేచాలు. అసలు పని ఎట్లాంటిదో నీకు తెలుస్తుంది. అవసరమయితే నువ్వు వుండి ఆయనకు పనిలో తోడ్పడవచ్చును. చాల తొందర పని అయితే, అది ఇక్కడే చేయగల్గిన దయితే నేను దానిని ఇక్కడికే పంపుతాను"

కొంచెం జంకాడు అణ్ణామలై. కళాశాలలో కాగితం మీద నీటి వర్ణచిత్రాలు వేయడం దాకానే అభ్యసించాడు. తీరికసమయంలలో కదిరేశన్ వద్ద కాన్వాస్ల

మీద తైలవర్ణ చిత్రరచన నేర్చుకుంటున్నాడు. ఈ మాటే చెప్పేసరికి—'' కరుణాకరన్ దగ్గర ఇదంతా సులువుగా నేర్చుకోవచ్చుగా !'' అన్నారు దండపాణి.

కాదన లేక పోయాడు అణ్ణామలై. తన మామూలు అభ్యాసానికి ఆటంకం వుండదని తెలిసి అతడు అందుకు అంగీకరించాడు. అసలే దండపాణి గారి మాట కాదనలేని వారందరు. అందులోనూ తనకు కాబోయె మామగారాయె ! ఒప్పుకోక తప్పింది కాదతడికి.

''మన ఇంటి పక్కనే దేరా లాటిది వేసి అక్కడే ప్రారంభిద్దాం పనిని. ప్రారంభోత్సవం హడావిడిగా చేయిద్దాము. నువ్వు ఆ నాటికి ఇలాటివి కొన్ని చిత్రాలనువేయి. వచ్చేవారు అదిరిపోవాలి !''

ఇట్లా మాటలతో అణ్ణామలై నదరగొట్టి, కారెక్కి వెళ్ళిపోయారు దండపాణి.

# 6

మెదడు, వాక్చాతుర్యం, అవకాశం— వీటిని ఎలా సద్వినియోగం చేసుకోవాలో చెన్నపట్నం వచ్చి కనుక్కున్నారు దండపాణి. సజావయిన బ్రతుకు తెరువుకు పోటీ ఎక్కువ, ఆదాయం తక్కువ. కనుకనే ఆయన కమీషన్ వ్యాపారం మొదలుపెట్టారు. పాతఇళ్ళు కార్లు అమ్మడం కొనడం, అప్పులిచ్చి పుచ్చుకోవడాలు వీటిలో కమీషను వ్యాపారం చేపట్టారాయన, వివిధ వృత్తుల వారెందరో ఆయనకు పరిచయమయ్యారు. తత్ఫలితంగా ఆయన కారుకొని, తిరగ గలిగారు, హాయిగా బ్రతకగలిగారు.

ఒక కొడుకుకు చదువు బాగా అబ్బింది. మిగతా ఇద్దరూ పశువులు మేపడానికయినా పనికిరానివారు. వారికెలాగో మార్కులు సంపాదించి ఒకడిని వైద్యకళాశాలలో, ఇంకొకడిని ఇంజనీరింగ్ కళాశాలలో ఇరికించేశారు. అమ్మాయి గురించి ఆయనకు బెంగ ఎన్నడూలేదు.

అణ్ణామలై తన యత్నంతో ముందుకు రావడం చూసిన దండపాణి అతనిని దృష్టిలోవుంచుకొని— ఈ ప్రకటనల కంపెనీని ప్రారంభించారు.

అప్పట్లో బాగా పేరు ప్రచారం వున్న రాజకీయ నాయకుడు, సినిమా నాయకుడు— వాళ్ళనిపిలిచి వాళ్ళచేత ప్రారంభోత్సవం చేయించారు. పత్రికా

విలేకరులను పిలిచి ఫోటోలు తీయించారు. తన ద్వారా అప్పులు సంపాదించి వ్యాపారం చేస్తున్న ప్రముఖులందరికి అణ్ణామలైను పరిచయం చేశారు. అతడి కళాకౌశలాన్ని మితిమించి పొగడి, తాను కనుక్కొన్న అత్యుత్తమ కళాకారుడితడు- అని చెప్పారు. ఇదంతా అణ్ణామలైని చాల ఇబ్బంది పెట్టింది.

నెలజీతం మీద నియమితుడయిన చిత్రకారుడు కరుణాకరం నుండి పనుల గురించి అణ్ణామలై తెలుసుకున్నాడు. చలనచిత్ర ప్రకటనల నిమిత్తం వర్ణ చిత్రాలు, బోర్డు. 'కటవుట్లు' మొదలయిన వాటిని, ఫోటోలు ఆధారంగా రాయాలి. చిత్రాలను ఎన్‌లార్జి చేయడం నిమిత్తం ఒక సాధనాన్ని కొనిపడేశారు దండపాణి.

''మన అభిరుచికి తగిన పని వుండదల్లే వుందే — ?'' అని కరుణాకరాన్ని అడిగాడు అణ్ణామలై.

యాభై అయిదు సంవత్సరాలకు పైబడిన ఆ చిత్రకారు డీ ప్రశ్న విని నవ్వి— ''ఇక్కడ కళ పదిపాళ్ళయితే వ్యాపారం తొంభైపాళ్ళు అనుకోవాలి. అంతేకాని మన అభిరుచి అంటూ చిత్రాలువేస్తే బ్రతకటం కష్టం.'' అన్నారు.

ఆ రోజే వెళ్ళి కదిరేశన్‌ను సంప్రతించాడు అణ్ణామలై. అతడు తన మామ గారి వ్యాపారానికి తోడు అన్న విషయం మరవకుండా కదిరేశన్ అతడికో హెచ్చరిక చేశారు.

'విదేశాలలో విద్యార్థులు విరామ సమయాలలో హోటళ్ళలో పనిచేస్తారు; పత్రిక లమ్ముతారు. ఏ రకమయినపనీ తమ హోదాకు తగనిది అన్న భావన వారికి వుండదు. కాని ఆ పని తమ విద్యకు అంతరాయం కల్గించనివ్వరు. అట్లాగే మీరు దీనిని ఒక పనిగా స్వీకరించండి; మీ కళాభివృద్ధికి ఆటంకం కానివ్వకండి.''

అణ్ణామలై అలాగే చేశాడు. సాయంకాలాలు అక్కడికి వెళ్ళి పని చూడ సాగాడు. పనిపట్ల ఆసక్తి, సామర్థ్యం సహజంగానేకల అతడిని చూసి దండపాణి మురిసిపోయారు. అతడక్కడ పనిచేస్తున్నప్పుడు సుందరిని అటు పోనివ్వకుండా ఇంట్లో నిలపడం ఆయనకో సమస్యయిపోయింది. రోజూ అతడిని అక్కడికి రమ్మని కోరేది సుందరి. అప్పుడప్పుడు అతడికి పనిలో సాయపడేది కూడాను.

ఒక ఆదివారం, అణ్ణామలై ఇంట్లోనే వుండిపోయాడు. వాళ్ళ కళాశాలలో ఒక చిత్రకళా ప్రదర్శన జరగనున్నది. దాని నిమిత్తం అతడు కొన్ని చిత్రాలను వేస్తున్నాడు; వాటి నవాళ పూర్తిచేయా లనుకున్నాడు.

అయితే పొద్దున్నే కారులో ఒక కట్ట ఫోటోలను పడేసుకుని అతడి దగ్గరికి వచ్చారు దండపాణి. అవన్నీ సినిమాల దృశ్యాలున్న ఫోటోలు. ఒక్కొక్క దృశ్యం పది పన్నెండు విధాల వేర్వేరు ఫోటోలుగా తీసినవి. అలాటి దృశ్యాలు పదికి పైగా వున్నాయి.

''ఎల్లుండి ఈ సినిమా విడుదల ! థియేటర్లకు ఈ ఫోటోలు రంగులువేసి పంపాలి. రేపు ఇస్తానని తెచ్చాను. నువ్వు అనుకుంటే లాగించేయవచ్చు —'' అని దండపాణి ఫోటోలకట్ట అతడి ఎదుట విప్పారు.

అతడు నిరాకరించలేకపోయాడు.

కళా ప్రదర్శన చిత్రాలను ప్రక్కకుంచి, చకచకమని యంత్రంవలె పని చేయసాగాడు. ఫోటోలకు రంగులు పూయసాగాడు. ఒకేరకం ఫోటోలు పూసిన రంగులనే పూయడం విసుగనిపించింది. అర్ధనగ్నంగా వున్న ఆ నటీమణులను చూస్తుంటే జుగుప్స కలిగింది. అయినా మొదలెట్టిన పనిని పూర్తిచేసితీరాలి అన్న దీక్షతో, వంచిన తల ఎత్తకుండా పనిచేశాడు. సాయంకాలానికి పని ముగించాడు.

పని ఎలా జరుగుతున్నదో చూద్దామని సుందరితోబాటు అటు వచ్చిన దండపాణి ఆశ్చర్యానికి అంతులేదు. 'అమ్మో ! పని చేతపడితే వీడు రాక్షసుడేనే ! ఇంత కట్టను ముగించి అవతల పారేశాడే !' అని ఉప్పొంగి పోయారు.

అతడిని పొగడ్తల వర్షంలో ముంచెత్తారు. తర్వాత తమ సంచిలోనుండి క్రొత్త రూపాయలకట్ట తీసి అతడివైపు జాచారు. ఆ కట్టలో వందరూపాయల నోట్లు పది వున్నాయి.

అంత డబ్బు నెప్పుడూ కళ్ళనయినా చూడలేదతడు. అది తీసుకుని ఏమిచేయాలో తోచలేదు. వద్దన్నాడు. ససేమిరా తీసుకోనన్నాడు. దండపాణి గొల్లుమని నవ్వారు.

''మీకు అక్కర్లేకపోతే తీసుకుని నా కివ్వండి. నే నడిగితే పదిరూపాయ లయినా ఇవ్వనంటున్నారు నాన్న —'' అంది సుందరి పరిహాసంగా.

''చూశావా, చూశావా ? పెళ్ళి తర్వాత జారీ చేయవలసిన ఉత్తర్వుల నిప్పుడే జారీ చేస్తూంది చూశావా ?... నువ్వు ఈమె చేతికి తర్వాత ఇద్దువుగాని ప్రస్తుతానికిది తీసుకుని నాన్నగారి చేతికివ్వు. నేనేమి అప్పనంగా ఇవ్వడంలేదు. ఇది నీ కష్టార్జితం !—''

అతడింకా జంకుతుండడం చూసి, క్రిందనున్న మేస్త్రీగారిని పిలుచుకు వచ్చారు దండపాణి. ఆయన చెబితే వద్దనడని ఆయన నమ్మకం.

''ఇస్తున్నదానిని వద్దనడం ఎందుకు ? అల్లుడు బ్రతకనేర్వని వాడని ఆయన అనుకోగలరు ! త్వరలో జరగబోయే పెళ్ళికి ముందుగానే కట్నం ఇస్తున్నారనుకో—'' అని ప్రోత్సహించారు మేస్త్రీ.

దండపాణి చెప్పిన తర్వాతే కొడుకు 'ప్రతి' యొక్క గొప్పదనం తెలిసింది. మేస్త్రీకి. ఈ డబ్బు దండపాణిది కాదు; తన కుమారుడిది. తాను పగలంతా ఎండనక వాననక బయట ఆకాశం క్రింద చెమటోడ్చితే రాని డబ్బు ఇంత సులభంగా వాడికి రావడం చూసి ఆయన అచ్చెరువొందారు.

ఆ డబ్బు అందుకుని వెంటనే తండ్రిచేతి కిచ్చా డణ్ణామలై. దానిని కళ్ళ కద్దుకుని మేస్త్రీగా రొక్క క్షణం పరవశం చెందారు. ఆ తర్వాత— ''ఇదిగో నమ్మా సుందరీ ! దీనిని నీ చేతులతో తీసుకువెళ్ళి మీ అత్తయ్య చేతికివ్వు—'' అని ఆమె చేతికిచ్చారు.

అణ్ణామలై కివన్నీ నాటకంలో దృశ్యా లనిపించాయి. తాను ప్రదర్శన నిమిత్తం పూర్తిచేయవలసిన చిత్రాల గురించి ఆలోచించ సాగాడతడు.

## 7

'మేస్త్రీ-మాణిక్యం, భవన నిర్మాణ నిపుణులు' అన్న క్రొత్తబోర్డు మేస్త్రీ ఇంటిముందు, మాణిక్యం ఇంటిముందు వెలిశాయి. అవి రాకముందే వారికి పని గిరాకీ తగిలింది కదిరేశన్‌కు తెలిసినాయన ఒక్కరు అడయారులో నివేశనం కొన్నారు. కదిరేశన్, మేస్త్రీగారల ఇళ్ళను చూశాక ఆయనకు మేస్త్రీగారి పనితనం మీద నమ్మకం ఏర్పడింది. అందులోనూ మాణిక్యం కదిరేశన్ అల్లుడాయె. అందుకనే తమ ఇంటి నిర్మాణం పనిని వారి కప్పగించారు.

పని మొదలయి ముమ్మరంగా సాగుతూంది. పొద్దున్నే పనిచోటికె వెళ్ళిపోయే వారు మేస్త్రీ; మాణిక్యం తొమ్మిదింటికి బయలుదేరేవాడు. ఇద్దరూ సాయంత్రం ఆరింటికి వెనక్కు వచ్చేవారు.

మాణిక్యం బయిలుదేరే ముందుగాను, వచ్చినాక అతడికి వలసిన సమస్య లను చక్కగా చేసేది ఆనంది. సాయంకాలం అతడు వచ్చేసరికి స్నానానికి వేణ్ణీళ్ళు, వేరే బట్టలు సిద్ధంగా వుండేవి. ఆ తర్వాత భోజనం తయారయేది. అదయ్యాక మాణిక్యం మేడమీదకు వెళ్ళి ఆనందికోసం కాచుకుని కూచునేవాడు. మొదట్లో ఇదంతా అతడికి క్రొత్తగా వుండేది. కాని కొద్ది రోజులలో అతడీ మధ్య తరగతి జీవిత సౌఖ్యాలకు అలవాటు పడిపోయాడు.

కాని అతడు అలవాటు చేసుకోలేకపోయిన విషయాలు ఆ ఇంట్లో కొన్ని వున్నాయి. ఆనందికని కదిరేశన్ చేర్చిన గ్రంధాలయంలో వందలాది పుస్తకా లున్నాయి. అన్ని ముఖ్య పత్రికలూ అక్కడికి వచ్చేవి. మరో రేడియో, ఆనంది వీణ మేడమీద వున్నాయి. అతడికి సమయం వుందికాని వీటితో కాలక్షేపం చేయడం అలవడలేదు. వార్తా పత్రికలను చదివేవాడు. కదిరేశన్ రచించిన చిత్రా లను సైతం అతడు సరిగా చూడలేదు.

ఆనంది రాకకోసం తహతహ లాడేవాడు. ఒక్కనాడయినా ఆమెను వీణ వాయించమని కోరిన పాపానపోలేదు. ఒక్కసారయినా ఆమె కమ్మని గానంలో కరిగిపోదా మనిపించలేదు. ఆమె మేడమీదకు వచ్చిన కొన్ని నిముషాలకెల్లా దీపం ఆర్పేసేవాడు. ఆ తర్వాత అక్కడ అంతా చీకటే.

ఒకరోజుదయం పడకమీదనుండి లేవబోయిన ఆనంది లేవలేకపోయింది. ఒళ్ళంతా విపరీతమైన నొప్పులు; భరింపరాని వేదన. ప్రతి ఉదయమూ ఆమెకు అట్లాగే అన్పించేదికాని ఆవాళ లేవనే లేకపోయింది. లేచినా అడుగు వేయలేక పోయింది. మాణిక్యం ఆదమరిచి నిద్రపోతున్నాడు. ఏడింటికిగాని లేవ దతడు. నెమ్మదిగా లేచి అతడిమీద దుప్పటి సరిగా కప్పింది. మృదువుగా అతడి పాదాలను స్పృశించి కళ్ళ కద్దుకుంది. తల్లి అట్లా నాన్న పాదాలను కళ్ళకద్దుకోవడం ఆమె ఎరుగును.

తన కొత్తపెళ్ళి జీవితం గురించి తలచుకోగానే ఆమెకు నవ్వు వచ్చింది. ఇంకా నవ్వు చచ్చిపోలే దామెలో. అప్పుడు తండ్రి చెప్పిన హితవు గుర్తుకొచ్చింది.

గదిలోపల చీకటిలో ఎన్నోసార్లు మాణిక్యం ఆమెను తన ప్రాణంవలె ప్రేమిస్తున్నానని చెప్పాడు. ఆమెకూడా అతడిని ప్రేమించాలని మనసారా కోరి ప్రయత్నిస్తూంది. పెళ్ళిచేసుకొనే వారందరూ ప్రేమించే పెళ్ళిచేసుకోరు కద— !

అందులో శరీర ఆకర్షణకు చోటు వుండనేవుంది. కాని అది శరీరాలతో ఆగిపోదే! కొన్నాళ్ళకు ఒకరి నొకరు తెలిసి మనసులూ ఏకమవుతాయి కదా!

అయితే ఆనంది తన జీవితంలో తెలుసుకున్నదో...?

పెళ్ళికి ముందు మేడమీదకు వచ్చిన మాణిక్యంతో ఆమె— "పెళ్ళయ్యే దాక నన్ను ఏకాంతంలో కలవవద్దు! కలపకండి!" అందికదా? అందు కతడు పగతీర్చు కుంటున్నట్లున్నాడు! లేక అతడి స్వభావమే అంతే కాబోలు! ఆనంది అతడిని పూర్తిగా తెలుసుకోలేకపోయింది

'ప్రేమ శారీరకమే అయినప్పటికీ, దానినీ అందంగా అనుభవించడానికి భగవంతుడు పంచేంద్రియాలనూ ప్రసాదించాడు!' అని ఎక్కడో చదివింది ఆనంది.

"అందంగా జీవించు; చేతనయితే జీవితాన్ని అందంగా చేయి. కాకపోతే దానిని పాడుమాత్రం చేయకు—" అన్న తండ్రి సూక్తులు గుర్తుకు వచ్చాయి; ఇంకోసారి నవ్వుకుంది ఆమె.

అబద్ధంతో తన్నుతాను మోసగించ దలచుకోలేదామె. ఆత దంతవరకు ఆమె కిచ్చిన జీవితం ఆమెకు రోతగానే వుండింది. అందంగా బ్రతకాలని వాంఛించిన ఆమెయొక్క జీవితం జుగుప్సాకరంగా తయారయింది. ప్రేమ అంటే - తొందరపాటు, తొట్రుపాటు, ఆవేశమూ, చెమట, ఎగశ్వాస - ఇవన్నీ కలసిన అర్థం లేని సంఘటనేనా? అతడు తన భర్త అన్న కారణంగా మాత్రమే ఆనంది రోజూ ఇది భరిస్తూంది.

దానిని గురించి కవితలురాసిన వారిని, చిత్రాలు రచించిన వారిని, శిల్పాలు మలిచిన వారిని ఆమె దూషించింది. ఇంతటి అసహ్యమైనది కావ్యవస్తువుగా, కళా వస్తువుగా ఎటాయింది? లేక సహజంగా అందమైనది తనకు మాత్రం అసహ్యకరమైనదిగా అయిందా? ఆమెకు అర్థం కాలేదు.

అయినా తండ్రిచెప్పిన ప్రేమ, ఓర్పు — అన్న రెండు మంత్రాలను బలవంతాన గుర్తుకు తెచ్చుకొని వాటిసాయంతో తన జీవనయానాన్ని సుగమం చేసుకోవాలని యత్నించసాగింది. ముమ్ముందు అందంగా జీవించగలననే ఆమె నమ్మింది.

# 8

ఆనంది మేడమీద వుండలేకపోయింది. క్రిందకువచ్చి నాన్నగదిలోకి వెళ్ళబోయింది. అక్కడ ఆయన అణ్ణామలైతో మాట్లాడుతుండడం చూసి వెనకడుగు వేసింది. అయితే అతడు తనతోబాటు కొన్ని చిత్రాలను తెచ్చివుండడం గమనించాక లోపలికి వెళ్ళకుండా వుండలేక పోయింది.

అణ్ణామలై ఆరు చిత్రాలు తీసుకువచ్చాడు. మూడు ప్రకృతి దృశ్యాలు, మూడు మానవ జీవితంలో దృశ్యాలు. అన్నీ కళాశాల ప్రదర్శన కోసం వేసినవి. మొదటి మూడింటికి 'సుఖాతిశయం' అనీ, మిగతా మూడింటికి 'దుఃఖాతిశయం' అని శీర్షికలుంచాడు.

లేగదూడ తల్లిఆవు పొదుగును కుమ్ముతూ, గెంతుతూ పాలు తాగుతున్న దృశ్యం — ఒక దానిలో వుంది. బిడ్డను చూసిమురిసి పోతూంది ఆ తల్లి. ఇంకొక చిత్రంలో — సరిగా పోషణలేక చనిపోయిన దూడ తోలులోపల గడ్డికుక్కి దానిని ఎదుటనిలబెట్టి ఆవుపాలు పితుకుతున్న పట్నవాసపు గొల్లవాడున్న దృశ్యంవుంది.

ఆనంది ఆ రెండింటినీ పదే పదేచూసింది.

కదిరేశన్ ఇంకొక చిత్రాన్ని చూస్తున్నారు. కూరల బస్తాలు ఎత్తుగా నిండిన బండిని చక చక లాగుకువెళుతున్న శ్రామికుడి చిత్రం అది. ఆ బస్తాల మీద వాటి యజమానురాలు కూర్చుని వుంది. చెమటతో తడిసిన ఆ బక్కపలచటి దేహాన్ని ఒక గోచి పాతలాటిది కప్పివుంది. బండిభారాన్ని చేత్తో నొక్కిపడుతూ పాదం రోడ్డుమీద ఆనని వేగంగా ఉరుకుతున్నాడు బండివాడు ఆ నేపథ్యంలో మేడలు, కార్లు, ఐశ్వర్యపు ఇతర చిహ్నాలు !

"మీలోని ఏ భావం ఈ చిత్రాన్ని ప్రేరేపించింది ?" అని అడిగారు కదిరేశన్.

"ఆశ్చర్యము, దుఃఖము, దయ — ఇవన్నీ కలిగాయినాకు. ఆ కాలం లోనూ పల్లకిలో కూర్చునేవారున్నారు; పల్లకీలు మోసిన వారున్నారు. ఇప్పుడు కాలం మారింది; కాని మనుషులు మారలేదు. కాని జాలిగుండెకు కరువేర్పడింది; అదే నాకు ఆశ్చర్యం !" అన్నాడణ్ణామలై.

కదిరేశన్ ప్రేమతో అతడి వెన్నుతట్టారు. తన చేతిలోని చిత్రాలను అతడికి వెనక్కిచ్చిన ఆనంది నయనా లశ్రుపూరితాలయ్యాయి దూడను కోల్పోయిన ఆవువలె వేదనా పూరితమయింది.

కళాశాలకు వేళయిన-దన చిత్రాలను తీసుకుని తొందర తొందరగా వెళ్ళిపోయాడణ్ణామలై. అతడు వెళ్ళాక అతడి చిత్రాలను ప్రశంసించారు కదిరేశన్. అణ్ణామలై తన చుట్టువున్న సామాన్యుల జీవితాన్ని చూడడం నేర్చుకుంటున్నాడని, అతని హృదయంలో ఇతరుల పట్ల ప్రేమ సానుభూతి వున్నాయని, అవి కళగా రూపొందుతున్నాయని అన్నారాయన.

"ప్రేమపునాదిగా ఆయనకు తెలియకుండానే ఆయనతో విలక్షణమైన కళా దృష్టి ఏర్పడుతూంది—" అని సగర్వంగా చెప్పారాయన.

అది విని ఆనంది హృదయం ఉప్పొంగింది. తర్వాత ఆయనతో కొంత సేపు గలగలమని మాట్లాడుతూ కూర్చుంది. ఆ తర్వాత తను పనులలో లీనమయింది. మధ్యాహ్నం కాస్త కునుకు తీసేసరికి బడలిక తీరినట్లయింది.

మాణిక్యం ఇంటికి వచ్చేవేళయింది. కుతూహలం తెచ్చుకుని మరి తన్ను తాను రోజుకన్న ఎక్కువగా అలంకరించుకుంది. మాణిక్యం రాగానే అతడికి కావలసినవన్నీ చిరునవ్వుతో అందిచ్చింది. భోజనం వడ్డించింది. అతడు రావడానికి ముందుగానే మేడ చేరింది.

వీణను చేతబూని కూర్చుని, తంత్రులు మీటుతూ, ఆ నాదంతో తనకమ్మని కంఠం కలుపుతూ పాడసాగింది. ఆమె నుద్దేశించే రాసినట్లున్న భారతికవి గేయాన్ని పాడసాగింది.

'అమ్మా ! ఆదిశక్తీ ! చక్కటి వీణను చేసిందెందుకు బూడిదలో పారేయడానికా ?' అన్న చరణం గల ఆ పాట నామె పాడుతుంటే హృదయమూ నగరమూ కరుగుతున్నాయి. ఆ తన్మయత్వంలో ఆమె, మాణిక్యం రావడము మొదట గమనించలేదు. గమనించాక చిరునవ్వు నవ్వింది. ఇంకా పాడింది.

ఆ పాటకు తన పతిదేవుడి ఎద కరిగిపోవాలని ఆశించిందామె. ప్రకృతి తనకిచ్చిన అందాన్ని, ఆ అందానికి మెరుగులు దిద్దే గానాన్ని చూసి, విని, అతడు పరవశం చెందుతాడని ఆమె ఎదురు చూసింది. తన మనసు చల్లగా అతడా వేళయినా ప్రేమ మాటలాడడా అని తపించిందామె హృదయం

కాని జరిగిందేమిటి ? కొన్ని సినిమాలలో కనపడే 'ప్రేమ దృశ్యం' లాంటిది జరిగింది.

పీణను లాగి ప్రక్కకుంచి, ఆమెను అమాంతంగా ఎత్తుకున్నాడు మాణిక్యం. ఆమె వేడుకుంది. పాట పూర్తికాన్వమంది. ఏదో మాట్లాడాలి అంది. ఇంకా భోంచేయలేదంది. తన ఒంట్లో బాగులేదనీ అంది.

"పాటా, మాటా రేపు ! ఇవాళ్టికి నా మాటవిను !" అని నవ్వాడు మాణిక్యం, ఆ నవ్వు నిప్పై కాల్చింది ఆమెను.

మేడమీద ఆ గదిలో దీపాలనార్పాడతడు. చీకటి, అంతటా కటిక చీకటి. చీకటి...

ఆ చీకటిలో-అతడు కాస్సేపటికి ఆదమరచి నిద్రపోయాడు రోజల్లా శ్రమపడి పనిచేసి అలసిన శరీరం వశంతప్పి నిద్రలోకి జారింది. కాని ఆనంది నిద్రపోలేకపోయింది.

నిద్ర రాలేదు. కలలా, స్మృతులా అని తెలియని విధంగా కొన్ని దృశ్యాలు, సంఘటనలు ఆమె మనోనేత్రం ముందు నిలిచాయి. తన దుస్థితికామె వగవలేదు. అతడామె భర్త. అతడు పురుషుడు. అట్టి ప్రవర్తన అతడి ప్రకృతి కావచ్చును. పుట్టుకలో వచ్చిన అలవాట్లు అంత త్వరలో మారవు. ఓపిక పట్టాలి. ఇంకా ఓపిక పట్టాలి. అదొక్కటే మార్గం. ఒకే మార్గం !

# 9

ప్రకటనలు, ఆహ్వానాలు, ప్రారంభోత్సవం-ఈ హడావిడితోనే చిత్ర ప్రదర్శన మొదలయింది. ఒక వారం రోజులపాటు దానిని నడపాలను కున్నారు. కాని జనం అంతగా రాలేదు. చెన్నపట్నంలో రోడ్డుమధ్య నిల్చుని, నోరు తెరచుకుని, తమ పనులను మరచి సినీతార బొమ్మలను జనం తండోపతండాలుగా చూడడం అలవాటైతే ఎరుగును.

అయితే ఈ చిత్ర ప్రదర్శనకు బొత్తిగా ఎవరూ రాలేదనికాదు. ఎడారిలో ఒయాసిస్సులవలె అప్పుడప్పుడు కొందరు, విడివిడిగాను, గుంపులు గుంపులుగాను

వచ్చిపోతుండేవారు. ఆ వచ్చినవారిలో కొందరు అణ్ణామలైను వెతుక్కొచ్చి మరీ పొగడుతుండేవారు. అలాంటివారి నుండి తప్పించుకో జూచేవాడతడు. కాని గర్వం రాజశేఖరన్ మాత్రం దొరికినవారిని వదలకుండా లాక్కొచ్చి తన చిత్రాల ఎదుట నిల్చోబెట్టి సుదీర్ఘంగా ఉపన్యాసాలిచ్చేవాడు. అతడొక్క నిముషం పక్కకు చూస్తే పారిపోదామని వుండేది ఆ శ్రోతలకు.

సుందరి తన స్నేహితురాండ్రతో రెండు మూడుసార్లు వచ్చి ఆ ప్రదర్శనను నవ్వులతో గలగల మాటలతో నింపి వెళ్ళింది. ఆమె రాకపోకలు తోటివారణ్ణా మలైను పరాచికాలాడడానికి తోడ్పడ్డాయి.

నగరంలోని విదేశీయులు, విదేశీ యాత్రికులు కూడా వస్తుండేవారు. పుట్టుక ఇక్కడే అయినా, అక్కడెక్కడో పుట్టిఎదిగినట్లున్న సంకరజాతి ప్రాణులూ ఒకటి రెండు రాకపోలేదు. ఆ తిపువ్వువలె అపురూపంగా అప్పుడప్పుడు కొందరు నిజమైన కళాంసికులూ వచ్చివెళ్ళారు.

ఒక రోజు రాజశేఖరన్ చిత్రాల ఎదురుగా ఒక గుంపు నిల్చునివుంది. వారి కట్టు, బొట్టు, మాట, చూస్తే తమిళుల్లా లేరు. కాని వారింకోదేశంవారూ కారు. కలగాపులగపు నాగరికతకు చెందిన ఆడా మగా నలుగురున్నారు. వారంతా రాజ శేఖరన్ వాగ్ధాటితో మునిగితేలుతున్నారు. వచ్చినవారతడినీ, అతడి చిత్రాలను ఫొటో తీశారు. అతడు చెప్పినదానిని రాసుకున్నారు. అతడు మేధావి అని పొగిడారు.

తర్వాత ఆ బృందం, ప్రక్కనే వున్న అణ్ణామలై చిత్రాల దగ్గరకు రాగానే, అందులో ఒకతె ప్రక్కనున్న అమ్మాయితో- ఎట్టి బిడియమూ లేకుండా- "ఇతడి చిత్రాలకన్న ఇతడందంగా వున్నాడు కదూ?" అని నవ్వింది. వారి నవ్వు అణ్ణామలైను కలచివేసింద. కాలానుగుణం కాని చిత్ర రచనా వైఖరిని తానవ లంబిస్తున్నానేమో నన్న సంశయం పీడించసాగింది.

కాస్సేపటికి అక్కడ తలనెరిసిన విదేశీ పెద్దమనిషి ఒకాయన వచ్చే సరికి, రాజశేఖరన్ ఎదురేగి ఆయనను తన చిత్రాల వద్దకు తీసుకువచ్చారు. వాగ్ఝరి మొదలయింది. కాస్సేపు విన్నాడాయన. "నేను ఫ్రెంచివాడిని, కళాభి మానిని. ఇక్కడకు నిజమైన భారతీయ చిత్రకళను చూద్దామని వచ్చాను. అంతే

కాని పాశ్చాత్య బాణీల అనుకరణలను చూద్దామని రాలేదు.'' అః ముందుకు సాగి పోయాడు.

ఆయన అణ్ణామలై ఆరు చిత్రాలను చూడడానికి అరగంట పట్టింది. ఆ చిత్రాల గురించి కొన్ని ప్రశ్నలు అడిగాడు. 'మీరు మార్గ దర్శకులు!'' అంటూ అణ్ణామలై చేయి, పట్టుకుని భుజం గూడా నుండి విడిపోయేలాగన, కరచాలనం చేశాడు. అదయ్యాక చేతిని సర్దుకుంటూ అణ్ణామలై - 'రసికులు పలురకములు!' అనుకున్నాడు. అతడి ఆత్మవిశ్వాసం మళ్ళీ కోలుకుంది.

అణ్ణామలై ఆ ప్రదర్శనలో మరుపలేని సంఘటన అయిదవ రోజున జరిగింది. ఆ రోజు ఆనంది కదిరేశన్‌తో బాటు వచ్చింది. కళాశాల ప్రధానాచార్యుల వారే కదిరేశన్‌తో బాటు వచ్చి ఆయనకు అన్నీ వివరించసాగారు వారి మాటలలో అణ్ణామలై గడించిన ప్రశంశ విని ఆనంది మనసుప్పొంగింది. ఆమె జీవితంలోని వేదనకిది మందులా అన్పించింది. 'జీవితంలో ఆయన పసిబిడ్డే కాని తమ కళలో బాగా పెరిగారు' అని సంతోషించింది.

''ఇన్ని చిత్రాల మధ్య వీటిని చూడడమే సరయిన పద్ధతి! నాకేగాదు నాన్నగారికి కూడా వీటి విశిష్టత ఇప్పుడే అర్థమవుతోంది. చుక్కల మధ్య చూస్తేనే కదా చంద్రుడి శోభ తెలిసేది!'' అంది ఆనంది అణ్ణామలైతో.

అతడామె పొగడ్త విని సిగ్గుపడలేదు, మైమరచిపోయాడు. కృతజ్ఞతా భావంతో నాలుక తడబడుతుండగా- "మీరు కావాలనే నన్ను మెచ్చుకుంటున్నారు'' అన్నాడు.

''మీ చిత్రాలన్నీ అమ్ముడుపోయాయన్న విషయం మీకు తెలుసా?"

''ఏమిటీ!?"

"మీ ప్రధానోపాధ్యాలవారు మీ దబ్బుతో అక్కడ కాచుకుని వున్నారు. ప్రదర్శన ముగిశాక కాని చిత్రాలనివ్వలేమని చెప్పారట ఆ కొన్నవారితో. ప్రపంచంలోనే తమ దేశంలో వున్న చిత్రకారులవంటి వారెవరూ లేరని గర్వించే, ఫ్రాన్స్ దేశానికి చెందిన ఒక కళాభిమాని మీ ఆరు చిత్రాలను మీరెరగకుండానే, వెల మాట్లాడి కొన్నారు!''

''నిజంగానా ఆనంది?!"

ఆనంది పాత రోజుల ఆనంది అయింది. ఆమె మనోభారం ఎగిరిపోయింది. ఆమె హృదయం గాలిలో దూది పింజలా ఎగిరింది. రాత్రి, పగలువలె సుఖం దుఃఖం ఒకదాని వెంబడి ఒకటిగా వస్తుంటాయని తెలిసి ఆమె మనసు కుదుట బడింది. విచారాన్ని భరించడానికి శక్తి కావాలికదా?- ఆ శక్తి ఆమెకు అక్కడ లభించింది

# 10

అణ్ణామలై ఆశ్చర్యపడేలా మరొకటి జరిగింది. "కలై మలర్" అన్న పత్రికలో, దాని సంపాదకుడయిన శరవణన్ అతడి చిత్రాలను ప్రచురించి, అతడి గురించి ప్రత్యేక వ్యాసం రాసి అచ్చువేశారు. వ్యాసంతోపాటు, శారద వేసిన అణ్ణామలై చిత్రంకూడా అచ్చయింది.

ఆ శరవణన్‌ను అతడెప్పుడూ కలవలేదు. ఆయన ప్రదర్శనకు రావడం, తన చిత్రాలను ఫోటో తీయడం, శారద తన చిత్రం గీచి ఆయనకివ్వడం-ఇవేమీ అతడికి తెలియవు. శారదా ఏమీ చెప్పలేదు.

అతడితోపాటు బడిలో, కళాశాలలో చదువుకున్న వారెందరో మెచ్చుకుంటూ ఉత్తరాలు రాశారు. అణ్ణామలైకిదంతా అగమ్యగోచరంగా వుంది. 'నేను నిజంగానే చిత్రకారుడల్లే వుంది-' అనుకున్నాడు తనలో!

ఇదంతా చూసిన దండపాణి, మేస్త్రీగారల ఆనందానికి అవధులు లేవు. అతడికోసమని తాను ప్రారంభించిన ప్రకటనల కంపెనీ జోరుగా సాగుతుండడం చూసిన దండపాణికి అణ్ణామలై అదృష్టవంతుడన్న అభిప్రాయం కల్గింది. ఇప్పుడా అభిప్రాయం దృఢపడింది.

వేడిలో వేడిగా అతడితో సుందరి పెళ్ళి చేసెయ్యాలనిపించిం దాయనకు. ఇంకా చిత్ర కళాశాలలో అభ్యాసం ముగియలేదు కదా-అన్నారు మేస్త్రీ. కాని ఆయన వినలేదు. అలవాటు చొప్పున తమ వాక్చాతుర్యంతో మేస్త్రీగారిని ఒప్పించారు.

మైత్రిగారా విషయం ప్రస్తావించినప్పుడు-అణ్ణామలై సుందరిని వివాహ మాడడానికేమీ అభ్యంతరం చెప్పలేదు. కాని తన చిత్ర కళాభ్యాసం ముగిశాక పెళ్ళి చేయండి-అని చెప్పాడు.

చెప్పాడే కాని-సుందరి వంటి చలాకీపిల్లను, స్వాహక్కులతో పీదపడి తిరిగే పిల్లను ఎన్నాళ్ళని దూరంగా వుంచగలడు ? అతడు దూరం పాటించడాన్ని ఆమె పరిహాసించింది, మండిపడింది. ఎవరికీ తెలియకుండా ఏకాంతంలో వారి మధ్య పోట్లాటలు జరిగాయి. అతడెంతో నిగ్రహంగా వున్నాడు. ఆమె తనకు కాబోయేభార్య గనుకనే ఆమెతో మరింత జాగత్తగా వుండాలనిపించిందతనికి. కాని ఆమెకో, అతడానాటి సినీ నాయకుడివలె నడుచుకోలేదని ఉక్రోషం. ఇంకో సందేహమూ లేకపోలేదు. శారదమీద మనసున్న కారణంగా తన్నుదాసీనంగా చూస్తున్నాడేమోనని అనుమానం.

పెళ్ళి వాయిదా వేయాలని అతడు కోరుతున్నాడని తెలియగానే సుందరి వాళ్ళింటికి రావడం మానేసింది. అణ్ణామలై వాళ్ళ ఇంటికి వెళ్ళినప్పుడు ఆమె సరిగా మాట్లాడేదికాదు. ఆమె ఇంటి పక్కన దేశాలోని ప్రకటనల కంపెనీలో పని చేసునప్పుడుకూడా ఆమె తొంగిచూసేది కాదు. ఉన్నట్లుండి ఆమె అతనిమీద పోరాటం మొదలుపెట్టింది.

ఆమె పోరుకు కారణం అణ్ణామలైకు ఆనంది ద్వారా తెలిసింది.

''చూడండి ! సుందరి నా దగ్గరికి వచ్చి ఏడ్చి వెళ్ళింది. మీ గాఢమైన కళాతృష్ణనామె తెలుసుకోలేదు. మీరు శారద కారణంగానే ఇట్లా కాలయాపన చేస్తున్నారని ఆమె భ్రమ. అది భ్రమేనని నేను మరీ మరీ చెప్పానామెతో. అయినా మీరూ ఆమె భావాన్ని గ్రహించాలి. మీరొకరి నొకరు కోరుకుంటున్నారన్నది నిర్ధారణయ్యాక ఇంత ఆలస్యం ఎందుకు ?''

''కళాశాల తతంగం అయిపోయాకయితే బాగుండును-''

''మీకింక కళాశాల శిక్షణ అనవసరం. మీరంతట మీరుగా అభ్యాసం చేస్తే చాలు. దానికి పెళ్ళి అడ్డు కాజాలదు, అసలు మీరామెనే 'మాడల్' గా పెట్టుకుని బొమ్మ గీచారుకదా ? ఆమె చెప్పి ఏడ్చింది...''

నిశ్చేష్టుడయ్యాడణ్ణామలై. దొంగతనం చేస్తూండగా దొరికిపోయిన వాడిలా గ్రుడ్లు మిటకరించాడు.

''అబ్బే ! అందుకోసమనే కాదు-'' అని నవ్వి అతనిని సంకటస్థితి నుండి తప్పిస్తూ ఆనంది-''నాకూ కాలక్షేపానికి స్నేహితురాలు కావాలి. అక్కడ సుందరీ చదువు మానేసి గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంది. నాకు ఇక్కడ పొద్దుపోవడంలేదు. ఇంటి పనులన్నింటిని అవ్వ, అత్తయ్య చూసుకుంటారాయె-'' అంది.

ఆమె మాటలలోనూ సబబుంది. అవివాహితుడయిన అణ్ణామలైతో ఆమె వెనుకటివలె మాట్లాడడం, మెలగడం, కష్టమవుతుంది. ఎంతో జాగ్రత్తగా వున్నా అప్పుడప్పుడు ఆమె అత్తగారి కళ్ళల్లో అనుమానపు ఛాయలు దోబూచులాడడం ఆమెకు తెలియకపోలేదు. అతడికి పెళ్ళి అయితే ఈ బెడదవుండదు. కనుకనే అతడితో సుదీర్ఘంగా మాట్లాడి అతడినొక దారికి తెచ్చింది ఆమె.

అభిమానంతో ఆమె చెప్పినదానిని కాదనలేకపోయా డణ్ణామలై ''సరే, మీరు చెప్పినట్లే చేస్తాను ఇప్పుడే వెళ్ళి అమ్మకు నా సమ్మతాన్ని తెలుపుతాను'' అని బయిలుదేరా డణ్ణామలై.

''మీకు నా శుభాకాంక్షలు!'' అని నవ్వింది ఆనంది. తన మొండితనం ఫలించినందుకు సంతోషం కల్గినా, ఇన్నాళ్ళు తన్ను ఏడ్పించినందుకు అణ్ణామలై నంత సులభంగా వదలలేదు సుందరి. అణ్ణామలైకు పెళ్ళి తతంగాలన్నీ అర్థరహితంగా కనుపించాయి.

ముహూర్తం వచ్చింది. అణ్ణామలై సుందరి మెడలో మూడు ముళ్లు వేశాడు. నిజానికతడు ఒక ముడి వేశాడు. తడబడుతుంటే అతడి తరపున ఆనంది మిగతా రెండు ముడులనూ గట్టిగా వేసింది.

ముహూర్తమేళం ప్రతిధ్వనిస్తూంది, నాదస్వర సంగీతం నలుదెసల విన్పిస్తున్నది. మంగళాక్షతలు విరజిమ్ముతున్నారు. ఆ అక్షతలు, పువ్వులు వారి జీవితాలకు లక్ష్యాలకు గుర్తులు ! రెండు ధృవాలను కలప యత్నించిన ప్రయత్నానికి సంకేతాలవి !

# 11

సుందరి అణ్ణామలైల పెళ్ళి జరిగాక, వాళ్ళను కదిరేశన్ తమ ఇంటికి విందుకు పిలిచారు. 'కలైమలర్' సంపాదకుడు శరవణన్‌నూ పిలిచాడు. వంటింట్లో

అత్తయ్య, అవ్వలతో కలిసి ఆనంది ఉత్సాహంతో వంట చేస్తూంది. సుందరి అక్కడే కూర్చుని కబుర్లు చెబుతూంది. మేస్త్రీ మాణిక్యమూ భోజనం వేళకు వస్తామని చెప్పి పనికి వెళ్ళారు.

శరవణన్‌ను ముందుగానే రమ్మన్నారు కదిరేశన్. అణ్ణామలై పెళ్ళికి శరవణన్ వచ్చారు కాని ఆ హడావిడిలో కదిరేశన్ ఆయనను అతడికి పరిచయం చేయలేకపోయారు. కదిరేశన్ అణ్ణామలై గురించి ఏమీ చెప్పకముందే, అతడాయన శిష్యుడని తెలియకముందే, అతడిని చూడకముందే- అతడిని గురించి తమ పత్రికలో రాసినవారు శరవణన్. కనుకనే అటువంటి రసికుడి పరిచయం అతడికి ముఖ్యం అని ఆయనను పిలిచారు కదిరేశన్.

"మనదేశంలో నేను గౌరవించే చాలా కొద్దిమందిలో ఆయన ఒక్కరు. బుద్ధి కౌశల్యం, నిరంతర శ్రమ, మెచ్చదగ్గ సాహసం, డబ్బుకు పదవికి తలవంచని నిజాయితీ ఇవి ఆయన సొత్తు. నకిలీ కళనూ, అట్టి కళాకారులనూ ఆయన నిర్మొహమాటంగా విమర్శించకుండా వుండే ఈపాటికి లక్షలు సంపాదించేవాడు. మాకు ఆయన స్నేహం చాల అవసరం-'' అంటూ శరవణన్ గురించి అణ్ణామలైకు చెప్పారు.

ఆయన పత్రికను చదివేవాడవడంవల్ల అణ్ణామలైకాయన నిష్ఠ తెలుసు.

ఆయన కారులో వచ్చి దిగుతారని ఎదురుచూస్తుండిన అణ్ణామలైకు ఆయన-బస్సు దిగి నడిచి రావడం ఆశ్చర్యం కల్గించింది. వయసు నలభై వుండవచ్చు, సన్నని శరీరం, చెదరిన క్రాపు, నిరాడంబరమైన రూపం, నడకలో చూపులో చురుకుదనం.

ఆయనకు ఉత్సాహంతో స్వాగతం చెప్పి కూర్చోబెట్టారు కదిరేశన్. ''అణ్ణామలై ఎవరో తెలియకనే మీ రతడి గురించి రాసిన వ్యాసం నాకు చాల ఆనందం కల్గించింది. ఇన్ని పుటలు కళకు ఎట్లా కేటాయించ గలిగారోనని పించింది !'' అన్నారు కదిరేశన్.

''రసికుల అభిరుచిని క్రిందకులాగి, తద్వారా పైకి వెళ్ళకోరేవాడిని నేను కానని మీకు తెలుసుకదా !'' అన్నారు శరవణన్-''నేను చిత్రకళకు బదులుగా ఆ పుటలనిండా, అట్టపైన ఆకర్షణీయమైన నటీమణుల చిత్రాలను వేసివుండ వచ్చును. అందుమూలంగా వ్యాపారమూ పెరిగేది. కాని అప్పుడు నా పత్రికలో

'కళ' కాస్తా 'కల' అయిపోతుంది-'' అని శరవణన్ గలగలమని నవ్వారు. "ఎముకల కోసం కొట్లాడుకునే కుక్కలవంటి నకిలీ మనుష్యులు, డబ్బుకోసం ఏ గడ్డినయినా కరవడానికి సిద్ధమే, ఎంతటి నీచమైన పనినయినా చేయడానికి సిద్ధమే – ఇటువంటి వారు ఎక్కువగా వున్న ఈ కాలంలో మనిషిగా జీవించాలని పోరాడడంలో ఎంత ఆనందం వుందో తెలుసా? నకిలీ మనుషుల నెందరినో నే నెరుగుదును. వాళ్ళందరికన్న సంతోషంగా జీవిస్తున్నాను నేను! పగలంతా కష్టపడి పనిచేసి రాత్రివేళ హాయిగా నిద్రపోతాను నేను!" అన్న ఆయన మాటలు అణ్ణామలై లో ఆలోచనను రేకెత్తించాయి. అసలు - నకిలీ అన్న మాటలు వినగానే తన మామగారిని గురించి ఆలోచించకుండా వుండలేకపోయాడు.

ఆయన తటాలున అణ్ణామలై వైపు తిరిగి "కళాశాలలో శిక్షణ ముగియగానే ఏమి చేయాలనుకుంటున్నారు?'' అని అడిగారు. ఏమి సమాధానం చెప్పాలో తెలియక తెల్లమొహం వేశాడతడు.

"మీ కళను నమ్ముకుని బ్రతగ్గలమన్న ధీమా మీ కుందా? లేక జీవ నాధారంగా వేరేదయినా వసతిగాని మార్గంగాని వుందా? పెళ్ళయింది; ఇంక తండ్రి అవుతారు. అందుకనే అడిగాను—"

"ఏమి చేయాలో అర్థం కావడం లేదు —"

''నేను చెప్పేది వినండి. ఆదినుండి కళాకారులు ఎట్లా జీవించారో నేను చెబుతాను. మొదట రాజుల చక్రవర్తుల ఆదరణతో జీవించేవారు కళాకారులు. ప్రపంచమంతటా కళ ఇట్లాగే వర్ధిల్లింది. ఆ తర్వాత చిన్నచిన్న రాజులు, జమీం దారులు, సంపన్నులు కళలను పోషించారు. అంచేత 'కళ కళకోసమే'నని ఎవరూ పస్తులుండలేదు. తన వ్యక్తిత్వాన్ని కోల్పోకుండా కళాకారు డితరులను సేవించాడు. ఇది మీ రిప్పుడే స్పష్టంగా తెలుసుకోవడం మంచిది. మీ వ్యక్తిత్వాన్ని కోల్పో రాదు; ఆ వ్యక్తిత్వపు మేలి ఫలితాలు ఇతరుల కుపయోగించాలి. ఒకేసారి రెండు గుర్రాల స్వారీచేసే వింత రౌతులం మనం.''

"అసలైన కళాకారుడి జీవితమే ఒక పోరాటం—" అన్నారు కదిరేశన్.

శరవణన్ ఇంకా చెప్పారు: "రాజుల కాలం గట్టెక్కిపోయింది. ఇప్పుడు మనం అందరం రాజులం. మన ఈ రోజుల రాజులలో కలవారికి డబ్బు చేసుకోవ డానికే సమయం చాలడంలేదు. కనుక వారు మీ చిత్రాలవైపు కన్నెత్తి అయినా

చూదరు. ఇంక మనలాటి పేదరాజు లున్నారే, వారికి వెండితెర రాజుల ఫోటోలే అద్భుత కళాఖండాలు! ఈ రెండూ చెడిన పరిస్థితిలో అన్ని రంగాలలో అసత్యం చోటుచేసుకుని నిజం ఊపిరి నలిచివేస్తుంటే మీ రేమి చేయదలిచారు?" అని నే నడుగుతున్నా — !"

తల తిరిగినట్లయింది అణ్ణామలైకు. కళాకారుడు తన కళను ప్రజలకే అర్పించి, వారి సాయంతో జీవించలేదా అన్పించిందతడికి.

"కష్టమే..." అని నడిగాడు అణ్ణామలై.

"కష్టమేమిటి, వీలు కాదనిపిస్తే ఆ మాట చెప్పండి?"

"ఔను, వీలుకాదు!"

"వీలుకానిదానిని వీలయ్యేటట్లు చేసేవాడే మనిషి. వాడే మగవాడు నాగరికతను, సంప్రదాయాన్ని, సమకాలీన సమాజాన్ని మెరుగు పరిచేదే నిజమైన కళ. జంతువులను మనుష్యులగా మార్చగలవాడే నిజమైన కళాకారుడు. మనుష్యులను జంతువులు చేసేది నకిలీ కళ... నిజమైన కళాకారుడిగా బ్రతకడం కష్టమే. పోరాటానికి సిద్ధపడితే కళాకారుడిగా ఎదుగుతారు!"

శరవణన్ మాటలు కారంగా, ఘాటుగా వున్నా అణ్ణామలైకు కదిరేశన్ ఇంటి విందుకన్న - అవే నచ్చాయి. తన్ను మనిషి అని తలయెత్తి సగర్వంగా చెప్పుకోగల ఒక వ్యక్తిని కలవడం అతడికి ఆనందంగా వుంది. తిండికి సుఖానికి మించిన ఎత్తుకు ఎదిగిన మనిషిగా ఆయన అతడికి గోచరించారు. అతడి మనస్సాక్షికి నిదురలేచి కళ్ళు నులుముకో సాగింది.

# 12

మోహం ముప్పై రోజులు, ఆశ అరవై రోజులు అని తెలుసుకోడానికి ఆనందికి ఎక్కువ కాలం పట్టలేదు. రోజులయినకొద్దీ ఆశామోహాల కారణంగా ఆమె అనుభవిస్తున్న బాధ తగ్గసాగింది. మాణిక్యానికి ఆమెతో మాట్లాడడానికికూడా సమయం లభించసాగింది! తన పనిగురించి, ఆదాయం గురించి, గొప్పలు చెప్పుకుని డప్పు వాయించుకోవడంలో ఆనందం కనుపించిం దతనికి.

ఒకరోజు సాయంకాలం ఉత్సాహంతో ఇంటికి వచ్చాడు మాణిక్యం. అసాధారణంగా, ఆవేళ ఆమెను తీసుకుని టాక్సీలో బయలుదేరాడు షికారుకు. చాలపెద్ద హోటల్‌లోకి వెళ్ళి, కుటుంబాలకని ప్రత్యేకించిన ఒక గదిలోకి వెళ్ళి కూర్చున్నారు. సర్వర్ కేవో చెప్పాక మాణిక్యం ఉత్సాహంతో మాట్లాడసాగాడు.

"నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలనే ఇక్కడకు తీసుకొచ్చాను."

ఇంటివద్ద ఏకాంతానికి బోలెడు అవకాశం వుండగా ఇక్కడికి ఎందుకు రావాలో అర్థంకాలే దానందికి. "ఏవిటా విషయం?" అని ఆందోళనతో అడిగింది.

"మనకు హఠాత్తుగా అదృష్టం వచ్చిపడింది. ఆరేడు నెలలలోపుగా ఒక లక్ష రూపాయలు వస్తాయి! దానిని గురించి నీ సలహా అడుగుదామని అనుకున్నాను—"

ఎప్పుడూ తన్నేదీ అడగని వాడిలా మారడం ఆమె కర్థం కాలేదు.

"ఏవిటా అదృష్టం?''

సర్వర్ బోలెడు ఫలహారాలు తెచ్చాడు. మితంగా తినడం ఆమె అలవాటు. ఆమె వంతుకూడా తానే లోపలికి పంపించివేస్తూ మాట్లాడసాగాడు.

''ఆంధ్రకు చెందిన ఒక మాజీ జమీందారుకు మైలాపూరు నానుకుని పెద్ద చోటుంది. ఆయన దీనిని అమ్మేసి వెళ్ళి ఆంధ్ర దేశంలోవున్న పొలాలను చూసుకుంటూ అక్కడే వుండిపోవా లనుకుంటున్నాడు. ఆ చోటును చిన్నచిన్న ముక్కలుగా చేస్తే పాతిక ముప్పై 'ప్లాట్'లు అవుతాయి. అయితే ఆ జమీందారుకు డబ్బు ఇబ్బంది వచ్చిపడింది. వెంటనే రొక్కం కావాలి. అదే మనపాలిటి సువర్ణావకాశం. తక్షణం నగదిచ్చేటట్లయితే యాభై వేల కిస్తానంటున్నాడు. దానిని గనుక కొని 'ప్లాట్'గా చేసి అమ్మితే ఆరేడు నెలలలో రెండు లక్షలు వస్తాయి. ఆరు నెలల్లో నీ చేతికి లక్ష రూపాయల నివ్వకపోతే నా పేరు మాణిక్యం కాదు!''

అస లంతడబ్బు తమ కెందుకో ఆమెకు తెలియలేదు. కోటీశ్వరులు కాకపోయినా దేశంలో చేతికి నోటికీగా జీవిస్తున్న లక్షలాది జనులకన్న హాయిగానే జీవిస్తున్నాము తాము.

"తమ అంతస్తుకు, పేరుకు భంగం రారాదని ఆ జమీందారీ అమ్మకాన్ని రహస్యంగా వుంచాలనుకుంటున్నాడు. నలుగురుకీ తెలిస్తే ధర పెరుగుతుంది. నల్ల

డబ్బు గనుక రంగంలోకి దిగిందంటే మనం తట్టుకోలేము. కనుక గుట్టుచప్పుడుగా ముగించాలి బేరం—''

''మరి డబ్బుకేం చేయదలిచారు ?''

"మేస్త్రీగారినో ముప్పైవేలు ఏర్పాటు చేయమని కోరాను. నేను ముప్పైవేలు సంపాదించాలి. లాభంలో చెరిసగం. ఆరు నెలల్లో ఆయన పేరిట లక్షరూపాయలు జమకడతానని చెప్పాను. చెరి లక్షకన్న ఎక్కువ వస్తుందే కాని తగ్గదు. ఆ చోటుకు చాల గిరాకీ వుంది. ఒక్కొక్క 'ప్లాట్'ను ఆరువేల కమ్మితే గద్దల్లా తన్నుకుపోతారు. కారు, టెలిఫోను - ఈ సౌకర్యాలతో ప్రకటనలు చేయ దలిచాము."

మేస్త్రీగారెలా సంపాదిస్తారు డబ్బు? ఈయన ఎలా సంపాదించ దలిచారు? ఆణ్ణామలై పెళ్ళిలో మేస్త్రీ చేతిలో వున్నదంతా ఖర్చు అయిందని మీనాక్షమ్మ చెప్పగా వింది ఆనంది. తన పెళ్ళి నాన్నగారు చేతిలోది చాలక అప్పుతెచ్చి ఖర్చు పెట్టాడు.

"మరి డబ్బు ఎట్లా సంపాదించదలిచారు?"

"నువ్వే చెప్పాలి, ఏదన్న తీయగా తిన్నావంటే నీ నోటి నుండి తీయని ఆలోచనేదయినా వస్తుందేమోనని ఇక్కడికి తీసుకువచ్చాను-" అని గాఢంగా ప్రేమిస్తున్న కావ్యనాయకుడిలా ఆమెను కన్నార్పకుండా చూశాడు మాణిక్యం. అత డట్లా చూడగలడన్న విషయం ఆనంది కప్పుడు మొదటిసారిగా తెలిసింది.

''నేనేమి చెప్పగలను?"

"మేస్త్రీగారు తమ ఇంటిని కుదవబెట్టి డబ్బు తీసుకోబోతున్నారు. నువ్వా మీ నాన్నకు చెబితే ఆయన కాదనరు. ముప్పై వేలుంటేచాలు ఐదారు 'ప్లాట్'లు అమ్మేసరికి ఆ డబ్బు మన చేతికి వచ్చేస్తుంది. వ్యాపారం బాగా సాగితే మూడు నెలల్లో అప్పు తీర్చివేయవచ్చు.''

ఆనందికెందుకో శ్వాస బిగుసుకు పోయినట్లయింది. చెప్పరాని భయమేదో తన్నావరించడం ఆమె గుర్తించింది. తండ్రి మనసు తనకు తెలుసు. ఆయన ఇంటిని తన కుటుంబీకులుండే కోవెలగా భావిస్తారే తప్ప ఆస్తి అనుకోరు. రూపాయణా పైసల వ్యాపారంలోకి కుటుంబ స్త్రీలనెట్లా లాగరాదో, కాపురం వుండే ఇంటినీ అలాగే వుంచడమే అందం అంటారాయన. ఇంటిని ఆస్తిగా భావించడం

వల్లనే చాలమంది ఆ ఇల్లు లేక కష్టాలపాలవుతున్నారని నమ్మకం. అదీగాక ఇల్లు తనఖా పెట్టి ఆయన ఎప్పుడూ డబ్బు తీసుకుని ఎరగరు.

ఆందోళనతో చెప్పిందామె. "నాన్న నడిగి చూస్తాను."

"అడిగి చూడడం కాదు, పని ముగించు! ముగించి తీరాలి!" మాణిక్యం స్వరం ఆమె మనసున ముల్లులా నాటింది.

# 13

తమ కూతురి అల్లుడి దాంపత్య జీవితానికని ఎన్నో వసతులు సమకూర్చారు దండపాణి. పది రోజులకని తమ కారుని, బోలెడు డబ్బును సుందరికిచ్చారు. వాళ్ళిద్దరూ పాశ్చాత్య దేశాలలో వలె 'హనీమూన్'కు వెళ్ళాలని ఆయన కోరిక. మేస్త్రిగారూ తమ కొడుకు కోడలు తమలా లెగాక నవనాగరికంగా వుండాలని ఆశించారు.

బయట కారులో షికారుకు వెళ్లే వేళలలో అణ్ణామలై మీద వాలివుండేది సుందరి. ఆమె క్రొత్త చీరల రంగులు, సిగలో పూల సౌరభం, కాటుక కళ్ళు, తిలకం మెరిసే నుదురు-అన్నీ అతడికి నచ్చాయి. చిన్న బిడ్డలా ఆమె అతడితో ఆడుతూ, పాడుతూ, నవ్వుతూ, నసుగుతూ, గొణగుతూ కాలం గడిపేది. ఆమె అతడికి కొత్త కాదు. కాని అతడికి తన్ను తాను అర్పించుకున్నందున ఏర్పడిన హక్కుతో ఆమె అధికారం చెలాయిస్తుంటే ముచ్చటగా వుంది అతడికి. ఆమెకు లొంగి నడుచుకోవడంలో క్రొత్త ఆనందం అనుభవించాడతడు.

మేడ మీద అణ్ణామలై స్టుడియో ప్రక్కనే సుందరికి గదిని కేటాయించారు. ఆ మేడ మీద పెద్దల అటంకం లేని సామ్రాజ్యం వారిదయింది. స్టుడియో జోలికి రానంత కాలం ఆమె తన దగ్గరే వుండడం అతడికి హాయిగా వుంది. ఈ విశాల జగాన తానూ సుందరీ తప్ప ఇంకెవరూ లేరన్నట్లుగా పరవశం చెందా డణ్ణామలై. క్రొత్త తోడు, క్రొత్త అనుభవాలు, క్రొత్త కాలక్షేపాలు. ఆహా జీవితం ఎంత మధుర మయినది!

ఈ విషయంలో ఈ మేరకు అవతల ఆనంది మాణిక్యాల మేర చుక్కెదురుగా వుండింది. కొన్ని రోజులందాకా అణ్ణామలై తన చిత్రాలనే మరిచిపోయాడు.

ఒక రాత్రి.

కిటికీగుండా గదిలోకి ప్రవహిస్తూంది వెండి వెన్నెల. మత్తు నిండిన కళ్ళతో ఆమెను చూసి ఆనందిసున్నాడతడు. పెళ్ళికి ముందు కళాకారుడి దృష్టితో ఆమెనొక 'మాడల్'గా చూసి మురిసేవాడు. ఆ అందానికి ఆనందానికి, ఇప్పుడు ఆమె భర్తగా చూస్తున్న ఆ దానికి ఆనందానికి ఎంత వ్యత్యాసం! ఆమె మన దేశంలో అందానికి నిర్వచనాలుగా పరిగణించే రతీదేవిలాగానో మోహినిలాగనో కాక, పాశ్చాత్యులు ఆరాధించే అందాల దేవత 'వీనస్'లాగా కనిపించిందడికి నిండైన శరీరం, గులాబీ వన్నె, ఒకించుక మగతనం కలిసిన ఆడతనం-ఈ సమ్మేళనం ముగ్ధ మనోహరంగా వుండింది. ప్రేమ మైకంలో తన్నోలలాడించడానికనే జన్మించిందా ఈ సుందరి?

పొద్దు పొడిచింది. ఎన్నో పొద్దులు పొడిచాయి.

దండపాణి తమ కారును వెనక్కు తీసుకున్నారు. సుందరి చేతికాయన ఇచ్చిన డబ్బు ఖర్చయింది అణ్ణామలై కళాశాలకు వెళ్ళ రాసాగాడు. సుందరికి కాలం గడవడం కష్టం అన్పించసాగింది. ఇంటి పనులన్నీ మీనాక్షమ్మే చేసుకుంటున్నందున ఆమెకు ఆ పనులు లేవు.

ఒక రోజు కళాశాల నుండి వెనక్కు వచ్చాడణ్ణామలై.

"నాన్నగారు కారు వెనక్కు తీసుకోవడంతో కాళ్ళు విరిగినట్టయింది. మా ఇంట్లోనయితే అప్పుడప్పుడు కారు లభించేది.'' అంది సుందరి. "మనకు కారెందుకు? మన స్కూటరే చాలుగా!''

కాస్సేపూరుకుంది ఆమె- "నాన్నతో చెప్పి మనకు వేరే క్రొత్త కారు కొనిపిద్దాం-" అంది.

''ఆయనకు మాత్రం అంత డబ్బెట్లా వస్తుంది?''

"ఆయన డబ్బేమీ మనకివ్వక్కర్లేదులెండి. మీరు పనిచేయడంవలన ఆయనకు వేలకువేలు వస్తున్నాయి. అందులో మన డబ్బును డబ్బుగా కాక కారుగా ఇవ్వనివ్వండి!''

అణ్ణామలై తనలోనే నవ్వుకున్నాడు. దండపాణి కొన్ని రోజులపాటు తమ కారునివ్వడమే సరికాదనిపించిందతడికి. అదీగాక ఆయన దగ్గర తానింకా పని చేయబోతున్నానని ఆమె నమ్మడం అతడికి వేడుకగా వుంది. 'ఫొటోలకు రంగు పూయడానికి, పోస్టర్లు, బ్యానర్లు రాయడానికి డజన్లకొద్దీ మనుషులుండగా నేనెందుకా పనిని ఆయన క్రింద చేయడం?' అన్న ప్రశ్న ఉదయించిదతనిలో.

"కారు అక్కరలేదు; స్కూటరే చాలు-" అన్నాడు అణ్ణామలై. సుందరి అతడిని కోపంతో చూసింది.

# 14

సుందరి అణ్ణామలై ఎదురు చూడని విధంగా వారింటికో కారు వచ్చింది. "మేస్త్రి - మాణిక్యం భవన నిర్మాణ నిపుణులు" తమ వ్యాపార నిమిత్తం కొన్న పాత కారది. మాణిక్యం ప్రోద్బలంతో దానిని మేస్త్రి వాయిదాల పద్ధతిలో కొన్నారు. ఆ కారు ప్రత్యేకించి తమకే కాకపోయినా, కారంటూ ఒకటి ఇంటికి రావడం సుందరికి కాస్త ఊరట కల్గించింది. త్వరలోనే తమకంటూ వేరే ఒక కారు వస్తుందిలే అన్న నమ్మకం కలిగింది ఆమెకు.

మాణిక్యం మాటలు కార్యరూపం ధరించసాగాయి. కదిరేశన్‌తో ఆనంది భర్త మాటలను చెప్పిందిగాని ఆయనను ఒత్తిడి చేయలేదు. మేస్త్రిగారొచ్చి కదిరేశన్‌తో తమ కొత్త వ్యాపారాన్ని గురించి చెప్పారు.

"మైలాపూర్ ఇంటిని అమ్మి నేను మీ సాయంతో, ఎంతో శ్రమతో ఈ ఇంటిని కట్టుకున్నాను. అణ్ణామలై పెళ్ళితో చేతిలోదంతా ఖర్చయిపోయింది. ఇప్పుడు నా ఇల్లొక్కటే నా ఆస్తి. అయినా దానిని తనఖాకు పెట్టి డబ్బు తీసుకోబోతున్నాను. మీ స్థితీ నాలాగేవుంది. అయినా గాలివాటాన్నిబట్టే తెరచాప నెత్తాలి మనం —'

గాలివాటాన్నిబట్టి తెరచాప నెత్తడం అన్న సిద్ధాంతం విని తమలోనే నవ్వుకున్నారు కదిరేశన్.

"ఇంటిని నేను ఆస్తిగా భావించడంలేదు. అది మనం వుండే కోవెల అని నేను అనుకుంటున్నాను. అలాటిదానిని తనఖాకు పెట్టమంటున్నారే!" అన్నారాయన.

"ఇల్లు మన చేతిలోనే వుంటుంది కదా... దీనిని విడిపించుకోవచ్చు; రాబోయే లాభంతో కొత్త ఇల్లు కట్టవచ్చు"

కదిరేశన్ ఆలోచించారు ఈ పథకం ఆయనకు బొత్తిగా నచ్చలేదు. అయితే ఆనంది మాణిక్యాల సంబంధ బాంధవ్యాలమీద దీని ప్రభావం వుంటుంది. ఇల్లు ముఖ్యమా? కుటుంబం ముఖ్యమా?

"సరే మీ ఇష్ట ప్రకారమే కానివ్వండి-" అన్నారు కదిరేశన్.

పత్రాలు, సంతకాలు, అయ్యాయి. అన్నింటా అబద్ధాలుచూసి కదిరేశన్ బాధపడ్డారు పత్రంలో మున్ప్రైయైదువేలని రాశారు; కాని అప్పు మున్ప్రైవేలే. రాసిందొకవడ్డీ పుచ్చుకున్నదింకోటి. డబ్బు ఎక్కడ అడుగుపెడుతుందో అక్కడ నిజం పీకను నొక్కేస్తుంది అని తెలిసి విచారించారాయన. కాని మాణిక్యం ఈ విషయాలలో ఆరితేరినవాడిలా వున్నాడు ఈ పితలాటకాలు లేకపోతే జీవితమే లేదని నమ్మినవాడతడు.

ఇల్లు కుదువ పెట్టడం, ఆ స్థలాన్ని కొనుగోలు చేయడం-రెండు పనులూ రిజిస్ట్రార్ ఆఫీసులో ఒక్కసారే జరిగాయి. ఆ జమీందారు ప్రతినిధి కాగితాలమీద సంతకాలు చేసి డబ్బు తీసుకున్నారు. అందుకు కావలసిన అధికారం అతడి వద్ద వుంది. దళారీకి ఇవ్వవలసిన కమిషన్‌ను ఇద్దరూ ఇచ్చారు. జమీందార్‌గారి కారు డబ్బుతోసహా వెంటనే ఆంధ్రకు బయలుదేరింది.

కొన్నచోటును 'ప్లాట్లు' గా భాగించి పనిని మొదలుపెట్టారు, మేస్త్రీ మాణిక్యం. ప్లాట్లమధ్య దారాలు ఏర్పరచారు; ఎల్లలు గీశారు. ఇద్దరిళ్ళకూ టెలిఫోన్లు వచ్చాయి.

తర్వాత మంచిరోజు చూసి అన్ని దినపత్రికలలోను ఈ క్రింది ప్రకటన వేయించారు.

"అపూర్వ అవకాశం! మేస్త్రీనగర్‌లో చక్కటి నివేశనాలు! వివరాలకు టెలిఫోన్ చేయండి. కలిసిన వారిని కారులో తీసుకువెళ్ళి నివేశనాలను చూపిస్తాము. త్వరపడండి! ఆలసించి ఆశాభంగం పొందకండి! ధర వివరాలకు సంప్రదించండి!"

చెన్నపట్నంలోని దినపత్రికల పాఠకులలో ఇట్లాంటి ప్రకటనలను మాతమే చదివేవారిలో చాల రకాలవారున్నారు. కాపురంవుంటున్న వాటాకు నెల అద్దె సరిగా చెల్లించలేని స్థితిలోవుండి, ఎలాగో ఒకలాగున స్వంత ఇంటిని కట్టుకోలేమా అని కలలుగనేవారు, వారు ప్రకటనలు చూసి, వివరాలు కనుక్కుని, ధరలు తెలియగానే మూర్ఛిల్లేవారు. ఇంకొక రకంవారు ఖాళీ ఇండ్లను, స్థలాలను ఇతరులకు చూపి, ధరలు పెంచి అమ్మేవారు. మరికొందరు తమ దగ్గరున్న నల్ల డబ్బును ఇట్లగా మార్చదలచినవారు... వారందరూ పై ప్రకటనను చూశారు. అందరిలోనూ సంచలనం కలిగింది.

టెలిఫోన్ పక్కనేవున్న మాణిక్యం అక్కడనుండి కదలలేకపోయాడు. కాస్సేపటికి కార్లు, టాక్సీలు వచ్చి 'మేస్త్రి-మాణిక్యం కంపెనీ' ముందు, ఆగ సాగాయి.

వచ్చిన వారిని గుమాస్తాలు తీసుకువెళ్ళి ప్లాట్లు చూపించారు. నివేశనాన్ని అధిక ధరకు కొన్నారన్నారు. కావాలంటే ప్లాట్లలో ఇళ్ళు తామే కట్టిస్తామన్నారు. కొందరికి ఆ ధర విని తలతిరిగింది. ఎంత ధరయినా లెక్కలేని కొందరికి మైలాపూరు దగ్గర ఆ చోటు దొరకడమే అపూర్వభాగ్యం అన్పించింది.

మొదటిరోజే, ఒక్కొక్కటి ఏడువేల ఐదువందల రూపాయల చొప్పున పది ప్లాట్లు అమ్ముడుపోయాయి. వాటికి ఒప్పందాలు అయ్యాయి. ఐదువేలూ అడ్వాన్సుగా వచ్చింది. రిజిస్ట్రేషన్‌నాడు మిగతా రెండున్నరవేలూ వారు వారికిచ్చేటట్లు ఏర్పాటు. ఆరోజే రెండిళ్ళమీద అప్పునూ తీర్చేస్తానన్నాడు మాణిక్యం. ప్లాట్లన్నీ అమ్మకం అయిపోతే చెరి అరవై వేలకు పైగా లాభం వుంటుందని అంచనా వేసుకున్నారు వాళ్ళు.

ఆనంది కదిరేశన్‌ల కిదంతా నాటకంలా కనపించింది. నాటకాలలో జరగనివి కూడా నగరంలో జరగడం ఆశ్చర్యంగా వుండింది!

రిజిస్ట్రేషన్ జరగవలసిన రోజు ఒక విషాద నాటకం జరిగింది. పొద్దున్నే పోలీసులు వచ్చి మేస్త్రినీ మాణిక్యాన్నీ ఖైదుచేసి తీసుకు వెళ్ళారు.

# 15

అలా వారిని పోలీసులు తీసుకువెళ్ళగానే ఆ రెండు ఇండ్లలోనూ శోకం తాండవించింది. కదిరేశన్ మతిపోయినవాడిలా తలను చేత్తో పట్టుకుని కూర్చుండి పోయారు. అణ్ణామలై హడావుడిగా పోలీసు స్టేషన్‌కు పరుగెత్తాడు. కాని అతడిని లోపలకి వదలలేదు. సుందరి గోలపెడుతూ తన తండ్రికి ఫోన్ చేసింది. మీనాక్షమ్మా, ఆనందీ మూర్ఛిల్లినట్లు పడివున్నారు.

మాణిక్యం తల్లి నెత్తిని బాదుకుంటూ వచ్చి కదిరేశన్ ఎదుట రోదించ సాగింది.

"కన్నకడుపు భగ్గుమంటున్నదే!... మీరేమో బెల్లంకొట్టిన రాయిలా కూర్చుండిపోయారే! వెంటనే వెళ్ళి నా కొడుకును తీసుకురండి లేకపోతే నేనూ రొక్కనూ—"

ఆమె పుత్రరత్నమూ, మేస్త్రీగారూ ఆ క్షణాన పోలీసుస్టేషన్‌లో ఇన్‌స్పెక్టర్ ఎదుట కూర్చొనివున్నారు. వారి ప్రక్కగా బుర్రమీసాలు, ఎర్రబారిన కళ్ళుగల తెలుగు జమీందారు కూచుని వున్నారు. ఆయన తమిళం తెలుగు ఇంగ్లీషు కలిసిన మణి ప్రవాళంలో మండిపడుతున్నారు.

ఆయన ఆరోపించిన నింద ఇది.

అత్తగారి సొమ్ము అల్లుడు దానం చేసినట్లు, తన నివేశనాన్ని ఈ 'మేస్త్రీ మాణిక్యం' గాళ్ళు ప్లాట్లుచేసి అమ్ముతున్నారు. చెన్నపట్నంలోని తన మిత్రుడొకడు ఉత్తరంరాస్తూ, వారి పత్రికా ప్రకటన ప్రతినీ పంపాడు. వెంటనే మద్రాసు వచ్చి కనుక్కొంటే ఈ మోసగాళ్ళిద్దరూ ఇంకో మోసగాడి నుండి తన చోటును కొన్నట్లుగా నాటకమాడి, అమ్మేస్తున్నారు. జమీందారు యొక్క అసలయిన ఏజెంటూ ఆయనతో వున్నాడు. తన ఏజెంటులాగా నటించిన అతడూ ఈ మోసగాళ్ళ గుంపులోనివాడే! తాను ఈ ప్లాట్ల అమ్మకాన్ని నిలుపుదల చేయమంటూ కోర్టువారిని కోరివున్నాడు. వీరిద్దరిమీద దగా, మోసం, కుట్రలు ఆరోపిస్తూ పోలీసులకు ఫిర్యాదూ చేశాడు. "వారిని కటకటాల్లోకి తోసిగాని నేనీ వూరు విడిచిపోను-" అని ఉరిమాడా జమీందారు.

ఇంతటి అవమానాన్ని మేస్త్రీ తమ జన్మలో ఎరగరు. పేదరికం, రోగం, దగా-ఇవన్నీ అనుభవించారు కాని ఎప్పుడూ ఎవరూ ఆయనను మోసగాడని అనలేదు. ఇంటికి పోలీసులు వచ్చి ఖైదుచేసి తీసుకెళ్ళడం తీరని అవమానం అని భావించే గ్రామస్తుల భావమే ఆయనలోనూ వుంది. మానాభిమానాలను విసర్జించే టంతగా నగర నాగరికత ఆయనను ఆవహించలేదు. పంచప్రాణాలూ కుంచించుకు పోగా, కళ్ళు తుడుచుకుంటూ ఏమీ మాట్లాడకుండా, కూచుని వున్నారాయన.

మాణిక్యానికి నిజం వెల్లడి ఆయింది. జమీందారు ఏజెంటులాగా నటించిన ఎవడో ఒక వ్యక్తి తమ కంట్లో కారంకొట్టి డబ్బు తీసుకుని పరారీ అయ్యాడని తెలిసింది.

అప్పటికీ అతడేమీ బెక్కు చెదరలేదు. ఏమీ భయపడకుండా ఇన్‌స్పెక్టర్‌తో, జమీందారుతో చట్టం గురించి మాట్లాడాడు. జమీందారు తన మనిషినే పంపి అమ్మకం చేయించారు: డబ్బు కాస్తా తీసుకుని ఇప్పుడు కావాలని తమ్ము బెదరిస్తున్నారు. డబ్బు చెల్లించి నమోదు చేయించిన ఆ చోటు చట్టరీత్యా తమదే. జమీందారే మోసగాడు; నాటకం, పితలాటకం అంతా ఆయనదే !

అది పోలీసుస్టేషను కావడంవల్ల, అక్కడ ఇన్‌స్పెక్టర్ వున్నందువల్ల జమీందారు మాణిక్యం మక్కెలు విరగదన్ని పొడి పొడిగా చేయలేదు.

పట్టపగలే తన సొత్తును స్వాహా చేయడమేకాక తన్నే మోసగా డనడంతో ఆయనకు అరికాలి మంట నెత్తికెక్కింది. శత్రువుల తలలను అరటి గెలలవలె నరికివేసే వంశంలో చివరివా డాయన.

మాణిక్యమూ ఉక్రోషంతోనే బీరాలు పలికాడు. కాని మేస్త్రీగారికి అవ మానమే తప్ప ఆక్రోశం కల్గలేదు. ఆయన, జమీందారుతోను పోలీసులతోను తమ జీవితం గురించి వివరించారు. ఆయనకు ఆశవుంది, పేరాశ వుంది కాని మోసం దగా ఆయనకు తెలియవు. అభిమానధనుడాయన. జమీందారుగారి నివేశనం కొనడానికి తమ భవిష్యత్తునే పణం ఒడ్డారు, తామూ కదిరేశనూ తా ముంటున్న ఇండ్లను కుదవబెట్టారు. నమ్మకద్రోహం చేసినది తాముకాదు, ఆ ఏజెంటని చెప్పు కున్నారంతే...

"అయ్యా! జరిగిందేదో జరిగింది; పోయిన డబ్బు ఎటూరాదు. మీ చోటును మీరు తీసుకుని మమ్మల్ని మానంతో పోనివ్వండి! ఇప్పుడే నా గొంతు పూడుకు పోతున్నది..." మాటరాక అవస్థ పడ్డారు మేస్త్రీ.

"మీ రుత్తి పల్లెటూరి బైతులా మాట్లాడకండి ఊరుకోండి " అని అయనను గదమాయించిన మాణిక్యం—" అదేమీ కుదరదు. చట్టప్రకారం చోటు మనదే. ఆయన చిత్తం వచ్చినట్లు చేసుకోమనండి. తీర్పు చెప్పవలసింది కోర్టు!" అని అరిచాడు.

న్యాయానికి విరుద్ధంగా చట్టమా ? ధర్మానికి విరుద్ధంగా కోర్టా ? మేస్త్రీగారికి పట్టరాని ఆగ్రహం వచ్చేసింది. అది పోలీసుస్టేషన్ అని మరిచి మాణిక్యం మీదకు ఉరికి టపటపమని వర్షించేశారు; దెబ్బమీద దెబ్బ అతనికి. మొహమూ, ముక్కూ అని తెలియకుండా వడ్డించేశారు.

పరిస్థితి బాగా ముదిరిపోయేసరికి ఇన్‌స్పెక్టర్ వారిని విడదీయ వలసి వచ్చింది.

"విశ్వాసం లేని కుక్క వెధవా ? నేనాచదువురాని మూర్ఖుడని; నువ్వు చదువుకున్న మూర్ఖుడివి. ఏమిచేశావో తెలుసట్రా నాకు ? నా ఆస్తితో బాటు మానాన్ని గంగలో కలిపేశావు మానం అంటే ఏవిటో తెలుసా నీకు ?

మేస్త్రీ పిచ్చి పట్టినట్లు తమలో తామే మాట్లాడుకోసాగారు. ఏడిచారు. వారిని వేడుకున్నారు. తెలియక చేసిన తప్పుకు మన్నించమని కోరారు.

జరిగినదంతా ఇన్‌స్పెక్టర్‌కు అర్థమయింది. నేరస్థు డెక్కడో మాయమ య్యాడు. మోసగించబడిన ఇరు పక్షాలవారూ చిక్కుకుని అవస్థపడుతున్నారు. అందులోనూ మేస్త్రీగారయితే జమీందారు నివేశనాన్ని వెనక్కిచ్చేయడానికి ఒప్పు కున్నారు. మాణిక్యమే ఒప్పుకోవడంలేదు.

సరిగ్గా ఆ సమయానికి వారిని జామీను మీద విడిపించాలని కదిరేశనూ దండ పాణీ అక్కడికి వచ్చారు. కదిరేశన్‌ను చూడగనే వారిని కావలించుకుని వెక్కి వెక్కి ఏడ్చారు మేస్త్రీ.

"నేను మీకు ద్రోహం చేశాను. కొత్త ఇల్లు కట్టి ఇచ్చినట్టే ఇచ్చి దాన్ని మీకు లేకుండా చేశాను. ఆ పాపానికే నాకు ఇప్పుడు శిక్ష లభించింది మట్టికి మట్టి

పోయింది. మానానికి మానమూ పోయింది. గాలి వీస్తున్నప్పుడే తెరచాప ఎత్తాలని నేనంటే, పేరాశపడితే పెను తుఫాను రావచ్చని మీరు అన్నారు. అదే అయింది! మన రెండు కుటుంబాలూ సమూలంగా నాశనం అయ్యాయి. నన్ను క్షమించండి. నేను చదువుకోని శుంఠను నన్ను క్షమించండి!"

జామీనిచ్చి వారిని విడిపించారు. బయట దండపాణి కారులో కాచుకుని వున్న అణ్ణామలై తండ్రిని చూడగానే పరుగు పరుగున వచ్చి ఆయనను పట్టుకున్నాడు. ఆయన అతడిని గట్టిగా కౌగలించుకుని నుదుటి మీద ముద్దు పెట్టుకున్నారు. అతడిని అట్లా ముద్దు పెట్టుకోవడం అదే మొదటిసారి. అతడి నుదుటి మీద ఆయన రక్తపు ధారపడి బొట్టులా భాసించింది. అతడు ఈ భూమి మీదకు రావడానికి కారణమైన ఆ రక్తాన్ని చూసి ఆయన గర్వించారు.

కారు వెనక సీటులో అణ్ణామలైను కూర్చోమని చెప్పి, అతడి ఒడిలో తల పెట్టుకుని, పడుకున్నారు మేస్త్రి. మిగతా వారు ముందు ప్రక్క ఇరుక్కుని కూర్చోవడంతో కారు ఇంటికి బయలుదేరింది. కొడుకు ఒడిలో తల పెట్టుకు పడుకున్న మేస్త్రికి తన జీవితంలో ఇదివరకు ఎన్నడూ తెలియనంత సుఖంగా వుందనిపించింది.

"అణ్ణామలై! నువ్వే నిజంగా నా కొడుకువు. నువ్వొక్కడివే నా కొడుకువు! తెలుసా, నువ్వు మంచివాడివి, బంగారం లాంటి వాడివి. ఈ మహా నగరంలో మంచి పేరు తెచ్చుకో- ఆశించు, కాని పేరాశకు గురి కాకు! పేరాశ పెద్ద చేటుకు కారణం. దేవుడే నిన్ను చల్లగా చూస్తాడు...చల్లగా చూస్తాడు..."

కారు ఇల్లు చేరింది. కాని మేస్త్రిగారు దిగలేదు.

మట్టినీ మానాన్నీ ఒక్కసారిగా కోల్పోయాక ఆ ఇంట్లోకి అడుగుపెట్ట నిచ్ఛగించనట్లుగా కారులోనే కట్టెలాగా పడివున్నారు.

# 16

మేస్త్రిగారిని ఒక పిడికెడు బూడిదగా చేసి వెనక్కు తిరిగివస్తున్న అణ్ణామలైను వర్ణించరాని ఒంటరితనం ఆవరించింది. తనలో ఒక భాగం, ఒక పెద్ద

భాగం మండి మసి అయినట్లనిపించింది. కారణం అతడికి పూర్తిగా అర్థం కాలేదు. అతడికి తెలియకుండానే ఆయన అతడి చుట్టూ తమ ప్రేమానురాగాలతో ఒక కోట కట్టి వుంచారని ఇప్పుడు తెలుస్తున్నది. అతడి భవిష్యత్తుకని ఆయన ఎన్ని బంగారు కలలు కన్నారు!

ఇంటి మీద అప్పిచ్చిన ఆయన విచారింపుకని వచ్చారు; విచారించారు. దుఃఖించారు. ఆయన దుఃఖానికి బలమైన కారణమూ వుంది. మేస్త్రి కన్ను మూసిన ఆ రోజునే- తన అప్పు డబ్బు వెనక్కు రావలసి వుంది. ధనం ఇవ్వవలసిన వాడి శవం కంటపడేసరికి దుఃఖం కాక మరేమి కలుగుతుంది? అదీగాక జమీందారు కథా ఆయనకు తెలిసింది.

''నాయనా! ఈ మాయకాయం శాశ్వతమైనది కాదు. పుట్టిన వాళ్ళందరూ ఒకనాడు గిట్టక తప్పదు. అందు నిమిత్తం విచారించడం అవివేకం-" అంటూ సాక్షాత్తు ఆ శ్రీకృష్ణ భగవానుడే మరో అవతారం ఎత్తి వచ్చి అర్జునుడికి చెపుతున్న ధోరణిలో వేదాంతం మాట్లాడాక ఆయన- ''ఇక నుండి అంతా నా బాధ్యతే! నువ్వే ఆయన ఏకైక పుత్రుడివి!'' అంటూ అసలు విషయానికి వచ్చారు.

ఆ ఏకైక పుత్రుడేమో ఏమీ ఎరగని అమాయక పుత్రుడుగా వుండె!

"అబ్బాయ్! నేను మీ నాన్నను నమ్మి అప్పిచ్చానేగాని ఈ ఇంటిని నమ్మి కాదు. అసలు ఈ ఇంటికి ముప్పై వేల అప్పు ఇవ్వదగినంత విలువ లేదు. ఇప్పుడు నువ్వున్న పరిస్థితిలో అప్పు వెనక్కివ్వమని అడగడానికి నాకు మనసు రావడం లేదు. నెల నెల మొదటి తారీఖున నువ్వు వడ్డీ మాత్రం సరిగా కడితే చాలు. వడ్డీ కూడా ఎక్కువేమీ కాదు నెలకు ఆరు వందలే..."

''నెలకు ఆరు వందలే...వడ్డీ ఎక్కువేమీ కాదు...నెల నెల మొదటి తారీకున కడితే చాలు''- ఈ మాటలు వినగానే కళ్ళు తిరిగాయి అణ్ణామలైకు. అంతే కాదు భార్య, తల్లి వున్నారు, వారిని పోషించాలి. నెలకు ఖర్చు వేయికి పైగా అయ్యేట్లుందే!

గుడ్లు మిటకరించి చూస్తున్న అణ్ణామలైను చూడగానే మరొక గుండెపోటు కేసు తయారవుతుందేమోనని భయపడి ఆ అప్పిచ్చిన ఆసామీ జారుకున్నాడు.

అణ్ణామలై భోరుమని ఏడవసాగాడు.

మేస్త్రీగారి అస్థి నిమజ్జన దినం వచ్చింది. కదిరేశన్, దండపాణి, మాణిక్యం అణ్ణామలై తోబాటు శ్మశానానికి నడిచారు. దారిలో కనపడిన గుడిసెలనూ, వాటిలో నివసించేవారినీ చూసినప్పుడు అణ్ణామలై కెందుకనో తానూ వారిలో ఒకడి ననిపించింది. అరంతస్తుల మేడలు నిండిన నగరంలో ఆరడుగుల గుడిసెలో వాళ్ళెలా జీవిస్తున్నారో ? అయినా వాళ్ళు నెలకారు వందలు వడ్డీ కట్టనక్కర లేదుగా !

శ్మశానంలోకి అడుగిడగానే అణ్ణామలై, తన తండ్రి చితిని కర్రతో కెలికి కాలని పిడక ముక్కలను, కాల్చిన కర్రల బొగ్గులను సేకరించి ఒక పాత బుట్టలో పడేసుకుంటూన్న ముసలి దానిని చూశాడు. శ్మశానపు కావలివాడు ఆమెను, వస్తున్నవారిని చూసి పరుగెత్తు కొచ్చాడు. ఆమెను తిడుతూ ఆ బుట్టను తీయబోయాడు. ఆమె ప్రతిఘటించింది.

''ఏయ్, ముసలిదానా ! ఇక్కడికి రాకు అని ఎన్నిసార్లు చెప్పాను నీకు ! మళ్ళీ కనబడితే నిన్నూ ఆ చితి మీదకు పారేస్తా !''

''అట్లా చేసి పుణ్యం కట్టుకోరా నాయనా ! రోజుకు మూడు సార్లు కడుపులో మండే మంటకన్నా చితిమంట చల్లగా వుంటుంది !'' అంది ఆ ముసలిది. కావలివాడు ఆ బుట్టను తిరగేసి కింద పోయబోతే ఆమె అడ్డుపడింది.

"వద్దుబాబూ వద్దు ! బియ్యం నూకలంటే బొగ్గులకు డబ్బులుండవు. బొగ్గులకు డబ్బులుంటే గంజికి నూకలుండవు. వృధాగా పోయేవాటినే కదా నేను తీసుకున్నాను. ఇవాళ్టికి వదిలేయి ! రేపు వస్తే అడుగు !''

ఆ సంఘటన అణ్ణామలైను కలచివేసింది. మాణిక్యం కోపంతో ఆ ముసలి దానిమీద కురకపోతే ఆపాడు అణ్ణామలై – "ఆమెను వదలండి ! ఆమెను బుట్టతో వెళ్ళిపోనివ్వండి" అన్నాడు.

''బలే వూరండీ ఇది ! మండుతున్నప్పుడే తలో కాస్త పీక్కుపోవాలని చూస్తారే !'' అనీ మండిపడ్డాడు మాణిక్యం. కాని ఆ వూరి మనస్తత్వానికి తాను నిజమైన ప్రతినిధి అన్నమాట అప్పటికి మరిచాడు.

'ముసలిదాని తప్పేమీలేదు. ఈ నగరానికి హృదయం లేదు—' అని తనలో అనుకుని వచ్చిన పనిలో నిమగ్నుడయ్యా డణ్ణామలై. దుఃఖం, విషాదం నిండిన ఆ క్షణంలో ఎందుకో నవ్వాలనిపించింది అతడికి. చివరకు పిడికెడు మట్టిగా మారే

వారికి ఎన్ని ఆశలు! ఎన్ని పేరాశలు! చివరికి తన తండ్రికూడా దానికే బలి అయ్యారు!

"ఆశించు! కాని పేరాశపడకు!" అని తండ్రి చెప్పిన మాటల అర్థం తేట తెల్లం కాసాగింది.

# 17

జరిగిందేదో జరిగింది. జీవిత పోరాటంలో అస్త్రాన్ని తప్పుగా ప్రయోగించగా అది వెనుదిరిగిరాగా దానిదెబ్బకు మరణించారు చిదంబర మేస్త్రి. ఒక విధంగా చూస్తే ఆయన సమస్యలన్నింటినుండి తప్పించుకుపోయారని చెప్పాలి ఇప్పుడు చిక్కుకుని తపిస్తున్నవాడు అణ్ణామలై.

దండపాణిగారూ అలాగే తపించారు. ఈ విధంగా జరుగుతూందని తెలిసి వుంటె అంత తొందరపడి సుందరిని అణ్ణామలైకిచ్చి పెళ్ళి చేసేవారా? మేస్త్రికి ఇల్లు వాకిలి వున్నాయి ఇంకా సంపాదించి పెట్టగల స్తోమత వుంది-అన్న ఆలోచనతో చేసిన పెళ్ళి అది. మేస్త్రిగారింకా ఐశ్వర్యవంతులయితే ఈ సంబంధం తమ చేయిదాటి పోతుందేమోనని తొందర పడ్డారు దండపాణి. జరిగిందేదో జరిగింది. ముందు జీవితం వుందికదా... మామగారుగా తమ బాధ్యతలను స్వీకరించారు ఆయన.

"ఇకనుంచి అణ్ణామలై కళాశాల వెళ్ళనక్కర్లేదు. మన ప్రకటనల కంపెనీ చూసుకుంటే చాలు. నెలకు వెయ్యి రూపాయలివ్వడం నా పూచీ. నేనే నెలనెల ఆరు వందలు వడ్డీ కట్టేసి మిగిలిన నాలుగు వందలను చేతికిస్తాను. తర్వాత అదృష్టం బాగుంటే ఇంటినీ విడిపించుకోవచ్చును. కంపెనీకి పని తీసుకురావడం నా వంతు, దానిని పూర్తిచేసివ్వడం అణ్ణామలై వంతు." అన్నారు దండపాణి సుందరితో ఆ ప్రక్కనే వున్నాడు అణ్ణామలై.

అతడేమీ పలకలేదు. అతడికి ఆ పని అంతగా నచ్చలేదని దండపాణికి తెలుసు. అందుకనే ఆయన "బయట పనికి వెళ్ళితే రెండువందలు రావడం కూడా కష్టమే... పోనీ చిత్రాలు గీచి అమ్ముదామా అంటే డబ్బులురావు. కనుక ఈ పని చేయడమే మంచిది-" అని లేచారు దండపాణి.

సుందరి సంతోషం పట్టలేక తండ్రిని కౌగలించుకుని గంతులు లేసింది. క్షణంలో తన భర్తకు నెలకు వేయి రూపాయల వుద్యోగం మిప్పించాడు నాన్న. ఆ వేయిలో ప్రస్తుతం చేతికి వచ్చేది నాలుగు వందలేనన్న విషయం మరిచిందామె.

మామగారి మాటలువిని ఆనందించాలా, దుఃఖించాలా అని తెలియలేదు అణ్ణామలైకు. వెంటనే కావలసింది డబ్బు; అది వచ్చే మార్గం ఇది. ఆ మేరకు అతడికది ఊరట కల్గించింది. కాని చేయవలసిన పనో? పిచ్చి పిచ్చిగా బట్టలు వేసుకునో అసలు వేసుకోకనో వున్న దిగంబర ఫోటోలకు రంగులు పూయాలి. తన జాతి కళా సంప్రదాయానికి చెందని కయంత్రంలాటి మైకానికి అతడు ఊడిగం చేయాలి. పనిలో హెచ్చుతగ్గుల వున్నాయని అతడనుకోడు కాని, అక్కడ తాను చేసేపనిని కళ అనడానికి మనస్కరించలేదు.

సరిగ్గా ఇప్పుడే శరవణన్ అక్కడికి వచ్చారు. మేస్త్రిగారి మరణవార్త విని, పరామర్శించి పోదామనీ, అణ్ణామలై వద్ద ఏదయినా చిత్రం వుంటే తమ పత్రికలో ప్రచురణార్థం తీసుకు పోదామని వచ్చారాయన.

అణ్ణామలై ఆయనకు అన్నీ చెప్పాడు. కాస్సేపు ముందుగా దండపాణి చెప్పిన పథకం కూడా చెప్పాడు. అది తనకు అంతగా ఇష్టంలేని పని అని చెప్పాడు. నెలకు వేయి రూపాయలు వచ్చే అవకాశాన్ని హర్షించని యువకు డుంటాడా అనిపించిందాయనకు.

''పనిలో తరతమాలు లేవు. కాని ఏది పని. ఏది కళ అని మీరే మొదట తేల్చుకోవాలి. మీరు పనివాడుగా, లేక యజమానిగా కాదలిచారా, లేకపోతే కళాకారుడు కాదలచారా అన్నదీ నిశ్చయించుకోండి.'' అన్నారు శరవణన్.

''నేను కళాకారుడి నవ్వాలని కోరుతున్నాను—''

''మరి ప్రస్తుతానికి నెలకు రెండు వందల రూపాయలు సరిపోతాయి అనుకుంటే నేనొకదారి చూపగలను. మీ చిత్రాలను ప్రజల దగ్గర కెన్నెన్నీ విధాల తీసుకు వెళ్ళడానికి యత్నిస్తాను తర్వాత తర్వాత మీకు ఎక్కువరావచ్చు. కాని ఖచ్చితంగా చెప్పలేను''

ఇంటిమీద అప్పు గురించి ప్రస్తావించి- ''ఆ వడ్డీకి నెలకు ఆరొందలు కావాలే!'' అన్నాడణ్ణామలై.

"పోతే పోతుందని ఇంటిని వదలివేసే ధైర్యం వుంటేనే నా మాట వినండి. నేను మీకు యాభై రూపాయల అద్దెలో వాటా ఇప్పించగలను. నేనూ అద్దె ఇంట్లోనే వుంటున్నాను. మీ నాన్నగారే మోయకుండా వెళ్ళిపోయిన ఈ భారాన్ని మీరెందుకు నెత్తిమీద పెట్టుకోవడం? మీ మామగారు ఒప్పుకుంటే ఇంటినీ అప్పులనూ ఆయనకే వదలివేయండి—"

అణ్ణామలైకి ఆలోచన నచ్చింది. ఈ ఇల్లూ అప్పులూ ఆయననే చూసుకోమందాం. కళాకారుడిగా జీవించడమనే పోరాటంలో దూకాలి. అటువంటి జీవితాన్ని జీవించడమే తపస్సనిపించింది. శరవణన్‌కు కృతజ్ఞతలు చెప్పాడు. ఆయన సెలవు తీసుకున్నారు.

# 18

అణ్ణామలై కొత్త పథకాన్ని సుందరి హర్షించలేదు, మీనాక్షమ్మ హర్షించలేదు.

సుందరి అతడి మాటలు వినగానే - అతడి మతి చలించిందేమోనని సందేహించింది. తన తండ్రి గనుక ఇది వింటే అల్లుడి మొహం చూడడు - అని అరిచింది ఆమె. కాని ఆమె ఆర్భాటమూ అరుపులూ వింటుంటే ఆమె తండ్రి మాటలు వినకపోతే ఆమె తన మొహంచూసి మాట్లాడదేమో ననిపించింది.

పైపెచ్చు సుందరి ప్రేరేపించడంతో మీనాక్షమ్మ కళ్ళ నీళ్ళతో ఇలా అంది - "మీ నాన్నకు నువ్వంటే ప్రాణం. నీ కోసం ఎంతో ఆశతో ఆయన కట్టిన ఇల్లిది. ఇది పోతేపోనీ అనడం నీకు న్యాయమా? ఆయన ఏకైక పుత్రుడివి నువ్వు; ఆయన ఆస్తికీ, అప్పుకూ వారసుడివి నువ్వు. మగవాడిగా పుట్టిన నువ్వు ఈ బాధ్యతలకు వెరచి పారిపోవడం తప్పు—"

అణ్ణామలై సన్యాసం పుచ్చుకోవడానికి సిద్ధమైనట్లూ, అతడిని ఎట్లాగయినా ఆపడమే తమ ధ్యేయం అయినట్లు మాట్లాడారు వాళ్ళు. మైత్రి మరణం దెబ్బకు అతడి మతి చలించిందేమోనని వాళ్ళు భయపడ్డారు.

తెల్లవారింది. బాలభానుడి బంగరు కిరణాలూ, లేతగాలి మేడమీద కిటికీలో నుండి గదిలోకి ప్రవేశిస్తున్నాయి. లేచి కిటికీవద్దకు వెళ్ళి నిల్చుని ఆనంది ఇంటి

తోటవైపు చూశాడు అణ్ణామలై. సుమసౌరభం అతడిని పరవశుడిని చేసింది. చెట్లు, మొక్కలు, పువ్వులు - వీటి రంగుల రంగవల్లికలు నయనానంద కరంగా వున్నాయి. అది చూస్తుంటే ప్రశాంతి తన్నావహించడం తెలిసింది అతడికి.

దూరాన వెర్రిగా పూచిన నాగలింగ చెట్టు పెద్ద పూలబంతివలె వుంది. పొద్దుటే లేచి తలస్నానం చేసి, తడియారని జుత్తుతో ఆ చెట్టుకింద నిలిచి అందిన రెమ్మల నుండి పువ్వులను కోస్తూంది ఆనంది. ఆమె అతడిని చూడలేదు. కాని అతడికి ఆ దృశ్యం మనోజ్ఞమైన చిత్రంవలె అనిపించింది.

ఆ లేత ఎండలో కళాదేవి దర్శన భాగ్యం లభించిన వాడిలా మైమరచి వున్నాడతడు. అట్లా ఆమెను చూస్తుండడం తప్పు అనిపించలేదు అతడికి. సౌందర్య పిపాస తప్ప మరొక్కటి లేదతడి ఎదలో. నెమలిని పురివిప్పి ఆడేటట్లు చేసే శక్తి ప్రకృతి కున్నట్లే తనలోని కళా మయూరిని ఆడించే శక్తి ఆమెలో ఏదో వుంది వుండాలి అనిపించింది అతడికి.

'ఇలాటి దృశ్యం చూడాలనిపించిననాడు, ఈ ఇంటిలో లేకపోతే ఎలా చూడగలను? ఈ చెట్లు, ఈ పక్షులు, ఈ ఆనంది, ఈ అందం - ఇవి ఎక్కడ లభించగలవు?' అనిపించింది హఠాత్తుగా.

అతడొక నిశ్చయానికి వచ్చాడు. పనివాడుగాను, కళాకారుడిగాను ఒకే సారిగా జీవించ నిశ్చయించాడు. దండిపాణిగారి పని కేవలం బ్రతుకు తెరువుగా చేపట్టడం, తన స్టుడియో అనే సామ్రాజ్యానికి చక్రవర్తిగా తన చిత్తం వచ్చిన చిత్రాలను గీయడం - అదీ పద్ధతి, అనుకున్నాడు.

కళాశాల ప్రధానాచార్యులవారిని కలిసి అన్నీ చెప్పాడు అణ్ణామలై. అతడట్లా నగంలో వెళ్ళిపోతున్నందుకు బాధపడ్డా రాయన, కాని అతడిని వారించలేదు.

"నువ్వేపనిని చేపట్టిన ఈ కళను వదలకు. నీలో కళాత్మకమైన శక్తివుంది. తీరిక వేళలలో చిత్రాలు గీయి. నీకు వీలయినప్పుడు చిత్రాలతో ఇక్కడికి వస్తూండు—" అన్నారాయన.

దండపాణి కంపెనీలో చేరాడు అణ్ణామలై. వేళకు అక్కడికి చేరి ఒంచిన తల ఎత్తకుండా పనిచేసేవాడు. ఒకటికి రెండింతలు పనిచేసేవాడు. తన క్రింద వారిచేతా బాగా పని చేయించేవాడు. దండపాణీ అహోరాత్రాలు తిరిగి తిరిగి బోలె డంత పనిని తెచ్చేవారు. చిత్ర పరిశ్రమలో బోలెడంత డబ్బు మూలుగుతుండడం

వలన ఎంతటి లోభినుండి అయినా తన క్కావలసినదానిని రాబట్టటాన్ని ఒక కళగా నేర్చిన దండపాణిగారి నిరంతర కృషివలన - ఆదాయం బాగా రాసాగింది. ఇట్లాగే ఇంకొంతకాలం పట్టుబడితే అణ్ణామలై ఇంటిని ఋణవిముక్తంచేసి అతడికి అప్పగిం చేయ వచ్చునని ఆయన నమ్మారు.

పొద్దున పనిలోకి వెళ్ళేముందుగాని సాయంకాలం పనినుండి వచ్చాకగాని కాసేపు స్టుడియోలో కూచోగల్గితే అణ్ణామలైకు ఆ రోజు సార్థకం అన్పించేది. స్టుడియోలో పనిచేసుకుంటే, శ్రమ, చీకాకు, ఆయాసం అన్నీ మాయమయ్యేవి. చిత్రాలు ప్రారంభించడం, ముగించడం - ఆనందంగా సాగేది. మధ్యలో ఎప్పు డయినా ఒక రోజు సుందరిని తీసుకుని షికారుకు వెళ్ళేవాడు.

అయితే సుందరికి అతడి ధోరణి నచ్చలేదు. ఎప్పుడో రాత్రివేళ కాసేపు మాత్రమే సరదాగా మాట్లాడ వీలవుతూంది. అప్పుడయినా అతడి పోట్లాడడంతోనే సగం పొద్దయిపోతుంది. షికారుకు వెళ్ళినప్పుడు ఖర్చు పెట్టడానికయినా అతడివద్ద ఎక్కువ డబ్బుండేది కాదు.

ఒకరోజు సుందరి అతడితో, తన మామూలు సణుగుడు ధోరణిలోకాక - స్పష్టంగానే చెప్పింది. "మీరేమో పనికి వెళ్ళిపోతారు పనినుండి రాగానే స్టుడియో లోకి దూరుకుంటారు. కాని నాకేమో పొద్దుపోవడంలేదు. ఒకటే 'బోర్' కొడు తూంది" ఆ పదం ఆమె బడిలో నేర్చుకున్న పదం.

ఆమె మాటలు సబబే నన్పించాయి అతడికి. పెళ్ళికిముం దామె చెలికత్తెల తోను, అతడితోనూ కులాసాగా, ఖుషీగా, సీతాకోక చిలుకలా విహరిస్తుండేది. అదీగాక తనకూ సరదాగా ఏ సముద్ర తీరానికో ఆమెతో వెళ్ళాలనిపించక పోలేదు.

"నువ్వు చెప్పింది నిజమే. అందుకు నేనో మాట చెప్పనా?" అని ఉత్సా హంతో చెప్పాడు. "నా స్టుడియో పరికరాలను శుభ్రంగా వుంచడం, పెన్సిళ్ళను చెక్కి వుంచడం, రంగులు కలపడం - వీటికే నాకు సగం కాలం హరించుకు పోతూంది. నువ్వుగనుక ఈ పనులన్నీ చేయడం నేర్చుకుంటే నీకు 'బోర్' కొట్టదు. నాకూ కాలం మిగులుతుంది. వారంలో రెండు రోజులయినా మనిద్దరం స్కూటర్ మీద అలా తిరిగి రావచ్చు."

ఆమె తనంతట తానుగా ఈ పనులన్నీ చేసిపెడుతుందని ఎదురు చూసి చూసి నిరాశచెంది ఇవాళ నోరుతెరిచి అతడే అడిగేశాడు.

ఆమె జవాబు చెప్పకుండా అతడిని కోపంతో చూసింది.

"సుందరీ ! నీ బాధ నాకు తెలుసు. నా పరిస్థితి నువ్వు తెలుసుకుంటే ఎంతో బాగా వుండగలం మనం—"

"వేయి రూపాయలువచ్చే వుద్యోగం వుండగా మీకు ఈ వెధవసంత ఎందుకు? ఈ పీడను వదలించుకో కూడదూ ?" అంది.

సుందరిని చూపులతోనే కాల్చేసేవాడిలా చూశాడు అణ్ణామలై. అతడి శరీరం కంపించింది.

మనసు సరిగా లేనందున ఆ సాయంకాలం అణ్ణామలై ఏమీ గీయలేక పోయాడు. అతడి కోపపు చూపుకు బదులుగా తానూ అతడిని చుర చుర చూసి సుందరి మేడ దిగి క్రిందకు వెళ్ళిపోయింది. అణ్ణామలై స్టుడియోలో కూచుని ఏదయినా చిత్రం గీద్దామని ప్రయత్నించి కూడా ఏమీ గీయలేకపోయాడు అంతా తుడుపులూ కొట్టివేతలూ అయింది. లేచి తమ గదిలోకి వచ్చి మంచం మీద పడ్డాడు.

కాసేపటికి లేచి కిటికీ దగ్గరగా నిల్చున్నాడు. వీధిలో చెత్తకుండీ దగ్గర ఒక ఆవు నిల్చుంది. పక్కింటి వారి ఆవు అది. పచ్చగడ్డి, పత్తిగింజలు, కుడితి నీరు పెట్టి చక్కగా పెంచిన ఆవు అది. అయినా అది చెత్తకుండీలోని అశుద్ధమైన కాగితాలను తింటూంది! పట్నవాసపు నాగరికత ఇట్లా ఆవు యొక్క తిండి రుచినే మార్చివేసినపుడు ఇంక మనుష్యుల సంగతి చెప్పాలా ?

ఆ రాత్రి కూడా అణ్ణామలై సుందరితో మాట్లాడలేదు. ఆమే తనంతట తానుగా మాట్లాడనీ అనుకున్నాడు. సుందరీ తగ్గలేదు; అతడే మాట్లాడాలి అనుకుంది ఈ విధమైన కలహంతో ఇద్దరికీ నిద్రలేకుండా గడిచిందా రాత్రి.

మరుసటి రోజు పొద్దుటే స్టుడియోలోకి వెళ్ళి పోయాడణ్ణామలై. వెంటనే కల్పనా శక్తి రెక్కలు విచ్చుకుంది; కుంచె విహరించింది. ఏకాగ్రతతో చిత్ర రచనలో లీనమైన అతడికి సుందరి చేస్తున్న గొడవ ఏదీ వినపడలేదు. ఆమె కిటికీ తలుపులను టాప్పున వేసింది; మేడంతా అదిరేటట్లు నడిచింది, క్రిందకు వెళ్ళి పాత్రలను దొర్లించింది. ఇవన్నీ మీనాక్షమ్మ బెదరడానికి తోడ్పడ్డాయేగాని అణ్ణామలై చెవినయినా పడలేదు.

ఆ రోజు అతడు పనికి ఆలస్యంగానే వెళ్ళాడు. స్నానం, భోజనం, బట్టలు- దేనిలోనూ సుందరి సాయం లేనందున ఆలస్యం అయింది. పనయ్యాక సాయం కాలం ఇంటికి వచ్చాడు. అతడి స్కూటర్ శబ్దం వినగానే గుమ్మంలో ఎదురయే సుందరి ఆవాళ రాలేదు.

మేడమీద గదిలో మంచంమీద పడుకుని వుంది సుందరి. తలుపు సందు గుండా ఆమెకే తెలియకుండా ఆమెను చూశాడు అజ్ఞాపరై.

ఆమె అపూర్వ సౌందర్యానికి అతడి కళ్ళు చెదిరాయి. దట్టమైన శిరోజాలు, తీర్చిదిద్దిన కనుబొమలు, సంపంగి మొగ్గలాటి ముక్కు, ఎర్ర పత్తిపూవుల్లాటి పెదవులు, ఎగసిపడే వక్షస్థలం, ఎర్రటి పొడగాటి చేతులు, జీవితపు వసంతాన ఆడిపాడి ఆనందించడానికనే విధాత సృష్టించిన శరీర సౌందర్యం - అజ్ఞాపరై పెద్దగా నిట్టూర్చాడు.

పరుగెత్తుకెళ్ళి, ఆ క్షణాన ఆమె అందానికి దాసుడయి, ఆమెను మన్నించ మని కోరి, ఆ సౌందర్యాన్ని తన ప్రేమతో జయించాలన్న తహతహ ఏర్పడింది. తలుపుమీద చేయివేసినవాడు స్టూడియోవైపు చూశాడు. పొద్దున్న తాను వేసిన చిత్రం క్రింద బోర్లపడి వుంది. సామానులన్నీ చిందరవందరగా తాను వదలి వెళ్ళినట్లే పడివున్నాయి. గదంతా దుమ్ము నిండివుంది; చిమ్మలేదు, సుందరి సౌందర్యంపట్ల పెరుగుతున్న ఆరాధనా భావం మాయమయింది.

ఆమె బాహ్య సౌందర్యం అర్థరహితమని క్షణంలో విశదమయిం దతనికి. ఎంత కోపమయినా ఇంత అలక్ష్యమా ఆమెకు ? పట్టుమని పది నిముషాలు శ్రద్ధ తీసుకునివుంటే ఆమె ఆ చోటిని అద్దంలా వుంచివుండవచ్చు.

మీనాక్షమ్మ సాధారణంగా మేడమీదికి రాదు కనుక మేడ శుభ్రత బాధ్యత అంతా సుందరిదే. సుందరి అశ్రద్ధ అతడిని గాయిపరచింది.

అద్భుతమైన శిల్పాలు, ఆకర్షణీయమైన గోపురాలువున్న బ్రహ్మాండమైన ఆలయపు గర్భగుడి లోపల ప్రేమకు చిహ్నమైన చిన్న మూలవిరాట్టు లేకపోతే ఎట్లా వుంటుంది ?

# 19

మేస్త్రి ఇంట్లోని వారితో మాణిక్యం నవ్వుతూ మాట్లాడినా మేస్త్రిగారిచ్చిన దండన నతడు మరవలేదు. ఆయన కనుమరుగయినా ఆయనమీద అతడి కోపం అలాగే వుంది. 'ఎంతయినా పోలీసు స్టేషనయినా చూడకుండా అంతమంది ఎదుట చేయిచేసుకున్నాడే ఆయన, అది బాగుందా? నేను చేయెత్తివుంటే ఆయన మర్యాద ఏమయి వుండేది ?

ఇంకొందుకు కూడా కోపమే. 'ఆయన అట్లా అర్ధాంతరంగా చచ్చిపోకుండా వుంటే ఆ జమీందారుమీద కేసువేసి గెలిచివుండే వాళ్ళం కదా! ఆ అవకాశం లేకుండా చేసి కంపెనీని నష్టానికి గురిచేసింది ఆయనే! నా నష్టానికి పరిహారం ఇవ్వకనేపోయాడాయన...నా నష్టానికి ఆయనే బాధ్యుడు!' అనుకున్నాడు మాణిక్యం.

చట్టరీత్యా మేస్త్రి బాధ్యతలు అని ఆయన నతడు విమర్శిస్తున్న అదే సమయంలో అతడికన్న రెండ కులు ఎక్కువగా చట్టం నేర్చినవా రతనిని నానాతిప్పలూ పెడుతున్నారు. జమీందారుగా ఋజువుచేసి తమ నివేశనాన్ని లాక్కున్నారు. ప్లాట్‌ల నిమిత్తం డబ్బులిచ్చినవాళ్ళు తమ డబ్బును అడిగి వెనక్కు తీసుకుని పోయారు. వాయిదాల పద్ధతిలో కొన్న కారు వచ్చిన దారినే వెళ్ళింది. అనంది నగలను, ఆమెకోసం ఆమె తల్లి వుంచిన నగలను డబ్బుగా మార్చి సర్దుబాటు చేశాడు మాణిక్యం. తన అల్లుడు అప్పులు చెల్లించలేక చెరసాలకు వెళ్ళివచ్చాడన్న అపఖ్యాతి లేకుండావుంటే చాలు ననిపించింది కదరేశన్‌కు. ఇంటిమీద అప్పు మాత్రం అలాగే వుండిపోయింది. అణ్ణామలైతో చెప్పినట్లే నెలకు ఆరు వందలు వడ్డీ ఇస్తే చాలునని మాణిక్యంతో చెప్పాడు అప్పిచ్చినాయన.

ఈ మొదటి ఓటమి మాణిక్యాన్ని కుంగదీయలేదు. అతడి మొండితనాన్ని, తెగువను హెచ్చించిందే తప్ప తగ్గించలేదు. ఆ నగరంలో తలెత్తుకుని తిరుగుతున్న 'ఇన్‌సాల్వెంటు' పెద్ద మనుషులను, 'క్రిమినల్' పెద్దమనుషులను చూసి అతడికి ధైర్యం కల్గింది.

టాక్సీలో బయలుదేరాడు తనకు సలహాదారులయిన కొందరిని కలవడానికి యత్నించాడు. అందులో కొందరే కనపడ్డారు. వారిలో ఒక్కడే అతడి వలలోకి చిక్కాడు.

అతడు చెప్పిందాని సారాంశం : "సరే, ఈ రోడ్డువేసే 'కాంట్రాక్టు' నీకు ఇప్పిస్తాను. లక్షరూపాయల 'కాంట్రాక్టు'. నిజానికి ముప్పై నలభై వేలల్లో పని ముగిస్తేదాలు. రాయి రప్పావేసి పూడ్చి, పైన మా త్రం కంటికినదరాగా వుండేట్లు చేయాలి. ఎవరూ లోపలికి తవ్వి చూసి తప్పు కనిపెట్టకుండా నేను చూస్తాను. మేస్త్రిగారిమీద గౌరవంకొద్దీ నీకి పని ఇప్పిస్తున్నాను. నాకు మాత్రం రొక్కంగా ఇరవై వేలు చేరాలి." అని చెప్పిన ఆతగాడు ఆదాయమంటూ లేకుండా 'గౌరవం'గా సంఘసేవచేసే పెద్దమనిషి. అత డంతటి ఐశ్వర్యవంతు డెలా అయ్యాడో మాణిక్యాని కిప్పు డర్థమైంది.

ఆ క్షణాన మాణిక్యం చేతిలో టాక్సీకికూడా డబ్బులు సరిగా లేవు. అయినా అతడు బయటపడలేదు.

"సరే, కానివ్వండి. పని ఇప్పించండి. ఎలాగయినా డబ్బుతెచ్చి నడిపిస్తాను— " అని చెప్పి బయలుదేరాడు మాణిక్యం.

రాత్రి బగళ్ళు శ్రమించి కావలసిన డబ్బును సేకరించాడు మాణిక్యం. అతడు తన వ్యాపార వివరాలు ఆనందికి చెప్పడు; ఆమె అడగదు. దెబ్బతిని వున్నాడేనని ఆనంది అతడితో చాల జాగ్రత్తగా మెలగేది. ప్రేమానురాగాలను బయటికి కనపడేలా ప్రదర్శించి అతడికి శాంతి చేకూర్చాలని ఆమె తాపత్రయపడేది. మునుపయినా ఆమెంతట ఆమె తన నగలను తీసి అతడి చేతికిచ్చింది.

ఒకరోజు రాత్రి అతి ఉత్సాహంతో టాక్సీనుండిదిగి ఇంట్లోకి వచ్చాడు మాణిక్యం ఒక బుట్టనిండా పండ్లూ తీసుకొచ్చాడు ఆనందిని కేకేస్తూ మేడమీదికి వెళ్ళాడు.

'ప్రయత్నం ఫలించింది, అందుకనే ఈ పళ్ళు !' అంటూ ఒక కాగితాన్ని ఆమెకు చూపించాడు, అందులో అతడి 'టెండర్'ను స్వీకరించి, లక్ష రూపాయల 'కాంట్రాక్టు'ను అతడి కిస్తున్నట్లుంది. ఆనంది తన కళ్ళను తాను నమ్మలేకపోయింది.

"అన్ని ఖర్చులూపోగా, పాతిక వేలయినా మిగులుతాయి !" అన్నాడు.

"మరి పని ప్రారంభించి, చేయడానికి కావలసిన డబ్బు కేమిచేస్తారు ?"

"ఏర్పాటు చేశాను !"

ఈ వ్యాపార విషయాలలో తన భర్త అసహాయశూరు డనిపించింది ఆనందికి బిచ్చమెత్తుకునే స్థితికి వచ్చినవాడికి లక్ష రూపాయల కాంట్రాక్టు రావడంచూసి మతిపోయినంత పనయిందామెకు.

అట్లాగే నిలబడిపోయిన ఆమెను చూసి అలక్ష్యంగా నవ్వి ''సరేసరే, అణ్ణామలై ఈ పాటికి పనినుండి వెనక్కు తిరిగి వుంటాడు. వాడిని వెంటనే తీసుకురా!'' అన్నాడు.

ఆనంది తటపటాయించింది, అణ్ణామలైను తీసుకురావడానికి తన్ను పంపడం ఏమిటో అనిపించింది ఆమెకు. కాని నిరాకరించడానికీ మనసు రాలేదు. బయలు దేరించి.

ఆమెను చూసిన వెంటనే లేచాడు అణ్ణామలై, ఆమె చెప్పగానే మాణిక్యం ఇంటికి వచ్చాడు ఆ తర్వాత ఆనంది తన ఇంటికి వచ్చింది.

''వెళ్ళి, ఆపిల్ పండ్లను ముక్కలుచేసి తీసుకురా!'' అని ఉత్తర్వు జారీ చేశాడు మాణిక్యం ఆనందికి

ఆనంది తెచ్చింది. ఆమెను కూర్చోమని, తనకు వచ్చిన అదృష్టం గురించి వివరించసాగాడు మాణిక్యం.

''నీ పని బాగుందోయ్! నెలకు వేయి రూపాయల జీతం ఇచ్చే ఉద్యోగాన్ని సృష్టించారు నీకోసం. ఈ ఇబ్బందులు తట్టుకోవడానికి దారి దొరికింది. నేనే ఊపిరాడక తికమకపడ్డాను. ఏదో నాకూ ఒక మార్గం దొరికిందివాళే... లక్ష రూపాయల కాంట్రాక్టొకటివాళే లభించింది''

''చాల బాగుంది, నీ కష్టాలూ గట్టెక్కుతాయి.'' అని నిజంగా సంతోషించాడు అణ్ణామలై. ఆ లక్షరూపాయలేవో అతడి చేతికి అప్పుడే వచ్చినట్లయింది. ''కాంట్రాక్టుపని మొదలు పెట్టడానికి ముప్పైవేలు కావాలి. దానికోసం ఒక ఏర్పాటు చేశాను, నా మీది నమ్మకంతో చేబదులుగా ఇవ్వడానికి ఆయన ఒప్పుకున్నాడు. అప్పును మూడు నాలుగు నెలల్లో తీర్చివేయగలను. ఎందుకయినా మంచిదని ఒక ఏడాది గడువు అడిగాను. నువ్వు కేవలం హామీదారుగా ఒక సంతకం పడేయాలి.'' అని మాణిక్యం ఒక కాగితాన్ని జూపి, అణ్ణామలై సంతకం పెట్టాల్సిన చోటు చూపించాడు.

ఎందుకో ఆనంది గుండె వేగంగా కొట్టుకుంది. కాని అణ్ణామలై ఉత్సాహంతో మాణిక్యం కలాన్ని తీసుకున్నాడు. అతడికి సాక్షి సంతకం, హామీ సంతకం - అంటే అర్థం ఏమిటో బొత్తిగా తెలియదు. కేవలం తన సంతకంతో అతనికి సాయం లభించేట్లయితే తాను అది చేయడానికి సిద్ధంగా వున్నాడు.

"ఈ సంతకం ఏదో, నాన్నగారి చేత పెట్టించవచ్చుగా ?" అంది ఆనంది.

ఆమె అంతరాయాన్ని సహించనట్లుగా తీక్షణంగా ఆమె నొక్కి గారి చూసి అణ్ణామలై వైపు తిరిగి మాణిక్యం చెప్పాడు "ఇంత చిన్న విషయానికి పెద్దాయనను ఎందుకు ఇబ్బంది పెట్టడం? ఈ మంచి పేరంతా తన తండ్రికి రావాలని ఆనంది తాపత్రయం. కాని నాకు అందరికన్న ముందు తెలిసినవాడు, సన్నిహితుడు నువ్వు అని ఈమె మరిచింది-" అని మసిపూసి మారేడుకాయ చేశాడు

సంతకంపెట్టి కాగితాన్ని వెనక్కిచ్చాడణ్ణామలై దానిని తీసుకుని ఆనంది చేతికిచ్చి మాణిక్యం- "ఈ విషయం ఇంకెవరికీ తెలియనవసరంలేదు. నీ మామ గారికి తెలిస్తే 'ఆ అప్పేదో నాద్వారా పుచ్చుకుని వుండవచ్చు కదా' అని అలుక చెందగలరు. నేనేదో కష్టపడుతున్నట్టు నలుగురికి తెలియడం నాకిష్టంలేదు. తల పైకి లేదాకనే అందరికీ అన్నీ తెలియనివాలి—" అన్నాడు.

"ఎలాగో ఒకలాగున మీరు క్షేమంగా వుండాలనే నా కోరిక ఇంటో వున్న నగనట్ర అమ్మివేశారని తెలిసి తెలిసి ఎంతో బాధపడ్డాను. నాకేగనుక వీలుండి వుంటే అట్లా జరగనిచ్చి వుండను" అన్నాడు అణ్ణామలై.

"ఇదిగో, ఈ సంతకమే పెద్ద సహాయం దీనిని నేనెన్నడూ మరువను." అన్నాడు మాణిక్యం.

అణ్ణామలై లేచాడు; తన ఇంటికి వెళ్ళిపోయాడు ఆ వెంటనే మాణిక్యం ఆ కాగితాన్ని ఆనందినుండి లాక్కున్నాడు ఇందాకటి అంతరాయానికి ఆనందిని విమర్శిస్తూ, అతడా కాగితంమీద అణ్ణామలై వివరాలను రాశాడు. అణ్ణామలైకు స్వంతంగా ఇల్లుంది; నెలకు వెయ్యిరూపాయల ఉద్యోగం వుంది.

ఆ పత్రంలో ముద్రితమైవున్న వివరాలను, మాణిక్యం రాసిన వాటినీ ఆనంది చదివింది. మాణిక్యం గనక ఏ కారణం చేతనయినా అప్పువాయిదాలు సరిగా చెల్లించకపోతే ఆ బాధ్యత అణ్ణామలైమీద పడుతుందని అందులో వుంది.

ఒకవేళ అతడు కూడా కట్టకపోతే అతడి స్థిరచరాస్తులమీద, జీతంమీద అప్పిచ్చిన వారు కోర్టు చర్యలు తీసుకోవచ్చుననీ వుంది. ఇవన్నీ తనకు అంగీకారమేనన్నట్లుగా ఆ క్రిందుగా అబ్బామల్లె సంతకం వుంది.

మ్రాన్పడిపోయిన ఆనంది-భయంతో''ఇందులో ఈ విధంగా రాసి వుందే ?" అని అడిగింది.

"ఉంటేనేం ?" అని నవ్వి చెప్పాడు మాణిక్యం, "అప్పు అతడు కడతాడా ? నేనే కడతాను. పోనీ కట్టదలచినా కట్టగలడా ? అతడి అప్పునే అతడి మామగారు కడుతుండగా ఆ మొనగాడు నా అప్పును తీర్చేస్తాడు గాబోలు !"

ఎందుకో ఆనంది మనసు శాంతిని కోల్పోయింది. తనకు తెలియకుండానే తననూ ఈ ఏర్పాటులో ఉపయోగించుకున్నట్లనిపించింది. కాని మాణిక్యం యొక్క కష్టాల గురించి ఆలోచిస్తే అతడినీ ఏమీ అనటానికి వీలులేదనిపించింది. పూర్తిగా మునిగిపోయినవాడు మళ్ళీ తలెత్తడానికి యత్నిస్తున్నాడు, ఎంతయినా అతడు తన భర్త ! అతడు తన భర్త !

# 20

దండపాణిగారి ప్రకటనల కంపెనీలో పని వర్షంలా కురుస్తున్న సమయం అది. పని వేగానికి తట్టుకోలేక తికమక పడుతున్నాడబ్బామల్లె. ఒక రోజు సాయంత్రం పని ముగించి ఇంటికి వెళ్ళాడు. మరు రోజు పొద్దునే వెళ్ళి అంతకు క్రితం రోజు తాను ముగించిన కొన్ని పెద్ద పెద్ద 'బ్యానర్ల'ను, 'కట్ ఔట్'లను తాపీగా చూశాడు.

తన చేతులతో రంగులు వేసిన చిత్రాలు అవి. అయినా వాటిని మెచ్చుకో లేకపోయాడు. చూచిన కొలదీ జుగుప్స కలుగుతుంది.

వీపు, రొమ్ము, మోకాళ్లు- వీటి పైన వేలాడుతోన్న కండలు- వీటన్నిటినీ అసహ్యంగా ప్రదర్శిస్తూ ఒక స్త్రీ వికారమైన భంగిమలో గెంతులు వేస్తూంది. మగ వాళ్ళొకరిని ఒకరు గుద్దుకుంటూ, కొట్టుకుంటూ, తుపాకులు పేల్చుకుంటూ జంతు బలాన్ని ప్రదర్శిస్తున్నారు. వెర్రి వెర్రి వేషాలు దాల్చిన ఆటవికుల గుంపొకటి

అక్కడికి వచ్చి పడినట్లు అనిపించింది అతడికి. ఇంతకూ అవి ఒక తమిళ కుటుంబ గాధా చిత్ర ప్రకటన దృశ్యాలు!

'వళ్లువర్ పుట్టిన తమిళదేశం, ఇళంగో వెలసిన తమిళనాడు, కంబర్ జన్మించిన తమిళభూమి-' అన్న మాటలను విని, వారి రాతలను చదివి కొంతవరకు తాను పుట్టిన గడ్డ యొక్క ప్రతిష్ఠ తెలుసుకుని గర్వించేవాడు అణ్ణామలై. కాని అట్లా గర్వించడం తనకు, తాను మోసగించుకోవడం అన్పించిందిప్పుడు. ఒక దేశపు నాగరికత, సంప్రదాయం, సంస్కృతి, జీవన విధానం- ఇవన్నీ విదేశీయుల దండయాత్రల వలన, దురాక్రమణ వలన నాశనమవుతాయని తాను చదివాడు. కాని నాగరికత పేరిట ఒక దేశ వాసులు తమ్ము తామే అజ్ఞానంతో నాశనం చేసుకోగలరని ఇప్పుడు తెలుస్తూంది.

వెలుపలికి వచ్చాడు. రంగుల గిన్నెను, కుంచెను తీసుకుని, అర్ధ నగ్నంగా వున్న సినీ నాయకి చిత్రం దగ్గరకు వెళ్ళాడు. అది చాల పెద్ద చిత్రం కావడం మూలాన్న దాని దగ్గరే ఒక నిచ్చెన వేసి వుందారు. ఆవేశంతో ఆ నిచ్చెన నెక్కాడు. ఆవేశం ఆవహించింది అతడిని.

కరుణాకరనూ, అక్కడి పనివారూ తమ తమ పనులను మానుకుని అతడి వైపు చూడసాగారు.

అతడావేశంతో కుంచెను రంగులో ముంచి ఎత్తాడు. ఆ అర్ధ నగ్న శరీరాన్ని, కొన్ని నిమషాలలో, ఒక అందమైన పమిట కప్పింది.

నిచ్చెన దగ్గర నిల్చున్న కుప్పుస్వామి లబలబ కొట్టుకున్నాడు- ''సార్, ఇంక ఆపండి సార్! ఆ పవిటను తీసిపారేయండి సార్! అందమైన చిత్రాన్ని నాశనం చేశారు కదా-''

అతడి యాతన చూసి, నిచ్చెన మీద నిల్చున్న అణ్ణామలై నవ్వాడు. 'కళ అంటే దాచవలసిన దానిని దాచాలి; బహిరంగ పరచవలసిన దానిని బహిరంగ పరచాలి."

''కళా లేదు, కాకరకాయా లేదు! ముందు మీరు క్రిందకు దిగండి సార్!'' అని గోల పెట్టాడు కుప్పుస్వామి. అణ్ణామలై దిగకపోయేసరికి అతడి బట్టలను పట్టుకు లాగాడు కుప్పుస్వామి.

కుప్పుస్వామి కోపంగా మాట్లాడి వుంటే అణ్ణామలైకు కోపం వచ్చి యుండేది. అతడికి అణ్ణామలై దండపాణి అల్లుడని తెలుసు. అణ్ణామలై అంటే మర్యాద, భక్తి, వున్నాయి. అతడు నిజంగా బాధపడుతున్నాడని అణ్ణామలైకు తెలుసు. గత్యంతరం లేక క్రిందకు దిగాడు.

''దిగుతాను. రసికుల అభిరుచిని క్రిందకు దింపితేనే మనం పైకి వెళ్ళాల్సి నట్లుంది-' అన్నాడణ్ణామలై.

రోతతో తన గదిలోకి వెళ్ళాడణ్ణామలై. కుప్పుస్వామి వెనకాలే వెళ్ళాడు. లక్షలు కుమ్మరించి సినిమాలు తీయడంలో వున్న కష్ట నష్టాలను వివరించి- ''మనమేమి హితోపదేశం చేయడానికా ఈ వృత్తిలోకి దిగింది? ఆ పని చేయ డానికి కోవెలలు, బళ్ళు, భగవద్గీత - లాటి వెన్నో వున్నాయి కదా!'' అన్నాడు అతడు.

అణ్ణామలై బాధతో నవ్వాడు.

"ఫోటోలో ఏది వుంటే ప్రకటనలో అది అట్లాగే రావాలి. లేకపోతే ఆ ప్రకటన మీ కంపెనీ గోడల లోపలే వుండిపోతుంది-" అని హెచ్చరించి వెళ్ళి పోయాడు కుప్పుస్వామి.

అణ్ణామలై ఆ తర్వాత పని చేయలేకపోయాడు. అతరు రంగులు వేసిన చిత్రాలు అతడిని చూసి పరిహసిస్తున్నాయి. తమ 'రాక్ అండ్ రోల్' నృత్యం లోకి అతడిని లాగ జూస్తున్నాయి.

ఆ పూటకే పనీ చేయకుండా కూర్చుని ఇంటికి బయలుదేరాడు. స్కూటర్‌ను రిపేర్ కిచ్చినందున ఇంటికి బస్సు మీద వెళ్ళాల్సి వచ్చింది. కాని ఆ పూట నడిచే వెళ్దామని బయలుదేరాడు. దారిలో గోడల మీద పోస్టర్లు, దుకాణా లలో పత్రిక ముఖ చిత్రాలు, యువతీ యువకుల - చూస్తూ నడిచాడు.

జీవన స్థాయిలో ఈ దేశం పడమటి దేశాలను సమీపించనే లేదు. దీక్ష, సాధన, బాధ్యత-వంటి సద్గుణాలలో దేనినీ పాశ్చాత్యుల నుండి నేర్చుకోలేదు. కాని ఆ దేశాల అవకతవకలను మాత్రం నేర్చుకుంటూంది. ఆ నాగరికత వేసిన వెర్రి తలలను కూడ కొందరు వ్యాపింప చేస్తూ తమ పొట్టలు నింపుకుంటున్నారు. కొందరి స్వార్థానికి ఎర అయిన అసంఖ్యాకులయిన అమాయకులు తమ మన

సులను. శరీరాలను పాడు చేసుకునే దశకు దిగజారింది నగరం. దారి చూపవలసిన ముఖ్య నగరం నడిచే దారి ఇదా, భగవాన్ ? '

నడిచి వెళ్తుంటే ఆ నగరం బాగా తెలియసాగింది అతడికి.

అతడిల్లు చేరేసరికి అతడికోసం దండపాణిగారు కూర్చుని వున్నారు.

కంపెనీలోనే ఆయన అతడితో మాట్లాడి వుండవచ్చును కాని ఆయన విడిగా సుందరితోను, మీనాక్షితోను మాట్లాడాలని అక్కడికి వచ్చారు. ఆ పని ముగిసేసరికి అణ్ణామలై ఇల్లు చేరాడు.

క్రింది వాటాలో కూర్చుని, ఆడవాళ్ళిద్దరి ఎదురుగానే దండపాణి ఒక ముఖ్య విషయం ప్రస్తావించారు.

''ఈ విషయం మా ఇంట్లో తెలియదు; తెలియను అక్కరలేదు. మీ ఇంటి మీద అప్పులో సగం తీరింది. ఇంక పదిహేను వేలే వుంది. దానిని కూడా త్వరలోనే కట్టేయవచ్చు.

అణ్ణామలై ఎదురు చూడని వార్త ఇది. ఇంత స్వల్ప కాలంలో ఈయన ఇంత పెద్ద మొత్తాన్ని ఎలా కట్టగలిగాడని ఆశ్చర్యపోయాడు.

''ఇందులో నా డబ్బేమీ లేదు. అంతా నువ్వు కష్టపడి సంపాదించిన డబ్బే ! మీ నాన్నగారు పోయాక ఈ కుటుంబాన్ని కొంత ఆదుకోవడం నా బాధ్యత. అందుకనే ఈ అప్పు తీరేదాక కంపెనీ డబ్బులో రూపాయయినా తీసుకోరాదని నిశ్చయించాను. ఇతరత్రా వచ్చే ఆదాయం నా కుటుంబ ఖర్చులకు సరిపోతుంది. ఇది ఇంట్లో, సుందరి అమ్మకు, నా కొడుకులకు తెలిస్తే నేనేదో అంతా కూతురికి అల్లుడికి ఇచ్చేస్తున్నట్లు అపోహపడగలరు. అందుకనే వాళ్ళకు తెలియకుండా వుంటేనే మంచిది అనుకున్నాను–''

దండపాణిగారిలో ఇంత అనుబంధం, సానుభూతి, మానవత్వం వున్నాయని అణ్ణామలై ఎన్నడూ ఎదురు చూడలేదు. తానూ ఒక మనిషినే అని అల్లుడి ఎదుట నిరూపించడానికా అన్నట్లు వుండినాయి ఆయన చర్య, మాటలు, అణ్ణామలై కళ్ళు తడిగా అయ్యాయి. సుందరి మీద ఆయన ప్రేమ ఎంతటిదో అతడికర్థం అయింది

కాస్సేపటికి ఆడవాళ్ళిద్దరూ లేచి లోపలికి వెళ్ళారు. దండపాణి అణ్ణామలైతో వ్యాపార విషయాలు మాట్లాడారు.

''మన ఖాతాదారుల సంతృప్తే మనకు శ్రీరామరక్ష. ఏ వ్యాపార విజయానికయినా ఇదే కిటుకు. ఇది గుర్తుంచుకుని మెలగినందువలననే నాకో ఇల్లూ వాకిలీ ఏర్పడినాయి; హాయిగా కాలం గడుస్తూంది. ఈ విషయం నువ్వూ మరవకూడదు. ఈ వ్యాపారానికి పోటీ ఎక్కువ. మనకన్న తక్కువ డబ్బుకు కావలసిన విధంగా బొమ్మలు వేసివ్వడానికి సిద్ధంగా చాలమంది వున్నారు."

ఏమి జవాబు చెప్పాలో అణ్ణామలైకు తోచలేదు. ఒక్క క్షణం తటపటాయించాక - ''నాకీ వ్యాపారం నచ్చలేదు—'' అన్నాడు.

నిశ్చేష్టులయ్యారు దండపాణి. అయినా బయటికి కనపడ నివ్వకుండా - ''ఇది నీకు తెలిసినపని; అలవాటయిన పని. ఇంకే ఉద్యోగం చేసినా ఇంత డబ్బు వచ్చేది కాదు" అన్నారు.

"నా అంతరాత్మ ఒప్పుకోవడంలేదు. నేనుచేసే పనివల్ల 'పదిమందికి మేలు చేకూరాలన్నది నా అభిమతం. కాని నే నిప్పుడు చేస్తున్నపని అనేకులను పాడు చేస్తూందని నా నమ్మకం."

''ఆ పాపపుణ్యాలు మనకు చెందవు. డబ్బు ఇస్తున్నవాళ్ళకు పని చేసి పెడుతున్నా మంతే !"

చాలసేపు నచ్చజెప్పి అతడిని ఒప్పించారాయన. ఇంకా కొన్ని నెలలపాటిలాగే అహోరాత్రాలు పనిచేస్తే ఆ మిగత అప్పు తీర్చేసి ఇంటిని విడిపించుకోవచ్చును. అంతవరకయినా అతడు ఓపిక పట్టాలి. వచ్చిన సదవకాశాన్ని జార విడువరాదు.

''తొందర పనులన్నీ ముగించేసి, తర్వాత నువ్వూ సుందరీ ఏ ఊటీకో కొడైక్కానల్, అలా వెళ్ళి తిరిగిరండి. ఒక నెల రోజులపాటు మీ ఇష్టం వచ్చినట్లు తిరగండి. హాయిగా నీకు ఇష్టంవచ్చిన బొమ్మలు వేయి. ఇక్కడికి వచ్చాక నీ చిత్రాల ప్రదర్శన ఏర్పాటు చేద్దాం—''

దండపాణి ఆ రాత్రి భోజనం ఇక్కడే అతడితోపాటు ముగించి, వెళ్ళారు. ఆయన వెళ్ళాక సుందరి అతడితో సరదాగా మాట్లాడింది. తండ్రి రాకే ఆమె ఉల్లాసానికి కారణమని అణ్ణామలై గ్రహించాడు.

మేడమీది గది ఏకాంతంలో అతడి మెడకు తన చేతులను మాలగావేసి సుందరి - ''మీ రెంత సమర్థులో నాన్న చెబితేనే నాకు తెలిసింది. మన పోట్లాట

విషయం కూడా ఆయనకు తెలుసల్లే వుంది. ఇకముందునుంచి నేనే మిమ్మల్ని జాగ్రత్తగా చూసుకోవాలి!'' అంది.

''మన పోట్లాట విషయం ఆయన కెట్లా తెలుసు?''

''నేను అమ్మతో చెప్పివుంటాను; ఆమె ఆయనకు చెప్పివుంటుంది!''

''మనిద్దరిమధ్య సంగతులు మూడో మనిషికి చెప్పవచ్చునా?'' అంటూ ఆమెను కౌగలించుకుని - ''ఈ విషయంకూడా మీ అమ్మతో చెబుతావా?'' అంటూ నవ్వాడతడు.

అప్పుడామె పసిపాపలాంటి కుతూహలంతో, సంతోషంతో వుండడం చూచాడణ్ణామలై. ఆమె వయసు ఎదిగింది; ఆమె యౌవనం వికసించింది. అయినా ఆమె అతడి దృష్టిలో పసిపాపే. మనసు ఎదగని పసిపాప గారాబంగా పెరిగిన అమ్మాయి.

''తొందరలోనే నాన్న ఆ మిగతా అప్పును తీర్చేస్తా నన్నారు. తర్వాత మనల్ని కుర్తాళం వెళ్ళమన్నారు. ఈలోగా ఎప్పుడు కావాలంటే అప్పుడు కారు పంపిస్తానన్నారు!''

'మనిద్దరికి స్కూటర్ చాలుగా!' అనబోయి, ఆమె ఆగ్రహిస్తుందని వూరుకున్నాడు. చాలసేపు సరదాగా, కులాసాగా కబుర్లు చెప్పుకుని, ఆడి, పాడి, అర్ధరాత్రయ్యాక నిద్రపోయారు వాళ్ళు.

పొద్దున లేవగానే చకచకమని అతనికి సపర్యలు జరిగాయి. అతడి స్టుడియో తళతళమని మెరుస్తూంది. మనసుపెట్టి పనిచేస్తే ఆమె ఎంతలా చేయగలదో అణ్ణామలైకు మొదటిసారి తెలిసి, సంతోషించాడు.

అతడు బయలుదేరుతుండగా సుందరి - ''ఇకనుండి మీకు కంపెనీలో చాల పని వుంటుందని నాన్న చెప్పారు. రెండు మూడు నెలల వరకు ఇంతేనట. ఎలాగయినా ఎనిమిదికల్లా ఇంటికి రావడానికి ప్రయత్నించండి!'' అని వీడ్కోలు చెప్పింది.

అణ్ణామలై తనలో తాను నవ్వుకున్నాడు. ఏ పనినయితే వదిలివేద్దాం అనుకున్నాడో దానిని ఇంకా ఎక్కువసేపు చేయమని ప్రేమపూర్వకమైన ఆజ్ఞ జారీ అయింది!

# 21

కంపెనీలో పని రద్దీ బాగా ఎక్కువయింది. అణ్ణామలై ఇంటికి వచ్చే సరికి ఎనిమిది, పదీ అయినా సుందరి సణగడంలేదు. అతడి శ్రమ ఫలితం ఆమెకు అర్థమయ్యేలా దండపాణి వివరించినందున ఇప్పుడామె అతడితో పూర్తిగా సహకరిస్తూంది.

రాత్రి వచ్చేసరికి స్నానానికి వేన్నీళ్లు, భోజనం, పడక - అంతా తయారుగా వుంచేది సుందరి. ఇంతటి సుఖజీవితం వున్నా అణ్ణామలై కిదంతా నాటకీయంగా వుండేది. రాత్రిళ్లు ఆమెతో గడిపే జీవితంలోకూడా - ఒక విధమైన యాంత్రికత తోచసాగింది.

పొద్దాటే లేవడం, పక్షుల కలకలారవం వినడం, పువ్వుల వాసనల నాఘ్రాణించడం, తూరుపు ఆకాశంలోని రంగుల రంగవల్లులను చూడడం - వీటి నిమిత్తం మునుపటిలా ఉత్సాహంతో ఉదయాన్నే లేవలేక పోతున్నాడతడు. అలసి నిద్ర పోతున్న అతడిని ప్రతిరోజూ సుందరి కష్టపడి మేల్కొలుపవలసి వచ్చేది. చురుక్కుమని సూర్య కిరణం తగిలేదాక పడుకునే వుండేవాడు. దేవుడిచ్చిన ఈ దేహం అనే సాధనాన్ని కాసుకోసం మితిమీరి శ్రమించేటట్లు చేయవలసి వస్తూందనిపించింది.

లేచిన వెంటనే స్నానం, భోజనం ముగించి పనిలోకి వెళ్ళడంతో కుంచె ముట్టుకోవడానికి తీరికలేదు. స్టుడియో అతడిని చూసి ఎగతాళిగా నవ్వేది. రోజూ అద్దంముందు నిలబడి తల దువ్వుకుంటుంటే - అతడిలోని కళాకారు డతడిని చూసి నవ్వేవాడు - "కానివ్వండి, కానివ్వండి! బాబుగారు పని తొందరలో వున్నట్లున్నారు ..."

ఈ నాటకంలో సెలవు దినంనాడు మార్పుండేది. ఆ రోజు ఉదయమే దండపాణిగారి కారువచ్చి వాకిట నిలిచేది. డ్రైవర్ ఒక కవర్ తెచ్చి ఇచ్చేవాడు సుందరికి అది ఆ రోజు ఆమె ఖర్చుకు తండ్రి పంపిన డబ్బు. ఆ రోజు రెండు సినిమాలు చూచేవాళ్ళు. లేదా ఒక సినిమా చూసి ఏ బజారో బీచో వెళ్ళేవారు. హోటల్‌లో టిఫిన్ లేదా భోజనం చేసేవారు. బజారులో విలాసంగా తిరుగుతూ సుందరి, ఎంత ధరయినా పెట్టి చీరలు, గుడ్డలు, అలంకరణ సామగ్రి కొనేది.

బట్టల దుకాణం పెట్టడానికి వలసినన్ని గుడ్డలు ఇంట్లో వుండగా - బట్టలు కొనడం ఎందుకో అణ్ణామలైకు అర్థమయ్యేదికాదు. అయినా అతడేమీ మాట్లాడేవాడుకాదు. అది ఆమె తండ్రి ఇచ్చిన డబ్బు. పైపెచ్చు తానేదయినా అని ఆమె కంట నీరొలకడం మొదలెడితే అది తుడవడానికి వారం చాలదే!

సుందరిని ఉల్లాసంగా వుంచే నిమిత్తం తా నెన్నివిధాలుగా మారవలసి వస్తున్నదీ - ఆలోచించేసరికి అతడికి బాధగా వుండేది.

ఒక సెలవు రోజున సాయంత్రం సుందరీ అణ్ణామలై సినిమాకు వెళ్ళారు. హాలు గుమ్మంలో రెండవ తరగతి టిక్కెట్లమ్మే కిటికీ ఎదుట నిలబడి వున్నారు శరవణన్.

సినిమా మొదలవడాని కింకా సమయం వుంది. శరవణన్ అణ్ణామలై మాట్లాడుకో సాగారు. అణ్ణామలై కంపెనీ పనిలో తలమునకలుగా వుండడం ఆయన ఎరుగుదురు. అరుదుగా చిక్కిన తీరిక సమయాలలో వేసిన చిత్రాల నాయన కిచ్చాడతడు.

"ఈసారి సంచిక ముఖపత్రంమీద మీ చిత్రం వస్తూంది. అధికంగా డబ్బు ఖర్చుచేసి రంగుల చిత్రాలు వేయడం నా కలవాటులేదు. కాని చిత్రం బాగుంది కనుక వేశాను—" అన్నారాయన. తోటలో చెట్టుకింద నిల్చుని పువ్వులు కోస్తున్న కోమలాంగి చిత్రం అది అన్నారాయన.

అణ్ణామలైకు ఆనందం కల్గింది; అది అతడికి నచ్చిన చిత్రం.

"చిత్ర రచన మానకండి. ఉదర పోషణార్థం ఆత్మను చంపకండి" అన్నారు శరవణన్. "వీధి కోడి తన పొట్టి రెక్కలు విప్పుకుని నెమలివలె ఆడే కాలం ఇది. అలాగని నెమలి వీధికోడి కారాదు. మీరు జాతి నెమలేనని నేనింకా నమ్ముతున్నాను..."

ఆయన పలుకులు ములుకులై నాటాయి అతడి ఎదలో. ఆయన తన మాయ జీవితాన్ని ఎంత అందంగా ఎత్తి చూపారు! తల వంచుకోవలసి వచ్చింది అతడికి.

సెలవు తీసుకుని సుందరితో హాల్లోకి నడిచాడు అణ్ణామలై. కళాత్మకమైన బెంగాలీ చిత్రం అది; అందుకనే శరవణన్ వచ్చారు - అనుకున్నాడతడు.

హాలులో కూచున్నాక, చీకట్లో సుందరి అంది "ఈయనదంతా ఉత్తివేషం; నా కంతా మొదటినుండే తెలుసు—"

''ఏమి తెలుసు ?''

''ఏమిటా ? ఈయన పాతచెప్పులు, మాసిన తల, నలిగిన బట్టలు చూసి ఈయన పేదవాడనుకుంటున్నారు కదూ ? అది శుద్ధ తప్పు. ఈయన ధన వంతుడు.''

''ఏమిటి !?''

''ఔను నేను చదువుకునే రోజుల్లో ఈయన పేద విద్యార్థినుల వసతి గృహానికని పదివేల రూపాయలు విరాళం ఇచ్చి, ఆ విషయం ఎవరికీ తెలియ కూడదని షరతు విధించారు బడిలో ఒక సభ జరిపి ఆయనకు పూలమాల వేస్తా మని, ఆయన పటాన్ని ఆ వసతి గృహంలో ప్రవేశద్వారం దగ్గర పెడతామని అంటే – అట్లా ప్రచారం చేసేటట్లయితే తన డబ్బు తనకిచ్చేయమని బెదిరించాడీయన. చాల అసాధ్యుడు !''

''నిజంగానా ?'' వెయ్యి రూపాయలు విరాళం ఇచ్చి, దాని నుండి పదివేల రూపాయల ప్రచారం పొందజూసే నకిలీ దాతలుండే ఈ కాలంలో ఈ గుప్త దానమా ! లక్షలు దేవాళ్ళు ఆర్భాటంతో ఒక చిన్న మొత్తానిచ్చే యుగంలో తన కంటూ ఇల్లు లేకపోయినా కష్టార్జితాన్నిట్లా రహస్యంగా దానం చేయడమా ? ఏమి ఆ వ్యక్తిత్వం !

''అదంతా బయటివేషం; దానిని చూసి మోసపోకండి !'' అని సుందరి హెచ్చరించింది. మనుష్యులకు తారుమారుగా అర్థం చేసుకునే ఆ మనస్తత్వాని కతడు నవ్వుకున్నాడు.

''నాదే వేషం ! ఆయనే నిజంగా మనిషి !'' అన్నాడు అణ్ణామలై.

## 22

'కలైమలర్' పత్రికను చేతబట్టుకుని ఒక ఆదివారం ఉదయం అణ్ణామలై ఇంటికి వచ్చింది శారద. మొదట ఆనందిని చూసి, ఆ తర్వాత అటు వచ్చింది. చాల రోజుల తర్వాత ఆమె అతడిని చూడడానికి వచ్చింది. ఆ పత్రిక అట్టమీద

అతడు వేసిన చిత్రం వుండడం చూచాక. తిన్నగావచ్చి అతన్ని అభినందించకుండా వుండలేక పోయిందామె.

ఆ ఉదయం ఆనందదాయకంగా వుంది అబ్జామల్లైకు. పైపెచ్చు - అతడి చిత్రాన్నీ ఆనంది, కదిరేశన్ మెచ్చుకున్నారని శారద చెప్పడంతో మరింత ఉత్సాహం కలిగింది. ఆ చిత్రంలో ఆమె నాకర్షించిన ప్రత్యేకతలనామె సగర్వంగా వివరించింది.

''ఏదో నాకు తోచిన దానిని వేశాను. మీ అందరికి నా పట్లగల అభిమానం వల్ల ఈ ప్రత్యేకతలను నాకు ఆపాదిస్తున్నారు. అంతేగాని నేను వేసినప్పుడు నేను మీరు చెప్పినవన్నీ ఊహించనేలేను'' అన్నాడు వినయంతో.

''అదే నిజమైన కళా లక్షణం. మీరు ఊహించని అందాలందులో వెల్లి విరియాలి. ఈ చిత్రాన్ని తదేకంగా చూసిన నాకు - నా చుట్టు ఎన్నో చెట్లున్నట్లు, నేనలా విలాసంగా తిరుగుతూ వెళ్ళి పుష్పాలను కోస్తున్నట్లు-అనిపించింది !... మీరిలాంటి చిత్రాలు ఇంకా ఇంకా వేయాలి.'' అంది శారద.

''చిత్రాలు గీయడానికి తీరికలేదు-'' అని శారదతో చెప్పడానికి సిగ్గనిపించింది. తీరిక లేదా ? అతడి హృదయంలో చిక్కుకుని వున్న కళావాహిని కట్టలు తెంచుకుని పొంగి పొరలడానికి సిద్ధంగా వుంది. సుందరికి భర్తగా తన బాధ్యతలను నిర్వహించడానికి, ఆమె ఇష్టాలననుసరించి నడుచుకోవడానికి తన సెలవు దినాలను కూడా వెచ్చించవలసి వస్తుందని ఆమెతో ఎట్లా చెప్పడం ?

శారద అతడితో మాట్లాడుతున్న ఆ కొద్దిసేపట్లో సుందరి తొంగిచూసి, ఆమెను త్వరగా పంపివేయమని అతడికి మూడుసార్లు సైగచేసి వెళ్ళింది అది గమనించని వాడిలా అతడు నటించవలసి వచ్చింది. శారద ఆడదయిన కారణంగా అతడింత వరకు ఆమె ఇంటికి వెళ్ళలేదు. ఆమె ఆదరాభిమానాలను అంత త్వరగా త్రోసెయ్యలేదు అతడు. అతడి నుండి ఏమీ ఎదురుచూడకుండా ఆమె అతడికి ఎన్ని విధాల తోడ్పడింది !

ఇంక సహించలేకపోయింది సుందరి. అతడి బట్టలను తీసుకొచ్చి వాళ్ళిద్దరి మధ్య మేజామీద వుంచి- ''మనం బయటకి వెళ్ళాలని మరిచిపోయారా ఏమిటి ? కారు సిద్ధం మీదే ఆలస్యం !'' అని స్పష్టంగా బయటపడింది.

పరిస్థితి గ్రహించి శారద- "సరే! మీకు పని వున్నట్లుంది నేను వస్తాను. ఇదిగో ఈ పత్రిక ప్రతిని మీ వద్దవుంచండి. నేనింకోటి కొనుక్కుంటాను" అని లేచింది.

గుమ్మందాక వెళ్ళి ఆమెను సాగనంపి లోపలికి వచ్చాడు అశ్వామలై. నిల్చొని వుంది సుందరి. ఆ పక్కనే వుంది ఆ పత్రిక.

కుతూహలంతో దానిని తీసుకుని ఆమె చేతికిస్తూ-"ఇది చూశావా సుందరీ! మొదటిసారిగా నా చిత్రం ముఖ పత్రంమీద అచ్చయింది. ఎలా వుంది చెప్పు" అని అడిగాడు.

అలక్ష్యంగా ఎడమచేత్తో దానిని తీసుకుని ఓరచూపు చూచి మేజామీద పడేసింది

"ఎలావుందో చెప్పలేదే?"

"ఆ! వుంది అరోలా! ఇట్లా చెట్లూ చేమా గీచేసి ఎట్లావుంది అని అడిగితే ఏమీ చెప్పడం? మీకూ పనిలేదు; ఆ సంపాదకుడికీ పనిలేదు-" అంది ముఖం ముడుచుకుంటూ.

ఆమె గట్టిగా తన హృదయంమీద చరిచినట్లుయుంది అశ్వామలైకు. ఆ నిర్లక్ష్యాన్ని అహంకారాన్ని భరించలేకపోయాడు. ఏమి చేయాలో తెలియక తపించాడు.

"ఏమిటలా చూస్తారు? సినిమావేళయింది. బయలుదేరండి-" అంది ఆమె.

"నేను రాను, రావాలని లేదు. కావాలంటే నువ్వు వెళ్ళిరా!" అని ప్రశాంతంగా జవాబు చెప్పాడు. అది తుఫానుకు ముందరి ప్రశాంతి.

"ఏమిటన్నారు? రారా?"

"ఔను. రాను!"

అతడిని కాల్చివేసేలా గుడ్లురిమి చూసింది సుందరి.

అతడికని మేజామీద వుంచిన బట్టలను విసిరిపారేసింది, 'క్రైమలర్' గాలిలోకి ఎగిరింది. అనరాని మాటలను వినరాని విధంగా కర్కశంగా అంది: "మీకేం మగ మహారాజులు! ఏమన్నా చేయవచ్చును. వీధిలో పోయేదానిని తెచ్చి ప్రక్కన పెట్టుకుని సంసారాలాడగలరు. కాని కట్టుకున్నదానితో వీధిలో వెళ్ళాలంటే వీలుండదు. మిమ్మల్ని అనడం ఎందుకు? మీకన్నా మించినవారు లేరని, వెతు

కొ్కచ్చి మీకు కన్నెనిచ్చి కల్యాణం చేసి నెలనెల వెయ్యి రూపాయలు ధార పోస్తున్నారే ఆయన ననాలి! డబ్బూ ఇచ్చి, ఇల్లూ ఇచ్చి, కారు ఇచ్చారుకదా మరి మీరు కొండమీదికెక్కి ఎందుకు కూచోరు?''

ఆడపులివలె రెచ్చిన సుందరి మాటలు అతడిలో దాగిన మగపులిని రెచ్చగొట్టి సవాలు చేశాయి. చేయి విలవిల లాడింది. టపటపమని లెంపమీద వాయించి ఆమె నోరు మూయించి కింద పడేయాలని తపించింది మనసు. మెడబట్టి వీధిలోకి గెంటుదా మనిపించింది. కాని అది తప్పు, అది పాపం అని చెప్పింది అతడి సంస్కారం. అతి శ్రమమీద తన్ను తాను అణుచుకున్నాడు.

అంతలో ఆమె సత్యభామలా విసవిసా నడిచివెళ్ళి - ''డ్రైవర్! నువ్వు కారు తీసుకుని ఇంటికి పో!'' అని అరిచింది - ''ఇంకెప్పుడూ ఇక్కడికి కారును పంపవద్దని చెప్పు. నా బతుక్కి అదొక్కటే తక్కువ—!''

మీనాక్షమ్మకు ఏమీ అర్థం కాలేదు. చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళు కిటికీల గుండా వేడుక చూస్తున్నారు. వెనకవైపు కిటికీగుండా ఆనంది తల కనిపించింది

అణ్ణామలై. కళ్ళల్లోకి పొంగివస్తున్న నీటిని ఆపుకోలేకపోయాడు. అక్కడి కక్కడే చచ్చిపోతే బాగుండు ననిపించింది.

కథ అక్కడితో అంతం కాలేదు. కాస్సేపటికి సుందరి గదినుండి నానావిధ శబ్దాలు వినపడసాగాయి. అలమార తలుపులు కొట్టుకుని ఘోషించాయి. పెట్టెలు పిల్లిమొగ్గలు వేయసాగా.. కూజా, గ్లాసులు ఏడవసాగాయి. లేచి వెళ్ళి తొంగి చూశాడు అణ్ణామలై. సుందరి అలమారనుండి ఆదరా బాదరాగా తన గుడ్డలను తీసి పెట్టెలోకి కుక్కుతూంది. తర్వాత పెట్టెను చేతిలో పట్టుకుని బయటకు నడిచింది.

ఆమె జుట్టు విరబోసుకుని భయంకరంగా వుంది. కాసేపు ముందు సినిమా కని విలాసంగా తయారయిన మనిషి ఇంతలో ఇట్లా ఎట్లా అయిందనిపించింది అణ్ణామలైకు.

''ఎక్కడికి వెళుతున్నావు'' అని అరిచాడు. పుట్టింటికి వెళ్ళేటట్లయితే ఇందాకే కారులో వెళ్ళేది కదా అని అతడి భావం.

"నే నే ఏట్లోకిపోతే మీకేం ?" అని అరిచింది సుందరి. ఆమె స్వరంలో, చూపులో ప్రతిఫలించిన పగ అతడి నేడో చేసింది. ఆ స్థితిలోవున్న ఏ స్త్రీనీ అతడు చూడ నిచ్చగించడు. అయినా ఆమె తన అర్ధాంగి.

"నా మాటవిను సుందరీ !" అని ప్రతిమాలాడు అణ్ణామలై.

ఆమె వినలేదు. దారిలో నిల్చున్న అతడిని మొరటుగా పక్కకు తోసేసి చరచర మెట్లు దిగింది. క్రిందవున్న చెప్పులు తొడుక్కుంది వీధివైపు నడిచింది. మీనాక్షమ్మ సహించలేకపోయింది. ఆమె వెనకాలే పరుగెత్తుకువెళ్ళి ఆమె చేతిలోని పెట్టె పట్టుకుని ఆమె నాపింది

''ఇదేమన్నా బాగుందా సుందరీ ? లోపలికిరా !" అంది మీనాక్షమ్మ.

"మీకు మీ అబ్బాయి చేసేవే బాగుంటాయి. నా పెట్టె వదలండి !"

''అంతగా వెళ్ళాలనివుంటే, నిన్ను తీసుకువెళ్ళి విడిచిరమ్మని వాడితో చెబుతాను — ''

"నా కెవ్వరితోడూ అక్కర్లేదు !'' అని ఆమెను విదిలించుకుని వీధిలోకి నడిచింది సుందరి. మీనాక్షమ్మకు ఇంటి బయట అడుగుపెట్టే అలవాటేలేదు. అందులోనూ మేస్త్రీగారు పోయా క స్థితిలో బయటికి వెళ్ళడం అసలు ఇష్ట లేక, కొడుకు దగ్గరకు పరుగెత్తుకు వెళ్ళి పాధేయపడింది; ఆమె నెలాగయినా ఆపమంది; అది వీలుకాకపోతే ఆమెను స్కూటర్‌మీద వాళ్ళింట్లో దిగబెట్టి రమ్మంది.

ఇంటిగుట్టు అన్నది వీధిలో పడ్డాక, దాని వెనకాతలే వీధిలోకి పరుగెత్త డానికి మనస్కరించలేదు అతడికి. కాని తల్లి ఆవేదనను చూసి, కాదనలేక, అయిష్టంగా స్కూటర్‌మీద బయలుదేరాడు.

సుందరి బస్‌స్టాప్ చేరేసరికి అతడూ చేరాడు. సరిగ్గా అదే సమయానికి బస్సొచ్చింది. పెట్టెతో వెళ్ళి దాని నెక్కింది సుందరి. తిరిగయినా చూడలేదు ఆమె. బస్సు బయలుదేరింది. అవమానంతో, నిరాశతో వెనకు తిరిగాడు - ఆమె తన పుట్టింకే వెళ్తుందని తెలిసిన అణ్ణామలై.

ఇంటికి వచ్చిన కొడుకు నడిగింది మీనాక్షమ్మ దుఃఖంతో పొద్దున గలగల మని నవ్వుతూ సినిమాకు బయలుదేరిన సుందరి కేమయిందో ఆమె కర్థం కాలేదు.

"ఏమయిందిరా నాయనా, ఏమయింది ?" అని రోదిస్తూ అడిగింది ఆమె.

"ఆమె రమ్మంది; నేను రానన్నాను. అంతే. అంతకన్న వివరాలడగకమ్మా!" అని విసుక్కున్నాడు.

ఇంత స్వల్ప విషయాని కింత రభసా - అన్పించింది మీనాక్షమ్మకు. అయినా అతడి నింకేమీ అడగకుండా ఆమె వంటింట్లోకి వెళ్ళింది.

అశ్వత్థామలై తన గదిలో కూర్చుని 'కల్లై మలర్' ముఖచిత్రాన్ని చాలసేపు అలాగే చూస్తున్నాడు. నెమ్మది నెమ్మదిగా అతనిని శాంతి ఆవహించసాగింది.

సుందరిని గురించి ఆలోచించసాగాడు. మొదటినుండి ఆమె తన ఆశ, తన కోరిక, తన తృప్తి - తన అవసరం, తన ఇష్టం అయిష్టం - వీటికే ప్రాధాన్యం ఇస్తూంది. 'అయితే ఆమె చూపే ఆదరణ అంతా తన కోర్కెలను నెరవేర్చే సాధనం నేను అయినందుకేనా!'

ఆమె అల్పమైన కోరిక నొకదానిని కాదంటే ...?

ఏమేమి జరుగుతాయో అతడికి తెలిసింది. ఆమె తిరస్కారానికి గురి అవాలి. అవమానం చెందాలి. ఆమె చేసినదంతా భరించాలి.

ఇల్లు, వాకిలి, ధనం, కారు - ఇవన్నీ గడ్డిపోచ లన్పించాయి అతడికి. అన్యోన్యత అన్నది దంపతుల మధ్య కరువయినప్పుడు కలిసి సినిమాలకు వెళ్ళడం, కారులో సినిమాకి వెళ్ళడం చాల కృత్రిమం అనిపించాయి. ఆ కృత్రిమ నాటకాలకని నానా గడ్డికరిచి డబ్బు సేకరించడం చాల హేయం అన్పించింది.

తటాలున ఒక నిర్ణయానికి వచ్చాడు; తల్లి దగ్గరకు వెళ్ళాడు.

"అమ్మా! ఇంక నేను ఆమె తండ్రి కంపెనీలో పనిచేయను. ఈ ఇంటిని కావాలంటే ఆమె, ఆమె తండ్రి తీసుకోనీ - నాకు మాత్రం వద్దు. నాకు ఇల్లు వద్దు, కుటుంబం కావాలి!"

మీనాక్షమ్మ నిశ్చేష్టురాలయింది. ఇల్లు, కుటుంబం అన్న పదాల అర్థాలు నెమ్మది నెమ్మదిగా ఆమెకు బోధపడసాగాయి. ఇటుక, ఇసుక, సిమెంటు, సున్నం-వంటి జడపదార్థాలతో నిర్మించేది ఇల్లు. మరి కుటుంబమో—?

## 23

ఇల్లు కారులాటి హంగులలో నలుగురికంటె గొప్పగా కనబడుతూ జీవిస్తూ వచ్చిన దండపాణికి చాల ఆసల్యంగా గాని తాము తమ కుటుంబాన్ని సరయిన

అదుపాజ్ఞలలో వుంచి నడపలేదని తెలియలేదు. మొదటినుండి ఆయన కార్యమాదే చట్టం, కాని ఏ చట్టమయినా దానిలో నీతి న్యాయం వుంటేకాని సరిగా జరగదు.

సుందరి అంటే ప్రత్యేకమయిన గారాబం వుండేది. ఇది చూసి కొడుకులు మండిపడేవారు. ఎవరికీ లొంగేవారుకాదు. ఎప్పుడూ తిరుగుబాటే, గొడవే !

పెళ్ళయి సుందరి అత్తవారింటికి వెళ్ళిపోవడంతో ఆమె ఆధిక్యం, బలం మాయమయ్యాయి. ఆ తరుణంలో క్రూరవాళ్ళు తమ స్థానాలను బలపరచుకున్నారు. కాని ఈలోగా సుందరి తిరిగి రానేవచ్చింది.

"సింగన్న అద్దంకి వెళ్ళనూ వెళ్ళాడు; రానూ వచ్చాడు-" అని ఒకడు పాడగా, ఇంకొకడు తాళం వేయగా, ఇంకొకడు నాట్యం చేశాడు.

పుట్టింటికి వచ్చిన కొన్నాళ్ళకే, అక్కడి పరిస్థితి మారినట్లు గ్రహించింది సుందరి. తనకు ముందున్న ఆధిక్యత లేదిప్పుడు. తల్లికి మారుగా ఆ రాక్షస సోదరులు రాజ్యం ఏలుతున్నట్లున్నారు.

తాను వచ్చినందుకు కన్నతల్లి ఒక్కతే సంతోషించింది; తన 'దయనీయ' మైన స్థితిచూసి ఆమె మనసు వెన్నపూసై కరిగింది. తన పక్షాన ఇంకొక వ్యక్తి అన్న మాట.

"నేను మొదటే చెబితే విన్నారా ? నాన్నా కూతురూ తలక్రిందులుగా నిల్చుని తపస్సు చేశారే తపస్సు ! ఇప్పుడేమయిందో చూశారా ?" అంటూ ఆ ఇల్లాలు మొగుడిమీద ధ్వజం ఎత్తింది-" శారద అని ఎవతో బొమ్మలుగీచే పిల్లతో ఆ అబ్బాయి ఇంట్లోనే సరసాలుట పాత సంబంధం కాబోలు ! ఇప్పుడా జాణ ఇంటికీ వచ్చేసినట్లుంది. దానినిచూస్తే మీ అల్లుడికిక ఒళ్ళు తెలియదట !

దండపాణి ఇది నమ్మలేదు. ఇట్లాంటివాటికి అతడికి సమయమేలేదు అని ఆయన ఎరుగును కాని చెడ్డ తికమకలో పడిపోయాడాయన. ఈ గొడవేదో ఇంటితో ఆగక వ్యాపారంమీద దెబ్బతీసింది. అణ్ణామలై పనికి రానందువలన ఆయనకు, కంపెనీకి ఎన్నో సమస్యలు...

సమస్య అలాగే వుండిపోయింది. అణ్ణామలైను ఆయన కలవడానికిగాని, మాట్లాడడానికిగాని హక్కు లేకపోయింది. ఆ హక్కును ధర్మపత్ని ఉపసంహరించింది.

ఇంట్లోని మగవారి సానుభూతి అక్షామలై పక్షానవుంది. అయినా వారేమీ పరిష్కారానికి పూనుకోలేదు. వాళ్ళు ఒలీన సిద్ధాంతాన్ని పాటించారు. సుందరి పట్ల వారి ప్రవర్తన, వెనకటి రోజులలో ఆమె దురుసుతనానికి ప్రతీకారం చేస్తున్నట్లుగా వుంది. ఆమెను వారు లక్ష్యపెట్టలేదు. ఆమెను ఎవరో పరాయిపిల్లలా చూసేవారు.

సుందరి పరిస్థితి చూసి సహించలేక పోయేవారు దండపాణి. 'బిడ్డను చెరిచిన తల్లి' అని ఇల్లాలిమీద అదపదదప విరుచుకు పడసాగారు. అక్షామలై వచ్చి సుందరిని రమ్మనడం కల్ల-అని చెప్పారు. చిటారు కొమ్మనెక్కి కూర్చున్న అమ్మగారికి ఆ కొమ్మ ఎండి విరిగిపోతుందేమోనన్న గిలిపట్టుకుంది. క్రమంగా కిందికి దిగిరావడానికి సిద్ధమయింది.

ఈ పరిస్థితిలో ముందుగా కొన్ని ఏర్పాట్లను చేసుకుని ఒకరోజు ఆనంది ఇంటికి వెళ్ళారు దండపాణి. కదిరేశన్‌ద్వారా పరిష్కారం సాధ్యమవ వచ్చునని పించింది. అక్షామలై ఆయన మాటనంత సులభంగా తోసివేయదు.

అదృష్టవశాత్తు ఆయన వెళ్ళేసరికి ఆనంది, కదిరేశన్ ఇంట్లో వున్నారు. ఆయనకు ఆదరణతో స్వాగతం చెప్పారు ఆయనతో కాసేపు మాట్లాడిన వెంటనే, ఆయనకు అన్ని విషయాలూ తెలుసునని దండపాణికి అర్థమయింది.

అంచేత ఆయన ఎక్కువ మాట్లాడకుండా-''జరిగిందేమయినా ఇప్పుడు సుందరి కాపురం నిలబెట్టాలి ఆ బాధ్యతమీదే-'' నన్నారు దండపాణి.

''ముందు సుందరికి ఆ బాధ్యత వుండాలి. ఇదే తన ఇల్లు అని తెలియాలి. అది తెలిస్తే ఇబ్బంది వుండదు'' అన్నారు కదిరేశన్.

''అయితే నన్నేమి చేయమంటారు ?''

''మీరా అమ్మాయిని ఆమె ఇంటికి కారులో పంపించండి. ఇక్కడ ఆమె నెవరూ ఏమనకుండా నేను చూసుకుంటాను.''

చిక్కేననిపించింది దండపాణికి. కావాలంటే కొండను పెకలించుకు రావడానికాయన సిద్ధంగా వున్నారు; కాని కారులో సుందరిని తీసుకొచ్చి అత్తారింట్లో వదలడం అన్నది అంత తేలికకాదు. తన భార్య అందుకు అంగీకరించదు.

కాస్సేపు మౌనం వహించారు. ఆ తర్వాత సంచిలోంచి కొన్ని కాగితాలు తీశారు. అణ్ణామలై ఇల్లు పూర్తిగా తనఖానుంచి విడిపించినట్లు చెప్పే పత్రాలవి.

కదిరేశన్ వాటిని తీసుకుని అణ్ణామలై కిస్తామన్నారు. "ఈ రోజులలో మీవంటి మామగారు లభించడం తన అదృష్టం అనే అణ్ణామలై అనుకుంటారు. కాని మీరూ ఆయన్ను అర్థం చేసుకోవాలి..."

"చెప్పండి !"

"ఆయన నిజమైన కళాజీవి. డబ్బుకు ఆశించి ఏ గడ్డినయినా కరిచే జాతివాడు కాదాయన. నేనాయనతో మాట్లాడాను. డబ్బుకని అది తెచ్చే సుఖాలకని తనకు నచ్చని వాటిని గీయడానికి సిద్ధంగా లేడాయన. ఆయన మీ కంపెనీలో పనిచేయరింక..."

"పోన్లెండి ! ఎలాగో ఓలాగా వాళ్ళిద్దరూ అన్యోన్యంగా వుంటే చాలు."

"అన్యోన్యం !" అని దీర్ఘంగా నిట్టూర్చారు కదిరేశన్. ఆ భాగ్యం నాకు కలిగిందీ జీవితంలో. నా జీవితాన్ని పంచుకున్న ఆవిడ ప్రేమతప్ప మరోటి ఎరుగని అమృతమూర్తి. ఆమెను నేను అర్థం చేసుకోగలిగాను" అన్నారాయన మద్గకంఠంతో, ఎన్నెన్నో జ్ఞాపకాలు మెదిలాయి ఆయన మనసులో కష్టంతో ఇంకా చెప్పారు - "అణ్ణామలై బంగారంలాటి వ్యక్తి. పసిబిడ్డలాటి వ్యక్తి. ఆయనకు కావలసింది ప్రేమ ఒక్కటే. అది ఆయన భార్యనుండి లభించాలి. అధికారం చెలాయించో, బతిమిలాడో, లంచం ఇచ్చో ఆయన దానిని ఆమెనుండి పొందలేడు. ఆయన లేత మొక్కలాటి కళాకారుడు. ఆ మొక్క వసివాడకుండా వుండాలంటే మీ అమ్మాయి ప్రేమ చాలా అవసరం. ఆ ప్రేమను సుందరి ఇస్తే చాలు !

పక్కనేవున్న ఆనందికిది వినేసరికి గుండె నొక్కుకుపోతున్నట్లు అన్పించింది. కళ్ళవెంట నీళ్ళు రావడానికి సిద్ధంగా వున్నాయి. లోపలికి వెళ్ళిపోయి వెక్కి వెక్కి ఏడవా లనిపించింది. కాని ఎలాగో తన్నుతాను సంబాళించుకుని - "విచారించకండి, నేనూ నాన్నగారూ మీ ఇంటికి వచ్చి సుందరిని తీసుకొచ్చి ఇక్కడ దిగబెడతాము-" అంది.

"కోటి పుణ్యాలు మీకు-" అని చేయెత్తి నమస్కరించారు దండపాణి.

చెప్పదమైతే చెప్పిందిగాని ఆ పని చేసేసరికి ఆనందికి 'దాలురా బాబూ !' అనిపించింది. అణ్ణామలై వద్దకు అతడి భార్యను తీసుకొచ్చి అప్పగించడంతో ఆమె పడ్డ పాట్లు ఇన్నీ అన్నీ కావు.

సుందరి తల్లి 'వాళ్ళ నాలుక పీక్కునేటట్లుగా నాలుగు ప్రశ్నలు అడిగాక కాని కూతురిని పంపనని శపథంచేసి వుంది. కాని ఆమెకు ఆ అవకాశాన్ని అణ్ణామలై గాని, మీనాక్షమ్మగాని ఇవ్వనందున ఆమె తన ఉక్రోషాన్ని ఆనందిమీద కక్కింది.

నాలుగుకాదు, నాలుగు వందల ప్రశ్నలడిగింది ఆనందిని. దెయ్యం పట్టిన దానిలా అరిచింది, ఆడింది. కాని ఆనంది నోరు తెరవలేదు. చాల సహనంతో ముఖంమీది చిరునవ్వు చెదరకుండా అన్నిటినీ భరించి, సుందరిని వెంట బెట్టుకు వచ్చింది.

భార్యాభర్త లిద్దరినీ ఒకచోట చూశాక తనుపడ్డ వేదనంతా మరిచి పోయింది ఆనంది. ఆమె చాలాసేపు సుందరికి హితవుచెప్పి, ఆనందంతో తన ఇంటికి తిరిగి వచ్చింది.

# 24

ఆనంది వచ్చేసరికి ఆమెకోసం శారద కాచుకునివుంది. కాని ఆమె మొహం ఎప్పటిలా కళకళలాడుతూ లేదు. "నీతో మాట్లాడాలనే కూచున్నాను ఒక ముఖ్య విషయం మాట్లాడాలి" అంది శారద. ఆమె మొహం కోపంతో ఎర్రబడి వుంది. ఆమెను తీసుకుని ఆనంది మేడ మీదకు వెళ్లింది. అణ్ణామలై కుటుంబ విషయంలో తల దూర్చినందుకు ఆమె తన్ను కోప్పడుతుందేమో ననుకుంది ఆనంది.

అయితే శారద "ఇప్పుడు మీ ఆయన ఎట్లా వుంటున్నాడు ?" అంటూ మొదలు పెట్టింది.

"ఎట్లా వున్నారా ?" అని ఎదురు ప్రశ్న వేసి- "ఆయన వ్యాపారం బాగానే సాగుతూంది. కారు కూడా కొన్నారు."

"కారుకు డ్రైవరున్నాడా ?"

"ఆయనకే కారు నడపడం తెలుసు. అందుకని డ్రైవరు నుంచుకోలేదు."

"నిన్న సాయంకాలం ఆయన ఎన్ని గంటలకు ఇంటికి వచ్చారో నీకు గుర్తుందా ?"

ఇదేమిటి పోలీసులా ఇదేం ప్రశ్నలు అన్పించింది ఆనందికి. అయినా శారద ధోరణి చూస్తే నవ్వు రాలేదు. గుర్తుకు తెచ్చుకుని- ''నిన్న రాత్రి ఆయన ఇంటికి వచ్చేసరికి ఎనిమిదిన్నర లేక తొమ్మిది అయి వుంటుంది-'' అంది.

''నువ్వు ఆయనతో కలిసి రాత్రి ఎనిమిదింటికి 'బీచ్'కు వెళ్ళావా ? ఆయనతోబాటు కారు వెనక సీటులో నువ్వు ఆయన మీద వాలి వున్నావా అని అడుగుతున్నాను"

''శారదా !'' అని అరిచింది ఆనంది.

శారద చెప్పింది : రాత్రి ఆమె మాణిక్యం కారుని బీచ్ ఒడ్డున ఒక మూల చీకట్లో వుండడం చూసిందిట. ఆనంది వుంటుందేమో నని తాను కారు దగ్గరికి రాబోయిందంట. కాని తీరా దగ్గర కొచ్చేసరికి ఆ చీకట్లో, కారు వెనక సీటులో ఇద్దరు దగ్గర దగ్గరగా వుండడంతో సందేహం కల్గిందిట. మాణిక్యంతో వున్నది ఎవ్వరని తనకు తెలియలేదు.

"నువ్వు అయి వుండవని నాకు తెలుసు. ఎంత భర్తయినా అట్లా అక్కడ ఆయన ప్రవర్తించేందుకు నువ్వు అవకాశం ఇవ్వవని నాకు తెలుసు. అందుకనే నాకు సందేహం కల్గింది."

ఆనంది పై ప్రాణాలు పైనే పోయినట్లయింది. నెమ్మదిగా శారద చేతులను గట్టిగా పట్టుకుంది. శారద మాటలు నమ్మడాని కిష్టం లేదు గాని నమ్మడం తప్ప వేరే గత్యంతరం లేకపోయింది. ఆనంది ఎలాగో తన కన్నీటిని ఆపుకుంది. కాని శారద కన్నీటి నామె ఆపలేకపోయింది.

'ఇంత అన్యాయమా !' అన్పించింది; ఆ వెంటనే 'ఛీ...ఇంత దారుణం జరగదు' అన్పించింది. మరి జరగకపోతే ఏమి అయి వుంటుంది అని ఊహించ లేకపోయిందామె.

తాను చేపట్టిన ఇళ్ళ నిర్మాణంలో పని చేయడానికి వేలయ్యనూ ఆమె కూతురు ముత్తమ్మనూ మాణిక్యం కారులో తీసుకుపోవడం, రావడం ఆమె ఎరుగును. ముత్తమ్మ పెరిగి పెద్దయింది; చెక్కిన శిల్పం లాటి ఒళ్లు. అయినా అభం శుభం తెలియని పిల్ల.

కొన్ని రోజులనుండి వేలయ్యకు ఆరోగ్యం బాగులేనందున ముత్తమ్మ మాత్రమే పనిలోకి వెళ్ళి వస్తుందన్న విషయం చటుక్కున స్ఫురణ వచ్చిందా నందికి. పై పెచ్చు వేలయ్యకు చికిత్స చేయించడంలో మాణిక్యం ఆడిగా చూపిన శ్రద్ధ అమెకు ఎబ్బెట్టుగానే అన్పించింది.

ఆ రాత్రి సరిగ్గా తొమ్మిదింటికి మాణిక్యం కారు ఇంటికి వచ్చింది. కారు వెనక ప్రక్క నుండి దిగి ముత్తమ్మ ఉరుకులు-పరుగులూగా తోటలోకి వెళ్తుండడం ఆనంది చూసింది. ముత్తమ్మ నడకలో ఒక కొత్త హొయలు, విసురు కన్పిం చాయి గాని, అవి వయసు లక్షణాలులే అని సరిబెట్టుకో యత్నించిందామె. మాణి క్యం ముత్తమ్మ వెళ్ళిన వైపు చూడకుండా, ''ఇవాళ కూలి ఇచ్చే రోజు, అందుకని ఆలస్యం అయింది" అంటూ లోపలికి వచ్చాడు.

ఏమీ మాట్లాడకుండానే మాణిక్యం భోజనం ముగించుకుని తన గదిలోకి వెళ్ళిపోయాడు. లెక్కలూ అవీ చూసుకుని అతడు వచ్చేసరికి ఒక్కో రాత్రి పన్నెండు కూడా అయ్యేది. ఒక్కోసారి అక్కడే పడుకుని నిద్రపోయేవాడు.

మునుపటిలా అతడు ఆనంది నిప్పుడు రోజూ బాధించడం లేదు. ఇందు వలన ఆనందికి కాస్త శాంతి లభించింది. కాని తననుండి అతడి మనసు కనకం మీదకు మళ్ళిందిలే అనుకుంది ఆమె.

ఆ రాత్రి ఆమెకు నిద్ర రాలేదు. ఆ రాత్రి అతడు తన వద్దకు వస్తే మొహం మీదే అడిగేయాలి అనుకుంది. కాని అతడు రాలేదు. పన్నెండయ్యాక క్రింద వున్న తన గదిలో అతడు దీపం ఆర్పిన చప్పుడు వినిపించింది. పడక మీద నుండి లేచి హాల్లోకి వచ్చింది ఆనంది. అంతా చీకటి

తోటలో ఆకులు కూడా కదలడం లేదు. ఆమె కిటికీగుండా చీకట్లోకి చూస్తూ చాలాసేపు నిల్చుంది. అట్లా నిల్చోవడం అవమానం అన్పించింది. కాని తప్పలేదు.

క్రింద ఏదో చప్పుడు వినిపిస్తే మేడ మీద నుండి తొంగి కిందకు చూసింది.

# 25

ఆనంది చూపులలాగే నిలిచిపోయాయి. తల మీద ముసుగు వేసుకున్న ఒక రూపం దొంగతనంగా నక్కి నక్కి నడవడం కనుపించింది. ఇలాంటిద్రి

ముందు రోజు గనుక ఆమె చూసివుంటే 'దొంగ! దొంగ! అని అరిచి అందరినీ లేపి వుండేది. అయినా ఆతడు దొంగ కాదని ఆమెకు అర్థం అయింది. కాని అతడు తన భర్తేనని నమ్మడాని కిచ్ఛగించలేదామె.

మేడ దిగి, అతడి పని గదిలోకి వెళ్ళి చూసింది. గది చీకటిగా వుంది. అతడక్కడ లేడు. తెర తొలగించి మంచం మీద పడుకుని ఆలోచించ యత్నించింది. గందరగోళంగా వున్న మనసు ఎట్లా ఆలోచించగలదు?

వెనక్కు మేడ మీదికి వెళ్దామా? లేక అతడు తిరిగొచ్చేదాకా అక్కడే కాచుకుని వుందామా? లేక...లేక...తోటలోకి వెళ్ళి అతడిని వెంబడిద్దామా? ఏమీ పాలు పోలేదామెకు

ఆమెకు తెలియకుండానే ఆమె చేతులు మంగళ సూత్రాన్ని స్పృశించాయి. దానిని తన కళ్ళ దగ్గరకు తీసుకుంది. అంత చీకటిలోనూ అది తళుక్కుమని మెరిసింది.

ఆ మెరపు వెనక నిలబడి- 'నువ్వు పొరబాటు చేశావు. నీ చేతను నేనంగీ కరించలేను. నువ్వితడని పెళ్ళాడ్డం అవివేకం' అని శారద ఖంగుమని పలికి నట్లు అనిపించింది.

ఆమె గది చీకటి నుంచి బయటికి తోటలోకి వచ్చింది. అలా వెళ్ళడమే అవమానం అనిపించింది. జుగుప్సాకరంగా, రోతగా వుంది. కాని, కాని బురదలో పొర్లాడే పురుగును ప్రేమించ యత్నించాక, బురదను చూసి అసహ్యించుకోవడం దేనికి?

అడుగుల సవ్వడి విన్పించకుండా నెమ్మదిగా నడవసాగిందామె. ఒక ఆడది ఇటువంటిపని చేయవలసి రావడం ఎంత హేయం! ఆమె చెట్లచాటుగా నడవ సాగింది. చీమ చిటుక్కుమన్నా వినసాగాయి ఆమె చెవులు. ఎక్కడయినా. వినిపిస్తే ఎదుట పడదాం అనుకుంది ఆమె. కాని అలాంటిదేమి వినపడలేదు 'ఒక వేళ ముత్తమ్మ ఇక్కడికి రానందున ఆయనే వాళ్ళింటి దగ్గరగా వెళ్ళి కాచుకున్నా రేమో! అలాగయితే మంచిది. చప్పుడు చేయకుండా వెళ్ళి అతణ్ణి చేయి పట్టుకుని ఇంట్లోకి తీసుకు వెళ్ళిపోతే ఇద్దరినీ ఈ పాపంనుంచి రక్షించినట్లవుతుంది.

ఎన్నెన్నో ఆలోచనలు మనసున చెలరేగుతుండగా ఆమె ఊపిరి బిగపట్టుకుని ముందడుగు వేసింది. కాలి కేదో గుచ్చుకుంది! నెత్తురు కారసాగిందో తెలియ

లేదు. పాదాన్ని తడిమి చూసినప్పుడు చేతికయిన రక్తాన్ని తుడుచుకోవా లని పించలేదు.

ఒక్క క్షణం అక్కడ నిలబడింది. అటువైపు నందవర్ధనం చెట్లు కదలుతున్నట్లు అన్పించింది మెల్లగా అటు నడిచింది చెట్లు దట్టంగావున్నా మధ్య మధ్య ఖాళీగావుంది.

అలాటి ఒక ఖాళీస్థలంలో, పొదరింట్లో...

చీకటిగా వున్నా, నక్షత్రాల మినుకు మినుకుమనే వెలుతురే అక్కడ జరుగుతున్నదేదో ఆమెకు చూపించింది.

అక్కడ ఆమె చూసింది ఇద్దరు మనుషులను కాదు; రెండు మృగాలను చూసింది రెండు సర్పాలు ఒక దానినొకటి పెనవైచుకుని ఎగశ్వాస వదులుతున్న భయంకర దృశ్యం అది.

పిచ్చిపట్టినదానిలా మాంగల్యాన్ని చేతులతో పట్టుకుని వేగంగా వెనకకు నడిచింది ఆమె.

మేడమీద తనగదిలోకి వచ్చింది ఇంక అతడితో దీనిని గురించి మాట్లాడి లాభం లేదని తెలిసిపోయింది ఆ క్షణాన. తన్ను తాను నిందించుకుంది. తన దేహాన్ని, మనస్సును, అందాన్ని, యవ్వనాన్ని నిందించుకుంది.

మాణిక్యంవంటి వాడిచే మైలపరచబడిన ఈ శరీరాన్ని మోస్తూ బ్రతికి వుండదంకన్న ఘోరశాపం ఇంకొకటి వుండబోదనిపించింది. తన చేతులతో తన శరీరాన్ని ముట్టుకోవడానికీ జంకింది ఆమె. ఇంక అద్దంముందు నిలబడి తన్నుతాను చూసుకుంటే పిచ్చిపట్టడం ఖాయం అనుకుంది. తండ్రి గీచి క్రింద హాల్లో వేలాడదీసిన తన చిత్రాన్ని ముక్కలుచేసి పారేయాలనిపించింది.

తూర్పునుండి సముద్రపు ఘోష వినబడుతూంది. చెవులురిక్కించి వింది ఆమె. ఆ అలల పిలుపు తనకే! ఎంత ప్రేమవుంది ఆ పిలుపులో!

మెట్లు దిగింది. తటాలున ఎవరో తన దారికడ్డంగా నిలబడిన భ్రమ కల్గింది. ఈ వేళపుడు, ఎప్పుడో చనిపోయిన తన తల్లి ఇక్కడకు ఎలా వచ్చింది? సందేహంలేదు! సరస్వతమ్మే!

"ఆనందీ! మీ నాన్న బిడ్డలాటి వారమ్మా! ఆయనను నీ వద్ద వదలి వెళ్ళాను. నువ్వే ఆయనను చూసుకోవాలి. ఈ మాట ఎన్నడూ మరవకమ్మా!"

అట్లాగే అమ్మను కౌగలించుకుందామని జూచిన ఆమె చేతులకు మెట్ల పక్కనవున్న 'చెక్క చట్రం' తగిలింది.

ఆమె నిల్చున్నచోటు ఏదో ఆమెకు తెలియలేదు.

మొట్ట మొదటిసారిగా మాణిక్యం ఎంగిలి ఆమె పెదవినంటి నిప్పై ఆమెను కాల్చిన చోటు అది

# 26

ఎలాగో తెల్లవారింది. మాణిక్యం ఇల్లువిడిచి బయటకి వెళ్ళేదాక ఆమె క్రిందకు దిగలేదు. అతడి మొహాన్ని ఉదయమే చూడదలచుకోలేదామె. అయినా అతడికామె గుర్తు వచ్చినట్లులేదు. అమ్మ పెట్టిన ఉపాహారాన్ని తిని, బయటకు వెళ్ళిపోయాడు.

కారు బయలుదేరుతున్న శబ్దంవిని మేడమీద నుంచి తొంగి చూసింది. మాణిక్యం కారును ఒక ప్రక్కగా ఆపి, ముత్తమ్మకోసం 'హారన్' మోగిస్తున్నాడు. ఆమె పరిగెత్తుకు రావడంచూసి, ఆమెకోసం కారు తలుపు తెరిచి, ఆమె నెక్కించుకుని, కారును ముందుకుతోలాడు. మట్టి తట్టలను మోయడానికి వెళ్ళుతున్న ఆ కూలిమనిషి సిగలోని పూలచెండు చూస్తే ఆనంది కడుపులో కెలికినట్లయింది. ముత్తమ్మను చూసి ఆనంది ఈర్ష్యపడలేదు. ఆ అసహాయకురాలి పతనానికామె నొచ్చుకుంది.

క్రిందకు దిగి స్నానం పానం ముగించుకుంది తన తండ్రికి, అన్నకూ కావలసినదేదో సమకూర్చింది. అత్తగారయిన చెల్లమ్మకు ఎంతసేపు తను, తన కొడుకే తప్ప ఇంకొకరి విషయం పట్టేది కాదు. ఆ లోటు కనబడనివ్వకుండా ఆనంది చూసుకునేది.

ఆ పూట భోజనం సహించలేదు. రాత్రంతా నిద్ర లేనందున ఒళ్ళంతా నొప్పులు, హాల్లోకి వచ్చి సోఫాలో ఆనుకుని కూచుంది. కాస్సేపటికి కిటికీగుండా శారద రావడం చూసి ఎదురు వెళ్ళి ఆమెను కలుసుకుని మేడ మీదకు తీసుకు వెళ్ళింది. క్రిందయితే అత్తగారు వినకుండా మాట్లాడుకోవడం కష్టం.

శారద మొహంలో వడ్ల గింజలు వేస్తే పేలాలు అవుతున్నాయి. అంతకు క్రింద రోజు సాయం కాలం ఆమె కావాలనే సముద్ర తీరానికి వెళ్ళి నిఘా వేసి వుంచిందట. చెట్ల వెనకాల దాగి కూచుని గమనించిందట. అతడితో వచ్చింది ముత్తమ్మేనని ఋజువయిందట.

ఆనంది కిదివరకే తెలిసినదాని నామె అతి కష్టంతో కనుక్కుంది. తన వేదనను పంచుకోగల నెచ్చెలి ఆ పూట అక్కడికి రావడం ఆమె కూరట కల్గించింది. తోడబుట్టని సోదరి శారద. ఆమె ఎదుట తన గోడునంతా వెళ్ళబోసుకుంది. అది విని అగ్ని శిఖ అయింది శారద.

''సరే, ఇంక అంతా నాకు వదిలేయి. నేనివాళే ఈ ఆట నరికట్టడానికి చర్య తీసుకోకపోతే నా పేరు శారద కాదు-''

''శారదా !''

"ముత్తమ్మ ఇంట్లో చెప్పి ఆమెను రేపటి నుంచి పనిలోకి పంపకుండా చేస్తాను. వెంటనే ఆమె పెళ్ళికి ఏర్పాట్లు చేయిస్తాను. కావాలంటే డబ్బు కూడా ఇద్దాం పెళ్ళి ఖర్చులకు.''

ఆ పెళ్ళి ఆలోచన విన్న ఆనందికి అది తప్పని తోచింది. కళ్ళారా చూసిన మనిషి తను. ''చెడిన దానికి పెళ్ళా!'' అని తనలో తాను అనుకున్నట్లుగా అంది ఆమె. మాణిక్యం చేత మైల పడ్డానన్న కారణంగా అతడికి తన్ను అర్పించుకుంది. మరి తనకో న్యాయమూ, ముత్తమ్మ కింకో న్యాయమూనా?

"శారదా ! ముత్తమ్మ తోటమాలి వేలయ్య కూతురు గాక మనలాంటి అమ్మాయి అనుకో. నా చెల్లెలికే ఇలా జరిగితే నువ్విలాగే చేసేదానివా ?"

ఏమి అర్థంలేని ప్రశ్న అనిపించింది శారదకు. ఆనంది ఇట్లా ఎందుకు అడుగుతున్నదీ ఆమెకు తెలియలేదు. భర్తను అదుపులో వుంచుకోవడం మానేసి ఎవతికోసమో ఈమె వాదించడమేమిటి, అనిపించింది శారదకు.

"నా చెల్లెలి మాట అట్లా వుంచు. నాకే ఈలాటిది జరగినా, నేనే ఎవడో ఒకడికి బలి అయినా కూడా వాడిని ఎగిసి తన్ని మరీ వెళ్ళి ఇంకోడిని పెళ్ళాడదానిక ఇ కను. 'ప్రేమ' ఒలకపోయిడానికి పాపం చాలా మందే వున్నారు, కాని పెళ్ళొద్దం దగ్గర కొచ్చేసరికి చాలామంది పిరులు వెనక్కుండిపోతారు. కనుక;

ఇందులో పాపం ఏమిటి అని అడుగుతున్నాను. దోషి ఎదుట తల వంచడమే మహా పాపం!"

శారద సమ్మెటతో తన అంతరంగాన్ని తుత్తునియలు చేసినట్లయింది ఆనందికి.

హఠాత్తుగా ఆనంద ఏడ్వసాగింది. వెక్కి వెక్కి ఏడ్వసాగింది. భోరు మని ఏడ్వసాగింది శారద ఒడిలో తల పెట్టుకుని కన్నీరు మున్నీరుగా కార్చ సాగింది. శీలమనీ, కళంకమనీ తనకు తానే ఊహించుకుని, తనకు తానే చేసుకున్న నిర్ణయం ఆమె హృదయంలో ముల్లై గుచ్చుకుని వుండడం ఆమెకిప్పుడే తెలిసింది.

"నేను పొరబాటు చేశాను, శారదా! అని తాను మాణిక్యాన్ని పెళ్లి చేసు కున్నందుకు కారణాలను చెప్పింది అనంద. ఆమె ఎదుట ఏదీ దాచలేకపోయింది ఆనంద

"నమ్మలేను; నమ్మలేను.'' అని విలవిల లాడింది శారద. ''అప్పుడే నాతో ఒక్కమాటయినా చెప్పలేదేమే మూర్ఖురాలా ?''

''అయ్యో! ఆయనకు అయిదు నిముషాలు పట్టలేదు. కాని నాకు ఆ తర్వాత ఐదు రోజులదాక ఒంటి మీద స్పృహే లేదు. బురద గుంటలో మునిగిపోయి నట్లనిపించింది. ఎవ్వరికీ ముఖం చూపించాలనిపించలేదు. అప్పుడు నాకు కను పించిన దారి అది ఒక్కటే !

# 27

శారద రంగంలోకి ఉరికింది. చకచకా ముందుకు సాగింది. చేయవలసిన పనులను చేయసాగింది. ముత్తమ్మ తల్లి దండ్రులతో ఆమె ఏమి మాట్లాడిందో ఏమోగాని వెంటనే ఫలితం కనపడింది. మరు రోజు ముత్తమ్మ పనిలోకి రాలేదు. వేలయ్య తన కూతురు పెళ్ళి ఏర్పాట్లు చేయాలని పనిలోకి రాలేనని మాణిక్యంతో చెప్పేశాడు.

దెబ్బతిన్న పులిలా అయ్యాడు మాణిక్యం. ఎవరినడిగి ఏ విషయమూ తెలుసు కోలేని పరిస్థితి అతనిది. అయినా రహస్యం బయటపడినట్లుందని మాత్రం

ఊహించగలిగాడు, బయటపడడమే కాదు, అడ్డుపడింది. ఇది కనుక్కొన్న దెవరు? ఎట్లా కనుక్కొన్నారు? ఎలా అడగడం ఎవరినడగడం!

ఆనంది ప్రవర్తనలో మార్పు, ఆమె అతడి మొహంకూడా చూడకుండా తిరుగుతున్న వైనం అతడిలో సందేహాన్ని రేకెత్తించాయి. ఆమెను అడగడానికి ధైర్యం చాలలేదు. నెమ్మదిగా ఆనంది విషయమై అమ్మనడిగాడు.

"ఏంపాడో నాయనా ఎవరికేం తెలుసు? అంతా నువ్వే తెచ్చుకున్న తంటా ఇది!" అని అతనికే వాతపెట్టి ఆమె- "ఆ పిల్ల శారద రోజూ వచ్చి దీని మనసును పాడు చేస్తూందేమో నన్పిస్తూంది. ఇద్దరూ ఒకటే గుసగుసలు! ఏమి రహస్యాలో ఏమిటో?" అంది.

నెత్తిమీద గట్టిగా మొట్టికాయ వేసినట్లయిం దతడికి. సందేహం తీరి పోయింది. శారదమీద విపరీతమైన కోపం వచ్చింది. ఆమె తన కనవసరమైన విషయాలలోను, ఇతరుల కుటుంబ విషయాలలోను తలదూర్చి చెడుపుచేసే రకమని, జాగ్రత్తగా వుండమనీ తల్లిని హెచ్చరించాడు.

"ఇంక నువ్వే నీ కోడలిని అదుపాజ్ఞలలో వుంచాలి. నాకేమో తీరికలేని పనులాయె!"

చెల్లమ్మాళ్ తన చెవులను తానే నమ్మలేకపోయింది. పెళ్ళామే పెన్నిధి అని నెత్తిన పెట్టుకుని వూరేగినవాడేనా ఇట్లా అంటున్నది, అన్పించింది. అతడికి భయపడే ఆమె ఇన్నాళ్ళూ ఆనంది విషయాలలో జోక్యం కల్పించుకోలేదు. ఇప్పుడు తన నోటికి వేసిన తాళాన్ని తీసినట్లయింది.

"నీకు బుద్ధి వచ్చిందిరా అబ్బి! సుఖపడతావింక!" అని మనసార ఆశీర్వదించింది ఆ తల్లి.

చెల్లమ్మ కొత్త అధికారపు రుచిని మొదట చూసింది ఆనంది అవ్వ. బాగా వయస్సయికూడా అందరికీ ప్రేమతో సపర్యలు చేయడం తప్ప నోరుతెరచి మాట్లాడడం ఎరగని అమాయకజీవి ఆ వృద్ధురాలు.

ఆమె ఇప్పుడు పడకబెట్టింది. వయసు బాధకాక చెల్లమ్మ నోటి దురుసు తనం ఆమెను పడక విడవని రోగిష్టిగా చేసింది.

ఆనంది అవ్వకు శుశ్రూషచేసే నిమిత్తం కిందే వుండిపోసాగింది. రాత్రిం బగళ్ళామెకు ఆ పనే సరిపోయేది. అవ్వ పక్కన వుండడం ఆనందికి ఊరటగా వుంది.

ఒకరోజు, అవ్వ నిద్రపోతుండగా, కాసేపు ఒంటరిగా వుండాలని ఆనంది మేడమీదికి వచ్చింది. మనసు అలసట శరీరానికి అలసటగా అయింది. ఆమె మంచంమీద పడుకుంది. కిటికీగుండా తోటలోకి చూసింది. చెట్లు, తీగలు, పక్షులు, ఉడతలు ఎంత ఆనందంగా జీవిస్తున్నాయి! కాని మనుషుల జీవితం మాత్రం ఎందుకిట్లా నరకంగా మారాలి ?

ఆమె కళ్లు తమంతట తాముగా అజ్ఞామల్లై ఇంటి మేడవైపు చూశాయి. అతడు కిటికీదగ్గర నిల్చుని ఏదో దృశ్యాన్ని తన్మయత్వంతో చూస్తున్నాడు. ఆమె ఇంటిపక్క చూడ్డంలేదు అతను. అతడి చేతిలో, కుంచె కాబోలు! "ఆయన బాధ ఆయనకుంది !" అని నిట్టూర్చింది ఆనంది. "అయితే ఆయన తన బాధలను కుంచెతో తుడిచివేయగలరు... నేనో ?"

కన్నీరు పొంగి ఆమె కళ్లను కమ్మివేసింది. తన పెళ్ళి నిశ్చయ మయ్యాక ఒకసారి అతడు తన్ను వెతుక్కుని రావడం గుర్తుకు వచ్చింది. అప్పుడు తాను నిరాకరించినందువల్లనే పెళ్ళికికూడా వుండకుండా అతడు వూరువిడిచి వెళ్ళిపోయా డనీ ఆమెకు తెలుసు. 'పాపిష్టిదానా ! నిన్ను వెతుక్కువచ్చిన ఆ జీవితాన్ని కాల తోశావే ! ఏడు ! ఏడుమరి ! బాగా ఏడు !' అని తన్నుతానే తిట్టుకుంది.

కాని తర్వాత - అట్లా అనుకోవడం తప్పనిపించి, కన్నీరు తుడుచుకుంది. కళ్ళవలననేగదా పాత జ్ఞాపకాలు చెలరేగాయి అని కళ్ళను గట్టిగా మూసుకుంది. అలాగే పడుకుంది.

ఎవరో మెట్లెక్కుతున్న శబ్దం వినికూడా కళ్ళు తెరవలేదామె. నిద్రపోతూం దిలే అనుకోనీ అని అలాగే పడుకుంది. ఆ ఏకాంతం ఆమెకు చాల అవసరం అనిపించింది.

అడుగులు తన గదివైపు వస్తున్నాయి. ఒక్క క్షణం ఆగాయి. ఎవరో తన్ను చూస్తున్నారని మాత్రం అన్పించింది. మరుక్షణం మాణిక్యం ఆమె మీదకు వాలాడు. అతడి కళ్ళల్లో వెర్రి ఆవేశం; దహించుకు పోతూంది అతడి శరీరం.

తటాలున కళ్ళు తెరిచిన ఆనంది రెండు చేతులతోనూ అతడిని బలంగా వెనక్కు నెట్టింది. లేచి కూచుంది. ఆమె కళ్ళు నిప్పులు కక్కాయి.

"ముట్టుకోకండి నన్ను! వెళ్ళిపోండి! ఇక్కడినుంచి వెళ్ళిపోండి!" అని అరిచింది.

అతడు పోలేదు. దెబ్బతిన్న పులిలా నిల్చుని మళ్ళీ ఆమె చేతులు పట్టుకోబోయాడు. అసహ్యంతో ఆమె విదిలించుకుంది.

ఆమె తన కంఠాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ—"దయచేసి ఇకముందెన్నడూ నా దగ్గరకు రాకండి! వెళ్ళండి!" అని చేతులెత్తి నమస్కరించింది. ఆమె కంఠంలో ఆవేశం లేకపోయినా అది ఎర్రగా కాల్చిన ఇనుప కడ్డీలా అతడిని కాల్చింది.

తన ఓటమి అతడు అంగీకరించ నిచ్ఛగించలేదు. కోపంతో ఆమెను గుర్రుమని చూసి "ఆనందీ!" అని బెదిరించాడు.

"ఆ ఆనంది చచ్చిపోయింది. మీరు వెళ్ళి తలస్నానం చేయవచ్చు." అని మెరుపులా దిగి క్రిందకు వెళ్ళిపోయింది ఆమె.

తిన్నగా వెళ్ళి స్నానాల గదిలోకి దూరింది ఆమె. కుళాయి తిప్పి దాని క్రింద నిల్చుంది. అలా నిల్చునేవుంది. అతడి స్పర్శ సోకినచోట ఆవేదన తగ్గేదాక అలా స్నానం చేస్తూనే వుండాలనిపించింది ఆమెకు. నీళ్ళలా ప్రవహిస్తూనే వున్నాయి కాని ఆమె తపన ఆవయింతయినా తగ్గలేదు.

# 28

బస్సు పాతది. రోడ్డూ పాతదే. ఆ బస్సు తిరుచ్చినపళ్ళి నుండి బయలుదేరి గంటకు అరవై మైళ్ళ వేగంతో చెట్టినాడు వైపు వెళ్తోంది. ఆ బస్సులో సుందరీ, అణ్ణామలై వున్నారు. చెన్నపట్నం నుండి రైలు బండిలో తిరుచ్చి చేరే సరికి పొద్దు పొడిచింది. అక్కడ ఉపహారం సేవించి ఈ బస్సు నెక్కారు. సుందరీ అణ్ణామలై కలిసి మొదటిసారిగా అట్లా ప్రయాణం చేస్తున్నారు. శరవణన్ గారి ఊరికి వెళ్తున్నారు వాళ్ళు.

గ్రామం చేరింది బస్సు. రోడ్డు మలుపు దగ్గర ఆగింది బస్సు. పెట్టె పడక తీసుకుని దంపతులు దిగారు. ఒక గ్రామస్థుడు- "రండి! రండి!" అంటూ ఉత్సాహంగా స్వాగతం చెబుతూ, వారి చేతులలోని సామాన్లను తీసుకున్నాడు. ఆ ప్రక్కనే వున్న ఎద్దు బండిని చూసి, ఆ వచ్చినతడు బండి తోలేవాడనే వాళ్ళిద్దరు అనుకున్నారు.

''మొదటి బండిలో మీరు వస్తారని నా తమ్ముడు శరవణన్ రాశాడు. నా పేరు ఆర్ముగం" అని తమ్ము తాము పరిచయం చేసుకున్నారు.

గుండె గతుక్కుమంది దంపతులకు. బనియను, ధోవతి, పైన ఒక తువ్వాలు- ఇదీ ఆయన వేషం. శరవణన్ పోలికలున్నా ఆయనకన్న ఈయన ఆరోగ్యంగా కనుపించాడు.

బండిలో ఎక్కి కూచున్నారు. బండి చిన్నదేకాని అందంగా వుంది; రెండెడ్లు పూన్చి వున్నాయి. రివ్వున పరుగులు తీశాయి ఆ ఎడ్లు.

చాల నిర్లక్ష్యంగా ఆ బండిని ఆర్ముగం నడపడం చూసిన అణ్ణామలైకు తనే బండి తోలాలనిపించింది.

"బండిని నేను తోలవచ్చా?" అని అడిగాడు.

ఆయన సంతోషంగా ''అలాగే తోలండి! ఇవి బాగా మచ్చికయిన ఎడ్లే!" అని అతడికి చోటిచ్చాడు.

"నేను మళ్ళ క్షేమంగా మద్రాసు చేరాలి సుమండీ!'' అని సరదాకు కాదు నిజంగా భయంతో అరిచింది బండిలోపల కూర్చున్న సుందరి.

"నేను పక్కనే వున్నాను కదా! భయపడనక్కరలేదు!" అని నవ్వారు ఆర్ముగం.

గలగలమని మెళ్ళో గజ్జెలు మోగుతుండగా ఆ ఎడ్లు పరుగెడుతుంటే అణ్ణామలైకు అతి ఉత్సాహంగా వుంది. అదేదో పాత కాలమనీ, అది ఒక రథమనీ, యువ రాణిని తాను తీసుకు వెళ్ళిపోతున్నాననీ అనిపించింది అతడికి. సమయం చిక్కితే సుందరిని ఒంటరిగా బండిలో కూచోబెట్టి తీసుకువెళ్ళాలని అనుకున్నాడు.

రెండు మైళ్ళ తర్వాత గ్రామ దేవాలయ గోపురం కనుపించింది. నలు పక్కల పచ్చటి వరి పొలాలూ, చెట్లూ నయనా నందకరంగా వున్నాయి. కపిల తోలుతున్నా రిద్దరు రైతులు. అవతల పొలంలో నారు నాటుతున్న ఆడవాళ్ళ

పాటను విని బండిని ఆపేగాడు అణ్ణామలై. అలా వరుసలు వరుసలుగా ఆ స్త్రీలు వంగి నిల్చుని, పనిచేస్తూ పాటలు పాడుతున్న దృశ్యం చూస్తుంటే అతడి ఒళ్లు పులకరించింది.

"ఇక్కడి వారికి పనిలోనే ఎంత ఆనందం!" అన్నాడు. పొలం గట్ల మీద వున్న చెట్ల కొమ్మల కుయ్యాలలు కట్టి తమ బిడ్డల నందులో పడుకోబెట్టారు. ఒక తల్లి చెట్టు చాటుగా కూచుని బిడ్డకు పాలిస్తూంది. జనులూ ప్రకృతీ కలిసి మెలిసి జీవించే ఒక నూతన లోకంలోకి వచ్చినట్లనిపించిందతడికి.

గ్రామపు పొలిమేర నుండి ఆర్ముగం బండిని తానే తోలసాగాడు. వారింటికి ఎవ్వరో అతిధులు వస్తున్నారన్న కబురు ఊరంతా తెలుసు. వారి బండిని చూడ గానే కొందరు – ''వచ్చేశావా?" అని ఆర్ముగంను అడిగారు. మరి కొందరు "రండి!'' అంటూ అతిధులకు స్వాగతం చెప్పారు. అణ్ణామలై కంతా కొత్తగా వుంది. క్రింది వాటాలో కాపురం వున్న వాళ్ళకు మేడ మీద వున్నవాళ్ళెవరో తెలియని నగరం నుండి వచ్చిన వాడతడు.

పెద్ద డాబా ఇంటి ముందాగింది ఎద్దు బండి. ''సుందరీ! రావమ్మా!" అంటూ ఆమెను చాలా కాలం నుండి ఎరిగిన దానిలా ప్రేమతో చేయి పట్టుకుని తీసుకు వెళ్ళింది ఒక స్త్రీ. ఆమె అణ్ణామలైకూ స్వాగతం చెప్పింది. ఆర్ముగం భార్య ఆమె. ఆపాటికి ఆ వీధిలో సగం మంది అక్కడికి వచ్చేశారు. వారి చూపులలో ఎంత ఆదరణ!

శరవణన్ గ్రామమైన అరయన్ కుళానికి అణ్ణామలై చేరిన మరునాడు శర వణన్ అతడికి ఒక వుత్తరం రాశారు. ఆ వుత్తరంలో ఆయన రాశారు :

"పండగ సమయంలో మా గ్రామానికి మిమ్మల్ని పంపడంలో రెండు వుద్దేశ్యా లున్నాయి. మీరూ మీ ఆవిడా కులాసాగా కాలం గడపవచ్చు; మీకు చిత్రాలు రచించడానికి కొన్ని కొత్త వస్తువులు లభిస్తాయి అక్కడ. నానాటికీ గ్రామ జీవితం బాగా మారిపోతూంది. నా చిన్నప్పటి అరియన్‌కుళం ఇప్పుడు లేదు. ఇంకో పది, ఇరవై ఏళ్ళకు ఇప్పుడు మిగిలినదీ వుండబోదు. కనుక అనా దిగా మన గ్రామీణుల జీవితాలలో అంతర్భాగంగా వుంటూ వచ్చి, క్రమంగా కను మరుగై పోతున్న కళా దృశ్యాలను మీరు చిత్రించాలని నా కోరిక. మీకు నచ్చిన వర్ణచిత్రాలను వేయండి."

గ్రామంలోకి ప్రవేశించగానే అణ్ణామలై ఏమి అనుకున్నాడో ఆయన అదే రాశారు. కొన్ని కొన్ని దృశ్యాలు చూడగానే మనసున నిలిచిపోతాయి. ఆ అనుభూతిని చిత్రాలద్వారా వ్యక్తం చేయాలి అనిపించింది అణ్ణామలైకు.

చిన్న గ్రామం కావడం వలన దాని నంతా చుట్టిరావడానికి ఎక్కువ కాలం పట్టలేదు. కోవెల కేంద్రంగా మూడు పక్కల విస్తరించివుంది గ్రామం. కోవెల వెనకాల తామర కొలనుంది. ఊరిచుట్టు వరిచేలు; తోపులు; తోటలు. ఊరికి బయట తూరుపు దిశన అయ్యనార్ కోవెల వుంది. ఆ కోవెల ఉత్సవాలే ఆ వూరిలో గొప్ప సంబరం. ఆ తర్వాత గొప్ప పండగ సంక్రాంతి.

ఆ కోవెల ఉత్సవాలకని ఊరంతా అక్కడక్కడా ఏర్పాట్లు జరుగుతున్నా తోపులోపలవున్న అయ్యనార్ కోవెల సందడి లేకుండా ప్రశాంతంగా వుంది. కోవెలచుట్టు దట్టంగా చెట్లున్నాయి నల్లరాతితోను, కాల్చిన మట్టితోను చేసిన గుర్రాలమీద, ఏనుగులమీద కూచున్న వీరులు అణ్ణామలై కంటికి మనోహరంగా కనుపించారు. ఆ వూరికి కాపలాగా అయ్యనార్ తన సేనతో సదా సర్వదా సిద్ధంగా వున్నారన్నమాట.

ఆ బొమ్మలలో కొన్ని విరిగిపోయి వున్నాయి; కొన్నింటికి ముక్కు, కాలు, చేయి, ఏదో ఒకటి లేకుండా వున్నాయి. కోవెల వెలుపల ఒక చెట్టుచుట్టు వందల కొలది బిడ్డల మట్టిబొమ్మలూ, నాగుపాము బొమ్మలూ వున్నాయి. తమ బిడ్డలను రోగాలనుండి పాములనుండి కాపాడమని వేడుకుని ఆ గ్రామ ప్రజలు ఆ బొమ్మల నక్కడ ప్రతిష్ఠిస్తారట.

అణ్ణామలై ఒక చెట్టుక్రింద కూర్చుని పెన్సిల్‌తో కోవెల చిత్రాన్ని వేయ సాగాడు. వందలాది ఏండ్లుగా ప్రజల భక్తి విశ్వాసాలకు అది కేంద్రం; ఆ వూరికి శ్రీరామరక్ష; అక్కడి కళా సంపదకు ఆటపట్టు రకరకాల మట్టితో, రాళ్ళతో, దేవతల, వీరుల, పాముల, జంతువుల బొమ్మలు; క్రొత్తగా చేసిన బొమ్మలేవీ కనుపించక పోవడంతో ప్రజలలో వస్తున్న మార్పు అతడి కవగతమైంది.

అణ్ణామలైతోబాటు ఆర్ముగమూ సుందరీ వచ్చారు. ఆర్ముగం ఆశ్చర్యంతో అణ్ణామలై పక్కన కూచుని అతడు వేస్తున్న చిత్రాన్ని చూడసాగారు. సుందరి అక్కడ అయిదు నిముషాలకన్న ఎక్కువ వుండలేకపోయింది. 'ఈ వూరివాళ్ళు

శుద్ధ అనాగరికులల్లే వున్నారు !' అనుకుని అక్కడి బొమ్మలను చూడడానికి భయ పడింది; తాను వెంటనే ఇంటికి వెళ్ళాలని మంకుపట్టు పట్టింది. కాని మొరట అణ్ణామలై కివేమీ వినిపించలేదు.

కాస్సేపయ్యాక ఆమె గోడువిని— "ఈ పిరికి పిల్లను ఇంట్లో వదలి రండి !" అని అర్ముగాన్ని సుందరినీ పంపేసి తన పనిలో లీనమయ్యాడు.

ప్రశాంతమైన ఆ కోవెల, నిశ్చలము నిత్యము అయిన దాని అందము, చూడడానికి భయమనిపించే ఆ రూపాలు, ఆ వాతావరణంలోని భక్తి విశ్వాసాలు - ఈ భావా లన్నిటిని తన చిత్రంలో ప్రతిఫలించేలా చేయాలని అణ్ణామలై తాపత్రయం.

అక్కడ సమయానికి తీరికకు కొదవలేదు. కాలం అక్కడ నిదానంగా పరుగెడుతుండడంవలన హాయిగా, విశ్రాంతిగా, విలాసంగా కాలం వెళ్ళబుచ్చగలిగా డతడు. సుందరి అతడితో కలిసివుండవచ్చును; ఆ బండిని తానే నడిపివుండ వచ్చును; అతడితోబాటు పొలాలూ తోటలూ తిరిగివుండవచ్చును. ఊరి చివరవున్న గుట్టమీద కెళ్ళి కబుర్లాడుకుని వుండవచ్చును. అయితే సుందరి ఇవేమీ చేయలేదు. ఆ వూరిలో ఏదీ తనకు నచ్చలేదంది ఆమె. హాయిగా కారులో ఏ ఉదకమండలానికో తన్ను తీసుకునిపోక ఇట్లాంటి కుగ్రామానికి తీసుకొచ్చాడేనని ఆమెకు అలుక.

అయ్యనార్ కోవెల ఉత్సవాలు మొదలయ్యాయి. ఆ చుట్టుప్రక్కల గ్రామాల వారందరికీ అదే పెద్ద పిరణాలం. ఆ గ్రామంలో దుకాణాల వరుసలు లేవసాగాయి. రంగుల రాట్నాలు వెలిశాయి. బైస్కోప్ చూపించేవారు, మిఠాయిలవాళ్ళు, బెలూన్లవాళ్ళు, బొమ్మలవాళ్ళు - చేరసాగారు.

కొమ్ములు, తప్పెటలు, ఢంకాలు - మొదలయిన వాద్యాలవాళ్ళందరూ చేరారు. గ్రామ జీవితంలో ఉత్సాహము, వేగము కానవొచ్చాయి. అయ్యనార్ కోవెలముందు నిప్పు తొక్కడం చూసి సుందరికి ఆశ్చర్యం కల్గింది. మొక్కు లున్నవాళ్ళు ఎర్రటి నిప్పులమీద, పూల తివాసీమీద నడిచినట్లు నడిచారు. వాళ్ల పాదాల కేమీ కాలేదు !

గ్రామస్త్రీలు నెత్తిమీద చిన్న కుండల నుంచుకుని గొబ్బి నృత్యాలు చేశారు. ఆ కుండలలోని కొబ్బరి యాకులనుండి చెదరే ముత్యాలు, వారి కదలికలు చప్పట్లు, కళ్ళు తిప్పడాలు, పాటలు - అన్నీ అణ్ణామలై నమితంగా ఆకర్షించాయి.

ఇంకొక ప్రక్క కాలికి గజ్జెలు, నడుముకు రంగురంగుల వడ్డాణము, చేతుల్లో రంగుల గుడ్డ ధరించిన మగవారు 'ఒయిలాట్ట' ఆడుతున్నారు. ఇంకా కరగం, కావడి కొయ్యకాళ్ళ గుర్రం, ఇట్లా ఎన్నో ఆటలు పాటలు, తన్ను ఇక్కడికి పంపిన ఆ శరవణన్‌గారికి అణ్ణామలై ధన్యవాదాలు అర్పించుకున్నాడు మనసులో. ఆ ప్రజల ఆనంద నృత్యాలనూ, కళాభినివేశాన్ని చిత్రీకరించాలంటే ఏడాది పొడుగునా అక్కడే వుండాలనిపించింది. అయినా సాధ్యమైనంతవరకు తన పుస్తకం నిండా రేఖా చిత్రాలు గీచి నింపేశాడు.

ఇదంతా చూసిన అణ్ణామలై సుందరి చెవిలో రహస్యంగా— "ఇట్లా నీతో కలిసి ఆడి పాడాలని వుంది నాకు! జీవితం అంటే ఇదీ జీవితం! ఈ ప్రజలు ఆటల పాటలలో ఎంత స్వేచ్ఛగా మునిగిపోతారో చూడు... మనలా, 'కీ' ఇచ్చిన బొమ్మలవలె యాంత్రికంగా వుండరు వీళ్ళు—" అన్నాడు.

సుందరికి కోపం వచ్చింది ఆసలే రోజొక యుగంగా వుందామెకు. మీ రింత అనాగరికులని నాకు మునుపు తెలియకుండా పోయింది!" అంది వెటకారంగా.

"తెలిసి వుంటే ?"

"మిమ్మల్ని పెళ్ళాడివుండే దానిని కాను."

ఇది వినగానే మనసు చురుక్కుమంది అతడికి. ఈ ప్రయాణమే అర్థ రహితం అన్పించింది. ఆ ఉత్సవాలయిన మరురోజే వాళ్ళు అక్కడినుంచి చెన్న పట్నానికి బయలుదేరారు. దారిలో - బస్సులో, రైలులో వాళ్ళు మాటాడుకోలేదు.

చెన్నపట్నం చేరిన వెంటనే శరవణన్‌ను కలవడానికి వెళ్ళిపోయాడు అణ్ణామలై. ఆయనను కలిసి ఇంటికి రాగానే సుందరి అతడికని వుత్తరంతో కాచుకుని వుంది. అతడికి బదులుగా ఆమె సంతకంపెట్టి తీసుకుందిట. సుందరి చూడడానికి భయంకరంగా వుంది.

"ఇదిగో, వకీలు నోటీసు!" అని అతడికిచ్చి "ఛీ! మీరూ ఒక మనిషేనా ?" అంది సుందరి విరక్తితో.

# 29

సుందరినుండి తీసుకున్న వకీలు నోటీసును చదివిన అణ్ణామలైకు ప్రేగులను మెలిపెట్టినట్లయింది. పైపెచ్చు సుందరి మాటల బాణాలతో గాయపరిచింది. అతడు పుచ్చుకోని అప్పు కారణంగా వచ్చిన నోటీసు అది. ఆ అప్పు మొత్తాన్ని వారంలోగా చెల్లించకపోతే అతడిమీద కోర్టు చర్యలు తీసుకుని ఆస్తిని వేలం వేయాల్సి వుంటుందట.

"ఇదేమి విడ్డూరం ? మీరీ ముప్పైవేలను ఎప్పుడు తీసుకున్నారు ? ఎందుకు తీసుకున్నారు ? మరి దీనిని ఒక్క వారంలో ఎలా కడతారు ?" అని అడిగిన సుందరి అతడి జవాబు కోసం ఎదురుచూడక— "రేపే ఈ ఇంటిని నా పేర రాయించండి ఇది మీ నాన్న మళ్ళీ తెచ్చిచ్చిన ఇల్లు. దీనిని అప్పుల్లో ముంచడానికి మీకు హక్కులేదు !'' అని అరిచింది.

అణ్ణామలైకు ఆమె సమీపంలో నిల్చోవడంకూడా కష్టమనిపించింది. ఆమె కన్న ఆ నోటీసు పంపినవాడు మంచివాడేమో అనిపించింది. ఆమెనుండి తప్పించుకుని వేగంగా తన గదిలోకి వెళ్ళబోయాడు.

"సమాధానం చెప్పి మరీ వెళ్ళండి !"

"నేనెవరిదగ్గరా అప్పు పుచ్చుకోలేదు. పుచ్చుకున్నవాడు మాణిక్యం; వెనక్కివ్వబోయేవాడు మాణిక్యం. అతడికి హామీగా నేను సంతకం చేశాను. అంతే విషయం. ఇంక ఈ గోల ఆపు !"

''ఏమన్నారు ! గోలా ? ఎవరిది గోల ? ఉన్న ఇంటినికూడా ముంచేసి నన్ను వీధిలోకి పంపిద్దామనేగా మీ ఉద్దేశం ?''

సహించలేక పోయా డణ్ణామలై. అప్పటి కెలాగో ఆమెనుండి తప్పించుకుని పరుగెత్తాడు మేడమీదకు. మేడగది తలుపులను ధామ్మని అతడు వేయడం, అతడిని వెంబడించిన సుందరికి చెంపపెట్టులా వుంది. అణ్ణామలై సుందరిని చూసికాదు భయపడింది, తన గురించే భయపడ్డాడు.

తన సహనం, ఓరిమి, సంస్కారం, ఆలోచన, అణకువ - వీటన్నిటిని సుందరి తన మాటల ఆయుధాలతో పొడిపొడిగా చేస్తున్నట్లనిపించింది. తనలోని

జంతువును రెచ్చగొట్టి, దానిచే దెబ్బలుతిని ఏడుస్తుందేమోనని భయపడ్డాడు. ఆమె నోటీసునే చించివేయాలనీ, ఆమె మూర్ఛిల్లిపడేలా కొట్టాలని అనిపించింది. ఆ ఆవేశానికి తాను లొంగిపోతానేమోనని పరుగెత్తా డతడు.

ఆవేశాన్ని నిగ్రహించుకుని మామూలుగా కావడాని కతడికి చాలసేపు పట్టింది. బెదరింపులు నిండిన ఆ వకీలు నోటీసును మళ్ళీ ఒకసారి చదివాడు. అప్పు తీసుకున్న మాణిక్యం వడ్డీకూడా సరిగా చెల్లించలేదని తెలిసింది. 'మరి అలాంటప్పుడు కారెట్లా కొనగలిగాడు? ధనవంతుడిగా పై ఆడంబరాలతో ఎట్లా జీవించగల్గుతున్నాడు?'

నోటీసును తీసుకుని, మాణిక్యంతో మాట్లాడుదామని అతడింటికి బయలు దేరాడు అణ్ణామలై. అదృష్టవశాత్తు సుందరి ఎదురవలేదు ఎక్కడా ఆమె గొంతు కూడా వినపడలేదు మీనాక్షమ్మ విచారంగా కూచునివుంది అతడిని చూడగానే పరుగుపరుగున వచ్చింది.

కాని అణ్ణామలై తల్లితో ఏమీ మాట్లాడకుండా గబగబ నడిచి, వెనక తలుపులు తెరచుకుని ఆనంది ఇంటి తోటలోకి ప్రవేశించాడు. ఆ ఇంట్లోకి వెళ్ళక ముందే సుందరి మాణిక్యం తల్లి - వీరి గొంతులు వినిపించసాగాయి.

ఆ ఇంటి వాకిట చిన్న గుంపు గుమికూడివుంది కదిరేశన్ దెబ్బతిన్న వాడిలా దిగాలుగా కూచునివున్నారు. ఆయన అణ్ణామలైవైపు తలెత్తయినా చూడలేక పోయారు. నడిచినదేదీ ఆయనకు తెలియదు. ఆనంది వెక్కివెక్కి ఏడుస్తూంది. ఆనందిని అట్లా ఎప్పుడూ చూడలేదతడు. ఇక సుందరీ, మాణిక్యం తల్లి చెల్లమ్మా కలియబడి కొట్టుకోవడమే తరువాయి.

'జీవితాన్ని అసహ్యంగా చేయకుండానయినా వుండు' అన్న కదిరేశన్ సూక్తి లోపల గోడమీదనుండి, ఇదంతా చూసి నవ్వుతున్నట్లనిపించింది. అతడక్కడకు వచ్చినట్లు గుర్తించనయినాలేదు సుందరి.

చెల్లమ్మతో సుందరి "అమ్మా, తల్లీ! నేను నీతో మాట్లాడడానికి రాలేదు. నువ్వు నోరు మూసుకుని వుండు—'' అని ఆనంది మీద కురికింది. ''ఆనందీ! నువ్విలా నీలి కన్నీళ్ళు కారిస్తే లాభంలేదు. ఈ అప్పును మీఆయన కట్టకపోతే నే నూరోకోను. మా నాన్నతో చెప్పి మీ ఆస్తిమీద 'వారంటు' తెప్పిస్తాను—" అని అరిచింది.

''ఆయన ఇప్పు డూళ్ళోలేరు. రాగానే కట్టమంటాను.'' అని సుందరికీ అణ్ణామలైకూ కలిపి సమాధానం చెప్పింది ఆనంది. మాణిక్యానికి అలాటి నోటీసు వచ్చిందనీ, అతడు వారం రోజుల్లో వెనక్కు రావచ్చుననీ చెప్పిందామె.

'సుందరీ!' అని తన భార్యను గదమాయించి అణ్ణామలై - "ఇదంతా నేను చూసుకుంటానుగాని, నువ్వు మొదట ఇంటికి వెళ్ళు!" అని నెమ్మదిగా ఆమె చేయి పట్టుకున్నాడు. చటుక్కున అతడి చేతిని విదిలించుకుని "ఆహా! మీరు చూసుకున్నట్లే వుందిలెండి! మీ లక్షణం ఎవరికి తెలియదు గనుక! నెలకు వెయ్యి రూపాయలిచ్చిన మామగారిని కాదన్నారు. రేపా ఇల్లుకాస్త పోతే మీకేం దిగులు? అది మీరు సంపాదించిందా? లేకపోతే సంపాదించగల సత్తా మీకుందా? పెద్ద మగవాడిలా మాట్లాడ వచ్చారుగాన్లెండి...! మీరా కాగితంమీద బొమ్మలు అఘోరిస్తుంటారే అట్లాంటి ఆల్లాటప్పా వ్యవహారం కాదిది... పెద్ద ఆర్టిస్టట ఆర్టిస్టు!

ఆనంది సుందరి మాటలను విని గాయపడిన మనసుతో— "పాపిష్టిదానా! మాట్లాడకే, మాట్లాడకు!" అని ఆమె నోటిని మూసింది. సుందరి మొండిగా ఆమెను తోసివేసింది. గోడకు వెళ్ళి కొట్టుకుంది ఆనంది తల పగిలినట్లు నొప్పి కల్గింది ఆనందికి.

వెర్రి కోపంతో అణ్ణామలై తన పిడికిలి ఇనుప పిడికిలిగాచేసి "రా! ఇంటికి!" అంటూ సుందరిని మొరటుగా లాగాడు.

''నేను రాను; నువ్వేమి చేయగలవు?''

సుందరి అన్న ఆ 'నువ్వు' అన్న ఒక్క పదం తుపాకి గుండులా దూసుకు పోయిందతనికి హృదయంలో. ఆమె అతడికంట ఆడది కాదు. దెయ్యం అయ్యింది.

కన్ను, ముక్కు, చెవి అని చూడకుండా ఆమెను బాదసాగాడు. 'భార్య మీద చేయిచేసుకోవడం అనాగరికం' అని నమ్మినవాడతడు. కాని అప్పు డామె భార్యకాదు, శత్రువు.

అట్లా కొడుతున్న అతడి చేయి ఆగడానికి కారణం ఆనంది. అడ్డం నిలిచిన ఆమెకు ఎక్కువ దెబ్బలు తగిలాయి; సుందరికి తగిలినవి తక్కువే.

ఇందుకు సిగ్గుపడి, కుమిలిన అణ్ణామలై సుందరిని అక్కడనుండి బరబర మని లాక్కుపోయి ఇంట్లోకి తోశాడు.

# 30

సుందరి మేడమీద తన గదిలోకి వెళ్ళి లోపల తలుపులు వేసుకుంది. తల విరియబోసుకుని ఆమె నేలమీదపడి ఏడుస్తుండడాన్ని అబ్బామల్లై తలుపు సందు గుండా చూశాడు. ఆమె ఏ అఘాయిత్యమన్నా తలపెడుతుందేమోనన్న భయం పట్టుకుంది అతడిని.

వకీలు నోటీసు అన్నది యుద్ధానికి ఒక కారణం మాత్రమే; అది కాకపోతే ఆమె కింకో కారణం దొరికివుండేది. పుట్టింటినుండి ఆనంది ఆమెను ఇక్కడికి తీసుకొచ్చాకన్నా సుందరి మారి వుంటుందేమో ననుకున్నా డబ్బామల్లై. కాని నిజానికి ఆ తర్వాతనే ఆమెతో దినమొక యుగంగా గడుస్తున్నది. గ్రామాలవైపు వెళ్ళివస్తే ఆమె మారుతుంది అనుకుంటే అందుకు వ్యతిరేకంగా జరిగింది. ఆమె అహంకారం, అసంతృప్తి పెరిగిందేతప్ప తరగలేదు ఆ అసంతృప్తిని వెలిబుచ్చ డానికి ఆ వకీలు నోటీసు అవకాశం ఇచ్చిందంతే! అది కాకపోతే ఇంకొక మిష దొరికి వుండేది... ఇంక సుందరితో కలిసి ఎలా కాపురం చేయడం?

మనోవేదన భరించలేక అతడు మేడమీద ఇటూ అటూ పచార్లు చేస్తున్నాడు. ఆడవాళ్ళనుచూసి అందంగా చిత్రాలు గీయవచ్చునే తప్ప, వారితో జీవించడమంత మూర్ఖత్వం మరొక్కటి లేదు అని తోచింది అతడికి.

అప్పుడే ఆనంది అతడిని వెతుక్కుంటూ అక్కడికి వచ్చింది. తాను తెచ్చిన అట్టపెట్టె నతడి ముందుంచింది ఆమె.

ఆ పెట్టెలో ఆమె గాజులు, గొలుసు, దుద్దులు, ఉంగరాలు వున్నాయి. నిశ్చేష్టు డయ్యాడు. మెడలో మంగళసూత్రం తప్ప మరో నగలేదు ఆమె ఒంటిమీద.

"నాన్నగారినీ రమ్మంటాను. మీరిద్దరూ వెళ్ళి ఈ నగలను అమ్మివేసి ఆ వచ్చిన డబ్బును ముందుగా అప్పులవాడికి కట్టండి. మిగిలిన దానిని ఆయన రాగానే కట్టమంటాను. ఇది కారణంగా ఇంకెన్నడూ మీకూ సుందరికీ మాటలు రాకూడదు. అన్యోన్యత చెడకూడదు.''

"వీలులేదు !" అని నిరాకరించాడు అణ్ణామలై. "నేను దీనిని ముట్టుకోను. వీటిని మీరు తీసుకువెళ్ళి మామూలుగా వేసుకోండి. నేను తర్వాత మాణిక్యంతో మాట్లాడుతాను."

ఆనంది ఎంత నచ్చజెప్పినా వినలేదతడు, ఏడుపు వచ్చినంత పనయింది అణ్ణామలై కు.

"నేను మిమ్మల్ని కొట్టిన పాపానికి మాణిక్యాన్ని క్షమించమని అడగాలి. ఈ పాపం కూడా చేశానంటే ఇంక అతడి మొహం చూడలేను... వద్దు, వీటిని తీసుకుపోండి..."

"మీరుగా నన్ను కొట్టలేదు; నేనుగా మీ చేతి దెబ్బలు తిన్నాను." అని నవ్వుతూ అక్కడినుండి బయలుదేరింది ఆనంది. అంత బాధలోనూ ఆమె నవ్వు అతనికి ఎంతో ఊరట అనిపించింది మనుష్యుల చిన్న చిన్న చర్యలకున్న ఆశక్తే అతడికి వింతగా తోచింది.

కాని ఆ ఊరట అట్టేసేపు నిలవలేదు. సుందరి గది తెరచిన శబ్దం వినగానే అది ఎగిరిపోయింది. సుందరి చేతిలో పెట్టెతో బయటికి వెళ్ళడానికి సిద్ధంగా వుంది. అతడు భయపడినంతా జరగబోతుంది; ఆ విపరీతపు క్షణం రానేవచ్చింది.

ఆమెను చూశాడు. అతడి చేతి దెబ్బలుతిన్న గుర్తేదీ ఆమెమీద లేదుకాని ఆమె కనులు నిప్పు కణికల్లా వున్నాయి అతడు దారి కడ్డంగా నిల్చున్నాడు. ఆమె అట్లాగే భయంకరంగా అతడిని ఉరిమిచూస్తూ నిల్చుంది.

"ఇంక నువ్వు వెళితే ఇక్కడికి వెనక్కు రాకూడదు !" అన్న వాక్యం నాలుక చివరిదాక వచ్చింది. కాని ఆనంది అక్కడికి వచ్చివెళ్ళాక అతడిలో ఏర్పడిన శాంతి అతడి నిగ్రహాన్ని మళ్ళీ కోలుకునేటట్లు చేసింది.

"జరిగినదంతా నేను మరిచిపోతాను." అన్నాడు అణ్ణామలై. "నీకు నేనూ నాకు నువ్వూ మాత్రమే ముఖ్యం. ఇల్లు, వాకిలి, ఆస్తి, డబ్బు ఎలాగయినా పోనీ, మనిద్దరం కలిసి కొత్తగా జీవించుదాం" అన్నాడు.

"ఈ జన్మలో మరిచిపోలేను !"

"నా మాట విను సుందరీ ! మనం ఒకరి నొకరు భరించడం నేర్చుకోవాలి, సుందరీ ! ఇవాళ ఒక్కరోజు నాకోసమని ఓపికపట్టు; ఇక్కడ వుండు. రేపు నేనే తీసుకువెళ్ళి నిన్ను దిగబెడతాను. తర్వాత నేనేవచ్చి పిలుచుకువస్తాను."

"నాకు రాయిపేటకు దారి తెలుసు; మీరు నా వెనకాతల రానక్కర్లేదు !"

సుందరి గబగబ మెట్లుదిగి, క్రింద అడ్డంగా నిల్చున్న అత్తగారిని తోసుకుని వీధిలోకి వేగంగా నడిచింది. మేడమీదనుండే వెళ్ళిపోతున్న ఆమె రూపాన్ని చూశాడు అతడు. కన్నీటితో చూపు మసకయింది.

సుందరి వెళ్ళిపోయింది

అణ్ణామలైకు హఠాత్తుగా పిచ్చిపట్టినట్లయింది. జుత్తుపీక్కుని ఆ మేడమీద నుండి కిందకు దూకేయా లనిపించింది. ఎత్తైన మేడే. ఒక్క క్షణంలో అన్ని సమస్యలూ తీరిపోతాయి.

కాని ఏచోటయితే పడి ముక్కలవుదా మనుకున్నాడో సరిగ్గా ఆచోటే అతడి తల్లి శిలా విగ్రహంలా నిలబడివుంది. అతడిని ఆపడానికనే విధి ఆ రూపంలో వుందక్కడ !

అణ్ణామలై మనసు అంగీకరించలేదు. ప్రేమ, అణకువ, ఓరిమి, సంప్రదాయం ఇవేమీ తెలియనిదయినా, సుందరి తన భార్య. తనతో కలిసి జీవించిన వ్యక్తి; తనకు తన్నుతా నర్పించుకున్నవ్యక్తి; మనసును ఆత్మను ఇవ్వడం ఆమెకు తెలియని మాట నిజమే కాని దేహాన్ని, అంతిప్పగల అనుభూతులను ఇచ్చిందామె.

అలవాటు చొప్పున స్కూటర్ తీసుకుని బస్‌స్టాండుకు వెళ్ళాడు. అక్కడ ఆమెను ప్రతిమాలాడు. కాని ఆమె ససేమిరా వినలేదు. ఎప్పటివలెనే బస్సు ఆమె నెక్కించుకుని వెళ్ళిపోయింది.

వెనక్కు వచ్చాడు అణ్ణామలై. ఇల్లు వల్లకాడులా అనిపించింది అతడికి. సహించలేకపోయాడు. ఆ పగలు, రాత్రి అతడిని చిత్రవధ చేశాయి.

పొద్దుపొడవకముందే ఇంటిముందు కారాగిన శబ్దం వినపడితే, తటాలున పడకనుండి లేచాడు అణ్ణామలై. వచ్చింది అతడి మామగారి కారు. కొత్త నమ్మకంతో కారువద్దకు పరుగెత్తా డతడు.

కారునుండి దిగకుండానే దండపాణి— "సుందరి ఇక్కడికి వచ్చిందా ?" అని అడిగిన ప్రశ్న, ఆ కారు తన హృదయంమీదికి వచ్చినట్లయింది.

"రాలేదే !"

కారులో అలాగే వాలిపోయారాయన. అంతకు క్రిందరాత్రి ఆయన సుందరికి హితబోధ చేశారట. చీటికి మాటికి ఇట్లా కోపంతో పుట్టింటికి రావడం మంచిదికాదని కోప్పడ్డారట. ఆయన కొడుకులూ ఆమె నెగతాళి చేశారట.

''రాత్రి ఆమె అమ్మతోనే పడుకుంది. కాని పొద్దున లేచిచూస్తే లేదు. చిన్నవాడి సైకిలుగూడా లేదు !'' దండపాణి ఏలాగో ఓలాగు ఈ మాత్రం వివరాలు చెప్పగలిగారు. అణ్ణామలై, ఆయనా కలిసి కారులో అనేకచోట్ల తిరిగి వెదికిచూశాడు. కాని ఆమె కనబడలేదు. మైలాపూర్ బీచ్ ప్రక్కగా వెడుతూంటే సముద్రపు ఒడ్డున ఒక గుంపు కనిపించింది. కారు ఆపి అటు పరుగెత్తారు. దారిలో సైకిల్ ఇసుకలో పడివుంది. గుంపు మధ్య ఒడ్డుకు చేర్చిన సుందరి పడివుంది. చనిపోయ్యాకగూడా ఆమె శరీర సౌందర్యం నిప్పు కణికలా వెలుగుతూంది.

చల్లని ఆ శరీరంమీద, వ్రేళ్ళుతెగిన చెట్టువలె కూలి రోదించాడు అణ్ణామలై. కడలి అలలు అతడితో గొంతుకలిపి ఘోషించాయి. దండపాణి తమ నోటిలో గుడ్డను కుక్కుకొని విలపించసాగారు.

కఠోరమైన కార్యసాధనలో అణ్ణామలైను నిమగ్నుడుగాచేసి, అందులోనే అతడు తన్మయతానే మరిచేలా చేయసాగారు శరవణన్. ఆయన పత్రికకు చిత్రాలు అవసరమయ్యాయి. అంచేత అణ్ణామలై తన స్టూడియోలో కూచుని రాత్రింబగళ్ళు చిత్ర రచనలో లీనుడయ్యాడు.

గ్రామంలో అతడు రాసుకొచ్చిన పెన్సిల్ స్కెచ్‌లు బహుళ వర్ణ చిత్రాలుగా రూపొందసాగాయి.

పొద్దుపొడువకమునుపే నాగలిని భుజాన వేసుకుని ఎడ్లను తోలుకుంటూ పొలానికి వెళ్ళే రైతు, ఏతాముమీద నిల్చుని పాటపాడుతూ, తొక్కుతూ పొలానికి నీరు పారించే పాలేరు, పొలమంతట నారు మొక్కల పచ్చదనాన్ని నాటుతున్న ఆడవారు, మేతకు ఆలమందలను తోలుకు వెళ్తున్న కాపరి కుర్రవాడు, ఆవు పొదుగులో పొంగే పాలను పితుకుతున్న పల్లెపడుచు - ఇలాటి చిత్రా లెన్నో తయారవుతున్నాయి.

పాలను పితుకుతున్న అందగత్తె బొమ్మను ముగించాక ఆ చిత్రాన్నొకసారి పరిశీలించాడు అణ్ణామలై. ఆమె కట్టు బొట్టూ అన్నీ పల్లెపడుచువే, కాని ఆ అవయవాలు, ముఖం, చూపు - వాటిలో సుందరి దాగివుంది!

ఒడలు పులకరించింది అతడికి. ఎంతయినా తన రక్తంలో రక్తంగా కరిగిపోయిన వ్యక్తి ఆమె.

'నేనే ఆమెను చంపాను. నావల్లనే ఆమెకి జీవితంమీద రోత పుట్టింది. నేనే కారణం.'

ఇదే ఆలోచన పదేపదే అతడి అంతరంగంలో నిరంతర కెరటమై లేస్తున్నది.

లేచివెళ్ళి మొట్టమొదట ఆమెను 'మాడల్'గా వుంచుకుని గీచిన బొమ్మను తీసుకొచ్చాడు. ఆ చిత్రాన్ని రొమ్ముకు హత్తుకుని – 'ఆమె స్త్రీ జీవితపు మాధుర్యాన్ని నాకు చవిచూపిన మనిషి; నా జీవితాన్ని పంచుకున్న అర్ధాంగిని—'

కదిరేశన్ రావడం అతడు చూడలేదు. ఆయన చేయి గట్టిగా అతడి భుజం మీద పడగానే ఉలిక్కిపడ్డాడు. కదిరేశన్ అతణ్ణి కుదుపుతూ— "ఏమిటిది ?" అని అడిగారు.

"ఆమెను... సుందరిని... నేనే... నేనే..." ఆ పైన మాట్లాడలేక పోయాడు అణ్ణామలై.

"ఇదిగో చూడండి, మీ రిట్లా మాట్లాడేటట్లయితే నేనింక ఇక్కడికి రాను!" అని ప్రేమతో కోప్పడ్డారు కదిరేశన్. ఆదరణతో అతడితో మాట్లాడి దుఃఖం ఉపశమింపచేశారు. ఆమె మరణానికి అత దేమాత్రం కారణం కాదని నచ్చచెప్పారు.

"ఇదిగో చూడండి, మారుతున్న కొత్తతరపు పతనానికి చిహ్నం సుందరి. ఆమె తప్పేమీలేదు. ఆమె పుట్టుక, పెంపకం, చదువు, 'ధనమే దైవం' అని నమ్మే సంఘ ప్రభావం – ఇవి ఆమె అంతానికి కారణాలు. నా ఇంట్లోనే నేనీ బాధల నిప్పుడు చూస్తున్నాను. జీవితం యొక్క నిజమైన అర్థాన్ని కుటుంబంలోని పెద్దలే అన్వేషించనప్పుడు అది పిల్లలకు ఎట్లా లభిస్తుంది? పంచేంద్రియాల అనుభవాలను బురదలోకి లాగకుండా వుండడం తెలిస్తే జీవితం ఎంత ఆనందంగా, సుఖంగా వుండగలదు? కన్నులతో ఎవరి నెలా చూడాలో, చెవులతో దేనిని ఎప్పుడు వినాలో, శరీరాన్ని ఎలా సాధనకు, అనుభవానికి వినియోగించాలో, మనసు నెట్లా మానవత్వానికి నిలయంగా మార్చాలో – ఇప్పుడు ఎవరూ నేర్పకోవడంలేదు. కాని మనుష్య జన్మకు సార్థకత్వం ఇచ్చేది ఇదే! ఇది పిల్లలకు ఇంటిలో లభించడంలేదు; బడిలో లభించడంలేదు; సమాజ జీవితంలో లభించడం లేదు.

ఆవేశంతో మాట్లాడసాగా రాయన. తమ ఇంట్లోనే రోజూ – హఠాత్ ఐశ్వర్యం వేసే వెర్రివేషాలను చూస్తున్నారాయన.

"నేను ఆమెను కొట్టకుండా వుంటే..." అని మళ్ళీ అన్నాడు అణ్ణామలై మధ్యలో.

"మీ రామె నెక్కడ కొట్టారు ? అనందిని కదా కొట్టారు !" అని నవ్వారు. "నేను జరిగినదంతా చూస్తున్నానుకదా ! సుందరి హద్దు పద్దూ లేకుండా పేలిన అవాక్కులు విన్నాక మీరు ఆత్మహత్య చేసుకోకుండా వున్నదే నాకు ఆశ్చర్యంగా వుంది !"

అణ్ణామలై గలగల నవ్వాడు. అతడి మనోభారం తగ్గుతుండడం చూసి ఆయన సంతృప్తి చెందారు. ఆయన కనుగొని పెంచుతున్న కళాకారు డితడు. శరవణన్ కూడా ఆయనతో తరుచు వెళ్ళి అతడిని కలుస్తుండమని కోరారు. కదిరేశన్‌కుకూడా అణ్ణామలైతోబాటు కాలం గడపడం ఆనందంగా వుంది.

"సరే, నేను వస్తాను." అని లేచారు కదిరేశన్. "బ్రతికివుండగా ఆ అమ్మాయి మిమ్మల్ని పెట్టిన చిత్రహింస చాలు; చనిపోయాకకూడా ఆమె మిమ్మల్ని వేధించడానికి అవకాశం ఇవ్వకండి.

కదిరేశన్ వెళ్ళిపోయారు. మళ్ళీ చిత్ర రచనలో నిమగ్నుడయ్యా డణ్ణామలై. పని కష్టమైన దైనప్పటికీ, అలా ఒకేచోట కూచుని గీస్తుండడంవల్ల నడుము విరుగుతున్నప్పటికీ - అది అతడి ప్రాణానికి ప్రాణంలాటి శ్రమ: ఉత్సాహం ఇచ్చే శ్రమ; ఒకే చిత్రపు ప్రతులకు అదే రంగులు పదే పదే పూసే యాంత్రికతలేని శ్రమ; ఒక్కొక్కటి ఒక్కొక్క కొత్తపని; ఒక్కొక్క కొత్త సృష్టి !

# 2

మాణిక్యం తన పని గదిలో వున్నాడు; ఏదో ఆలోచిస్తూ, చిదరగా వున్న తన మొహాన్ని చేతులతో రుద్దుకున్నాడు. ఎంత ఉద్వేగంతో వున్నా సరే అట్లా మొహాన్ని రుద్దుకోగానే, అది ప్రశాంతంగా కనపడుతుంది. అప్పు డెంతటి సాముద్రిక శాస్త్రజ్ఞుడయినాసరే, అతని మనోభావాలను కనుక్కోలేడు.

అప్పు డతనివద్ద రొక్కంగా యాభై వేలున్నాయి. దానితో కదిరేశన్‌ద్వారా ఇంటిమీద తీసుకున్న అప్పును తీర్చాలని అతడి వుద్దేశం. అప్పిచ్చినవాడూ తొందర

పెడుతున్నాడు. ముప్పైవేలు అసలు, పదివేలు వడ్డీ కలిసి నలభై వేలదాక దేకింది.

'మేస్త్రీవల్ల ఏర్పడిన నష్టానికి నేను కట్టి ఏడవాలిసి వస్తూంది!' అని వాపోయాడతడు. వడ్డీ కడదామన్నా చేతకావడంలేదు. ఇల్లు చేజారి పోయే టట్లుంది. 'పోతేపోనీ! ఇల్లు మామగారిదే కదా? అప్పు ఆయనదే కదా?'

ఆయన అప్పు ఎవరికోసం చేశారన్నది మరిచిపోయాడతడు. అయినా ఇంటిని కోల్పోవ నిచ్చగించలేదు. రేపు ఆ ఇల్లు అతనికే చెందవలసినదికదా! లక్ష పెట్టినా అలాటిల్లు దొరకదు. 'కనుక ఎలాగయినా నలభై వేలనూ ధారపోయక తప్పదల్లే వుంది.

ఉన్నట్లుండి ఒక భయం పట్టుకుంది. ఆ భయానికి కారణం వుంది. కనీసం అతడలా అనుకున్నాడు.

"అప్పు నేనింకా తీర్చకముందే, అందు నిమిత్తం వాళ్లు నా దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి వుండగానే ఇట్లా జరుగుతూంది! అబ్బా, కూతురూ నేనొకడిని వున్నానని మరిచిపోయి తమకు కావలసిన వారిని పిలవడం, ఆదరించడం చేస్తు న్నారు. అణ్ణామలై ఒక గారాబుబిడ్డ అయిపోయాడు. ఆనందికి అతడంటే గర్వం! ఇంక ఈ ఇంటిని విడిపించివేస్తే? ఒకరోజు అణ్ణామలై వచ్చి— "నువ్వీ ఇంట్లోకి రాకూడదు—" అని తన్నే ఆజ్ఞాపిస్తే? అట్లా ఆజ్ఞాపించే రోజు వస్తుందనిపించింది మాణిక్యానికి.

కనుక ఆ ఇంటిని తనదిగా చేసుకోవడానికిదే అవకాశం అన్పించింది. ఇల్లు కదిరేశన్‌కు చెందితే ఆయన తర్వాత చట్టరీత్యా ఆనందిదవుతుంది. 'ఆమెకు గనుక ఇల్లు చెందితే ఇంక పట్టపగ్గాలుండవు. ఇప్పుడే పట్టలేతే కొట్టినంతపని చేసిన మనిషి ఆమె. చిటారుకొమ్మ నెక్కి కూచుని తన్ను దూరంగా ఉంచుతూంది. విద్యా గర్వానికి ధనగర్వం తోడయితే ఇహ చెప్పాలా?..."

వెంటనే కదిరేశన్ కోసం వెళ్ళాడు మాణిక్యం. మునుపయితే డబ్బు విషయాలన్నీ ఆనంది ద్వారానే కదిరేశన్‌కు అందించేవాడు. ఇప్పుడామెను నమ్మడంలేదు. తానే వెళ్ళి ఆయనతో మాట్లాడుతున్నాడు.

కాసేపు ఆయనతో అవీఇవీ మాట్లాడాక ''మనింటిమీది అప్పు తీర్చివేద్దామని అనుకుంటున్నాను. మీకు ఒక దిగులు తీరుతుంది." అంటూ అసలు విషయానికి వచ్చాడు.

కదిరేశన్ నొసలు ముడివడింది. ఒక్క క్షణం ఆలోచించాక ''మీరేదో చేబదులు తీసుకున్నారట... అదే, మీకూ అణ్ణామలైకూ వచ్చిన వకీలు నోటీసు గురించే చెబుతున్నాను. మొదట అది తీర్చండి. ఆ అప్పువలన ఆయన జీవితంలో భయంకర విషాద సంఘటన జరిగింది." అన్నారు

"ఇదిగో, దీని తర్వాత దానిని ఊడిపారేస్తాను. అదెక్కడకు పోతుంది లెండి? అప్పిచ్చినవాడు బాగా దగ్గరివాడు. ఊరికే అలా బెదిరి చాడంతే ఇంకేమీ లేదు.'' అని నవ్వాడు మాణిక్యం సుందరి చావు నతడు లెక్కచెయ్యనేలేదు.

''సరే, మీ ఇష్ట ప్రకారం చేయండి ''

"ఈ అప్పు చెల్లించితే భవిష్యత్‌లో మన వ్యాపారానికి అనుకూలంగా వుంటుంది. అందుకు మీ సలహా కావాలి " అంటూ తన ఒక సలహా ఇచ్చాడు. ''అప్పును మీరు కడుతున్నట్లుగా కాక నేనే కడుతున్నట్లు కట్టి, ఇంటిని నా పేరిట 'మే ట్రోవర్' చేయించుకుంటే మన వ్యాపారానికి అనుకూలంగా వుంటుంది. రేపు పెద్ద ఎత్తున వ్యాపారం చేయాలంటే నాకు పెట్టుబడికి పెద్ద మొత్తాలు కావలసి వుంటాయి. ప్రతిసారీ మిమ్మల్ని శ్రమపెట్టకుండా నేనే అప్పు తీసుకుని నడుపుకుంటూ రాగలను ''

ఏమి జవాబు చెప్పాలో తెలియక కదిరేశన్ కొంత తటపటాయించారు. అత డింటిని తన స్వాధీనంలోకి తెచ్చుకోదలచాడన్న అనుమానం ఆయనకు కలగ లేదు. ఆ ఇంటిని అర్ధంగా పెట్టి అప్పుతెచ్చి వ్యాపారం చేస్తాననడమే ఆయనకు నచ్చలేదు.

''ఇల్లు అన్నది మనం ప్రశాంతంగా జీవించే చోటుగా వుండాలే తప్ప, దాని నొక సొత్తుగా భావించడమే బాగలేదు. ఇకమీదయినా వ్యాపారంలోకి ఇంటిని ఇరికించి గందరగోళం చేయకుండా వుంటే బాగుండునేమో... వ్యాపారంలోని దుఃఖాలు మరవడానికే కదా మనకు ఇల్లంటూ కావాలి. బాగా ఆలోచించండి.'' అన్నారు కదిరేశన్.

''కాగితాలమీద బొమ్మలుగీచే వ్యాపారం కాదు నాది!'' అని కోపంగా అన్నాడు మాణిక్యం! ''లక్షలను రాళ్ళలోనూ మట్టిలోనూ కుమ్మరించి, ఎండనక వాననక శ్రమించి పెట్టిన డబ్బు కాక లాభాలూ సంపాదించాలి! అకస్మాత్తుగా పెద్ద మొత్తాలు కావల్సి వుంటుంటాయి అప్పు డెక్కడికి పోవడం?''

''మీ కిలా కోపం ఎందుకు వస్తుంది?'' అని నిదానంగా అడిగారు కదిరేశన్. మామూలుగా మాట్లాడుతుండగానే అతడలా అగ్గిగుగ్గిలమయిపోవడం ఆయనకు అర్థం కాని విషయం.

''మరేమిటయితే? మీకు మీ ఇల్లే ముఖ్యం. అది నా పేరిట వుండడం మీకు నచ్చదు మీకు నా మీద నమ్మకంలేదు అని నా మొహంమీదే అనేస్తే సరిపోతుంది కదా! మనలో మనకే దాగుడుమూత లెందుకు? పారంపర్యంగా ఐశ్వర్యవంతులు మీరు; నేను పేదరికంలో పుట్టినవాడిని. అమ్మా కొడుకులయినా ఆస్తి విషయంలో జాగ్రత్తగా వుండాలని మీ మనసులో వుంచుకుని మాట్లాడుతున్నారు.''

వెలవెలపోయారు కదిరేశన్. మనుషు లిట్లాకూడా అనుకుంటారని ఆయన ఎరగరు. కారులో తిరిగే దశకు వచ్చినా అతడు తాను బీదవాడినన్న తలపు ఐరువుతో కుంగడం ఆయనకు ఆశ్చర్యం కల్గించింది.

తటాలున కోపంతో లేచి అక్కడనుండి తన గదిలోకి వెళ్ళిపోయాడు మాణిక్యం. అంతకు ముందెన్నడూ అత డాయన ఎదుట అట్లా ప్రవర్తించి ఎరగడు.

చాల బాధపడ్డారు కదిరేశన్. ఉన్నది ఒక్క కూతురు. ఆమె జీవితాన్ని మాణిక్యం నందనవనం చేయగలడు; నరకంగానూ చేయగలడు. అత డామె బ్రతుకును నరకంగా మార్చడానికి ఆ ఇల్లు ఒక కారణం కాకూడదు.

కదిరేశన్ అతడి గదికి వెళ్ళారు ఆలోగా అతను నలభై వేల రూపాయలకు ఒక 'చెక్' రాసి ఆయనవైపు జాపాడు.

''వెళ్ళి కట్టేయండి. నావల్ల మీరు అప్పుల పాలయ్యామని అనుకోనక్కర్లేదు. నా చేతిలో వ్యాపారం వుంది. నా విషయాలు నేను చూసుకోగలను.''

అతడి కోపం తగ్గించి, అతడిని ఒప్పించేసరికి కదిరేశన్ తలప్రాణం తోకకు వచ్చింది. ఆయనను తన్ను బతిమిలాడే దశకు తీసుకొచ్చాడు మాణిక్యం. చివరకు

ఆయన పోరు భరించలేక ఆయనపట్ల కనికారంకొద్దీ ఆయన బలవంతం కారణంగా ఆ ఇంటిని తనపేర రాయించడానికి అంగీకరించారు!

అరగంటయ్యాక మాణిక్యం కారు బయలుదేరింది. కదిరేశన్ ఆనందికి అన్నీ వివరించారు. ఆమె ఇల్లు మాణిక్యం పేరిట వుందన్న లెక్కచేయలేదు. అతడా ఇంటి నెక్కడికి పెకలించుకు పోలేడుకదా... తండ్రి పేరవున్నా, అతడి పేరవున్నా ఒక్కటే! ఈ లావాదేవీలు సరిగ్గా బొత్తిగా ఎరగని వారికి కూతురిగా పుట్టిపెరిగిందాయె!

అయితే ఆనంది ఒకందుకు బాధపడింది: "మొదట ఆ చేబదులు మొత్తం కట్టేయమని మీ రాయనకు సచ్చచెప్పి వుండాలి. నాకు తెలిసివుంటే నేనా మాట ఖచ్చితంగా చెప్పేదానిని." అంది.

"నేను చెప్పానమ్మా! ఈసారి కడతానన్నారు."

"కాదు, మొదట దీనినే కట్టివుండాలి మొదట ఈ మొత్తాన్ని అప్పుగా తీసుకున్నప్పుడే మేస్త్రీగా రవమానంతో ప్రాణాలు వదిలారు. తర్వాత కల్గిన బాధ కారణంగా అణ్ణామలై సుందరిని కోల్పోవలసి వచ్చింది. తండ్రినీ, భార్యనూ కోల్పోయినవారి ఆవేదన గురించి ఆలోచించేటట్లుగా ఆయనకు చెప్పివుండాల్సింది. అంతరాత్మకే ఎగ్గు తలపెడితే రేపు మన కుటుంబానికి కీడు మూడుతుంది. ఇప్పుడే ఇది కుటుంబంలాగున లేదు...... ఆయన్ను రానివ్వండి; నేనే అడుగుతాను!"

"వద్దు ఆనందీ! వద్దు. ఇప్పుడు నువ్వాయన నేమీ అడగవద్దు" అని ఆమె చేతులు పట్టుకున్నారాయన. ఆయన నయనాలు అశ్రుపూరితా లయ్యాయి. కోపం వస్తే మాణిక్యం ఎట్లా మారుతాడో ఊహించితేనే ఆయనకు భయం కలగ సాగింది.

## 3

అణ్ణామలైకు మద్రాసు వదలి ఎక్కడికయినా వెళ్ళిపోవాలి అనిపించింది. మనసులో శాంతి లేదు. ఒక్కచోటయినా ఆగకుండా బైరాగిలా తిరిగి తిరిగి

రావాలని తపించింది అతడి మనసు. అందుకు కారణ మేమిటో తెలియలే దతడికి.

సుందరి తన జీవితానికి కోరి తెచ్చుకున్న ముగింపు అతడికి తెలియ కుండానే అతడి శాంతిని భగ్నం చేయజూచింది. ఇంకోవైపు ఆనంది ఇంట్లో పరిణామాలు అతడి చెవినిపడి వినలేని వేదనను కలిగించాయి. ఆనంది తమ ఇంటి విషయాల నెంత గుట్టుగా వుంచినా అవి ఎలాగో బయటికి పొక్కుతున్నాయి. వేలయ్య పెళ్ళాం ఒకరోజు మీనాక్షమ్మతో అన్నీ చెప్పి ఏడ్చింది— ''ఆఖరికి ఆనందమ్మ బ్రతుకిట్లా అవుతుందని మేమనుకోలేదమ్మా—!'' అని బాధపడింది. ఈ విషరా లన్నీ మీనాక్షమ్మ కొడుకుతో చెప్పింది.

ఆ తర్వాత ఆనంది మాణిక్యాల మధ్య జరిగిన ఒక పోట్లాట అణ్ణామలై చెవినిపడి అతణ్ణి కలవరపరచింది తన ఇంటి మేడమీద మాణిక్యం అరిచిన అరు పులు, చేసిన ఆర్భాటాలు స్టుడియోలోవున్న అణ్ణామలైకు వినపడ్డాయి. అణ్ణామలై సంతకంతో తీసుకున్న అప్పును మొదట కట్టివేయమని మాణిక్యాన్ని శతవిధాల వేడుతున్నది ఆనంది. అందుకని ఆమె నత దాడిన దుర్భాషలు అణ్ణామలైను చకితుడిని చేశాయి. ఆనంది ఏడుపు శబ్దం అణ్ణామలై స్టుడియోలోకి ప్రవేశించింది. పరుగెత్తుకు వెళ్ళి ఇద్దరికి సర్దిచెబుదామా అనిపించింది. కాని తనపేరూ వాళ్ళ వాగ్యుద్ధంలో వినపడినందున అట్లా చేయలేకపోయాడు.

ఇట్లా బహువిధాలైన బాధ లతడిని వేధించగానే కొన్ని రోజులు పాటయినా నగరం విడిచి ఎటయినా వెళ్లామనిపించింది. ఏదయినా ప్రకృతి చిత్రాలను రచించే నిమిత్తం తాను బయటికి వెళ్తున్నానని చెబితే శరవణన్ అంగీకరించారు. అక్క డక్కడ ఊళ్ళల్లో అతడికి కావలసిన సాయం చేయమని తమ స్నేహితులందరికీ రాస్తామన్నారాయన. సంక్రాంతి పండగకు తమ గ్రామంలో వుండి ''మంచివిరట్టు'' వేడుకను చూసి, ఆ తర్వాత చుట్టు ప్రక్కల గ్రామాలకు వెళ్ళమని సలహా ఇచ్చారు.

"ప్రయాణం నిశ్చయమవగానే, శారదతో మాట్లాడాలి అనుకున్నాడు అణ్ణామలై. ఆమే వచ్చింది. తాను ఉపాధ్యాయినిగా పనిచేస్తున్న బడినుండి ఇంటికి వెళ్తూ అటు వచ్చింది. ఆమెను కుతూహలంతో పలకరించి, తన ప్రయాణం గురించి చెప్పాడు.

"సంక్రాంతి సెలవులకు నాతోబాటు శరవణన్‌గారి గ్రామానికి 'మంజీవిరట్టు' వేడుక చూడడానికి వస్తానన్నారు కదా! మరిప్పుడు నాతోబాటు బయలు దేరుతారా ?"

ఆశ్చర్యంతో అతడిని ఎగాదిగా చూసింది. నిజంగానే అతడు తన్ను పిలుస్తున్నాడా అన్న సందేహం వచ్చిందామెకు.

''ఏం, వస్తారా ?'' అని మళ్ళీ అడిగాడు అణ్ణామలై.

''పసిబిడ్డల్లో పసిబిడ్డ మీరు !'' అని నిట్టూర్చింది శారద. ''మీరూ నేనూ కలిసి ఊర్లు తిరగడానికి బయలుదేరితే మీ అమ్మ ఏమంటారు? మీ ఇంట్లో నన్నే మంటారు? ఆ వూరిలో మనం ఎవరింటికి వెళ్తామో వాళ్ళేమనుకుంటారు? అందులోనూ సుందరితో కలిసి మీరు వెళ్ళిన వూరికి మీతోబాటు నన్ను తీసుకు పోతే...... ?''

అణ్ణామలైకు బయటలోకం అంటూ ఒకటి వుందని అప్పుడే తెలియసాగింది. తనచుట్టూ సమాజం అంటూ ఒకటి వుందని గుర్తుకు రాసాగింది.

శారద వేసిన ప్రశ్నం గురించి ఆలోచించాడు. ''అవును... మీరు చెప్పేది నిజమే !'' అన్నాడు నిరాశతో.

''ఏది నిజం ?'' అని ప్రశ్నవేసి విచారంగా నవ్వింది శారద : ''నిజం ఏదో మీ రెప్పుడూ తెలుసుకోరు. అంచేతనే మిమ్మల్ని వెతుక్కుంటూ వున్న నిజాన్ని కాలదోసి, నిజంవలె అనిపించిన మరేదో ఒకదాని వెనకాలపోయి యాతన చెందారు. ఇప్పుడూ అదే అయోమయం మీకు !''

శారద మాటలు అసందిని జ్ఞాపకం చేయడంతో అతడి హృదయాన్ని మెలి పెట్టినట్లయింది తన వేదనను పైకి కనబడనివ్వకుండా వుండడానికి అత డెంతో శ్రమపడ్డాడు. అయినా కళ్ళు తడి అయ్యాయి; గొంతు గద్గదమైంది.

"జరిగిన దానిని గుర్తుచేసి నన్ను బాధపెట్టకండి. నేను ఆ స్మృతుల సంక భరించలేను. అందుకనే ఎక్కడకైనా వెళ్ళిపోవాలని, ఏవైనా చిత్రాలను వేస్తూ నన్ను నేను మరిచిపోవాలని యత్నిస్తున్నాను—''

శారదకు, ఎందుచేతనో, అతడిమీద జాలి ఏర్పడలేదు.

''ఇంత బాధను లోపల వుంచుకుని నన్నిప్పుడు ఇంకో వూరికి రమ్మంటున్నా రెందుకు ?''

''ఆ బాధ మరవడానికే—'' అన్నాడు అణ్ణామలై : ''ఒక భయంకర స్వప్నంనుండి మేలొ్కనగానే ఇంకొక దుస్వప్నం నన్ను చుట్టుముట్టింది. సుందరి వున్నంతకాలం ఆమెతో జీవించడమే ఒక పోరాటంగా వుండేది అప్పుడెల్లా ఆనంది జీవితం ఆనందమయంగా వుండేదనే నమ్మేవాడిని. కాని ఇప్పుడు నిజం తెలిసింది. ఆ బాధను నేను భరించలే . వాళ్ళకోసం నేను చింతించడం తప్పే; అది వారి స్వంత విషయం కాని ఎంచేతనో అలా వుండలేక పోతున్నాను; పైపెచ్చు ఆ ఇల్లు ఇంకెక్కడోకాదు, పక్కనే వుంది...''

మాట్లాడుతూ అణ్ణామలై తటాలున లేచి ఆమెను సమీపించాడు. శారద చేతులను గట్టిగా పట్టుకున్నాడు అతడు నిలువెల్లా కంపించసాగాడు. దిగ్భ్రమ చెందింది శారద. అయినా తన చేతులను విడిపించుకోలేదు.

''శారదా ! ఇకమీద నేను నాతో ఒంటరిగా జీవించలేను; నా కొక తోడుం డాలి.... మీరు నన్ను పెళ్ళిచేసుకుంటే నాకు మేలుచేసినవా రవుతారు. కావాలంటే పెళ్ళి వాయిదా వేద్దాం కాని మీరు మాటఇస్తే చాలు."

శారద హృదయం సానుభూతితో నిండింది. నెమ్మదిగా తన చేతులను విడిపించుకుంది. అతడి కన్నీటి మొహాన్ని చూసింది.

''చూడండి, మీ రిట్లా పిరికి తనంతో మాట్లాడకండి. మళ్ళీ మీరు పాతబాటనే పయనించ జూస్తున్నారు మీ వేదననుండి బయట పడాలని నన్నిట్లా కోరుతున్నారు. ఇదికూడా నిజమని నాకు అనిపించడంలేదు. మొదట మీరు ఊరికి వెళ్ళిరండి. తర్వాత మనం మాట్లాడుదాం."

''శారదా !''

"వద్దు. నేను మీతో ఎప్పటికైతె చనువుతో మెలగాలని వుంటే మళ్ళీ ఈ ఊసెత్తకండి. ఇందుకు నాకు విచారమూ లేదు; కోపమూ లేదు. మీరు ఊరికి వెళ్ళి క్షేమంగా రండి !''

''అయితే మీరు నాతో రారా ?''

''ఇట్లా ఇంకొకసారి అడిగారంటే నేను ఇక్కడే ఏడ్చేస్తాను !''

నిజానికి ఆమె కళ్ళు తుడుచుకునే అక్కడినుండి కదిలింది.

# 4

అణ్ణామలై ఏ రోజు రాత్రి రైలులో బయలుదేరవలసివుందో ఆ రోజు వుదయం అతడికి కోర్టునుండి 'సమన్' వచ్చింది. దానిని తీసుకుని చదివిచూశా డతడు. అతడినీ, మాణిక్యాన్నీ ప్రతివాదులుగా పేర్కొంటూ అప్పిచ్చినవాడు కేసుపెట్టాడు. ఫలానా తేదీనాడు కోర్టులో హాజరవవలసిందిగా అందులో ఆదేశం వుంది.

ఏం చేయాలో తోచలేదు అణ్ణామలైకు. మాణిక్యం అతనితో చెప్పిందొకటి, ఇప్పుడు జరిగిందొకటి. సరిగ్గా ఆ కోర్టులో హాజరవాల్సిననా డతడు బయటి వూళ్ళో వుండాలి. కోర్టు వ్యవహారా లతడికేమీ తెలియవు కనుక అతడి కా 'సమన్' చూడగానే ముచ్చెమటలు పోశాయి. మాణిక్యం కోసమని ఒక సంతకం చేసిన పాపానికి, ఇప్పుడు నలభై వేల రూపాయలకుపైగా వెంటనే కట్టమని బెదరింపా!

'చేతిలో డబ్బుంటే కట్టివేయవచ్చు; నాలుగు వందలయినా లేదే!' అని బాధ పడ్డాడు అణ్ణామలై. తర్వాత ఆ కాగితాలను తీసుకుని పక్కింటికి నడిచాడు మాణిక్యం ఇంకా ఇంటికి రాలేదు. అణ్ణామలై నుండి ఆ కాగితాలను తీసుకుని చూసిన కదిరేశన్ అలాగే రాయిలా అయిపోయారు

ఆనందికూడా తీసుకుని చదివింది. ఏమీ మాట్లాడలేక పోయింది ఆమె. ఏమి మాట్లాడాలో, ఏమి చేయాలో తెలియలేదు. కాస్సేపు ముందు మాణిక్యం కోసం వచ్చి వెళ్ళిన వ్యక్తి కోర్టునుండి వచ్చినవాడేనని ఇప్పుడు రూఢి అయింది మాణిక్యానికీ ఇలాటిదే కాగితం వచ్చివుండాలి.

కాస్సేపటికి కారు దిగి లోపలికి వచ్చిన మాణిక్యం, అణ్ణామలైకు దగ్గరగా ఆనంది నిల్చునుండడం చూసి, ముఖం ముడుచుకున్నాడు. తాను లేనప్పుడు అతడు తరుచు తన ఇంటికి వచ్చి వెళ్తుంటాడని మాణిక్యానికి ఎప్పుడూ అనుమానమే ఇందు గురించి తన మామగారూ ఏమీ మాట్లాడకుండా వుండడం బాగులేదు.

"ఏమిటి విషయం? ఏదయినా కళా సమావేశాలకు పథకాలు వేస్తున్నా రేమిటి?'' అంటూ ఎత్తిపొడుపుతో అడిగాడు. అతడి గొంతులోని హేళన చురుక్కుమని కదిరేశన్ మనసున ముల్లై నాటింది.

ఆనంది ఏమీ మాట్లాడకుండా, తన దగ్గరున్న ఆ కాగితాల నతడి కిచ్చింది. మాణిక్యం దానిని చదివి, కలిగిన కంగారును దాచుకుని అలక్ష్యంగా నవ్వాడు.

"తాటాకు చప్పుళ్ళు చేస్తున్నాడు పాపం, చేసుకోనీ, చేసుకోనీ!... ఇది బెదిరే కుందేలుకాదు. నే నిదివరకే చెల్లించిన డబ్బునుకూడా జమలోకి తీసుకోకుండా దొంగ నాటకం ఆడుతున్నాడు. వీణ్ణి అంత తేలిగ్గా వదలకూడదు. వీడి అంతం చూడాల్సిందే..."

"నేను ఇవాళ ఊరికి వెళ్ళదలిచాను... వెనక్కి రావడానికి ఓ నెల పట్టచ్చు..." అంటూ మొదలు పెట్టాడు అణ్ణామలై.

"నిశ్చింతగా వెళ్ళిరా! నువ్వు కోర్టుకు రానక్కర్లేదు. అంతా నేను చూసుకుంటాను. సాయంకాలం నా వకీలును నీ దగ్గరకు పంపుతాను. 'వకాలత్' మీద, 'కౌంటర్' మీద సంతకంచేసి ఊరికి వెళ్ళు. వకీలు ఫీజు, కోర్టుఫీజు - అన్నీ నేనే చూసుకుంటాను. నువ్వేమీ ఇవ్వనక్కర్లేదు."

అతడి ఔదార్యం అణ్ణామలైకు ఆశ్చర్యం కల్గించింది. ఆనంది మాత్రం ఈ ధోరణి సహించలేకపోయింది.

"మీ కాయన సాయం చేసినందుకు ఆయననే ఖర్చుపెట్టమనేటట్లున్నారే! బాగుంది మీ న్యాయం!" అంది ఆమె.

మాణిక్యానికి బాగా కోపం వచ్చింది. ఆమెను కాల్చివేసేలా చూసి, 'నోరు మూసుకుని లోపలికి పో!' అన్నట్లు చూశాడు. కాని ఆమె అలా వెళ్ళనందున ఇంకా ఆగ్రహం ఎక్కువయింది. దానిని అణ్ణామలైను కించపరచడంద్వారా వెళ్ళగక్కాడు.

"చట్టరీత్యా చూస్తే అతడు వేరే వకీలును పెట్టుకుని కేసును నడుపుకోవాలి. కాని పాపం, డబ్బుకు ఎక్కడికి పోగలడు? బొమ్మలుగీచి సంపాదించే డబ్బుతో పొట్టపోసుకోవడమే కష్టంగా వుందికదా అని నేనీ పద్ధతిని సూచించాను. నేను ఒప్పుకోకపోతే తానే వకీలు నుంచుకోవాలి! కోర్టుచుట్టూ తిరిగి అవస్థ పడాలి!" అన్నాడు.

అణ్ణామలై తల అవమానంతో కుంగిపోయింది. ఏమీ మాట్లాడకుండా లేచి తన ఇంటికి వెళ్ళిపోయాడు.

మాణిక్యం డబ్బుకు ఇబ్బంది పడుతున్న రోజుల్లో తా నతడికి ఎన్నిసార్లు డబ్బిచ్చి ఆదుకున్నాడు. తన చొక్కాలూ పంచెలూ మాణిక్యం అడిగి తీసుకునేవాడు. కాని అందుకుగాను తా నతడి గురించి ఎన్నడూ తక్కువగా భావించలేదు; కించ పరిచి మాట్లాడలేదు. కాని ఇప్పుడతడు కదిరేశన్ ఆనందిల సమక్షంలో అలా అవమానకరంగా మాట్లాడాడు. చేసిన సాయానికి ఎట్టి కృతజ్ఞత!

ఆనంది కూడా అక్కడ నిలవలేకపోయింది. పొంగివస్తున్న దుఃఖాన్ని అణచుకోలేక తన గదిలోకి వెళ్ళిపోయింది.

## 5

అరయన్‌కుళం గ్రామం ప్రక్కనే మూలన్‌పారై అన్న గుట్టలున్న ప్రాంతం వుంది. ఆ ప్రాంతమంతా చుట్టుపక్కల గ్రామాలనుంచి వచ్చినవారితో క్రిక్కిరిసి వుంది. అరయన్‌కుళం గ్రామంవారు జరిపే 'మంజి విరట్టు' వేడుక చూడడానికి ఆ వేలాది జనం గుమికూడారు. ఆ గుట్టల నడుమవున్న పల్లంలోనే 'మంజి విరట్టు' జరగడం అలవాటు. ఆ 'మంజి విరట్టు' వేడుకలో పాల్గొనే ఎద్దులవల్ల చూపరుల కెట్టి ప్రమాదమూ వాటిల్లకూడదనే అరయన్‌కుళం గ్రామస్థులా పల్లపు మైదానాన్ని ఎన్నుకున్నారు.

అణ్ణామలై, శరవణన్ అన్న అర్మగంతోబాటు, ఒక రాతిబండమీద నిల్చుని వున్నాడు. అక్కడెక్కడయినా కూర్చుని, చిత్రం గీయడం అన్నది అసంభవం. అదీగాక మెరుపు వేగంతో జరిగే ఎద్దు-మనుష్యుల ఆ జీవన్మరణ పోరాటాన్ని - ఒకచోట కూర్చుని బొమ్మ వేయడంకూడా అసాధ్యం అనిపించింది అతడికి. అంచేత జరిగేవాటిని జాగ్రత్తగా చూసి, మనసున పదిలపరచుకుని తర్వాత బొమ్మ వేయాలి, అంతే. వేరు మార్గం లేదు.

ఆ పల్లంలో ఒక మూల తడికెలు చుట్టుకట్టిన శాలలో రకరకాల, రంగు రంగుల కోడె దూడలను కట్టివుంచారు. అవి రంకెలువేస్తూ, గెంతుతూ, త్రుళ్ళుతూ, గిట్టలు రాచుతూ కయ్యానికి కాలుదువ్వుతున్నట్లున్నాయి. ఒక్కొక్క కోడె దూడనూ, దాని ముక్కుతాడును పట్టుకున్న ఇద్దరు ముగ్గురు మనుషులు - అదు

పులో వుంచడానికి తంటాలు పడుతున్నారు. వాటిని వదలిపెట్టే సమయం ఇంకా కాలేదు.

ఆ కోడెమూదల అందం, అవయవాల అమరిక, వాటికి చేసిన అలంకారాలు - జాగ్రత్తగా పరిశీలించాడు అణ్ణామలై. కొమ్ములను వాడిగా చెక్కి రంగులు పూశారు నారతో చేసిన రంగురంగుల పట్టుకుచ్చుల నా కోడెల నుదుటిచుట్టూ, మెడచుట్టూ అలంకరించారు. రంగుల జరీపట్టు గుడ్డలు వాటి మెడనుండి వేలాడు తున్నాయి. వాటి కొమ్ముల క్రింద కట్టివున్న మూటలు డబ్బుల మూటలని గ్రహించా డణ్ణామలై. ఆ మూటలలో బంగారు, వెండి నాణాల నుంచుతారట.

ఆ కోడెల మదమునణిచి వాటిని గెలవడానికి ఉవ్విళ్ళూరుతున్న యువ కిశోరాలు అటు ఎదురువైపుగా నిలబడివున్నారు. లంగోటాలు కట్టుకున్నారు కొందరు. ధోవతులనే లంగోటాలవలె బిగించారు కొందరు. కండరాలు తిరిగిన ఆ శరీరాలు, ఆ విశాలమైన ఛాతీలు చూస్తుంటే వారు మూర్తీభవించిన వీరరసంవలె వున్నారనిపించింది అణ్ణామలైకు.

"ఆ కోడెలతో పోరాడే యువకులు, వాటి మెడలలో కొమ్ములకింద కట్టి వున్న డబ్బుని తీసుకుంటారు కాని, వాళ్ళా సాహసం చేయడం కేవలం ఆ డబ్బు కోసమేకాదు, అదిగో అటుచూడండి. ఆ కన్నెల క్రీగంటి చూపులకోసం, వారి చిరు నవ్వులకోసం, ప్రశంసలకోసం కూడా ! కోడెను గెలిచినవాడికి కోమలాంగీ దక్కు తుండడం ఇక్కడి ఆనవాయితీ !" అని వివరించారు ఆర్ముగం.

అణ్ణామలై మనసు వెయ్యేళ్ళు వెనక్కు వెళ్ళింది. 'కలిత్తొగై' కావ్యంలో వర్ణించిన ఆ పాతకాలంలో వీరు లిట్లాగే వధువులను గెలుచుకునే వారుకదా ! తమిళ దేశపు ఆ ప్రాచీన వైభవం అతడి కనుల ఎదుట ప్రాణం పోసుకుని నిలబడింది.

ఉన్నట్లుండి రంగస్థలం తప్పెటల చప్పుళ్ళతో ప్రతిధ్వనించింది. యువ వీరులు సమరోత్సాహంతో గర్జిస్తూ గెంతుతూ వున్నారు.

రాతిబండలమీద కూర్చున్న జనం తమ మాటలనాపి నిశ్శబ్దంగా క్రింద మైదానంలోకి చూడసాగారు.

కోడెల నడచడానికి ఉవ్విళ్ళూరుతున్న ఆ వీరులు కొదమసింగాలవలె దూక డానికి సిద్ధంగా వున్నారు.

శాలలోనుండి రంకెలు, గిట్టల సవ్వడులు భయం కొలిపేలా వినపడు తున్నాయి. ''మ్మ్...మా! మ్మ్...మా!'' అని భయంకరంగా అరుస్తూ, కొమ్ములతో మట్టిని తవ్వి దుమ్ము రేపుతూ రంగస్థలంలోకి దూకాయి కోడెదూడలు. వా టన్నిటిలోనూ - ఒకటి, ఎర్రటి కళ్ళది, నల్లటి మేనిది, రాజసంగా రంగంలోకి ప్రవేశించినది - అణ్ణామలైని ఎక్కువగా ఆకర్షించింది.

తనకు రెండే కళ్ళనిచ్చిన ఆ దైవాన్ని నిందించాడు అణ్ణామలై. వాటితో ఒకే సమయంలో ఒకే దృశ్యాన్నే చూడ వీలయింది. కాని అక్కడ, ఒకే సమయాన ముప్పై నలభై రకాల రోమాంచకములైన సంఘటనలు జరుగుతున్నాయి. ఒక కోడె మెడవంచి పోరాడుతున్నా డొక యువకుడు అది అతడిని తనతోబాటు అటూ ఇటూ లాక్కుపోతూంది. ఇక ఎద్దుతోకను పట్టుకుని దాని వీపుమీదకు లంఘించదలచిన వీరుణ్ణి తన వెనక కాళ్ళతో తన్నజూచింది అది. ఇంకొక కోడె పొట్ట కింద, దాని మెడను చేతులతోను నడుమును కాళ్ళతోనూ నొక్కిపడుతూ వేలాడుతూ దానిని లొంగదీయ జూస్తున్నా డొక సాహసికుడు. మరొక్కడు ఎదుటనే నిలబడి కొమ్ములను మెలిదిప్పుతూ ఆ కోడె నోడించ యత్నిస్తున్నాడు. ఇంకొక మూల తన్నెదిరించిన వాడిని క్రిందకుతోసి వాడి పొట్టను తన కొమ్ములతో చీల్చుతున్నది. ఎర్రటి రక్తం పారుతూన్న దక్కడక్కడ.

అణ్ణామలై ప్రక్క తిరిగి చూసిన ఆర్ముగం, అతడు తమ ప్రక్కన లేక పోవడంచూసి దిగ్భ్రమచెందారు. మైదానంలోకి చూశారు. పై ప్రాణం పైనే ఎగిరి పోయింది. అతడు ఆ భయంకరమైన నల్లకోడె దూడవైపు వెళ్తున్నాడు. ఆ క్రింద సంవత్సరం ముగ్గురిని చంపిన ఆ దూడ అణ్ణామలైను చూడలేదు. తన్ను లొంగ దీసుకో యత్నిస్తున్న ఇద్దరు యువకుల నతి నేర్పుతో ముప్పతిప్పలు పెడుతున్నది అది. అణ్ణామలై దగ్గరగా వెళ్ళి దాని అందాన్ని చూడాలని సమీపిస్తున్నాడు.

అతడు వెళ్ళడం దానిని లొంగదీయడానికి కాదు; దాని ఆ సాహస, సౌందర్య రూపాన్ని, దాని ఉద్వేగాన్ని తన మనసున చిత్రంగా భద్రపరచుకోవా లని వెళ్తున్నాడు. యుద్ధావేశం కాదది, కళావేశం!

"అయ్యో! అణ్ణామలై!'' అని అరుస్తూ ఆర్ముగం రంగంలోకి దూకారు. అది చూసి, పరిస్థితి తెలుసుకుని మరికొందరూ దూకారు.

ఆ భయంకరమైన దూడ ఇంతమంది మనుష్యులను చూచి, బెదరి అణ్ణామలై మీదకు దూకింది. ఆ తాకిడికి అతడు నేలమీదకు కూలాడు. ప్రపంచమే తిరుగుతున్నట్లనిపించిం దతడికి కాని అదృష్టవశాత్తు ఆ దూడ నెదిరిస్తున్న ఇద్దరు యువకులూ దానిని తోకను గట్టిగా లాగి పట్టుకున్నారు. అణ్ణామలైకు ప్రాణగండం తప్పింది; ఆ కోడె దృష్టి అతడినుండి మళ్ళింది.

అతడిని గుట్టమీదికి చేర్చారు. అక్కడినుండి అతడు ఆ నల్ల కోడెదూడను చూశాడు. దాని కొమ్ములమీద విజయ హారంవలె, ఎర్రగా నెత్తురు చిందుతున్న ప్రేగులున్నాయి. ఆ ప్రేగులను కోల్పోయిన వీరుడు, వీరస్వర్గం చెందిన వాడిలా కిందపడి వున్నాడు.

# 6

ఆ తర్వాత రెండు వారాలకు, అణ్ణామలై రచించి ప్రచురించిన 'మంజి విరట్టు' చిత్రం, మద్రాసులో కదిరేశన్ చేతిలో వుంది. అరయన్ కుళంలో వుండి ఆ చిత్రాన్ని పూర్తి చేశాకనే అతడక్కడనుండి కదిలాడు; కావేరితీర గ్రామంవైపు వెళ్ళాడు.

కర్ణాటక దేశంనుండి కావేరి తమిళ దేశంలోకి ప్రవహించే సరిహద్దు ప్రాంతంలో వున్న ఆ చిన్న వూరిని తమిళులు 'కావేరి' అంటారు; కర్ణాటకులు 'ఒగయుణకల్' అంటారు. ఎత్తైన కొండ శిఖరంనుండి కావేరి పొంగి క్రిందనున్న రాతిబండలమీద పడినప్పుడు చిందే నీటి బిందువుల పొగవంటి తెరనుచూసి. 'పొగ వచ్చే రాయి' అన్న అర్థం స్ఫురించే ఆ పేరు పెట్టారు కర్ణాటక దేశస్థులు.

ముప్పై నలభై గుడిశెలయినాలేని ఆ వూరు చేరిన అణ్ణామలైకు మనుషుల నుండి చాలదూరం వచ్చినట్లనిపించింది. నాగరికత కృత్రిమ రూపానికి దూరంగా హాయిగా వుంది. బెస్తవాళ్ళవి, ఫలహార శాలలవి, చేపల అడవుల శాఖవారివి - కుటీరాలున్నాయి. శరవణన్‌కు తెలిసిన ఒక మత్స్య శాఖాధికారి కుటీరంలో దిగాడు అణ్ణామలై. ఆ అధికారి అవివాహితుడు; తన తల్లితోపాటు వుంటున్నారు. వారి ఆదరణ అణ్ణామలైను ఆ ఇంటివారిలో ఒకడిలా చేసింది. నగరపు వసతులు లేని ఆ కుగ్రామంలో ఆయన అణ్ణామలైకు ఏలోటూ లేకుండా చేశారు.

ఊరికి ఒకవైపు కొండలూ అడవులూ వున్నాయి; ఇంకొకవైపు కావేరీ, కొండలూ, అడవులూ వున్నాయి. ఆ ఊరి పొలిమేరలో గలగలమని ప్రవహిస్తూంది ఒక సెలయేరు. అది ఆ వూరిని చుట్టివచ్చి కావేరిలో కలుస్తుంది.

కొన్ని రోజులలోనే ఆ గ్రామ వాసులలో ఒకడుగా మారిపోయా డణ్ణామలై. తేదీ, వారం, కాలం అన్నీ మరిచిపోసాగాడు. ఇచ్ఛవచ్చినపుడెల్లా ఏట్లో స్నానం చేసేవాడు. మనసుకు తోచినపుడెల్లా కొండచరియలమీదనో, అడవిలోనో కూచుని చిత్రాలు గీయసాగాడు.

అడవిలోపలికి వెళ్ళేటప్పుడు మాత్రం అతడికి తోడుగా కొందరు మనుష్యులు వచ్చేవారు. మనుష్యులు పాదం మోపలేనిచోట్ల భయంకరమైన రక్షణలతో తన రహస్యాలను దాచుకునివుంది ప్రకృతిమాత. అక్కడికెల్లా వెళ్ళి ఆమె అందాలను తన చిత్రాలలో నింపడానికి యత్నిస్తూ వచ్చాడు అణ్ణామలై.

ఒకరోజుదయం ఇంట్లో కూర్చుని అణ్ణామలై తన పెట్టెను తెరచి చిత్ర రచనకు వలసిన సామగ్రిని వెతుకున్నాడు. అట్లా వెతుకుతుండడంలో అతడేమాత్రమూ ఎదురుచూడని వస్తువొకటి దొరికింది. అట్టల మధ్యగా దాచివుంచిన పెన్సిల్ స్కెచ్ అది; చించి, అతికించిన, పాత, పసుపుబారిన కాగితం అది; మొట్టమొదటిసారిగా అతడు వేయడానికి ప్రయత్నించిన ఆనంది చిత్రం అది!

ఆ రోజులలో మాణిక్యానికి, తనకు జరిగిన వాగ్వాదాలన్నీ గుర్తుకువచ్చాయి. "నువ్వామెను ప్రేమిస్తున్నావా?" అని అతడానా డడిగిన ప్రశ్నకు అర్థమూ, అతడి హెచ్చరికా, ఈ చిత్రాన్ని అతడు తన చేతినుండి లాగితే అది మూలగా చినగడమూ - అన్నీ కలిసి మనోనేత్రంముందు నిలిచాయి. ఒక్కొక్క దానిని వివరంగా ఆలోచించసాగాడు.

'తెలిసి తెలిసి మాణిక్యం నన్ను మోసగించాడా? నా మనసు దోచిన దానిని నా నుండి లాక్కునిపోయాడా? అట్లా నన్ను అప్పుడప్పుడూ మునిసిగ్గుతో చూసిన ఆనంది అతడిని పెళ్ళాడడానికి ఎట్లా సమ్మతించింది?'

మాణిక్యం అంత చెప్పినా తాను అప్పుడే ఆ బొమ్మను చింపి పారేయక పోవడం అతడికి కొంత ఊరటగా వుంది.

ఆ చిత్రాన్ని చేత నుంచుకున్న అణ్ణామలైకు ఆనంది తనతోబాటు ఆ వూరు వచ్చినట్లే అనిపించి సంతోషం కల్గింది. కావేరీ తీరాన ఆ చెట్ల ఛాయలో అతడి

ప్రక్కన నిల్చుని, పొంగి పొరలుతున్న కావేరి ప్రవాహాన్ని చూస్తున్నట్లూ — అడవులలో అతడి వెంట తిరిగి అలసిపోతున్నట్లూ - అతడితోపాటు పడవలో కూచుని నదిమీద విహరించినట్లూ - అన్పించింది. నిజంగా ఇటువంటి చోట్లకు వచ్చివుంటే ఆమె ఎంత ఆనందించి వుండేది !

ఒకనాడు అణ్ణామలై, అతడి మిత్రుడూ పడవనెక్కి నదీ ప్రవాహానికి ఎదురుగా వెళ్ళి, కొండపైనుండి పడే జలపాతాలను చూడాలని వెళ్ళారు. అనుభవజ్ఞుడయిన సరంగు పడవను జాగ్రత్తగా నడుపుతున్నాడు. నీటిలోనుండి ఎగిరి పెద్ద చేపలు వారిమీద పడుతున్నాయి; అణ్ణామలై కి అనుభవం కొత్తగావుంది.

నది కిరువైపుల రాళ్ళను వేలాది శిల్పులు దొలిచి కోవెలలను మంటపాలను నిర్మించినట్లు కనపడింది. మహాబలిపురంలో రాళ్ళను, గుహలను ఆలయాలుగా మార్చారు. ఇక్కడ రాళ్ళలోపలే తొలిచి అద్భుతమైన కళాకౌశలాన్ని ప్రదర్శించారు. వాటిని చూసినప్పుడు అణ్ణామలై తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఎన్ని శిల్పాలు ! ఎన్ని సొరంగాలు ! వాటిమీద, వాటి లోపల ఎన్నెన్ని రకాల విగ్రహాలు ! ఎంత పతనం !

కావేరి అన్న కోమలి, మహారాణి తన వేలాది అలల చేతులనే ఉలులుగా చేసుకుని, ఆ రాళ్ళ నలా తొలిచింది, మలిచింది, ఆడుకుంది ! రాతిని కరిగించి, పోతపోసింది ! రాయి పళ్ళనుపీకి ఆటలు ఆడించింది !

పడవను ఒక ప్రక్కకు, ఒడ్డు దగ్గరగా తీసుకువెళ్ళమని చెప్పి పడవనుండి ఒక రాతిని పట్టుకుని దూకాడు అతడు. అక్కడవున్న ఒక సొరంగపు ద్వారంలోకి వెళ్ళి పైకి ఎక్కాడు. మెట్లవలె వున్నాయి బండలు. పైపైకి ఎక్కి దూరంగా చూశాడు. కొండ శిఖరం మీదనుండి జలపాతాలుగా దూకుతూంది కావేరి. ఇంకొక బండమీదకెక్కి, అక్కడినుండి ఇంకా పైకెక్క ప్రయత్నిస్తూన్నాడు.

అతడి వెనకాల వస్తున్న అతడి మిత్రుడి గొంతో, సరంగు గొంతో అతడికి వినబడలేదు. ఆ జలపాత శబ్దం ఒక్కటే అతడిని తన దగ్గరికి రా రమ్మని పిలుస్తూంది. ఆ శిఖరాన ఎక్కి కూచుని బొమ్మ గీయడానికి ఏదయినా అనువైన చోటున్నదా అని వెతుకుతున్నాడు, అతడు.

"ఆగండి, ఆగండి ! ఆ బండమీద జారగలరు !"

ఆ బండమీదనుంచి జారనే జారాడు.

చేతి పట్టుతప్పి జారి దొర్లపడ్డవాడిని, ఆ బండ పగులులో పెరుగుతున్న ఒక చెట్టు అడ్డుపెడదామని చూసింది. ఆ చెట్టునుండి జారి, బండమీద జారి, దొర్లి క్రింద తీరంమీదకు వచ్చిపడ్డాడు. అతడి కుడిభుజంనుండి కారిన రక్తం కావేరిలో కలిసి పారింది.

ఆ ఇద్దరూ అతడి నెత్తి పడవలో పరుండబెట్టి వెనక్కి మళ్ళారు. ఆ వూరిలో ఆస్పత్రి లేదు: వైద్యుడు లేదు.

స్పృహ కోల్పోయివున్న ఆ స్థితిలోకూడా అణ్ణామలై అంతరంగం ఆ జలపాతపు సౌందర్యాన్ని మరవలేదు.

# 7

చెన్నపట్నంలోని ఒక పెద్దాసుపత్రిలో ఒక గదిలో మంచంమీద పడుకుని వున్నాడు అణ్ణామలై. కుడిభుజానికి, చేతికీ కట్లున్నాయి. భరించలేని నొప్పిలో బాధపడుతూ, విలవిలలాడుతూ వున్నాడతడు.

కావేరి తీరాన అతడి మిత్రుడుపడ్డ కష్టం, ఆయన ప్రక్క వూరినుండి వైద్యుడిని పిలిపించి ప్రథమ చికిత్స చేయించడం, ఆ తర్వాత శరవణన్ మద్రాసు నుండి హుటాహుటిగా వచ్చి అణ్ణామలై నొక కారులో పడేసుకొని వెనక్కి రావడం – ఇవన్నీ కలలో జరిగినట్లన్పించాయి అతడికి.

అణ్ణామలైకు ప్రాణగండం తప్పింది కాని ఆ ప్రమాదంవలన అతడికి చాల గాయాలు దెబ్బలు తగిలాయి. కుడిభుజం ఎముకలు విరిగాయి చేతికికూడా మడిచి నట్లు గట్టిగా కట్టు కట్టారు. శరీరమంతటా ఇంకా ఎన్నో చిన్న గాయాలు తగిలాయి.

మీనాక్షమ్మకు క్షణం తీరికలేదు; ఇంటికీ ఆస్పత్రికీ తిరుగుతూంది. శరవణన్, కదిరేశన్‌లు తమ వేదనను వెలిబుచ్చకుండా ఓపికతో అతడి చికిత్సకు కావలసిన వసతులన్నీ చేస్తున్నారు. శారదకు బడికివెళ్ళి రావడంతోబాటు ఆస్పత్రికి వచ్చి వెళ్ళడంకూడా ఒక విధి అయింది.

అయితే ఆనంది ఎక్కువగా రాకపోవడం అణ్ణామలై కేదో వెలితిగా వుంది. ఎందుకీ ఉపేక్ష ? ఇలా ఎలా వుండగలుగుతూందామె ?

మొదటిసారిగా మాణిక్యమూ, ఆనందీ కలిసి అక్కడికి వచ్చినప్పుడు అణ్ణామలై ఒంటిమీద స్పృహలేకుండా పడివున్నాడు. అప్పుడేమి జరిగినదీ అతడికి తెలియదు. తర్వాత శారద చెప్పగా తెలిసింది. అతడి నా స్థితిలో చూసిన ఆనందికి కళ్ళు తిరిగాయట. వెంటనే ఆమెకు చికిత్సచేసి అక్కడినుండి తీసుకువెళ్ళారట.

మళ్ళీ ఆ దంపతులు రెండోసారి వచ్చి వెళ్ళారు. ఆ తర్వాత మళ్ళీ తొంగి చూడలేదు.

ఆ రెండోసారి వాళ్ళు వచ్చిపోవడాన్ని గుర్తుచేసుకున్నా డణ్ణామలై. నిజానికి అతడు మరచిపోలేనంతగా ఆ రోజు అతడి మనసులో నిలిచివుంది భయంకరమైన నాటకంలా వుండది !

ఆనంది అతడిని, తాను కని, పెంచిన బిడ్డలా చూస్తూ నిల్చుంది కాసేపు భరించరాని దుఃఖంతో ఆమె పెదవులు కంపించాయి. కళ్ళు తడి అయ్యాయి. మాట్లాడలేక అవస్థపడి ఎలాగో మాట్లాడింది.

"మీ చిత్రాలను చూసినప్పుడెల్లా నాన్నగారు – 'దిష్టి తగలకుండా వుండాలి !' అంటుండేవారు. కాని మీకు దిష్టితగిలింది. అందుకనే ఇట్లాటి ఆపద కలిగింది... చిత్రాలు వేసే ఆ చేయి విరగ్గొట్టుకుని ఇట్లా పడివున్నారు !'' అని కన్నీరు ఆపుకోలేకపోయింది.

వచ్చినప్పటినుండి మాణిక్యం కళ్లు అణ్ణామలై వైపే తిరగలేదు, ఆనందినే చూస్తున్నాయి ఆమె జాలి. సానుభూతి హద్దుమించి పోవడం చూస్తే ఒళ్ళు మండింది అతడికి. ఇక భరించలేక పోయాడు

"దిష్టి తగిలివుంటే నీ కళ్ళే తగిలివుండాలి !'' అని విషం కక్కుతూ అని ఆమె నురిమిచూశాడు. ఆనందికి హృదయంలో బల్లెం గుచ్చినట్లయింది. తర్వాత మాణిక్యం అణ్ణామలైను సమీపించి— "ఇకమీద నువ్వు బొమ్మలు గీయాలనుకుంటే కుదురుగా కొంపపట్టునవుండి తెల్ల కాగితంమీద రంగులు పూసుకో ! అంతే ..'' అని ఉపదేశించాడు.

అణ్ణామలై ముఖం వాడిపోయింది. అది చూసి ఆనందించిన వాడిలా ఇంకా చెప్పసాగాడు మాణిక్యం.

"కొండలూ అడవులూ తిరగడం ద్వారానో, మంజి విరట్టు ఎద్దుకు ఎదురు వెళ్ళి ఢీకొనడం ద్వారానో నువ్వు చిత్రరచనలో మొనగాడి నయిపోదామని అను

కున్నావల్లేవుంది. అంతకన్న మూర్ఖత్వంలేదు ! నువ్విట్లా చేయీ కాలూ విరగగొట్టుక్కుని మూలపడివుంటే ఎంతమందికి ఎన్నివిధాల ఇబ్బందో, తెలుసా ? పాపం, మీ అమ్మకు సాయానికి మనిషిలేదు; ఖర్చుకు డబ్బులేదు. ఇవన్నీ నీకు తెలిసి వుండాలి."

అణ్ణామలై కళ్ళల్లో నీరు పొంగింది. తాను అనాధనని, వైద్యానికికూడా డబ్బులేనివాడిననీ మాణిక్యం ఎత్తిపొడవడం చాల బాధాకరంగా వుండింది.

విలవిలలాడిపోయిన ఆనంది — "ఇంక వస్తారా, మనం ఇంటికి వెళ్దాం !" అంది. అత దట్లా అణ్ణామలైను తన ఎదుట కించపరుస్తుంటే అక్కడ వుండలేక పోయిందామె.

అది వినిపించుకోకుండా మాణిక్యం అన్నాడు : "ఇదిగో అణ్ణామలై ! నీకు సుఖంగా జీవించడానికో దారి చెబుతా విను !... ఆ పిల్ల శారద నీతోను, మీ అమ్మతోను పూసుకుని తిరుగుతూంది. ఆమెకు నీమీద కన్నుంది. కనుక మాట్లాడకుండా ఆమెను పెళ్ళిచేసుకో. ఆమె సంపాదన చాలు మీ కుటుంబానికి. అంతేగాని నీ చిత్రాలనే నమ్ముకుంటే పస్తులుండాల్సిందే !"

అణ్ణామలైకు వెంటనే మంచంమీదనుండి లేచి మాణిక్యం మొహంమీద కాండ్రించి వుమ్మేయాలనిపించింది. శారదను పెళ్ళిచేసుకోమన్నందు కతడు బాధపడలేదు; కాని ఆమె జీతంతో బతకడానికనే ఆమెను పెళ్ళాడమన్నందు కతడికి ఒళ్ళు మండింది. నాలుగు డబ్బులు కళ్ళ చూడగానే ఎంత పొగరు వచ్చింది ! కోపంతో కంపించాడు. చటుక్కున ఆనంది అంది :

"అయితే మీరు డబ్బుకోసమే నన్నుమాట నన్ను పెళ్ళిచేసుకుంది !"

ఫెడీలుమని ఆమె చెంపమీద కొట్టాడు మాణిక్యం. వాళ్ళేమీ ఐశ్వర్యవంతులు కాదనీ, అతడి సంపాదనమీద ఆధారపడి బతుకుతున్నారనీ, అలాంటివా రింకో వందమందిని పోషించగల స్తోమత తనకుందనీ బీరాలు పలికాడు.

అది ఆస్పత్రి అనికూడా మరిచిపోయాడు మాణిక్యం. కాని అది ప్రత్యేకమయిన గది కావడంవల్ల ఈ గొడవంతా ఇం కెవరికంటా పడలేదు. మీనాక్షమ్మ ఇంటికి వెళ్ళివుంది. చెంప నలాగే పట్టుకుని తలవంచుకుంది ఆనంది.

అంతే. ఆ రోజు వెళ్ళినవాళ్ళు మళ్ళీరాలేదు. ఆనంది మాత్రం తండ్రితో బాటో, తన తల్లి మీనాక్షమ్మతోబాటో కలిసి వస్తుందని ఎదురుచూశాడు. కాని అట్లా జరగలేదు.

కొన్నాళ్ళయ్యాక, ఆనంది అవ్వ కన్నుమూసిందని విన్నాడు. ఆస్పత్రికి వచ్చిన కదిరేశన్‌ను పరామర్శించాడు. అదే వూళ్ళో వుంటూకూడా వాళ్ళింటికివెళ్ళి విచారించలేకపోయాడు. ఆనందికి తల్లిలేని లోటు తెలియకుండా చూసుకున్న ఆ ప్రాణంకూడా పోయింది. కదిరేశన్‌ద్వారా తన సానుభూతి తెలిపాడు అణ్ణామలై.

# 8

రోజులు గడిచినకొద్దీ శారదపట్ల అణ్ణామలై ఋణం హెచ్చుతూ వచ్చింది. ఆమె ఉదయం అతడి ఇంటికివెళ్ళి కాఫీ వగైరాలను తీసుకుని ఆస్పత్రికి వచ్చేది. ఆస్పత్రిలో దాదిలా అతడికి అన్ని సపర్యలూ చేసి బడికి వెళ్ళేది. సాయంకాలం బడినుండి తిన్నగా ఆస్పత్రికివచ్చి చీకటిపడేవరకు అక్కడే వుండి ఆ తర్వాత ఇంటికి వెళ్ళేది. ఆమె సాయం లేకపోతే మీనాక్షమ్మ ఒక్కర్తెవల్ల అణ్ణామలైకు కావలసినవన్నీ సమకూర్చడం చేతనయ్యేదికాదు.

ఒకరోజు సాయంకాలం ఆమె బడినుండి వచ్చేసరికి అణ్ణామలై మంచంమీద ఆనుకుని కూర్చుని వున్నాడు. మీనాక్షమ్మగారు రాత్రి భోజనాన్ని తీసుకుని అక్కడికి వచ్చాకనే శారద వెళ్ళడం అలవాటు. ఆవేళ అతడిని చూడడానికి ఎవరూ రాలేదు.

ప్రక్కనవున్న కుర్చీని చూపించి శారద నందులో కూచోమన్నాడు.

కొంతసేపువరకు అనురాగంతో ఆమెవైపే చూస్తూ కూచున్నాడు. అది నచ్చనట్లు ఆమె తలవంచుకునే కూర్చుంది.

"శారదా! తోడు లేకుండా మనిషి బ్రతకలేడల్లేవుంది. అతడిని ప్రేమించే వారు ఎవరో ఒక రుండాలి. ఆ అమ్మ ప్రేమను నేను ఎన్నటికీ మరవలేను. కాని నా కిప్పుడు అది మాత్రం చాలదు. ప్రేమలేని ఒక వ్యక్తితో జీవించినాక ఇప్పుడు నాకు ప్రేమ విలువ మరింతగా తెలిసివచ్చింది."

శారద మాట్లాడలేదు. ఆమెకు వెంటనే అక్కడినుంచి వెళ్ళిపోదామనిపించింది. అయినా అతడిని నొప్పించదలచుకోలేదు.

"శారదా! ఆ రోజు మాణిక్యంకూడా ఆనంది ఎదుటే ఆ మాట అన్నాడు. మిమ్మల్ని పెళ్ళాడమని సంహా ఇచ్చాడు."

"నాకు తెలుసు. ఆనంది నాతో చెప్పింది... అంతేకాదు. ఆనందే స్వయంగా నాకూ ఇలాగే చెప్పింది."

"ఆనంది చెప్పిందా?" అని 'షాక్' తిన్నవాడిలా అడిగాడు అణ్ణామలై.

"ఔను. కాని మీ కింత 'షాక్' ఎందుకు?"

"అబ్బే ఏమీలేదు... ఏమీలేదు......" అని తొట్రుపడ్డాడు అణ్ణామలై. ఉన్నట్లుండి అతడికి శారదతో మాట్లాడాలన్న ఉత్సాహం తగ్గిపోయింది. ఆనంది ఇందులో జోక్యం కల్పించుకోవడం అతడికి ఎందుకో నచ్చలేదు.

"చెప్పండి! ఏమిటి విషయం?"

"ఏమీలేదు... ఇటువైపు తొంగికూడా చూడదానికి వీలులేనివారికి ఇంతటి ఆసక్తి కల్గిందే ననిపించింది."

"ఇక్కడికి పోవద్దని మాణిక్యం ఉత్తర్వు. తానే తీసుకుని వెళ్తానన్నారట ఆయన. ఆయనకు తీరికలేదు, ఇష్టమూలేదు; కనుక ఆమె రాలేకపోయింది. అందుకనే ఆమెకు బదులుగా నేను వస్తున్నాను."

అణ్ణామలై కొంతసేపు నిశ్శబ్దంగా వుండి—"అయితే మీరు మీ ఇష్టం మేరకు ఇక్కడికి రావడం లేదన్నమాట?" అని అడిగాడు.

"ఎందుకీ ఆరాలు తీయడం?" అని ఆమె "దయచేసి ఇంకమీద మీరు నన్ను గురించి మాట్లాడకండి. త్వరగా ఆరోగ్యం కోలుకుని ఇంటికి రావడానికి ప్రయత్నించండి!" అంది.

"పాపం! ఆనంది అవ్వగాయా పోయారు." అని నిట్టూర్చాడు అణ్ణామలై.

శారద కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఒక్క నిమిషం మాట్లాడలేకపోయింది. తర్వాత పలికింది! "ఆనందికూడా త్వరలోనే వాళ్ళవ్వను చేరుకుంటుంది. అప్పుడే ఆమెకు విముక్తి. ఆ విముక్తి ఆమెకు లభిస్తుంది... తర్వలోనే వస్తుంది." అని బాధపడింది.

"శారదా !"— అరిచాడు అణ్ణామలై.

''ఔను; మీరొకపక్క, మాణిక్యం ఒకపక్క ఆమెమీద బాగా పగ తీర్చు కుంటున్నారు. మనసులో మిమ్మల్ని అనుకుంటూ, ఆ కిరాతకుడితో శారీరకంగా జీవించే ఆ హేయమైన స్థితిని ఆమె ఇంక భరించలేదు. తను కనులు మూయక ముందే ఆమె నాకు మీతో పెళ్ళి జరపాలని చూస్తున్నది. మీ రామె కొకసారి చేసిన ద్రోహం చాలదన్నట్లు, ఇంకోసారి మీతో కలిసి నే నామెకు ద్రోహం చేయా లన్నమాట !''

శారద మాటల కతడు వెలవెలపోయాడు. ఆమె అతడికి అర్థమవనట్లూ వుంది, అర్థమయినట్లూ వుంది. ఆమెకు ఆనందిపట్ల వున్న ప్రేమ ఇంత ప్రగాఢ మైనదని అతడి కిప్పుడే తెలిసింది.

''చెప్పండి ! మీరు నన్ను నిజంగా ప్రేమిస్తున్నారా ? లేక సుందరిని ప్రేమించినట్లు ప్రేమిస్తున్నారా ? గుండెమీద చేయివేసుకుని మరీ చెప్పండి !''

"వద్దు శారదా ! మీరు నన్నేమీ అడగకండి. నాకేమి జవాబు చెప్పాలో తెలియడంలేదు."

"అబద్ధం !" అని అరిచింది శారద. "మీరు నిజాన్ని మరుస్తున్నారు; దానికి మసిపూస్తున్నారు; దానిని చెప్పడానికి భయపడుతున్నారు."

"శారదా !" అని ప్రతిమిలాడాడు అణ్ణామలై.

"మీరు ఆనందిని ప్రేమించారా, లేదా ? ఇప్పుడూ ప్రేమిస్తున్నారా లేదా ?"

శారద చెంపమీద దెబ్బతీసి బయటికి తోసేద్దామన్నంత కోపం వచ్చింది అతడికి. మర్యాద తెలియని మనిషి అనుకుని మండిపడ్డాడు. అయితే ఆమె అడిగిన ప్రశ్నలు కత్తులై అతడి హృదయాన్ని చీల్చి, అంతరాంతరాలలో దాగివున్నదానిని బయటికి లాగాలని యత్నించాయి.

"ఆనంది మాణిక్యం భార్య. అది మరిచిపోయి మీ ఇష్టం వచ్చినట్టెల్లా వాగ కండి." అన్నాడు అణ్ణామలై.

''మీరు ఉత్త పిరికివారు; ఆనాడు పిరికే; ఈనాడూ పిరికే ?" అని ఛీత్కారంచేసి ఆమె కుర్చీనుండి లేచింది— ''ఆనంది అతడి భార్య అని లోకం నమ్మవచ్చు; ఆమె నమ్మవచ్చు; మీరూ నమ్మవచ్చు, అయితే నేను నమ్మలేను ! నేను అసత్యాన్ని నమ్మను—" అంది.

"అది మీ ఇష్టం!" అన్నాడు అణ్ణామలై.

"మీరింకా నే నడిగినదాని కిది జవాబు చెప్పలేదు; చెబితే మీ నోరు కాలి పోదు లెండి!"

"నాకు జవాబు చెప్పడం ఇష్టంలేదు!" అన్నా డతడు మొండితనంగా.

శారద నవ్వింది. ఏడుస్తూ నవ్వింది.

"సరే! నేనింక వెళతాను; మీ అమ్మవచ్చే సమయం అయింది—" అని "ఇంకెప్పుడూ నాతో పెళ్ళి ఊసెత్తకండి; ఎత్తితే మీ ముఖం చూడను—" అని చెప్పి ఆ గదినుండి గబగబ బయటకు నడిచింది.

ఆమె విశ్వరూపం ధరించిన ట్లనిపించింది అణ్ణామలైకు.

ఆమెకు చెప్పని సమాధానాన్ని తనలోనే వెతుక్కో సాగాడు అతడు.

# 9

అణ్ణామలై చేతికి కట్టుకట్టి ఆస్పత్రినుండి ఇంటికి పంపించారు. వారాని కోసారి ఆస్పత్రికి రావాలని, నెల రోజులలో పూర్తిగా నయమవుతుందని, ఆ తర్వాతకూడా కొంతకాలంవరకు జాగ్రత్తగా వుండాలని వైద్యులు ఆదేశించారు.

ఒక చెరసాలనుండి ఇంకొక దానిలోకి మారినట్లు అనిపించింది అణ్ణామలైకు. ఇంటికి రాగానే మొదట ఆనంది ఇంటికివెళ్ళి, ఆమె అవ్వను కోల్పోయినందుకు పరామర్శించి వద్దా మనుకున్నాడు. ఆ ముసలావిడతో అతడంత సన్నిహితంగా మెలగలేదు; కాని అతడి నామె ఇంటిలో వాడిగా పరిగణించి ఆదరించేది.

అయితే వెళ్ళలేక పోయాడతడు. అతడి తల్లి, శరవణన్ అతడి ఆరోగ్య కారణంగా వద్దన్నారు. ఇంకొక వారందాక ఎక్కడికీ కదలవద్దన్నారు శరవణన్. అంచేత మంచంమీద పడుకునే వెర్రివాడిలా పక్కింటిని చూడడం తప్ప మరోదారి లేకపోయింది అతడికి. అలాంటి తోటలో చెట్లు, లతలు, పువ్వులు, పక్షులు, ఉడతలు అన్నీ అలాగే వున్నాయి. వాటిలో మునుపటి జీవం, చైతన్యం లోపించి నట్లనిపించింది.

తోటంతా కాగితం చెట్లతో కాగితం పూలతో నిండివుంది. దాని మధ్యవున్న బంగళా సినిమా తీసేటప్పుడు వేసే 'సెట్'వలె వుంది. అంతేగాని ప్రాణంవున్నది, నిజంగా వున్నది ఏదీలేదు - అన్పించింది. అతడి కిష్టమైన నాగలింగ చెట్టుకూడా కదలకుండా నిల్చునుంది. దానిమీద ఒక్క పువ్వయినా లేదు.

ఆ ఇంటి వెనక తలుపులు తెరుచుకుని ఒక ఎముకలపోగు - ఆస్పత్రిలో అతడు చూసినటువంటిది - తన ఇంటివైపు రావడం చూశాడు. పరీక్షగా గమనించాడు. ఆ శవంలా వస్తున్నది ఒక ఆడరూపం.

కొన్ని నిముషాలకు ఆనంది అతడి గదిలోకి ప్రవేశించింది. అతడి దగ్గరగా నిల్చుంది. అపరిచితవలె ఒకరి నొకరు చూసుకున్నారు. అణ్ణామలై ఆమెను చూడలేకపోయాడు. పాలిపోయిన ఆమె ఎండిన తీగవలె వుంది.

ఆమె అవ్వ మరణించినందుకు ఆమెను పరామర్శించాలి అన్న విషయం మరిచి —

"ఆస్పత్రినుండి వచ్చింది నేనా, మీరా ?'' అని అడిగాడు అణ్ణామలై.

''మీ రక్కడనుండి వచ్చారు; నే నక్కడికి వెళ్ళనున్నాను'' అని—

''అయితే, నేను వెళ్ళితే మీవలె వెనక్కు రాను—" అని లేతగా నవ్వింది.

''మీరిట్లా మాట్లాడితే నేను భరించలేను నేనూ - నేనూ అలాగే అంటాను!'' అని కాస్సేపు వూరుకున్నాడు; "మీ కేమిటి అనారోగ్యం ?" అని అడిగాడు.

"నాకు ఒంట్లో ఏమీలేదు; మీ ఆరోగ్యం ఎట్లావుంది చెప్పండి—" ఆనంది అతడి సమీపంగా ఒక కుర్చీని లాక్కుని కూచుంది. —''ఇక్కడవున్న కోట్లాది స్త్రీలలో నే నొక్కతెను. నేను వున్నా, పూడినా ఒక్కటే. కాని మీ రట్లాకాదు. ఈ ప్రపంచానికి మీ రివ్వవలసిన దింకా ఎంతోవుంది. మీ కళకోసం మీరు జీవించి వుండాలి; ఆరోగ్యంగా వుండాలి. చిరంజీవియైన కళ మీది..."

కళ గురించి ఆమె మాట్లాడడంతో ఉత్సాహంతో లేచి మంచంమీద కూచున్నాడు అణ్ణామలై.

''ఆనందీ! ప్రతిదినమూ ఇట్లావచ్చి ఒక్క ఐదునిముషాలు కూచుని కళను గురించి ఏదయినా మాట్లాడండి; నేనేమి చిత్రాలు గీయాలో చెప్పండి. ఇంకొక వారంలో నాకు పూర్తిగా నయమవుతుంది. నా చేతిలో కుంచె పనిచేస్తుంది."

వాత్సల్యంతో అణ్ణామలైను చూసింది ఆనంది. తాను తరుచు ఆస్పత్రికి వెళ్ళి చూడని లోటు ఇంకా అతడిని బాధిస్తూంది అని ఆమె గ్రహించింది.

''మీతో మాట్లాడడానికి రోజూవస్తే నా ఆరోగ్యం బాగా అయిపోతుందేమో నని భయం నాకు !" అని నవ్వింది ఆమె. "నా కది ఇష్టంలేదు. శారదతో చెబు తాను. రోజూ ఇక్కడికి వచ్చి మిమ్మల్ని చూడమని.''

తటాలున తలెత్తి ఆమె కళ్ళల్లోకి చూశాడు అణ్ణామలై. శారద తనతో అన్న మాటలు గుర్తుకొచ్చాయి. 'నేను శారదను పెళ్ళాడాలని మీ కోరికా ?' అన్న ట్లుగా చూశాడు.

"అలా చూస్తున్నారేం ?"

"ఏమీలేదు. మీ ఆరోగ్యం బాగవుందేమోనని భయపడుతున్నా నన్నారే, దానికి అర్థం ఏమిటి !''

''ఏ అర్థమూలేదు. అసలు జీవితానికే అర్థంలేదని నా భావం. నా శక్తికి మించి దానితో పోరాడి అలిసిపోయాను. పోరాడుతున్నంత సేపు అందు కవసరమైన శక్తి నాలో వుండింది. ఇంక లాభంలేదు అని ఓటమి నంగీకరించగానే శరీరమూ నీరసపడిపోయింది. ముగింపు దానంతట అదిగా వస్తుందని ఎదురుచూస్తున్నాను. ఆలోగా నేను అనుకుంటున్న ఒక బాధ్యతను నిర్వర్తించేయాలి."

"ఆనందీ !" - అణ్ణామలై కళ్ళల్లో నీరు వర్షించింది. అలాగే ఆమెను మనసార దగ్గరకు తీసుకుని తన కన్నీటితో స్నానం చేయించాలని తహతహ లాడాడు అతడు. సంఘమూ, లోకమూ, ఎవరయినా, ఎందరయినా ఆమెను మాణిక్యం భార్య అని చెప్పినా ఒప్పుకోవడానికి సిద్ధంగా లేడతడు. ఆ అబద్ధాన్ని నమ్మడానికి నిరాకరించాడు. అనాదిగా వచ్చిన ఏదో అర్థంలేని సంప్రదాయమే, ఆమె అతని భార్య అని నమ్మమని, తన అంతరాత్మను ప్రేరేపించింది. 'కాని అంతరాత్మ అంటూ లేని ఒకడు తన్ను మోసగించి తీసుకుపోయిన వ్యక్తి ఈమె.'

—అయినా ఆమె ఇంకా అతడు తాకడానికి జంకే దూరంలోనే వుంది. తన మనసులోని భావనలను అణగదొక్కడానికి నానా యాతనా పడ్డా డతడు. అది ఆమె ఎరగకపోలేదు.

"నా ఆఖరి బాధ్యత ఏమిటి అని మీ రడగలేదేం ?" అంది ఆనంది.

''మొదట మీ అనారోగ్యం ఏమిటో చెప్పండి.''

"ఉన్నట్లుండి మైకం వస్తూంది. నడవలేను; తినలేను; నిద్రపోలేను. రక్తపు పోటు చాల తక్కువగా వుందట. అవ్వ పోవడం ఒక కారణం. అయినా అదొక్కటే కారణంకాదు. ఇంకా ఆమె వుండివుంటే తిండికీ మందుకూ నానా కష్టాలూ పడేది. దేవుడే దయతలచి మా అత్తగారినుండి ఆమెకు విముక్తి కల్గించాడు. మీరిట్లా అనాథలా ఆస్పత్రిలో పడివుండడాన్ని నేను సహించలేకపోయాన. కాని ఏమీ చేయలేకపోయాను. అక్కడికివచ్చి మిమ్మల్ని చూడవద్దన్నారు ఆయన."

ఆనంది ఇంతగా మనసువిప్పి మాటలాడినందుననే ఆమె మనసు ఎంతగా క్షోభిస్తున్నదో తెలుసుకున్నాడు అణ్ణామలై. ఒకదాని తర్వాత ఒకటిగా బాణాలవలె తగిలాయి ఆమె మాటలు. సాలెగూడులో చిక్కిన చిన్న చీమవలె వుంది ఆనంది. సాలెగూడు ఇంకా ఇంకా ఇరుకయి ఊపిరాడడమే కష్టమైపోయిన పరిస్థితిలో ఆమె అక్కడకు వచ్చింది.

భయపడుతూ అడిగాడు అణ్ణామలై. ''ఇప్పుడు నువ్వు వచ్చినట్లు తెలిస్తే?''

"తెలిసినా ఫరవాలేదనే వచ్చాను. మున్ముందు నేనిక్కడికి రాలేకపోవచ్చు. ఆలోగా నేను చెప్పదలచిన దానిని మీతో చెప్పిపోదామనే వచ్చాను.''

'మున్ముందు రాలేకపోవచ్చు' అన్న దానిని ఊహించలేకపోయాడు అతడు. అతడి హృదయం కంపించింది. నోటమాట పెగలలేదు. ఇకమీద ఆమెను కలవడం, చూడడం, మాట్లాడడం జరగదా ?

"ఇదిగో చూడండి!'' అన్న ఆమె మాటలతడిని ఈ లోకంలోకి తీసుకొచ్చాయి. ''నా తర్వాత నాన్నగారు ఆ ఇంట్లో ఒక్కరోజయినా వుండలేరు. ఆయనను మీరు మీ వద్దకు పిలిపించుకోవాలి. శారదకూ ఆయనంటే అభిమానం వుంది. మీ రిద్దరే ఆయనను చూసుకోవాలి.''

"ఏమిటి ఆనందీ, మీరంటున్నది ?"

"శారదను పెళ్ళాడమంటున్నాను. తన కిష్టంలేదని ఆమె అన్నదాన్ని నేను నమ్మడంలేదు. మీరూ ఇకపై ఒంటరిగా ఇబ్బంది పడకూడదు. నే నెలాగయిన ఆమెకు నచ్చజెపుతాను."

"ఆనందీ, మీకు పిచ్చిగాని పట్టలేదుకదా !''

''పిచ్చి పట్టకూడదనే ఇట్లా వాగుతున్నాను. చావుకన్న భయంకరమైనది అది. ఆ తర్వాత మీ అందరికి భారంగా, ఇతరుల హేళనకు గురిఅవుతూ నేను బ్రతకదలచుకోలేదు."

"ఆనందీ !'' అని గద్గద స్వరంతో ఆమెను పిలుస్తూ అతి కష్టంతో మంచం మీదనుండి లేచాడు అణ్ణామలై.

"నేను వస్తాను." అంటు గబగబ వెళ్ళిపోయింది ఆనంది. ఇంకో క్షణం అక్కడవుంటే తా నెట్లా ప్రవర్తిస్తానో ఏమోనన్న సందేహం ఆమెకి కలిగింది.

# 10

ఇంటి గుమ్మంలో, కాలు నిలవకుండా ఇటూ అటూ పచారుచేస్తున్న మాణిక్యం, గుమ్మంగుండా ఆనంది లోపలికి ప్రవేశించ నుండడాన్ని చూసి ''ఆగు !'' అని అరిచాడు. ఆ అరుపు ఆ ప్రక్కనే గదిలోవున్న కదిరేశన్ నెత్తి మీద సమ్మెటపోటై పడింది. లేచి వద్దామని తపించికూడా తమాయించుకున్నారు.

''నువ్వెక్కడికి వెళ్ళి వస్తున్నావు ?"

''మీకు తెలుసు !" అంది ఆనంది.

మాణిక్యం చేయి తహతహలాడింది. కాని పక్కగదిలో కదిరేశన్ వుండడం వలన ఆమె శరీరాన్ని హింసించ దలచలేదు. దారి కడ్డంగా నిలిచి, ఆమె ముఖాన్ని మొరటుగా పైకెత్తాడు. కాని ఆనంది చూపులు కిందికే వున్నాయి. అక్కడే తన్ను హత్యచేసినాసరే కన్నెత్తి అతడి మొహంలోకి మాత్రం చూడకూడదన్న మొండి తనం ఆమెది.

"నువ్వికమీదనుండి అణ్ణామలై ఇంటికి వెళ్ళేటట్లయితే మళ్ళీ నా ఇంట్లోకి అడుగు పెట్టకూడదు !'' అన్నాడు మాణిక్యం.

ఆమె అక్కడే ఒక్క నిముషం నిలిచి ఆలోచించింది. ఆ క్షణాన్నే ఆ ఇంట్లోకి వెళ్ళబుద్ధికాలేదు. ఎక్కడికయినా వెళ్ళిపోవాలని తహతహ లాడింది. అప్పుడు గది తలుపులు తెరచుకుని బయటికి వచ్చిన కదిరేశన్— "ఎందు కిక్కడ నిలబడ్డావు ?" అని అడిగి ''లోపలికి వెళ్ళు" అని ఆజ్ఞాపించినట్లుగా అన్నారు.

మాణిక్యం వెంటనే అణ్ణామలై ఇంటివైపుగా నడిచాడు. మంచంమీద పడక పెట్టిన అణ్ణామలైను మాణిక్యం ఏమిచేస్తాడో అని దిగులుపడింది ఆమె. అతడి నామె ఆపలేదు; ఆప నిచ్ఛగించనూలేదు. కదిరేశన్‌కూడా జరుగుతున్న దానినంతా వేడుక చూస్తున్నవారిలా చూస్తున్నారు.

మాణిక్యం ఆవేశంతోనే బయలుదేరాడేగాని దారి మధ్యలోనే ఆవేశాన్ని దిగమింగుకోవాల్సి వచ్చింది.

దారిలో ఒకచోట నిల్చుని ముఖాన్ని చేతులతో బాగా రుద్దుకున్నాడు. తనలోనే మెల్లిగా నవ్వుకుంటూ నిదానంగా నడిచాడు అతడి మొహంలోని ఆవేశం - అదేమి చిత్రమో - మాయమయింది.

మాణిక్యం అణ్ణామలై మంచం దగ్గరగా కూచుని చాల అక్కరతో అతడి ఆరోగ్యం గురించి విచారించాడు. వ్యాపారం గొడవలు, కోర్టు గొడవలు కారణంగా తాను తరుచువచ్చి అతడిని చూడలేకపోయానని బాధపడ్డాడు. అనంది అక్కడికి వచ్చి వెళ్ళడం గురించి అతడేమీ మాట్లాడలేదు.

కోర్టు గొడవలు అని మాణిక్యం అనగానే అణ్ణామలైకు తమ కోర్టు కేసు విషయం గుర్తుకు వచ్చింది. ''ఆ కేసు ఇంకా నడుస్తూందా? నువ్వు వెళ్తూ వస్తున్నావా?'' అని కుతూహలంతో అడిగాడు అణ్ణామలై.

తిన్నగా జవాబు చెప్పకుండా మాణిక్యం ప్రతివాదులను, తన వకీలును నోటికి వచ్చినట్లు తిట్టసాగాడు. ఆ కేసునలా ఏళ్ళతరబడి లాగించి వుండవచ్చునని, అట్లా కాకుండా తన వకీలు తీర్పుకు అవకాశం కల్పించాడనీ చింతించాడు. తాను కట్టిన డబ్బును లెక్కలోకి తీసుకోకుండా, ప్రతివాదుల దొంగ లెక్కలనే నమ్మి కోర్టువారు తీర్పు ఇచ్చారని విచారించాడు.

"అయితే, కేసు ముగిసిపోయిందా?''

"ఔను, అవతలివారి కనుకూలంగా తీర్పు ఇచ్చారు. ఆ తీర్పుమేరకు నువ్వే ఆ నలభై వేల చిల్లరనూ తక్షణం కట్టాలి.''

అతడు, 'నేనే' అనడానికి బదులుగా నోరుజారి 'నువ్వే' అన్నాడనుకుని అణ్ణామలై ''అంత డబ్బునూ నువ్వు మళ్ళీ కట్టాలా!" అని అడిగాడు.

''చట్టరీత్యా చూస్తే మనం ఇద్దరమూ దానిని కట్టాలి. లేక, మనలో ఒకరు కట్టినా చట్టం సమ్మతిసుంది. కాని చట్టాన్నట్లా ఏడవనీ...... న్యాయప్రకారం

చూస్తే నువ్వు కట్టవలసిన డబ్బే అది. నువ్వే కట్టబోతున్నావు కూడాను. వేరే దారిలేదు."

అణ్ణామలై చేతికర్రనూ మరిచి మంచంమీదనుండి దూకాడు. ఎడమచేత్తో మాణిక్యం భుజాన్ని పట్టుకుని ఊపుతూ- ''ఇదేమి అన్యాయం! ఏమిటి నువ్వనేది? నాకేమీ బోధపడడం లేదే!" అని గోలపెట్టాడు.

"చూడు, ఇది డబ్బు విషయం. నాకేమీ తెలియదని చెప్పి తప్పించుకోవడానికి వీలులేదు. నువ్వు కష్టాలలో వున్నందున వాడిని కాస్త ఆగమని చెప్పాను. లేకపోతే ఈ పాటికి 'జప్తు వారంటు'తో వచ్చి ఇక్కడ నిలిచివుండేవాడు. నేనే నీ తరఫున చాలదాల ప్రతిమిలాడాను.''

ఆ మేడ ఉన్నపళంగా కూలి తన నెత్తిమీద పడ్డట్లనిపించింది అణ్ణామలైకి. 'న్యాయప్రకారంచూస్తే నువ్వే కట్టాలి' అన్నాడే ఎక్కడుంది న్యాయం? అప్పు తీసుకున్నవాడు మాణిక్యం; దానితో వ్యాపారం చేసినవాడతడు; కారు కొన్నవాడతడు; లాభం సంపాదిస్తున్నవాడతడు! అలా వుండగా సంతకంచేసి సాయం చేద్దామనుకున్న పాపానికిది శిక్షనా?

"మాణిక్యం! నువ్వు దొంగవు; దగాకోరువి; వంచకుడివి —" అని మండిపోతూ తిట్టాడు అణ్ణామలై. అయితే మాణిక్యం అవన్నీ విని చిరునవ్వు నవ్వుతూ వున్నాడే తప్ప, కోపం కలిగినట్లు కనబడనివ్వలేదు మౌనంగా వున్నాడు.

"ఇవ్వడానికి నా వద్ద డబ్బులేదు; వున్నా నేనివ్వను!'' అన్నాడు అణ్ణామలై.

"విను, నీ చేయి విరగ్గొట్టుకుని డబ్బివ్వమనడం లేదునేను. చట్టం ప్రకారం, న్యాయం ప్రకారం నువ్వు నాకివ్వాల్సిన డబ్బు అది. నువ్వు అంటే, మీ నాన్న ఇవ్వాల్సినది అనుకో. ఆయనవల్ల నాకేర్పడిన ముప్పైవేల నష్టం గురించి ఆలోచించు. ఆ ఆంధ్ర జమీందారు కాయన లొంగి వుండకపోతే అందులో లాభం మాత్రమే నాకు యాభై వేలు వచ్చివుండేది. కాని ఆయనవల్ల నా కదంతా నష్టమైంది. అదిగాక నేను కట్టిన వడ్డీనికూడా కూడిచూడు. మీ నాన్నకట్టిన ఇల్లు నీదని కులుకుతున్నావు కదా, మరి ఆయన అప్పుల బాధ్యత నీదికాదా?"

"ఇది అక్రమం! అన్యాయం! నువ్వింత నీచుడివని నేను అనుకోలేదు. మాణిక్యం! నువ్వు చేసింది పాపం! ద్రోహం!'' అంటూ అణ్ణామలై నోటికి

వచ్చినట్లెల్లా తిట్టాడు. దబ్బుమా ఇంటినీ లెక్కచేయలేదతడు. కాని మనిషి ఇంతటి కీడు చేయగలడు అన్న నిజం తెలిసి అతడి మనసు ఉడికిపోయింది. అందులోనూ మేస్త్రిగారి ఉప్పుతిన్నవా డీ మాణిక్యం; ఆయన పెట్టిన డబ్బుతో, ఇచ్చిన గుడ్డలతో, నేర్పించిన చదువుతో ఈ స్థితికి వచ్చినవాడు. కృతజ్ఞతను కాల్చి తినేసిన ఆ ద్రోహి ఊపిరి తనమీద సోకడంకూడా అణ్ణామలైకు జుగుప్స అనిపించింది.

"జరిగేదేదో జరగనీ... నేను దేనికీ ఉగులుపడను." "సరేలే, నువ్వు వెళ్ళు ఇక్కణ్ణుంచి!" అని అతడికి బయటకు దారి చూపించాడు.

"నువ్వు కోపపడి లాభంలేదోయ్! ఆ అప్పులవాడొచ్చి నీమీదే పడతాడు. నా దగ్గరకు రాడు. నువ్వు కావాలంటే ఆ అప్పు కట్టడానికి నీకు నేను సాయం చేయగలను."

"నా కేసాయమూ అక్కరలేదు."

"'జప్తు వారంటు'తో వాడు ఇక్కడికివస్తే బాగుండదే అని చూస్తున్నాను. అవసరమైతే చెప్పు. ఈ ఇంటిమీద అప్పు తీసుకుని వాడికి కట్టవచ్చు. నేను ఏర్పాటు చేయగలను."

"ఓహో! ఈ ఇంటినీ నువ్వే కాజేద్దామని చూస్తున్నావా? లేక నన్నిక్కడ నుండి తరిమివేద్దా మనుకుంటున్నావా?" అన్నాడు అణ్ణామలై.

ఒకే రాయితో రెండు పండ్లను రాలుద్దా మనుకున్న మాణిక్యం అణ్ణామలై ఇప్పుడు మునుపటి పసిబిడ్డకాదని తెలుసుకున్నాడు. మేలుకున్న అతడికి గుణపాఠం చెప్పడానికి కావలసిన చర్యలను వెనువెంటనే తీసుకోసాగాడు. అణ్ణామలై మాటలు కలిగించిన వేదనకు ప్రతీకారం చేతలద్వారా చేయాలని పని మొదలు పెట్టాడు.

## 11

అణ్ణామలై సహించలేకపోయాడు. మాటిమాటికి తాను అప్పులవాడిగా అవడం సహించలేకపోయాడు. 'నాకు ఇల్లు వాకిలీ వద్దు; ఆస్తి సుఖం అంతకన్నా వద్దు. ఈ ప్రపంచంలో ఏ వస్తువూ వద్దు. అయితే నేను అప్పుల వాడినన్న నిందను మాపడానికి అవి బలిఅవుతూంటే చూస్తూ ప్రాణాలతో వుండాలా?'

కిటికీగుండా పక్కింటినీ, తోటనూ తదేకంగా చూశాడు : 'మొదటి సారిగా నే నిక్కడికి వచ్చినప్పుడు స్వర్గలోకపు రమ్య హర్మ్యంగా తోచిన ఇల్లు ఇదేనా ? ఆ పాతఇల్లు మాణిక్యం చేతి లాఘవంతో కొంగ్రొత్త బంగళాగా మారినమాట వాస్తవం. సిమెంటు గట్టిదనంవల్ల నయితేనేమి, పైపై మెరుగులతో నయితేనేమి అది మారినదీ నిజమే. కాని ఆ పాత ఇల్లు ఆ ఇంట్లోని వారికిచ్చిన మనో నిశ్చలత్వం ఇప్పు డెక్కడకు పోయింది ? దానిలోని జీవం, కాంతి, ఉత్సాహం ఎక్కడికి ఎగిరిపోయాయి ? అందులోంచి వెలుగుతుండిన ప్రేమజ్యోతి ఏమయింది ? ఎక్కడికి పోయింది ?'

ఆనందీ, కదిరేశన్ల తలలు కనుపించాయి.

'లేదు; ఆ జ్యోతి ఇంకా ఆరిపోలేదు, రెండు చిన్న ప్రమిదలు అక్కడ ఇంకా మినుకు మినుకు మంటున్నాయి; ఆరిపోయే దీపాలవలె అవి ఊగిసలాడుతున్నాయి.'

దీర్ఘంగా నిట్టూర్చాడు అతడు.

'ఎప్పుడయినా మారంనుండి ఆనందిని నేను చూడాలంటే అది నే నింట్లో వుంటేనేకదా వీలవుతుంది ? లేకపోతే ఆమె కన్నుమూసినా ఆమె మొహాన్ని నేను చూడకుండా చేస్తాదా మాణిక్యం !' - అణ్ణామలై కనులనుండి నీటిధారలు ప్రవహించ సాగాయి.

—బోనులో పులిలా ఇటూ అటూ తిరుగుతున్నాడు అణ్ణామలై. అతడిని కళామతల్లికి అనుంగుబిడ్డలా అర్పించిన ఆ కపాలేశ్వరుడి ఆలయ గోపురం ఎట్లాగో అతడి లోపలనుండి కొద్దికొద్దిగా తొక్కుకుంటూ తోసుకుంటూ వెలుపలికి వస్తున్నట్లు అన్పించింది. ప్రసవవేదన వంటిదే, వివరించరాని వేదన......... తటాలున ఒక పిచ్చుక తోటలోనుండి ఎగిరి కిటికీగుండా లోపలికివచ్చి కిటికీ తలుపుమీద కూచుంది. దానిని కన్నార్పకుండా చూశాడు. దాని కళ్ళల్లో విముక్తి ఎంతగా వెలుగుతూంది !

'విచ్చుకుని సంకెలలా
పిచ్చుకవలె ఎగరవోయీ మానవా !'

గోపురం అతడిలోపలే వుండి అతడి చెవులలో అరుస్తున్న భ్రమ కలిగింది. గుడ్డముక్కలవంటి కట్లలో వున్నదానిని వెర్రి ఆవేశంతో విదిలించాడు; కట్లు వీడి

పోయాయి. ఎడమ చేతితోను, పళ్ళతోను లాగి ఆ గుడ్డముక్కలను విసిరివేశాడు. కుడిచేతిని మడిచి, చాచి, పైకెత్తాడు. నొప్పి ఇంకా వుంది. కాని దాని నతడు లక్ష్యపెట్టలేదు.

పక్కనున్న పెట్టెను క్రింద తిరగబోశాడు. ఆ కుప్పనుండి ఆనంది పెన్సిలు స్కెచ్‌ను తీశాడు. మేద తలుపులు మూసుకుని, దానిని చూస్తూ పెద్ద చిత్రం వేయసాగాడు. అతడి లోలోని కటకటాకేవో కొద్దికొద్దిగా బద్దలవుతున్న భావం, వాటినుండి విడిపడి వడివడిగా వెలుపలికి వస్తున్న భావం అతడిని ఆవరించ సాగింది. ఒక గంటసేపట్లో అతడి మనసు గాలిలో రెక్కలు విదల్చుకుంటూ పిచ్చుకలా ఎగిరింది.

ఆనంద పారవశ్యం పొంగి పొరలుతున్న అద్భుతమైన కల్పనా జగతిలో విహరించసాగా డతడు. హరివిల్లులోని ఆరున్నొక్క రంగులనూ రంగరించి ఆనందిని రూపొందించుతున్న ఆనందం అతనిది. అతడు వేస్తున్న ఆనంది కన్యగా ఆ రోజులలో అతడితో మెలగిన ఆనంది. అప్పుడే విరిసి మంచులో తడిసిన పువ్వు వంటి రూపంతో స్వాప్నిక లోకాల విహరిస్తున్న ఆనంది. వయసూ సొగసూ, ఉత్సాహమూ దరహాసమూ - వెలుగుతున్న కళ్ళు, నాట్యమాడే నడకా - కలిసి పోతపోసిన ఆనంది. తాను వెళ్ళినప్పుడెల్లా ఆదరించి ఉపచరించిన ఆనంది. నూతనత్వానికి నిర్వచనంలా నడయాడే చిత్రసుందరి నాతడు చిత్రించసాగాడు.

'కాలమహిమ కారణంగా రూపంమారి జీవచ్ఛవంగా మారిన ఈనాటి ఆనందిని నేనిక చూడలేనట్లేవుంది. అందుకు బదులుగా ఈ చిత్రసుందరయినా నాకు తోడుంటుంది కదా ? ఈ చిత్రాన్ని ఏ అప్పులవాడూ వచ్చి నానుండి లాక్కుని పోడుకదా ? నే నెక్కడ జీవించినా, గుడిసెలోవున్నా ఈ చిత్తరువులోని భామ నాతోనే వుంటుంది కదా ?'

అతడి ఊపిరీ ప్రాణమూ, ప్రాణానికి ప్రాణమూ, ఆత్మా ఆత్మయొక్క ఆత్మా - అన్నీ కరిగి రంగులై కుంచెగుండా ఆ చిత్రంలోకి వర్షిస్తున్నాయి.

ఆ తలుపులు తడుతున్న శబ్దం ఆగలేదు. వేగంగా వెళ్ళి, తలుపులు తీసి, ఆ అడ్డొచ్చినవారిని చంపిపారేద్దామన్న కోపంతో చూశాడు అన్నామలై. అతడి చూపుచూసి గజగజ వణికింది శారద. మరుక్షణం అతడి కుడిచేతిని చూసి కెవ్వు

మని అరిచింది. మడిచి కట్టుకట్టివుండిన ఆ చేతిలో, ఆ చేతిలో కుంచె! కుడి మోచేతివద్ద పెద్ద వాపు!

పరుగెత్తుకొచ్చి అతడి భుజాన్ని పట్టుకుని - "ఇదేమి ఘోరం? ఇన్నాళ్ళు మీరుపడ్డ అవస్థలన్నీ మరిచిపోయారా? ఇంత హఠాత్తుగా ఈ వెర్రి ఆవేశం ఎందు కొచ్చింది మీకు?" అంటూ కేకలేసింది. తిరిగి, అతడు రచిస్తున్న చిత్రాన్ని చూసింది; కారణం తెలుసుకుంది. ఆమె ఒడలు పులకరించింది, ఆ చిత్రాన్ని చూస్తుంటే.

"నేను ఈ ఇంటిని విడిచి వెళ్ళిపోబోతున్నాను; మాణిక్యం వచ్చి నన్ను తరిమేలోగా నేనే వెళ్ళిపోతాను." అంటూ ఆరంభించాడు; "అయితే, ఈ చిత్రాన్ని నాకు ఎవ్వరూ దూరంచేయలేరు... నా ప్రాణం పోయినా దీనిని మాత్రం ఎవరికీ ఇవ్వబోను!" అన్నాడు.

శారద కేమీ అర్థంకాలేదు. మితిమించిన ఆవేశంలోపడి తన నిదానాన్ని కోల్పోయాడు అతడు అన్పించింది. తర్వాత ఆమె బలవంతంమీద వెళ్ళి మంచం మీద పడుకున్నాడు. మాణిక్యం తన్ను మోసగించిన వైనం తెలిపి— "ఆనంది చచ్చిపోయినాకూడా నేనామె ముఖం చూడలేనుకదా!" అని కంట తడిపెట్టాడు.

# 12

దీపాలుపెట్టే వేళయింది. అణ్ణామలై ఇంటినుండి బయలుదేరిన శారద కదిరేశన్‌ను వెతుక్కుంటూ వచ్చింది. వారింటి తోటలోనే ఆయన కనపడ్డారు. "మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలని వచ్చాను." అంది. ఇద్దరూ సరస్వతీ విగ్రహం దగ్గరగా పాలరాతి అరుగుమీద కూర్చున్నారు. శారద చెప్ప దలచిన దానిని గబగబ చెప్పుకుపోసాగింది. విగ్రహంలా కూచుండి పోయా రాయన.

తనకు తెలిసినదంతా చెప్పి, శారద, చివరగా, అణ్ణామలై తనకు తెలియ కనే ఋణగ్రస్తుడయిన వృత్తాంతం చెప్పి, "ఆయనకు ఇంకా కష్టాలు కల్గించడం

ఆ భగవంతుడికే తగదు!'' అని ముగించింది. కదిరేశన్ అన్నీ విన్నారుగాని ఏమీ మాట్లాడలేదు. శారద లోపలికి వెళ్ళి ఆనందిని చూడకుండానే వెళ్ళిపోయింది. అత్తగారి పోలీసు కాపలాలోవున్న ఆనంది నామె ఇబ్బంది పెట్టదలచుకోలేదు.

శారద వెళ్ళిపోయాక, నక్షత్రాల వెలుగులో, కదిరేశన్ తోటలోనే కాసేపు పచారు చేశారు.

''జీవితాన్ని అందంతో నింపు; కాని అసహ్యంతో నింపకు!'' అన్న సూక్తి ఆయన్నుచూసి ఎగతాళి చేయసాగింది. ఆయనకే తెలియకుండా ఆ కుటుంబంలో ఏమిటేమిటో జరుగుతున్నాయి. 'ఆనంది తెలివితక్కువగా ప్రవర్తించింది. ఒకరుచేసిన తప్పిదానికి బహుమతిగా వాడికి తన్నే అర్పించుకుంది!'— ఆయన శారద చెప్పినదానిని నమ్మకుండా వుండలేకపోయారు.

బయట కారు దీపాల వెలుగు కనపడింది; శబ్దమూ వినిపించింది. మాణిక్యం తిరిగి వస్తున్నాడు. అతడికి స్వాగతం పలకదలచిన వాడివలె ఆయన గబగబ వెళ్ళి వసారాలో నిల్చున్నారు. కారుదిగి వస్తున్న మాణిక్యంతో— "ఇట్లా నా గదికోసారి రండి—" అని చెప్పి పిలుచుకు వెళ్ళారు.

"ఏమిటి విషయం?'' అని నిల్చునే అడిగాడు మాణిక్యం. అతడిని కూచోమని చెప్పి మాట్లాడసాగారు కదిరేశన్.

"మీరూ, అణ్ణామలై సంతకాలుచేసి తీసుకున్న అప్పును మీరు త్వరగా కట్టేయండి. మీరే కట్టాలి దానిని!''

ఆయన గొంతులోని నిశ్చయత్వాని కతడు విస్తుపోయాడు. మరుక్షణం సర్దుకున్నారు. అణ్ణామలై అక్కడకువచ్చి ఆయనతో చెప్పుకున్నాడేమోనని మాణిక్యం అనుమానం.

"అతడి తండ్రిద్వారా నేను పొందిన నష్టాని కతడు పరిహారం చెల్లించాలి. ఆస్తికి హక్కున్నవాడు అప్పు బాధ్యతకూడా స్వీకరించవలసిందే!"

''ఆయన తండ్రివలన మీరు నష్టపోయారా? లేక మీ వలన ఆ మంచిమనిషి ప్రాణాలు కోల్పోయారా?" అని అడిగి— "మీ రిట్లా అన్యాయంగా మాట్లాడకూడదు. చదువుకున్నవారు సంస్కారంతో ప్రవర్తించాలి. చదువుకు అందం సంస్కారమే...'' అన్నారు కదిరేశన్.

ఎన్నడూలేనిది అవాళ మామగారు తనకు ఉపదేశం చెయ్యడం మాణిక్యానికి మంటగావుంది. ఆయనలోని అధృధత్వాన్ని మొదటిసారిగా తెలుసుకున్నాడతడు. జవాబు చెప్పకుండా ఆయననే చూస్తూ నిల్చున్నాడు మాణిక్యం.

"చేతిలో డబ్బులేకపోతే, ఈ నా ఇంటిని అమ్మి ఆ అప్పును కట్టండి. ఇంటి నివాళ అమ్మితే రేపు ఇంకో ఇంటిని కొనుక్కోవచ్చును. కాని అంతరాత్మను అమ్ముకుంటే మనుషులుగా బ్రతకలేము. రేపే ఈ పని ముగించి, ఆ తర్వాత మిగతా పనులను చూడండి !"

"అది వీలుకాదు; జరగదు !'' అని మొరటుగా అరిచాడు మాణిక్యం.

''ఎందుకని ?"

"ఈ ఇంటి విలువకన్న ఎక్కువ మొత్తాన్ని అప్పుగా తీసుకుని వ్యాపారంలో వాడాను. నా దగ్గర వసూలుచేయడానికి ఏమీ లేదనే ఆ అప్పిచ్చినవాడు అతడిమీద పడుతున్నాడు.''

ఆఘాతం తగిలినట్లయింది కదిరేశన్‌కు. 'ఈ ఇల్లు ఇప్పుడు మీదికాదు, నాది' అని చెప్పకుండానే చెప్పాడతడు. అతడి భయంకరమైన స్వార్థం, అహంకారం ఆయనను నిశ్చేష్టుడిగా చేశాయి. ఆయన పెట్టుకున్న ఆఖరి ఆశకూడా వృధా అయిపోయింది. అతడితో ధర్మం పేరిట, న్యాయం పేరిట వాదించారు కదిరేశన్. కాని మాణిక్యం ససేమిరా లొంగలేదు. అసలు ధర్మమూ, న్యాయమూ వుంటే అవి తన పక్షాన్నే వున్నాయని ప్రతిగా వాదించాడతడు: కోర్టువారే ఆజ్ఞామలై అప్పు ఇవ్వాలి అని తీర్పు ఇచ్చాక ఆయన అతడి తరఫున మాట్లాడడం సబబుగా లేదని అతడు వాదించాడు.

''మాణిక్యం !'' అని అతడి నదలించి — "మీరు వయస్సులో చిన్నవారయినా మితిమీరిన తెలివితేటలు సంపాదించారు. కాని ఇంత తెలివీ, నేర్పరితనమూ పెడదారిని పడుతున్నాయేనని నాకు విచారంగా వుంది." అన్నారు ''ఇతరులను వంచించడం, ఇతరులకు ద్రోహం చేయడం, ఇతరులను మోసగించడం, ఇతరుల వస్తువుల నాశించడం - ఇవి జీవితపు సౌందర్యాన్ని కలుషితంచేసే అల్పమైన చేష్టలు. ఇకమీదయినా మీరు అందంగా జీవించడం నేర్చుకుంటారని నమ్ముతున్నాను..."

మాణిక్యానికి, మామగారి గొంతు నలాగే నులిమిపారేయాలన్నంత ఉద్రేకం కలిగింది. తటాలున లేచి వెళ్ళిపోదామనుకున్నాడు. కాని ఆనంది తలుపుదగ్గర నిల్చుని వున్నట్లు మొదటి సారిగా చూశాడు.

''ఆనందీ! నీ కిక్కడేం పని?'' అంటూ కదిరేశన్ మీది అక్కసునంతా ఆమెమీద వెళ్ళగక్కాడు.

''పనివుంది." అని ఆనందిని తమ దగ్గరకు పిలిచారు కదిరేశన్. ఆమె ముఖాన్ని సరిగా చూడలేనంతగా కన్నీళ్ళు నిండాయి ఆయన కళ్ళల్లో. కళ్ళద్దాలను తీసి కళ్ళను తుడుచుకున్నారు. బయటికి వెళ్ళామనుకున్న మాణిక్యం అలాగే నిల్చుండి పోయాడు.

''ఆనందీ! నేను నీ కోసం చేయించిన నగలు, మీ అమ్మ నగనట్రా, నేను మీ అమ్మకొన్న పాత్రలు అవీ, కలపసామగ్రి - వీటన్నిటిని ఒక జాబితాలో రాసుకురా! వీటన్నిటినీ రేపే అమ్మడానికి ఏర్పాటు చేయిస్తాను. ఆ వచ్చిన డబ్బును మొదటే కట్టేద్దాం, తర్వాత మిగతాది చూద్దాం. ఈ అప్పులో ఒక పైస నయినా అణ్ణామలైను కట్టనివ్వను. అలా అతడు కట్టవలసివస్తే, నేను ప్రాణంతో వుండి లాభంలేదు." కదిరేశన్ బక్కపలచని శరీరం ఉద్వేగంతో ఊగిసలాడింది.

''మిస్టర్ కదిరేశన్!'' అంటూ నాటక ధోరణిలో ప్రారంభించాడు మాణిక్యం. ''ఈ ఇంట్లోంచి గడ్డిపోచయినా బయటికి పోవడానికి వీలులేదు. ఆనందికి తాళికట్టిన భర్తను నేను; ఆమె నా భార్య. ఈ ఇంటికీ, ఇంట్లోని వస్తువులకూ యజమానిని. ఇంటి గుమ్మానికి అడ్డంగావున్న ఆ విగ్రహాన్ని కావాలంటే పెకలించి తీసుకుపోవచ్చు!"

"మీరు తాళికట్టినవారు! అందువల్లనే ఆమె మీ భార్య! అందువల్లనే ఈ సొత్తంతా మీది!'' కదిరేశన్ నవ్వారు. భయంకరంగా నవ్వారు.

ఆ నవ్వులో ఏముందో తెలియదు. అది వాడి అంతరంగాన్ని కాల్చింది. అంతరాంతరాలను కాల్చింది. అక్కడ దాగిన ప్రాణాన్నే కాల్చింది. కలవరంతో ఆనందివైపు తిరిగాడు. ''రా! వచ్చి నాకు భోజనం పెట్టు. మీ నాన్నగారి నేదో

ఆవహించింది. నేనింక ఆయనతో మాట్లాడలేను." అంటూ ఆమె చేతిని పట్టుకుని బరబర లాక్కుని పోసాగాడు.

"నాన్నా ! రండి మీరూ భోంచేద్దురుగాని—'' అంది ఆనంది. కదిరేశన్ మళ్ళీ నవ్వారు. "పోవమ్మా కూతురా, పో! భోంచేసి చేసి ఈ కాయాన్నిలా చెట్టులా పెంచినది చాలు. హత్య గావింపబడిన ధర్మం విలవిలలాడుతున్న ఈ క్షణాన నన్ను అన్నం తినమని అడగకు! వెళ్ళు! ధర్మం నా గొంతుకు అడ్డంపడి ఊపిరాడకుండా చేస్తుంది.''

భోంచేస్తుండగా మాణిక్యానికి చాలాసార్లు గొంతుకు ఏదో అడ్డంగా వచ్చినట్లయింది. ఎవరో పాపాత్ములు తన బిడ్డను శపిస్తున్నారని తిట్టిపోసింది మాణిక్యం తల్లి. ఆ పాపాత్ములు ఎవరో ఆమె చెప్పకపోయినా వాళ్ళు ఆనందీ, కదిరేశన్ అని ఆమె సూచనలు చెప్పకనే చెప్పాయి.

ఆ ఇంట్లో ఆ రాత్రి ఇద్దరు భోజనం చేయలేదు; ఇద్దరు నిద్రపోలేదు. ఇద్దరూ ఎవరికి వారే వారివారి ఆత్మలను వెతుక్కుని వేసారుతున్నారు. చీకటి నిండిన ఆ సమయంలో - తమ లోలోపలి వెలుగు నన్వేషిస్తున్నారు. దారీ తెన్నూ తెలియని కారడవిలో చిక్కుకుని, దూరంగా కనపడుతున్న కొండ శిఖరంమీది వెలుగు నందుకోవాలని ప్రయత్నిస్తున్నారు. కాంతి దూరంగా కనపడింది; కాని దారే కనపడలేదు. దానికోసం వారు దగ్గరగా వెళ్ళినకొద్దీ అది దూరంగా వెళ్తున్నట్లు భ్రమ కలిగింది.

—మరురోజు పొద్దుపొడవగానే కదిరేశన్ ఇల్లువిడిచి బయలుదేరారు. ఎక్కడికి వెళుతున్నదీ ఆనందికి కూడా చెప్పలేదు.

కొంతసేపటికి, అణ్ణామలై ఇంట్లోకి ఎవరెవరో వెళ్తుండటం చూసింది. కోర్టు అధికారులూ, అమీను మొదలయినవారూ అప్పిచ్చినవాడూ కలిసి అణ్ణామలై ఇంటిని ముట్టడించారని ఆమెకు అర్థమైంది. వెంటనే గోడుగోడుమంటూ, వెర్రిపట్టిన దానిలా మాణిక్యంవద్దకు పరుగెత్తింది. అతడు ఆ దృశ్యాన్ని ఎదురుచూస్తున్నవాడిలా, చిరునవ్వుతో మేడమీద నిల్చుని చూస్తున్నాడు.

# 13

ఎవరో ముక్కూ మొగమూ ఎరగనివారు నలుగురైదుగురు కలిసి మీనాక్షమ్మ వద్దకువచ్చి, అణ్ణామలై కోసం వచ్చామని చెప్పారు. చెప్పి ఆ ఇంటి తలుపుమీద ఒక కాగితం అంటించారు. ఎవరి అనుమతీ అడగకుండా ఇంట్లోకి వెళ్ళి అన్నీ పరిశీలించసాగారు. వచ్చినవారిలో ఒకడు ఇంటినీ, ఇంటిలోని సామాన్లనూ జప్తుచేయడానికి వచ్చినట్లు మీనాక్షమ్మతో చెప్పాడు

మీనాక్షమ్మ పైప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. భయంతో తత్తరపాటుతో, మేడమీదున్న అణ్ణామలై వద్దకు వెళ్ళింది ఆమె. అక్కడ ఆనంది చిత్రం ఎదుట కూచుని దానికి మెరుగులు దిద్దుతున్నాడు అణ్ణామలై; మైమరచి వున్నాడా పనిలో. ఇంకో రెండు గంటలు ఎవరూ అంతరాయం కల్గించకుండా వుంటే చాలు ఆ చిత్రం పూర్తవుతుంది. అతడి కుడిచేయి బాగా నొప్పిగావుంది. కుంచె పట్టుకున్న వేళ్ళూ, కుడి మణికట్టూ విరిగి పడిపోయేటట్లున్నాయి. అయినాసరే పని ముగించిగాని లేవ కూడదన్న మొండి పట్టుదలతో వున్నాడణ్ణామలై.

పనిమధ్య అంతరాయం కల్గించిన తల్లిని తిరిగిచూశాడు అణ్ణామలై. సంగతి చెప్పి ఆమె ఏడ్చింది. ఆ అదరుపాటు, ఆ అవమానం భరించలేకపోయింది ఆమె.

“ఇప్పుడు నేనువచ్చి ఎవరినీ చూడలేనని చెప్పమ్మా! అంతకుమించి వారేమనా చేసుకోవాలి అంటే చేసుకోనీ! నేను మాత్రం ఈ పనిని విడిచి రాలేను!” అన్నాడణ్ణామలై కోపంతో.

తన కొడుకు ధోరణిచూసి నవ్వాలో, ఏడ్వాలో తెలియలేదు మీనాక్షమ్మకు. ఇల్లు అంటుకుపోతూంటే, ఇట్లా మొండికెత్తి కూచుంటాడే ననిపించింది ఆమె కోప్పడింది కొడుకును. కాని అతడు చలించలేదు.

ఆలోగా ఆ వచ్చిన వారందరూ మేడమీదికి వచ్చారు. అణ్ణామలై కోపంగా వారివైపు చూశాడు. 'కళాసృష్టి జరుగుతున్న ఈ పవిత్ర సమయాన ఇక్కడ అడుగుపెట్టడానికి మీకు అర్హత వున్నదా?' అని అడిగింది ఆ చూపు.

వచ్చినవారిలో ఒకడు కోర్టు ముద్రవున్న ఒక కాగితంమీద అణ్ణామలై సంతకం తీసుకున్నాడు. ఆ కాగితాన్ని చదువుకొమ్మన్నాడతడు. విసుగుతో చదివాడు

అణ్ణామలై. అప్పుకు బదులుగా ఆ ఇంటినీ, అందులోని వస్తు సామగ్రినీ కోర్టువారు స్వాధీనం చేసుకుంటున్నట్లుగా అందులో వుంది. అప్పుడయినా అతడు అప్పు కట్టక పోతే ఇంటినీ, ఇంట్లోని వస్తువులనూ వేలంవేసి అప్పుల వాళ్ళకు అప్పులు చెల్లించు తామని అందులో వుంది.

అందులో వున్న 'స్థిర, చర ఆస్తులు' అన్నది చదవగానే అణ్ణామలైకు ఒక సందేహం కల్గింది. తాను వేస్తున్న ఆనంది చిత్రం వైపు చూశాడు. 'వీరు దీనికూడా చరాస్తికింద లెక్క కడతారా ?'

—"సరే, ఇప్పుడేమి చేయదలచుకున్నారు ?" అని అడిగాడు.

''ఇంకాస్సేపట్లో లారీ వస్తుంది. మొదట ఈ ఇంట్లోని సామన్లనా లారీ లోకి ఎక్కించి తీసుకువెళాము. ఆ తర్వాత మీరా ఇల్లు ఖాళీచేసి మాకు అప్ప గించాలి. ఖాళీచేసిస్తే ఇంటికి తాళంవేసి, 'సీల్' వేయడానికి వీలు అవుతుంది." అన్నాడు ఒకాయన.

"ఓహో !'' అని అన్యమనస్కుడై తలవూపి— ''మీలో అప్పిచ్చిన దెవరు ? కోర్టువా రెవరు ?" అని అడిగాడు. అప్పు తా నిచ్చినట్లు ఒకతను చెప్పు కున్నాడు. అతడిని అణ్ణామలై అంతకుముం దెన్నడూ చూసి ఎరగడు. అతడూ మాణిక్యంలాగే అడ్డంగా బలిసివున్నాడు. శరీరమంతా ముడతలు, చదువూ సంస్కారమూ లేదని స్పష్టంగా చెప్పే ముఖం.

"చట్టప్రకారం మీరు చేసినది సరిగా వుండవచ్చును. కాని మీకు అంతరాత్మ అనేది వుంటే, దాని ప్రకారం ఇది ద్రోహం—'' అని బాధతో అన్నాడు. "ఇన్ని అక్రమాలను మీరు మాణిక్యం ప్రేరణతో అతడికోసం చేశారు. నేను చేయిజాచి మీనుండి పైసా తీసుకోలేదని మీకు తెలుసు. అతడినుండి డబ్బు వసూలు చేయ వచ్చును అని మీకు తెలుసు. ఈ ఇంటిని అతడు వేలంలో కొనడానికని మీ రిట్లా చేస్తున్నారు. హాయిగా చేసుకోండి. శవాన్ని పీక్కుతినే రాబందులు, మనిషి చచ్చాకనే ఆ పని చేస్తాయి. కాని ధనాన్ని తినే మీలాటివారు మనిషి బ్రతికుండ గానే పీక్కుతుంటారు. మీ రింతగా పేరాశపడే ఈ ఆస్తివుందే, ఇది నా పాదధూళికి సమానం. మీరు నిశ్చింతగా కాజేసుకుపోండి !''

కార్లు, బంగళాలు, పొలాలువున్న ఐశ్వర్యవంతుడా అప్పిచ్చిన ఆసామీ. తన ధనగర్వంతో ఎందరినో బెదరించి నాశనంచేసిన ఘనుడు. డబ్బులేనివారు

తమ చెప్పుక్రింద నల్లులని భావించినవాడు. అలాటివాడి కిట్లాంటి వ్యక్తిని చూడడమే వింతగా వుంది; దిగ్భ్రమగా వుంది. ఏమీలేని ఈ బికారిముందు అతడు ఏమీ సమాధానంకూడా చెప్పలేక నిల్చుండిపోయాడు. అణ్ణామలై దగ్గర 'ఏమీ' లేక పోయినా, వేరే 'ఏదో ఒకటి' వుందనిపించింది అతడికి.

"ఇదిగో, ఈ చిత్రాన్ని మీరు చరాస్తిగా లెక్కకట్టకుండా నాకు దీనిని వదిలేసి మిగతా అన్నీ తీసుకోండి. నేను దీనిని ఎవరికీ ఇవ్వను. ఇలా కాక దీని మీద ఎవరయినా చేయివేస్తే నే నేమి చేస్తానో నాకే తెలియదు ?''

పిచ్చివాడిని చూసినట్లు చూసి— "ఈ చెత్త కాగితాలేవీ మాకు వద్దు...'' అన్నాడు అతడు కోపంతో.

"ఔనౌను ! అచ్చొత్తిన నోట్లకు మొక్కే భక్తులు కదా మీరు !" అని అణ్ణామలై, ఒక మూలగా నిల్చునివున్న తన తల్లిని చూసి— ''అమ్మా ! ఇంటి తాళం, పెట్టెల, అలమారల తాళాలు వీరి కిచ్చేయి. మొదట వీళ్ళు క్రిందవున్న సామాన్లను బయటపెట్టనీ... ఈలోగా నేనీ చిత్రాన్ని పూర్తిచేస్తాను. ఆ తర్వాత మనం ఎక్కడయినా పోదాము !'' అన్నాడు.

వరద తలకు మించిపోయిందని తెలుసుకున్న మీనాక్షమ్మ మౌనంగా కిందకుదిగి వెళ్ళింది. మాట్లాడే స్థితిలో లేదామె.

''ఎక్కువ గొడవతో నా పనికి భంగం రాకుండా మీ పనులు చూసుకోండి; వెళ్ళండి !" అన్నాడు అణ్ణామలై.

దాడిచేసిన మూక నెమ్మదిగా కదిలింది. వారిలో ఒకతను నెమ్మదిగా అణ్ణామలై దగ్గరకు వచ్చాడు. కోర్టుకు చెందిన వాడతడు.

"చట్టరీత్యా మీకో దారి లేకపోలేదు; ఈయన అప్పును మీరు మొదట కడితే, తర్వాత మీరు మాణిక్యంమీద కేసునడిపి, ఈ డబ్బు నాయననుండి వసూలు చేయ వచ్చును '' అన్నా డతడు.

బాధతో నవ్వాడు అణ్ణామలై : ''కోర్టుకు వెళ్ళడమే అవమానంగా భావించిన ఆయన కొడుకుగా పుట్టినవాడిని నేను. ఆయన మాణిక్యాన్ని నమ్మవద్దని చెప్పే కన్నుమూశారు. ఆయన హితవును పాటించనందుననే ఈ శిక్ష లభించింది. ఇదిదాలు నాకు. ఇంతటితో నేను మాణిక్యాన్ని మరిచిపోదలచుకున్నాను. మిత్రు

డిగా, శత్రువుగా అతడు నా మనసున వుండదగడు, ఇంక నా ఆస్తి నా మనసు; దానిని నేను కాపాడుకుంటే చాలు.''

విచారంతో వెనక్కు పోయాడతడు.

మరల ఆ మేడ గదిలో శాంతి నెలకొంది. నెమ్మదిగా నడిచి కిటికీదగ్గర వెళ్ళి నిల్చుని పక్కింటిని తదేకంగా చూశాడు కాసేపు. ఇంక దానిని మరల చూడలేనుకదా అని, కన్నులు మనసు ఆస్వాదించినంతవరకు ఆ దృశ్యాన్ని ఆస్వాదించాడు.

తోటలో, ఇంటి వాకిట్లో, పెరట్లో, కిటికీ ప్రక్కన - ఎక్కడా ఆనంది కనపడలేదు. ఒకే ఒకసారి, ఆఖరిసారి, ఆమెను దూరం నుండయినా చూడాలని తపించింది అతడి ఎద. ఆ తపన వేదనగా ముదిరిందేగాని దానికి ఉపశమనమార్గం ఏదీ దొరకలేదు.

ఉన్నట్లుండి ఒక భయం పట్టుకుంది. చిత్రాన్ని ముగించేలోగా ఆ కోర్టు వారు పనికి అడ్డొస్తారేమో ? అలాగయితే ఎక్కడికెళ్ళి ఈ చిత్రాన్ని పూర్తి చేయడం ? చెన్నపట్నంలో వెంటనే ఇల్లు అద్దెకు దొరకదు. శరవణన్ ఇంటికో, ఇంకెవరి ఇంటికో వెళ్ళి వుండాలి. మరి ఈ చిత్రాన్ని వేయడానికి వలసిన ఏకాంతం లభిస్తుందా ?

వెళ్ళేటప్పుడు ఎలాగయినా ఆనందిని చూసి, చివరిసారిగా చూసి, ఆమె నుండి సెలవు తీసుకోవాలి అని అతడు నిశ్చయించుకున్నాడు. ఆనంది తన్ను చూడడానికి ఇక్కడికి రావడం కల్ల. తానిక్కడికి ఇంక రాలేనని ఆమె ముందే చెప్పింది. అయినా ఆమెను చూడకుండా, ఆమెతో చెప్పకుండా పోకూడదని తీర్మానించుకున్నా డతడు. చూడకుండా పోకూడదు. చూడకుండా పోకూడదు. గుండె ఆ ఆశతో కొట్టుకుంటూంది. ఉరికంబం ఎక్కేవాడి చివరి కోరికలా తన చివరి కోరిక ఇది; ఇదయినా నెరవేరాలి !

చిత్రాన్ని పూర్తి చేద్దామని దాని దగ్గరకు వచ్చాడు. చిత్రంలోవున్న ఆనందిని ప్రేమతో చూశాడు. కొన్ని నిముషాలలో ఇదమిత్థమని చెప్పలేని ప్రశాంతి అతడిని ఆవరించింది. అతడు జీవితంలో అంతకుముందెన్నడూ అనుభవించి ఎరగని

శాంతి అది. అతడూ, ఆనందీ - కేవలం వాళ్ళిద్దరూ మాత్రమే ఈ విశాల జగాన వున్నట్లు - ఇంకే ప్రాణీ - లేనట్లు అనిపించింది. ఎటుచూసినా నిశ్శబ్దం, శూన్యం! పొలంలేదు, నీరులేదు, నిప్పులేదు, గాలిలేదు, అంతా శూన్యమే!

అయితే, ఆ శూన్యంలోనుండి ఆనంది మాత్రం ప్రకాశవంతములైన తన కళ్ళతో దీక్షగా చూస్తూ, చిరునవ్వు నవ్వుతూంది. ఆమె శ్వాస అతడికి తగులు తున్నది. ఆమె పెదవుల కంపనం అతడి కళ్ళకు కనపడుతున్నది. ఆమె ఏదో రహస్యాన్ని అతడి చెవులలో చెప్పాలని తహతహలాడుతూంది. ఆ మాటను ఆమె నోటిద్వారా వినాలని తపించారు అణ్ణామలై.

"చెప్పండి ఆనందీ! చెప్పండి! మీరు చెప్పదలచుకున్నదానిని నా దగ్గర దాచకండి!'' అని ఆ సజీవ చిత్రాన్ని వేడుకున్నా డతడు.

# 14

తమిళనాడు గ్రామాలలో ఒక పసిరికపాము గురించి చెప్పుకుంటుంటారు. ఎవరినయినా కాటువేయడంతో దానికి సంతృప్తి కలగదట. అది శ్మశానానికి వెళ్ళి అక్కడో చెట్టు చివర కొమ్మమీద తెగబాకి తోక వేస్తుందట; వేసి కుతూహలంతో ఎదురు చూస్తుందట. కాటుతిన్నవారి శవం శ్మశానానికి వచ్చే చేరాకనే దాని పగ తీరుతుందట!

మాణిక్యం అనే పసిరికపాము - ఆ విధంగానే తన ఇంటి మేడమీద నిల్చుని, శ్మశానంలా పాడయిపోతున్న పక్కింటిని సంతోషంతో వేడుక చూస్తు న్నాడు. మేజాలు, కుర్చీలు, సోఫాలు, అల్మైరాలు - అన్నీ ఒక్కొక్కటీ బయ టికి వచ్చి చేరుతున్నాయి. వాటితోబాటు అణ్ణామలై వీధిలోకి వెళ్ళిపోవడంకూడా చూసేయాలని ఆ పాము కాచుకుని వుంది.

ఆ ఇంటిని వేలం వేయడానికి వలసిన ఏర్పాట్లన్నీ అతడిదగ్గర సిద్ధంగా వున్నాయి. 'ఆ దరిద్రపుగొట్టు మొహాన్ని ఇటువైపు తొంగి అయినా చూడకుండా దూరంగా పారేసేతప్ప ఇంట్లో దీని పొగరూ అణగదు' అనుకున్నాడు.

అయితే ఆనంది అతడికి లొంగివుండలేదు అన్న సత్యం ఆమె అక్కడికి వచ్చి నిలిచిన పద్ధతిలోనే తెలిసింది. ఉరిమి చూసిన ఆమెను అతడూ ఉరిమి చూశాడు. "ఏమిటి ?" అని అడిగాడు.

"పర్యవేక్షణలో వున్నట్లున్నారు !" అని నవ్వింది ఆనంది. "ఏం, ఇక్కడ ఇలా భయపడి నక్కి నిల్చుని చూడలేకపోతే తిన్నగా అక్కడికే వెళ్ళి మీ చేతులార ఆయన మెడపట్టి వీధిలోకి గెంటేయక పోయారా !"

"ఇదిగో చూడు, ఇకనుండి నువ్వు వాడిని వెనకేసుకు వచ్చావంటే, నిన్నే మెడపట్టి గెంటవలసి వస్తుంది."

మళ్ళీ ఆమె నవ్వింది. ఆ నవ్వు అతడిని భయపెట్టింది. కాని అందులో అందం వుంది. అతడి నెదిరించినప్పుడెల్లా, ఆమెలో దాగివున్న సౌందర్యం వెలువడ సాగేది. రోగంతో, చచ్చిపోవడానికి సిద్ధంగా వున్న ఆనంది, ఇప్పుడు ఆ రోగాన్ని పారద్రోలి, మరల తన యువ్వనపు సొగసులను కొద్దికొద్దిగా సంతరించు కుంటూ న్నది. ఆ వేళప్పుడు ఆ విధంగా కనపడిన ఆమెను చూడగానే అతడిలో చాపల్యం రేగింది.

"ఆనందీ, నా మాట విను." అని నవ్వుతూ మాట్లాడుతూ ఆమెను మంచి చేసుకోవాలని చూశాడు. ఆమె చేయి పట్టుకుని తనవైపు లాక్కొని భుజాల నందుకో పోయాడు. అతడి కళ్ళల్లో, ఆకలి తొంగిచూసింది.

చేతిని విదిలించుకుని దూరంగా నిల్చుంది ఆనంది.

"మగవాడనిపించుకునే మనిషి చేయదగిన పనేనా ఇది ?" అని పక్కింటి వైపు చూపించింది ఆమె. నలుగురైదుగురు పనివారు అరుపులతో కేకలతో ఒక అల్మైరాను మోసుకొస్తున్నారు వీధిలోకి.

ఆనందితో అప్పుడతడు తగాదా పెట్టుకో దలచుకోలేదు. ఆమె అతడి కామిత పదార్థంగా కనపడిం దప్పుడు. అంచేతనే కారణాలు వివరించి ఆమెతో రాజీ పడదా మనుకున్నాడు.

"ఇదిగో చూడు, నేనిట్లా చేయకుండావుంటే అప్పిచ్చినవాడు వాడిని వదిలి నా మీద పడివుండేవాడు. నువ్వూ నేనూ వీధిలో నిలబడి వుండేవాళ్ళం."

''అందుకని ?" అని అడిగి "అప్పు తీసుకోవడానికి మీకు సాయంచేసిన వాడి వీపులో కత్తితో పొడుస్తారన్నమాట !" అంది.

కోపం రాక తప్పిందికాదు మాణిక్యానికి. అయితే అదే సమయంలో ఆమె శరీర సౌందర్యమూ మరింత శోభాయమానంగా వెలిగిపోతున్నట్లు అతనికి కన పడింది. తన కోపాన్ని ఆమెను పాడుచేయడంద్వారా తీర్చుకోదలచిన మాణిక్యం "అప్పులవాడు నేనుకాదు, అజ్ఞామలై !'' అన్నాడు ఓరిమితో.

"ఏమిటన్నారు ?"

''వాడే ఋణగ్రస్తుడు. వాడి నాన్న నాకు పడ్డ బాకీని వాడే తీర్చాలి మరి. ఆ అప్పును నేను ఇంకే విధంగానూ నేను వాడినుండి వసూలు చేయలేను. నాదయిన దానిని వదలుకునేటంత మూర్ఖుడిని కాను నేను—"

''ఇంకొకసారి ఆయనను ఋణగ్రస్తుడు అంటే మీ నాలుక పుచ్చిపోతుంది-" అని అరిచింది ఆనంది.

''ఆనందీ !''

''మీ నోటితో నా పేరింక ఉచ్చరించకండి ! అందుకు అర్హతలేదుమీకు !" అని ఘోషించింది ఆమె— ''అందుకనేమో, అప్పుడు మీరు తాళికట్టిన దానిని ఆయన దగ్గరకుపంపి ఆయననిక్కడకు పిలిపించారు ? ఆమెను నవ్వుతూ మాట్లాడ మని, ఆమెద్వారా ఆయనను బుట్టలో వేసుకుని, కావలసినచోట సంతకం చేయించు కున్నారే ? డబ్బుకు ఒళ్ళుని అమ్ముకునేదానిని వేశ్య అంటారే, మీలాటివారి నేమని పిలవాలి ? డబ్బుకోసం, ఆస్తికోసం, సుఖంకోసం, నలుగురి ఎదుట పెద్దమనిషిలా వేషం వేసుకుని తిరగడానికి, చిన్నచిన్న చాపల్యాలను తీర్చుకోవడానికి ఇంతటి నీచానికి ఒడిగట్టిన మీలాటి వారిని మనుష్యులని ఎట్లా అనడం ?''

మాణిక్యానికి వెర్రి ఆవేశం వచ్చేసింది. చేయి నొప్పిపెట్టేదాక ఆమెను బాది, అక్కడే చంపిపారేద్దామన్నంత ఆగ్రహం కలిగింది. కాని అంతకు మించిన మరో ఆవేశం అతడి నావహించి ఆడిస్తూంది. ఆమెను తన జంతు తృష్ణకు బలిగా చేసి, ముక్కలు ముక్కలుగా చేసి, విసిరి పారేయాలనిపించింది. ఆమె దేనినయితే నీచాతి నీచంగా అసహ్యించుకుంటుందో, దేనికి ఆమె భయపడుతుందో, దాని

ద్వారానే ఆమెను నాశనంచేసి తన పాదాలదగ్గర పడేసి కాలితో తొక్కాలని నిశ్చయించుకున్నాడతడు.

ఐంతు బలంతో మీదపడిన మాణిక్యం ఇనుప పట్టుతో ఆమె ఉక్కిరిబిక్కిరి అయింది. దెబ్బలను, గుద్దులను ఆమె ఎన్నయినా భరించగలదు. కాని ఆ హేయమైన దానికి ఆమె ఇంక తల ఒగ్గలేదు; తల ఒగ్గబోదు. ఆమె ఆడ పులిలా పోరాడింది అతడితో. అంత శక్తి ఆమెకు ఎక్కడినుండి వచ్చిందో !

శక్తినంతా కూడగట్టుకుని ఆమె అతడిని దూరంగా తోసినప్పుడు అతడి చేతిలో ఆమె మంగళసూత్రం వుంది. అతడు దానిని కావాలనే పట్టి లాగాడో, లేక పోరాటంలో అది అతడి చేతిలో ఇరుక్కుందో తెలియదు. దాని నతడి చేతిలో చూడగానే ఆమె కన్నులలో వెయ్యి మెరుపులు మెరిశాయి; ఆమె గుండెలో వెయ్యి ఉరుములు ఉరిమాయి. ఆ మెరుపులూ ఉరుములూ కలిసి – ఇన్నినాళ్ళుగా ఆమెకు దాని పట్లవున్న నమ్మకాన్ని, భయాన్ని, భక్తిని ఒకే క్షణంలో పొడిపొడిగా చేసి వేశాయి.

నిశ్చేష్టుడయి మాణిక్యం వెలవెల బోయాడు. 'ఆనంది ఎదలో చల్లని మలయమారుతాలు వేలకొలదిగా వీచసాగాయి. 'ఎంత అద్భుతంగా వుందీ విముక్తి ! ఏమయిందీ స్వేచ్ఛ ఇన్నిరోజులు ! ఆ ఉరితాడు కారణంగా ఊపిరికూడా ఆడలేదా ?'

''ఆనందీ ! దీన్ని మెడలో కట్టుకో ?" అని దాని నతడు ఆమె కంఠానికి సమీపంగా తేబోయాడు.

ఆమె వారించింది : "అయ్యా ! లక్షాధిపతిగారూ ! దయచేసి దానిని తీసుకు వెళ్ళి మీరు ప్రేమించే ఆ డబ్బుకు కట్టండి. డబ్బుతో ఇంకెవరినయినా కొనుక్కోండి. ఇక నేను మీకు భార్యనుకాను; మీరు నాకు భర్తకాదు.'' అని ప్రశాంతంగా చెప్పింది.

మాణిక్యం చేతిలోని ఆ పుస్తెతాడి శక్తి ఏమిటోగాని అది అతడి శక్తిని పీల్చివేయసాగింది. తడబడుతూ వెళ్ళి అతడు గోడ నానుకుని నిలబడ్డాడు.

ఆనంది నిదానంగా బట్టలను, జుత్తును సరిచేసుకుంది... బయలుదేరింది... మేడ మెట్లమీద, వంపు దగ్గర, పాదం పెట్టగానే భగ్గుమంది. ఆమె మెదడులోకి ఉద్రిక్తా దెక్కడానికి కారణమయిన చోటు అది.

మేడ దిగింది.

ఆమె తండ్రి ఇంకా రాలేదు. ఆయన శరవణన్ వద్దకు వెళ్ళారని ఆమెకు తెలుసు. లోపలికివెళ్ళి అత్తగారి మొహాన్ని ఆమె చూడదలచుకోలేదు. తోటలోకి వచ్చింది. అక్కడి సరస్వతీ విగ్రహాన్ని చూస్తూ నిల్చుంది. చల్లని గాలి వీచింది. ఎంత లేతగా వుంది. తటాలున తిరిగి నాగలింగపు చెట్టును చూసింది. అది పుష్పించే కాలం కాదది. అయినా ఆ అకాలంలోనూ ఆ చెట్టుమీద ఒకే ఒక పువ్వు కనిపించింది. తన లేత చేతితో దానిని కోసింది.

చేతిలో నాగలింగ పుష్పం; పాదాలు పక్కింటికి దారితీశాయి. ఆ పువ్వే దారి చూపుతున్నట్లు అన్పించింది.

ఆ ఇంటి క్రింది భాగం సామాన్లతో, దుమ్ముతో గందరగోళంగా వుంది. మీనాక్షమ్మగాని, అణ్ణామలైగాని కనపడలేదు. మనుషులు, సామాన్లులేని శూన్య గృహంగా అన్పించింది.

మేడమీదకు వెళ్ళింది. అక్కడ కనపడిన దృశ్యం ఆమె మేన పులకరింతలు వర్షించింది. పరిపూర్ణమైన ఆ చిత్రసుందరి ఎదుట అతడు శిలగా మారిపోయి కూర్చుని వున్నాడు. రక్తమాంసాలతో ఈ ఆనంది, ప్రాణంతో ఊపిరితో ఈ ఆనంది రావడం, వచ్చి తన ప్రక్కన నిల్చోవడం అతడెరుగడు. దేవాలయపు గర్భగుడిలోపల విరాజిల్లే దేవిశ్రీపాదాలచెంత సర్వమూ అర్పించి పడివున్న భక్తుడిలా వున్నాడతడు. మూసిన కనులనుండి నీరు ధారలుగా కారుతూంది.

ఎందుకో ఆనందికి అతడింకా పసిపాపడిలాగే కనుపించాడు. ఆ రోజు - పెళ్ళికి ముందుగా, అతడు తన వద్దకు పరుగెత్తుకువచ్చి— "మిమ్మల్ని పెళ్ళి చేసుకునే భాగ్యం నాదయితే అందుకోసం ఏమయినా చేస్తాను"— అనడం గుర్తొచ్చింది ఆమెకు. పాపలలో పాపగా అతడలా అన్నప్పుడే అతడిని తన ఒడిలోకి తీసుకుని కన్నీళ్ళతో లాలించడానికి తపించినది ఆమె. అదే తపన ఇప్పుడూ కలిగింది ఆనందికి.

అలాగా అణ్ణామలై కళ్ళు తెరిచాడు. ఆమెను చూశాడు. ఒకరి నొకరు చూసుకుంటున్నారు. కళ్ళు అనిమేషాలయ్యాయి కాలం నిలిచిపోయింది.

తాను తెచ్చిన నాగలింగ పుష్పాన్ని అతడికిచ్చి ఆనంది, నెమ్మదిగా అతడి తల నిమురసాగింది. ఆ ప్రేమ భారాన్ని మోయలేక అతడి తల ఆమె ఒడిలోకి వాలింది. కన్నీటి ధారలు అణ్ణామలై చెంపలమీదుగా పారసాగాయి. ఆమె నోరు విప్పి ఏమీ చెప్పకుండానే అతడికి అన్నీ తెలిశాయి.

'మనకు మిద్దెలువద్దు, మేడలు వద్దు; ఎక్కడయినా చిన్న కుటీర మొక్కటి చాలు' అని అతడు నోరుతెరిచి అనలేదు. కాని ఆమెకు తెలిసింది. ఆమె మనసున అనుకున్నది అతడి మనసుకు అందింది. అక్కడ మాటకు చోటులేదు; ఏ కదలికకూ తావులేదు.

ఒకటే శాంతి; ఆనంద మయమైన శాంతి......

—కాస్సేపయ్యాక అక్కడికి వచ్చిన శారద దూరంనుండే ఆ సజీవ శిల్పాలను చూసింది. ఆమె కళ్ళు ఆనందంతో నిండాయి. ఆ క్షణాన, తానే ఆనంది అయినంత ఆనందం కలిగిందామెకు.

ఆ ఇంటినుండి అణ్ణామలైనూ, అతడి తల్లినీ పిలుచుకుని వెళదామని శరవణన్ వచ్చారు. వీరినేకాక ఆనందినీ కదిరేశన్‌నూ కూడా తీసుకువెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడింది.

యువతీ యువకులు తమంతట తాముగా చేసుకున్న ఆ నిర్ణయం పెద్దలకు ఏ అదురుపాటును, ఆశ్చర్యాన్ని కల్గించలేదు. పైపెచ్చు కదిరేశన్ వారిని మౌనంగా పదేపదే ఆశీర్వదిస్తున్నారు.

శరవణన్ తీసుకొచ్చిన కారులో, ఆయనగాక అణ్ణామలై కుటుంబ సభ్యులు నలుగురూ కూర్చున్నారు. ఆనంది చిత్రాన్ని చుట్టగా చుట్టి చేతిలో పట్టుకుని వున్నాడు అణ్ణామలై. 'ఆస్తి' అనదగిన దింకేమీ లేదు ఆ కారులో. ఈ లోకంలోకి వచ్చేటప్పుడు ప్రతి ఒక్కరూ ఏ ఆస్తినయితే తెస్తారో, ఇక్కడినుండి వెళ్ళిపోయేటప్పుడు దేనినయితే తీసుకు వెళ్తారో, దానితో మాత్రమే వారి ప్రయాణం మొదలయింది.

''ఇంక ఆ చిత్రాన్ని మీరు నా కిచ్చేయవచ్చు—'' అని అణ్ణామలై నుండి దానినీ తీసుకుంది శారద.

కారు బయలుదేరింది.

కారు కనుమరుగయ్యేదాక శారద ఆ చోటినుండి కదలలేదు. జీవితం ఆనందిదే, అయినా ఆ ఆనందం తనది అని నమ్మిన వ్యక్తి ఆమె.

సమాప్తి.